193 81

# ఆంధ్రపత్రిక

## సాధారణ సంవత్సరాది సంచిక

[అరువదియవ సంచిక]

[1970 - 71]



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



వెల రూ. 3

ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము.

Supplement to Andhra Patrika Issue Dated 7-4-1970 Regd No. M 1118

సంచిక 60

# సాధారణ సంవత్సరాది సంచిక

## విషయానుక్రమణిక

సంవత్సరము 1970—71



## వర్ణ చిత్రాలు:

### ముఖచిత్రం: పరీక్షిజ్జననమ్

సేకరణ—శ్రీ కోడవారు రామమూర్తి (మద్రాసు). చిత్తూరు జిల్లాలో సేకరించినది వంద సంవత్సరాలకు ముందుది. అప్పటి జీనిగవారనే చిత్రకారులు, చిత్రాజీవులు కర్రపలకల పై ముద్దరంగులతో చిత్రించారు. నగలకు, పీతకౌశేయ వాసానికి బంగారువరకు వాడారు. సూతికా గృహమని తెలుపడానికి భూమి కలో నల్లరంగు వాడారు. కృష్ణుడని తెలుపడానికి ఆవుదూడ ప్రతీక. ముగ్గురు స్త్రీలు—కుంతి, ద్రౌపది, ఉత్తర. సాధారణంగా కర్రపలకలమీద, గాజుపలకలమీద చిత్రాల ప్రమాణం 20 అంగుళాలకు తక్కువ వుండదు. ఇది మూడంగుళాలది. ఇంతటి చిన్ని-మీనియేచర్ చిత్రంలో ఎంతటి పనితనం!వాస్తవికత!పూర్వ చిత్రాలలో కృష్ణునిరంగు గులాబి, కమలదళవర్ణం. జీనిగవారు రామకృష్ణులను నీలమేఘ శ్యాములుగా చిత్రించరు. శుద్ధ సత్వమయిన బ్రహ్మరంగు సరోజదళ గర్భవర్ణమనే విశ్వాసంతో ఈ రంగే వేసేవారు.

పిల్లలు పుట్టి చనిపోతున్నవారు దీనిని పూజిస్తే పిల్లలు అకాలంలో మరణించరనే విశ్వాసం జనంలో వుంది.

### అన్నపూర్ణ (బాతిక్ చిత్రం)

శ్రీ అరగొండ ఆంజనేయులు (మద్రాసు).

బాతిక్ అనేది ఇండొనీసియా మాట. వస్త్రశబ్ద తద్భవం. గుడ్డ మీద కలంకారీ అద్దకానికి బాతిక్ అని ఇండోనీసియా కళారంగంలో వ్యవహారం. అదే ఇతరత్ర వ్యాప్తి చెందింది.

### చిలుక (బాతిక్ చిత్రం)

డిజైన్—ఆర్. కృష్ణారావు,

ప్రిన్సిపాల్, కాలేజ్ ఆఫ్ ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సు, మద్రాసు.

రంగుల అద్దకం—శ్రీ సి. వాసుదేవన్

కాలేజ్ ఆఫ్ ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సు, మద్రాసు.

### కేరళ సుందరి (గాజుపలకమీది చిత్రం)

సేకరణ—శ్రీ కోడవారి రామమూర్తి (మద్రాసు).

ఇది రామనాథపురం జిల్లా చెట్టినాడులో సేకరించబడిన వంద సంవత్సరాలనాటి చిత్రం. దీనిని నాయక సంప్రదాయ చిత్రమంటారు. దీనిని కూడా జీనిగ వారనబడే తెలుగు చిత్రకారులే గీశారు. ముఖచిత్రం టెక్నిక్ విషయంలో చెప్పినదంతా ఈ చిత్రానికి అన్వయిస్తుంది. వ్యక్తి పరిశీలన, వాస్తవికత ఎంత చక్కగా అనుసరించబడ్డాయో చిత్రమే చెబుతుంది.

ఊరేగింపు — ఖండవిల్లి శేషగిరిరావు (విజయవాడ.)

### తెలుపు—నలుపు చిత్రాలు

కాకులు—శ్రీ కొండపల్లి శేషగిరిరావు (హైదరాబాదు)

జింక — ,, ,,

మృతగోవు ,, ,,

ఓమ్

# ప్రస్తావన

అనేకకాలాలు సమవాయం చెంది అణువులు, అణువులు సమవాయం చెంది భూతములు భూతముల సమవాయ పరిణామం సృష్టిగా పర్యవసించిన విధంగా క్షణములు గడియలుగా, గడియలు దినములుగా, దినములు మాసములుగా, మాసములు సంవత్సరములుగా పరిణమిస్తుంటాయి. ఇతర దేశాల సంగతి ఎట్లావున్నా భారత దేశంలో ఈ సంవత్సరములు నామధేయ సమాహితములై వున్నాయి. ప్రభవాదికంగా ఈ సంవత్సర నామధేయములతో కాలపురుషుడు భారత దేశ భాగధేయాన్ని ఏలుతున్నాడా, లేక, హెచ్చరికలు చేస్తూ 'తస్మాజ్జాగ్రత్త'గా కొనసాగుతున్నాడా, అనిపిస్తుంది గడచిన సంవత్సరం సౌమ్య సంవత్సరం. సౌమ్యము అనగా మంచితనము, నెమ్మదితనము ఆ సంవత్సరం అన్వర్థనామధేయంగా సాగుబడి అయిందా? రాష్ట్రాన్ని చూచినా, దేశాన్ని పరిశీలించినా, ప్రపంచాన్ని అనుశీలనం చేసినా పరిస్థితి తారుమారుగా కనిపిస్తుంది. ఎచ్చట చూచినా అలజడులే. ఎచ్చట చూచినా సంఘర్షణలే, ఎచ్చట చూచినా ఆత్మవైనాశిక కారణాలైన ప్రగుద్దులాటలే. ఇది సౌమ్యానికి లక్షణమా? అందువల్లనే సంవత్సర పురుషుని నామధేయము కాలము చేయు హెచ్చరికవంటిది అనుకున్నప్పుడే ఆ నామధేయము అన్వర్థమయి కనిపిస్తుంది.

ఆంధ్రప్రదేశమే తీసుకొందాం. నాలుగుకోట్ల జనాభాగల రాష్ట్రం. ఏకసంస్కృతి, ఏకజీవన విధాన పద్ధతి, ఏకస్వస్థాన వేషభాషా ప్రవణత. ఏక ప్రయోజన, ఏకలక్ష్య సంవర్ధితంగా సర్వతోముఖాభివృద్ధిని పరం పరాభివృద్ధిగా సాధించుకొనవలసిన స్థితి ఇచ్చట వుంది. ఇదంతా సౌమ్యంగా సాధించుకొబడవలసింది, సాధించుకొనగలమన్న ధైర్యానికి కూడా తావలం అవుతూ వచ్చింది. మరి కాల విపర్యయాన ఎట్టిదనగా, ఆత్మకు ఆత్మలోనే విఘాతం కలుగుచున్నంతగా పరిణమించింది అది దాని లక్షణమా? లేక మానుష బుద్ధి వైపరీత్య ప్రకోపనమే కాలంలో అధ్యారోపిత మవుతున్నదా? ఆంధ్రప్రదేశ్‌లో తెలంగణా సమస్య ఏర్పడిందంటే దానికి కారణం ఈ రెంటిలో ఏదో ఒక్కటి అయి వుండాలి. ఆత్మ మాయచేత ప్రచ్ఛన్నమై తన్ను తాను మరచిపోయినట్లు తెలుగుజాతి తన్ను తాను మరచిపోయి, అనాత్మలక్షణ లక్షితమైన అకార్యాకరణానికి దిగిందా అనిపిస్తుంది. తెలంగాణా ఉద్యమం పేర జరిగిన కొన్ని సంఘటనలు ఏ జాతికైనా తలవంపులు ఘటించేవిగా, కొనసాగాయి అధికార స్థానంలో వుండి రాష్ట్రాన్ని దిద్దవలసిన ప్రభుత్వం వట్టి నైష్కర్మ్యాన్ని భజించింది. సహజంగా అయితే, నైష్కర్మ్య సాధనం పెద్దవిషయమే. ప్రభుత్వంవల్లమాత్రం అది విపరీత సాధనంగా పరిణమించింది. ఒక తెలుగువాడు ఆంధ్రుడయినాడు, మరి ఒక తెలుగువాడు తెలంగాణీయుడయినాడు. ధర్మక్షేత్రమయిన కురుక్షేత్రంలో యుయుత్సువులయిన కురువంశ సంతానాన్ని పోలి విచిత్ర సంగ్రామం కొనసాగింది. ఇది ఏకపక్ష సంగ్రామం. ఆంధ్రుడయిన తెలుగు వానిపై కాలపురుషుని సౌమ్యత అసౌమ్యమై ప్రసరించింది. అరచేతులలో ఆంధ్రుడయిన తెలుగు వాడు ప్రాణాలు పెట్టుకొని తెలంగాణమునందు పల్లటీలు కొట్టవలసి వచ్చింది. శాంతి భద్రతలను కాపాడవలసిన ప్రభుత్వం అశాంతిని శాంతి అనుకొని, అభద్రతను భద్రత అనుకొని, చేతకానితనాన్ని సమర్థత అనుకొని సంతోషించిందో, తనస్థితి భద్రమనుకొందో, అనుకొని తృప్తి చెందిందో చెప్పడం కష్టం.

ఈ సమస్య ఉపాదన కారణాలేమిటి? ఏ నిమిత్త కారణాలను పురస్కరించుకొని ఈ సమస్య జాతికి ఇంత తలవంపులుగా ప్రాదుర్భావం చెందింది? ఎక్కడి శతపథ బ్రాహ్మణము? ఎక్కడి ఆంధ్రజాతి? ఏమి దరిత్ర! ఏమి సభ్యత! ఏమి వైభవము! ఏమి సర్వదర్శన సమన్వయ సమర్థత! అన్నీ ఏమయినవి! జాతి ఏమైపోయినది? వీరు స్త్రీలు, వీరు పసిపిల్లలు, ఇది సంపత్తి, ఇది అతిక్రమించరాని ధర్మము, ఏవం విధమయిన విచక్షణ ఏమైపోయింది? ఇచ్చట ఏదో విచిత్రోపప్లవం ఆత్మలో ప్రవేశించింది. ఇందుకు అయిన కారణం అన్వేషింద

బడిందా? పరిశీలిస్తే పరమార్థంలో వైరుధ్యం కన్పించదు; విప్రతిపత్తి కన్పించదు. ఉన్న విప్రతిపత్తి అంతా వ్యవహారంలోనే గూడుకట్టుకొని కన్పిస్తుంది. ఇది పురుషకారవశంవదమైన ప్రపంచం. ఆ పురుషకారం ఒకచోట వైపరీత్యాన్ని, మరొకచోట అకర్మణ్యత్వాన్ని భజించిందా? ప్రభుత్వం స్తంభించింది. ప్రభుత్వ నాయకులు బమ్మెరపోయారు. తెలుగుజాతిని దిద్దిన అధిదేవతలు నిశ్చేష్టులై స్తబ్ధతను భజించారు. ఇది ఆంధ్ర విష్ణువు, గుణగ విజయాదిత్యుడు, రాజరాజు, కాకతిరుద్రుడు, గణపతి చక్రవర్తి, రుద్రమదేవి, సర్వజ్ఞసింగభూపాలుడు, అనవేముడు, కృష్ణరాయలు, దిద్దిన దేశమా? తానాషా పాలించిన ఉత్తమ మాగాణమా? తమ తమ సర్వస్వమును అర్పించి జాతిని ఒక దశనుంచి మరి ఒక దశకు పరమార్థక్షతి లేకుండా తాము దిద్దుకుంటూ వచ్చిన జాతి ఏమైపోయిందని అధిష్ఠాతృ దేవతలు, మహాపురుషుల ఆత్మలు దుఃఖించాయో! కుమారిల్లాయో!

ఈ సమస్యను అర్థ పద్ధతిలో పరిష్కారం చేయగలమని కొందరి ఆశ. నిజానికి ఇది రాజకీయ సమస్య. ఆ సమస్యను అల్లే పరిష్కారం చేయవలసి వుంది. ఆత్మను చీల్చి త్వఙ్మాత్రైక్యాన్ని నిల్పి ఏమో సాధించామనడం మాయాశబలిత జీవబ్రువుని ఆలోచనా పద్ధతే కాని ఆత్మధర్మసంబంధమయిన ఆలోచన కాజాలదు. అందుకే ఇప్పటి జనం ఏమి అనుకుంటున్నదీ విశదంగా తెలుసుకొని, ఆ అభిమతాన్ని బట్టి వ్యవహరించడం పరమార్థ పద్ధతి అనిపిస్తుంది.

అసలు, ఈ స్థితికి తత్కాలమయిన కారణాలు ఏవో వున్నా, మొత్తముమీద, దేశంలో ప్రభవించి, ప్రధానవస్థితిని పొంది గతాన్ని తోస్తూ, వర్తమానాన్ని గ్రహించక, భవిష్యత్తు విషయంలో అగమ్యగోచరమై కొనసాగుతున్న ఒకానొక మానసిక వైక్లబ్యం ఏ విధంగా పరిణమించిందా? దాని ఛాయను ప్రసరించిందా?—అని కూడా అనిపిస్తుంది. దేశంలో నీతి ఏమైంది? నిజాయితీ ఎక్కడ వుంది? ధర్మం ఎన్ని కాళ్లమీద నిలుస్తున్నది? సత్యప్రవర్తన, అహింసాధర్మం ఏమయాయి? దేశంలో ఎప్పుటమాదినా దౌర్జన్యం కనిపిస్తుంది. ఈ దౌర్జన్యం అధికారవ్యామోహ సంవలితమై జన్మించిందా? దీని జన్మకు కారణం ఎక్కడ? ఏమి అంతుపట్టదు. విపరీతభావాలు మాత్రం అకాల సూర్యునిచండప్రతాపంలా దేశాన్ని మాడ్చివేస్తున్నాయి. బహువిపరీత సిద్ధాంతాల సంఘర్షణతో దేశం అట్టుడికి పోతున్నది. కాంగ్రెస్ ఉన్నది; తన అన్ని లోపాలతోను చరిత్రగలది కావడంచేత, దేశంలో జనభావంలో అంతర్యామివలె వ్యాపించి వుండడంచేత, దేశం సుస్థితికి కారణం. స్థానం కాగలదనుకుంటూండగానే అది విచ్ఛిన్నమయిపోయింది. విపరీత భావుకులు విపరీత తత్త్వనిష్ఠులై అనిష్టకార్యాచరణానికి చెలరేగిపోతున్నారు. విజాతీయ భావజాతం సజాతీయ భావసంపత్తితో ఇముడక, సమన్వయం చెందక సంఘర్షణను తెచ్చిపెడుతున్నది. సంక్షోభం తెచ్చిపెడుతున్నది. కర్తవ్యతామూఢత్వం కర్తవ్యంగా అవభాసిస్తున్నది. అకార్యకరణం సత్కార్యం అనిపించుకొంటున్నది. జాతి జాతి, భావము భావము చిద్రుపలు చిద్రుపలై శీర్ణమై దేశంలో అపరిస్కీర్ణతా స్థితిని తెచ్చిపెడుతున్నది. దీనిని ఐక్యం అని సంతోషిస్తున్నవారూ లేకపోలేదు. జాత్యేకీకరణకు ఇదే మార్గమని అనుకొంటున్నవారు కూడ లేకపోలేదు. ఈ స్థితిలో ఆత్మధర్మం ఊడని జారుతున్నది. సత్ప్రవర్తనం పలాయనం చిత్తగిస్తున్నది. సత్యవాక్యం అత్యయస్థితిని చెందుతున్నది. సర్వమూ ప్రళయోన్ముఖంగా వుంది. ఇది భావ ప్రళయం. ఈ భావ ప్రళయంలోంచి, సృష్టి, నూతన సృష్టి జరుగుతుందనుకొనే వాళ్ళు వున్నారు. మనస్సే అవ్యవస్థమయినప్పుడు, భావములకు ఏకాకారత లేనప్పుడు, ఆదర్శమునకు ఆకారం లేనప్పుడు, ప్రవర్తనకు నియమం లేనప్పుడు, ఆత్మకు సంయమం లేనప్పుడు, అనాత్మమై, అధర్మభావనాభాజనమై పుట్టిన ప్రళయం ఇది. ఇట్టి ప్రళయంనుంచి ఉద్భవించే సృష్టి ఎట్టిదిగా వుంటుంది? సత్యము, ధర్మము, శౌచము, మొదలయిన ఉత్తమ లక్షణాలు సాపేక్షాలనే అనవచ్చు. సాపేక్షములే కాని అభావములా? కాలంచేత వాని శరీరధర్మమునందు, ప్రచార లక్షణమునందు ఉత్తమ పరిణామం కలగాలే కాని, మూల విప్లవమా? అభివృద్ధా? వ్యవస్థా? మేధావితలేని దేశం అవస్థ యిది. అప్పుడు స్వధర్మాన్ని పరధర్మం ఆక్రమిస్తుంది. సత్యాన్ని అసత్యం గ్రసిస్తుంది. ధర్మాన్ని అధర్మం బాధపెడుతుంది. మనిషి తన్ను తానే హత్య చేసుకుంటాడు. గీతాకారుడు ఈ స్థితిని ఆతతాయి స్థితి అని అభివర్ణించాడు. ద్వాపర ప్రళ

యంలో ఆ స్థితి వచ్చింది. స్వధర్మం హేయమై, పరధర్మం అరగక అధ్యాసభాజనమయిన మేధావిత దేశ సర్వస్వ భాగధేయాన్ని వీక్షిస్తున్న స్థితిస్వరూపం యిది.

ఇది అవ్యవస్థ. భావప్రళయం. ఆలోచనా వైక్లబ్యం. ఈ స్థితి పరిణామ స్వరూపం తెలంగాణాలుగా, రాష్ట్రాల మధ్య సరిహద్దుల వివాదాలుగా, నదీజలాల తగవులాటగా, భాష విషయంలో సంఘర్షణగా, సంస్కృతి విషయంలో అంతర్యుద్ధంగా, ప్రాదేశిక విషయకంగా, ఉత్తర దక్షిణ విభక్తి పద్ధతిగా కొనసాగుతున్నది. సభ్యతకు, సంస్కృతికి ద్రావిడమని, ఆర్యమని మరి ఒకటి అని ఉంటుందా? సత్యం ఎక్కడయినా సత్యమే మంచితనం ఎక్కడయినా మంచితనమే. క్షమ ఎక్కడయినా క్షమే. పరోపకారం ఎక్కడయినా పరోపకారమే. ఈవి ఎక్కడయినా ఈవియే. అజ్ఞాత భూత బాధాగ్రస్తమైన మనస్సు సమ్యగ్దర్శనం లేనిదై తాను అవ్యవస్థపాలై దేశాన్ని అవ్యవస్థపాలు చేస్తున్నది. ఆసేతుశీతనగం భారతదేశమయినప్పుడు, అంతర్గత సీమాదిక వివాదాలు పెండిలి సందర్భములయందు సమ్మార్జన వస్తు వివాదాలవలె వుంటాయి. ఇది మనస్సుయొక్క, మనిషియొక్క అల్ప భావనకు, అల్ప ప్రయోజకత్వమునకు లక్షణం. ఇవి ఏక జాతి, నిర్మాణ క్షమమైన నయశాస్త్రపద్ధతులు కాజాలవు. చారిత్రకంగా భారతదేశంలో మతం ఏక భావాన్ని భారతీయుడైన మనుష్యునికి, మనుష్యులలో మనుష్యులకు అద్వైతస్థితిని సాధించి అభయాన్ని ప్రసాదించింది. కాశీ వున్నదో, రామేశ్వరమున్నది. గంగ వున్నదో, కావేరి వున్నది. కాశ్మీరమున్నదో, కన్యాకుమారి ఉన్నది. ఇవి భారతజాతి ఐకాత్మ్యకు ఎల్లలు. ఇవి మతంచేత, ధర్మంచేత, దేవతాపురుష విశేషంచేత తీర్చబడినట్టివి! రాముడు ఎక్కడ దేవుడు కాడు? కృష్ణచరితం ఎక్కడ ఆనందసంధాయకం కాదు? భారతాన్ని కాదని జాతి జీవితం ఉన్నదా? వాల్మీకి కవితాప్రపంచం సాధించిన జాత్యేకీకరణంకన్న ఎక్కువ ఏకీకరణను సాధించడం సాధ్యమా? ఇప్పటి నవ భారతీయుడు ఎట్టివాడనగా, వానికి భారతం బూతు. రామాయణం కామాయనము. మరి దేవతలు ఉన్నారో లేదో! అదృష్టులై జాతిని ఏకం చేసినమాట మాత్రం వాస్తవం; చారిత్రక సత్యం. ఇప్పుడు అదృష్టవస్తువు వ్యవహారంలో దృష్టవిషయమై చిద్రుపలై వున్న జాతిని, బహుదేశ జనాకీర్ణమై వున్న దేశాన్ని భావనమైక్యంచేత, ఆత్మకు అద్వయస్థితి సాధనంచేత వివిధరూప సృష్టి విలసితమయిన జగత్తులో ఏకాధిష్ఠాన సత్పదార్థధర్మాన్ని చూచిన విధంగా చూచి, దానిచేత భావైక్యాన్ని, రసైక్యాన్ని సాధించగలిగింది. మతంలో కర్మకాండ వుండవచ్చు. అది—ఆ కర్మకాండ-పరిణామశీలమయింది. జనభావాన్ని బట్టి దానిక స్థితి "స్వస్థాన వేషభాషాస్వంతో రసప్రలుబ్ధ ధియః" అని నన్నయగారన్నప్పుడు ఆయన తన కాలమునందలి స్వస్థాన వేష భాషాదికములే ఎల్లకాలమును రసప్రలోభ విషయాలని అనుకోలేదు. ఎందుచేతననగా, ఆయనకు పూర్వ కాలమునందలి వేషం, భాష ఆయన కాలమునందువలె లేవు. ఆ సూత్రోక్తి సార్వకాలికము, సార్వదేశికము అవును. కాని, వ్యవహారాత్మమాత్రం కాలంచేత, జనభావంచేత పరిణమితం అవుతుంది. నన్నయగారు భారతమును రచించుటకు పడిన కష్టమెంత? ఎన్నిచోట్ల 'సత్సభాంతర సరసీరుహంబులను' ఎంతకాలం ఆయన కొనియాడి తెనుగున భారతావతరణమునకు తపస్సు చేయలేదు? ఇది ఆయన సూత్రార్థమునందు నిగదితమై వున్నది. అనగా భాషావిషయమందేమి, కర్మకాండ విషయమందేమి పరమార్థమయిన ఆత్మధర్మం క్షతిలేనిదిగా వుండవలెగాని శరీరధర్మం పరిణామం చెందవచ్చు. జైమిని కర్మకాండ చెప్పాడు. భగవంతుడైన వ్యాసుడు బ్రహ్మసూత్రములచేత కర్మకాండను పూర్వపక్షం చేశాడు. కుమారిలభట్టు కర్మకాండను ప్రదర్శించగా, త్రిమతాచార్యులు జ్ఞానభక్తి వైరాగ్య కాండలను జనభావసమ్మతంగా సముద్ధరించారు.

ఇప్పుడు మతం ఒక విచిత్ర స్థితిలో పడింది. అందుకు కారణం, దానిని రాజకీయ సంవలితం చేయడమనిపిస్తుంది. సెక్యులరిజంలో మతం వేరు, రాజ్యాంగ ధర్మం వేరు. మతం నిరసింపబడడం లేదు. ఎవరి మతం వారిది. మరి ఇప్పుడు, ఈ దేశంలో హిందూమతం విచిత్రమయిన రీతులలో, నిగూఢ పద్ధతులలో అధికార స్థానంలో వున్న వారిచేత నిరసించబడడం గోచరిస్తుంది.

కమ్యూనలిజం అన్న మాట చేత అది అభివర్ణిత మవుతున్నది. మతం లేక జీవిత మున్నదా? లేదు. మతం వైయక్తిక విషయమే కాక, సాముదాయక విషయం కూడా. కాలంమీదట, అందులో కొంత పనికిరానిది చేరి వుండవచ్చును. ఆ మతంలో చెప్పబడినది కొంత ఇప్పుడు పనికిరాకపోవచ్చును. కాని, తక్కిన మతాలను మన్నన చేస్తూ, ఒక్క మతాన్ని, అందులో అధిక సంఖ్యాకులు అనుసరించే మతాన్ని నిత్య నిరసనకు గురి చేస్తూండడంవల్ల తన్మతాభినివేశమే కాక పర మత అసహనంకూడ కొందరిలో పెరుగుతున్నది. మతాన్ని కూడా జాతీయభావ సమైక్యానికి అనుసంధానం చేసినప్పుడు పైన చెప్పిన వైపరీత్యం సంభవించదు. మతం–నీతిని చెబుతుంది. మనిషికీ, దైవానికీ ఉన్న సంబంధం చెబుతుంది. దైవం లేదనుకున్న వారుంటే, అది వేరే మతం; అది వారి విషయం. ఎవరిమతం వారు అనుసరిస్తూ పోతే, ఏ బెడదా వుండదు. ఈ దేశంలో రాజకీయాలనుండి మతాన్ని ఇదినుంచి పృథక్కరిస్తూనే వచ్చారు. ఆ ధర్మాన్ని పునరుద్ధరణ చేయగల్గితే, పునరుద్ధరించగల మార్గాన్ని సాధించుకోగల్గితే అప్పుడు సర్వమూ శుభంకరమై పరిణమిస్తుంది.

ఈ పని రాజకీయవేత్తలది కాదు. రాజకీయవేత్తలవలన దేశం పాడయిందని సౌమ్య సంవత్సర చరిత్ర వలన నిరూపితమయింది. ఇది మేధావుల పని. మన దేశంలో అరువు మేధావులు – ఎరువు మేధావులే కాని, అసలు మేధావులు లేరు. ఒకవేళ వున్నా కన్పించరు. వస్తుస్థితినిబట్టి ఏది దేశానికి కావాలో దాన్ని తేల్చి జనభావానికి అందేట్టు చెప్పగల సమర్థ మేధావులు కన్పించడం లేదు. ప్రతి భావమూ ఎరవు తెచ్చుకున్నదే. ప్రతి ఆలోచనా, ఇతర దేశాలలో భిన్న పరిస్థితులలో చేయబడినది కాగా, అది ఇక్కడికి దిగుమతి అవుతున్నది. మేధావిత విషయంలో దిగుమతే కాని, ఎగుమతి లేదు. దీనికి కారణం అరయవలసి వుంది. ఇది ఆత్మపరీక్షవల్లనే సాధ్యమవుతుంది. స్వోపజ్ఞమైన విచారధార ఎందుకు పుట్టడంలేదు? వస్తునిష్ఠమైన పరిశీలనం జరిగి తద్వస్తు విశ్లేషణంవల్ల ఎందుకు సజాతీయమయిన ఉత్తమ మేధాసంపత్తి ఆవిర్భావం చెందడం లేదు? ఒకవిధంగా చూస్తే పూర్వం కూడా ఇట్టి భావోపప్లవస్థితులు భారతదేశంలో చాల సంభవించినట్లు కనిపిస్తుంది. భగవద్గీతలోని 'ధర్మగ్లాని' శ్లోకం ఈ విషయాన్నే చెబుతున్నది. మరి అప్పుడు ఆ అవ్యవస్థను వ్యవస్థగా, చీకటిని వెలుగుగా, మృతిని అమృతంగా మార్చాలన్న తితిక్ష, దీక్ష గల మేధావులు బయలుదేరి తిరిగి వ్యవస్థను సాధించి వుండడం కూడా కనిపిస్తుంది.

ఇప్పుడు, మన సాహిత్యాన్ని చూచినా, తాత్త్విక విచారపద్ధతి చూచినా, ప్రజలకు సన్నిహితంగా మసలుతూ జనభావంపై ప్రబలమైన ముద్రను వేసే చలనచిత్ర ప్రపంచాన్ని, ఆ సాహిత్యాన్ని చూచినా, ఈ అవ్యవస్థనుండి వ్యవస్థకు మార్గాన్ని చూపించే దక్షత, ప్రవరత్వం గోచరించవు. మన దేశంలో అసలు ఉపప్లవం రాజకీయాల్లో రాలేదు. మేధావిలోకం జడిమను భజించడంవల్ల, మేధావిలోకంలో వెలుగు లేకపోవడంవల్ల వచ్చింది. ఈ స్థితి ఎప్పుడు తొలగి వివేక సూర్యోదయం అవుతుందో అప్పుడు నిజమయిన నూతన సంవత్సరం ఉషఃకాంతులు వెదజల్లుకుంటూ ఉగాదియై ఉదయిస్తుంది.

---

మ. శ్రుతులు అభ్యాసము చేసి శాస్త్రగరిమ ల్శోధించి తర్కంబులన్
మతి నూహించి శరీర మస్థిరము బ్రహ్మం బెన్న సత్యంబు గాం
చితి మంచున్ సభలన్ వృధావచనము ల్చెప్పంగనే కాని ని
ర్జిత చిత్తస్థిరసౌఖ్యముల్ దెలియరో శ్రీ కాళహస్తీశ్వరా.

# సాధారణ సాధువాదము

శ్రీ శనగన నరసింహస్వామి

## 1

స్వాగతము! శారికాపిక
మాగధ సంస్తూయమానమానితచరితా!
భోగనిధి! మాత్మపర్వా
భ్యాగత! సాధారణాఖ్య! స్వాగత మనఘా!

## 2

శ్రీ మాఘమాసమంతు మశియా తొలిలియ్యని వేసఁబోక గా
నామృతపచులన్ శుకపికావళి స్వాగతమున్ వచించె నా
రామములెల్లఁ బుష్పనికరంబుల నర్ఘ్య మొసంగె విక్రమో
ద్దామ! నవాబ్ద! రమ్ము! వసుధాప్రమదామణి పుల్కరింపగన్..

## 3

ఆకుఁరాలిన కుజానీకమ్ము కొమ్మల
చిగురాకు గుత్తుల సిరులు దాల్చి —
తతదిగంబరలైన వ్రతతినితంబినీ
మణుల యంగములు క్రొన్ననల దాచి —
సచరాచరాత్మక సర్వ విశ్వంభర
కభినవయౌవన విభవ మొసఁగి —
శుకపికశారికాదిక శకుంతముల కం
ఠముల కకుంఠ విభ్రమము నేర్చి —

ఆఱుఋతువుల సౌభాగ్య మతకరించు
తేజరిలుచున్న ఋతురాజు తీర్చిదిద్ద
కుసుమ సింహాసనంబున గొలువుదీరి
ధరణి బాలింపు మింక సాధారణ సమ!

## 4

అదిగో వసంతుఁడు వచ్చె మందానిలములు
వచ్చె నిటువచ్చె మదనుఁ డీ వలనుండి

వచ్చినాడవు మోహనాహ్వయుడ నిక జ
వాళి కందని భోగ భాగ్యములు గలవె?

## 5

వానలు పంటలున్ ధరలు వర్తిలుమధ్యమ పద్ధతిన్ ధరా
జానులకున్ ముదంబగును సౌమ్య నవంబున నంచు 'రెడ్డి' వి
జ్ఞాని లిఖించుచున్ బశుంజాతికి మానవజాతికిన్ గటా!
హాని యటంచుఁ బేర్కొనియె నయ్యశుభంబు ఘటిల్లె సత్యమై

## 6

ఒఱిగిపోయిన కొంప నుద్ధరింపగలేక
యొకమూలఁ గాపురంబుండు నతడు
పండఁబారిన క్షేత్రఖండ మంబుల మునిగి
తిండికిలేక రోదించు నితడు
నిజకుటుంబము గంగ నిర్దయంబుగ మ్రింగ
దిగ్భ్రాంతి నందుచుఁ దిరుగు నతడు
పసికి గ్రాసంబు సంపాదింపనేరక
కనుదోయి నీర్వెట్టుకొను నితండు
గాలివానల కతివృష్టి ఘాతలకును
హానిగాంచనివాడు లే డాంధ్రభూమి
పంచభూతము లిటు విక్రమించుచున్న
జరుగునే యొక్కక్షణమైన జనుని బ్రతుకు

## 7

ఆకాశానఁ జరింపఁగల్గినఁ నగాధాంభోధి గర్భంబునన్
బ్రాకన్ నేర్చినఁ జంద్రమండలమునన్ బాదంబిడంజాలినన్
వాకోఁజాలని శాస్త్రవైభవము సంవర్ధించినన్ మర్త్యుఁడీ
లోకంబున్ నవరింపనేర్చునె విపల్లోకంబు వాటిల్లినన్?

## 8

తేనెపూసినకత్తి తృణపరిచ్ఛన్న
కూపంబు మండూకకూజనోరగము
గోముఖ దుర్దమక్రూర శార్దూల
మరయఁ బయోముఖ గరళ కుంభంబు
మేకవన్నియవాలుమృగము సౌమ్యంబు

పేరాసఁ గొలిపి మా బీరంబు గెడపి
దుష్టనేతంబోలె దుర్మార్గుఁ జేసి
పోయె భారంబు నీ భుజముపై మోపి
చెడగొట్టిపోవుట కడు సులభంబు
బాగుసేయుట యంత పైపైని కలదె
యైన నీ ప్రాభవం బాత్మ నమ్మితిమి
సాధారణా! యెట్లు సాకెదో మమ్ము!

## 9

జననష్టము పశునష్టము
ధన ధాన్య ద్రుమవినష్టతతిఁ బునరుక్తిన్
మొనసి ఘటించిన సౌమ్యుని
ఘనశత్రుని దలప భీతి కలచున్ నేడున్.

## 10

ప్రజ లొసంగిన శాపనార్థములు గొనుచుఁ
దరలిపోయెను సౌమ్య వత్సరము – నేడు
భవ్యభవదాగమంబున భావిలవ శు
భాశ చిగురించె మా హృదయంబులందు.

## 11

పేరును గాంచి మోహపడి పెద్దతికంబు ఘటించి గౌరవ
స్ఫూరతఁ జూపినందులకు సౌమ్యము చూపిన నెయ్యమెల్ల సా
ధారణ! యే రెఱుంగ రికఁ దత్పరిపీడితజాతి నీవసా
ధారణ వైభవోన్నతులు దనరుసేయక సేదదేరునే.

## 12

అరువది యేండ్ల కొక్క పరి
యాయము మంజుల మర్త్య లోకమం
దిరమునఁ గాలుమోపు నతి
థి ప్రవరా! ప్రజలిచ్చు నిత్య స
త్కారణములన్ గ్రహించి యను
కంప వహించి శుభాశిషంబులన్
గురియుము నొక్క వత్సరము
కుంఠిత వైఖరిఁ గొల్వొసంగుమా!

## 13

ఒక్క సవిత్రి గర్భమున నుద్భవ మందిన యంతవాఁ డనే
తక్కువసేయరాదనెడి తత్త్వ మెఱింగి జనుల్ నుతింప నీ
వెక్కువఁ గాంచి యానగాని పెంపరి సౌమ్యుడు సంభ్రమింప మా
యక్కఱలెల్లఁ దీర్చి మహితచ్ఛయ యాశంబు వరింపు మింకిటన్.

## 14

జగతి కానందసందోహ సమయమైన
యీ వసంతంబునన్ గద్దెనెక్కి తక్క
ఋతువు లనుకూలరీల వర్తింప విజయ
ఢక్క మ్రోగింపుమోయి! నల్దిక్కులందు.

## 15

సౌమ్యను సంతరించిన యసౌమ్యములెల్ల నణంగుగాక! మా
కామ్యము దీరుగాక! గత కాలముకంటెను వచ్చుకాలమె
రమ్యత మించుగాక! మధురంబగు పాలనమందు ముందు వి
సామ్యము గాంచుగాక! విలసత్సహజన్మ శరత్సమూహముల్.

# సాధారణా! సుస్వాగతం!

శ్రీ అబ్బరాజు శ్రీనివాసమూర్తి

సౌమ్యం సౌమ్యంగా
వెళ్లలేదు.
సామాన్యుని స్వాగతంతో
సరిగమలు పలికించకపోగా!
ప్రచండ ఝంఝా వాతూలం
సుడిగాలి రేపింది!
నేల నాలుగు చెరగులా
హిరణ్యాక్షునిలా, ప్రకృతి
గాలివానలతో చెలరేగింది
చుట్టబెట్టేసింది.
'అన్నదాత'కు తాతల
కాలంనాటి రాగిచెంబు తోమి
తోడుగా జోలి పట్టుండంది!

## సాధారణా! సుస్వాగతం!

ఏ గుండెలోనైనా
వెచ్చనిట్టూర్పులా
వేడి కన్నీళ్లా
ఏ నేలపైనైనా మృగతృష్ణలా
ముళ్ల కంచెలా!
సామాన్యుని స్వగతంలో ఆశాజ్యోతి
ఆరీ ఆరక నూనెకోసరం
అలమటిస్తోంది!

ఎప్పుల కుమ్ములాటలో
పంట పొలాల పని
కత్తుల పాలైనాయ్!
అన్నదమ్ముల కొట్లాట
రచ్చబండ దాటింది
మడినుంచీ గుడిదాకా
కశ్మలం — పేరుకొంది.
ఆకాశంలో ఇంద్రధనుస్సు
వెలవలేదు
ఆంధ్రదేశంలో శాంతి పునః
స్థాపితం కాలేదు!

ఇహనైనా! ఇప్పైనా!
రాబోయేది సాధారణ కనక
మానవతా తంత్రీనాదం
మహాజనాభ్యుదయంగా అతి
సాధారణంగా, సాధారణతో
వినిపిస్తుందా!
వినిపించేలా ఈ అగ్రేసరులు
సంచరిస్తారా!
'వర్తమానం' తల్చుకొంటే
'భూత'మే నయమనిపిస్తోంటే
'భవిష్యత్తు' నూహించేందుకే
భయమేస్తోంది!

ఓ సాధారణ సర్వతంత్ర స్వతంత్ర
సంవత్సరరాజమా! కోటి నమస్సులు!
సార్థక నామధేయమై సాధారణగానైనా
నడిపించు!
అందుకే కోటి సుస్వాగతాలు!
ఉపవళ అర్ధనయనాల వసంతాలు!

# సామంత కాకతీయులు - కల్యాణి చాళుక్యులు

శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి

క్రీ. శ. 973 వ సంవత్సరమునుండి దాదాపు 1200 వఱకు, కల్యాణకటకము (నేటి బసవకల్యాణి) రాజధానిగా దక్షిణాపథమున సామ్రాజ్యాధినాయకులుగా వెలసిన చాళుక్య చక్రవర్తులకు (వీరే కల్యాణి చాళుక్యులు) కాకతీయులు మొదట సేనాపతులుగానుండి, నమ్మిన మాండలికులై, వారి వలన దేశములు పడసి బలవంతులై, అధిరాజులు బలహీనులైనంత తాము క్రమముగా స్వతంత్రులైరనుట చరిత్రకారులందఱును సూత్రముగా అంగీకరించిన విషయము. ఐనను, వారి యభివృద్ధిని గుఱించి భిన్నాభిప్రాయములు కనబడుచుండుటవలనను, నిరంతరాన్వేషణచే నూతనాంశములు దొరకుచుండుటచేతను, ఒకసాటి పునఃపరిశీలనము చరిత్ర పరిశోధకులకు ఆవశ్యకమగుచున్నది. ఇటీవలిపరిశోధనలచే వీరికాలముననే దీనికి తెలుగుదేశమను పేరువచ్చుటయు తత్పూర్వము ఆ పేరు లేకపోవుటయు కొంత దీనికి దోహద మిచ్చుచున్నది.

క్రీ. శ. 973 లో రెండవ తైలపచక్రవర్తి రాష్ట్రకూటులను పడగొట్టి తన సామ్రాజ్యమును ప్రతిష్ఠించినాడు. అప్పుడు ఇతని రాజధాని మాన్యఖేటము. ఇతనికేకాదు ఇతని తర్వాత అరువదియేండ్లవఱకు మాన్యఖేటమే ఈ కల్యాణి చాళుక్యులకు రాజధాని. వీరికిని చోళులకు నిరంతరము యుద్ధములు జరుగుచుండినందున ఇతని మునిమనుమడు 'త్రైలోక్యమల్ల + ఆహవమల్ల' సోమేశ్వరుడు కల్యాణపురమును రాజధానిగా నిర్మించుకొనెనని (క్రీ. శ. 1033) బిల్హణుని విక్రమాంకదేవచరితమున చెప్పియున్నాడు. అదిమొదలు వీరు కల్యాణి చాళుక్యులు. ఈ తైలపుడు క్రీ. శ. 977 వఱకు పాలించి గతింపగా నితని కుమారుడు సత్యాశ్రయుడు 'ఇఱివబెడంగ' 'అకలంకచరిత' బిరుదములను ధరించినవాడు రాజై క్రీ. శ. 1008 వఱకు పాలించెను. చోళులతో తండ్రి ప్రారంభించిన యుద్ధములను కొనసాగించి వేంగిమీదికి దాడియెత్తగా చోళులు ఇతనిపై బిజాపూరులో దోనూరువఱకు దండెత్తిపోయి దేశమును పాడుచేసిరి. సత్యాశ్రయునికి సంతానము లేనందున అతని తమ్ముడైన దశవర్మయొక్కకుమారుడు విక్రమాదిత్యుడు క్రీ. శ. 1008 ప్రాంతమున రాజై 1014 వఱకు పాలించెను. ఇతడు గతించి ఇతని తమ్ముడు అయ్యనయ్య రాజై, కొన్నిదినములుమాత్రమే పాలించి, గతింపగా నితని రెండవ తమ్ముడు 'జగదేకమల్ల' 'మల్లికామోద' బిరుదాంకితుడు జయసింహుడు 1015 లో రాజాయెను. ఇంతవఱకు చరిత్రలో ఒక ఘట్టముగా గ్రహించి పరిశీలించుట యుక్తము. చాళుక్యులకు వారి ప్రారంభకాలమునుండియు చోళులతో దక్షిణమునను, మాళవరాజులైన పరమారసంజ్ఞులతో ఉత్తరమునను ఎడతెగని యుద్ధములు జరిగెడివి తైలపుడును సత్యాశ్రయుడును తమ జీవితకాలమంతయు ఇరువైపుల పోరాడిరి. జయసింహుని కాలమునకు ఈ యుద్ధములు తీవ్రరూపమును తాల్చినవి. ఇచ్చటి నుండి రెండవ ఘట్టము — ఉత్తరమునుండి మాళవదాహళకోసల రాజ్యములు రంగమును ప్రవేశింపగా దక్షిణమున చోళులేగాక చేరపాండ్యాదులును పాల్గొనసాగిరి. జయసింహుని కుమారుడు మొదటి సోమేశ్వరుడు యువరాజుగా నుండునప్పుడే రంగమున కుఱికి క్రీ. శ. 1033 ప్రాంతమున కల్యాణకటకమును నిర్మించి, క్రీ. శ. 1042 లో పట్టాభిషిక్తుడైనదిమొదలు చోళచాళుక్యయుద్ధములు అతితీవ్రరూపమును పొంది అతని యవసానకాలమునకు తుది దాకినవి. ఇది మూడవ ఘట్టము. చోళరాజు, రాజాదిరాజు, కొప్పం సంగ్రామమున ఏనుగుమీదనే వధింపబడెను. చోళులబలము సన్నగిల్లెను. రాజరాజనరేంద్రుడు, వేంగీశుడు, కల్యాణి చాళుక్యులతో సంధి గావించుకొని తన బంధువులను, చోళులను త్యజించెను. భోజుడు చాల వృద్ధుడై, రణరంగమున కాకపోయినను చాళుక్యులు తన్ను ముట్టడించిన కాలమున మరణించెను. పరమారులబలము అడుగంటెను. ఒక్క కర్ణాటక ద్రావిడ ప్రభువులుమాత్రమేగాక భారత దేశమందలి ప్రభువులలో ప్రధానులందఱు, అనగా ఆర్యావర్త కళింగములును కేరళపాండ్యసింహళములును రంగమును ప్రవేశించినవి. పోరాటములు వివిధరంగములందు వ్యాపించి, నానాటికి

రంగము విస్తరిల్లి సామంతమాండలికరాజన్యులుకూడ పాల్గొని చక్రవర్తుల మెప్పువడసి వారి యాదరాభిమానములచే చిన్నచిన్న రాజ్యములను మండలములను గ్రహించి, వానిని పెంపొందించుకొనుచు అభివృద్ధికి వచ్చుచుండిరి. అట్టి చిన్నసామంతమాండలికులుగానుండి, కల్యాణి చాళుక్యుల సేనాపతులుగా వారిని కొలిచి, మండలాధిపత్యము సంపాదించుకొని, తర్వాత చాల వృద్ధికి వచ్చినవారిలో కాకతీయులు ప్రధానులు. వీరు తెలంగాణ నిర్మాతలై ఎట్లు సామ్రాజ్యాధినేతలైరో తెలిసికొన్న ఎంతో మనోవికాసము కలుగును.

## 2. కాకర్త్య గుండన

కాకతీయుల పూర్వచరిత్రను, అనగా మొదటి బేతరాజుకు మునుపటి విషయమును తెలుపు శాసనములు లేవు. దొరికినవంతవఱకు వీరి ప్రాచీన శాసనములు, వీరు కల్యాణి చాళుక్యుల సామంతులుగానుండినప్పటివే. సూటిగా చెప్పవలయునన్న మనకు దొరికిన మొదటి కాకతీయ శాసనము క్రీ. శ. 1079 నాటి రెండవ బేతరాజుయొక్క హనుమకొండ శాసనము. అంతకు మునుపటివి దొరకలేదు. రెండవది ఇతని ఖాజీపేట శాసనము, క్రీ. శ. 1090 నాటిది. ఈ శాసనములలో కాకతీయులు పశ్చిమ చాళుక్యుల సామంతులుగానుండి అభివృద్ధికి వచ్చినట్లు స్పష్టముగానున్నది. ఇది ఎప్పటినుండి అను ప్రశ్నకు సమాధానముగా త్రైలోక్యమల్ల అహవమల్లుని పేరు శాసనమందున్నది తత్పూర్వుల పేరు కానరాదు. చాళుక్యుల శాసనములలో చూచిన యెడల ఈ త్రైలోక్యమల్లుని కుమారుడైన త్రిభువనమల్లుని శాసనములలోనే కాకతీయుల ప్రస్తావము కనబడుచున్నది. కాబట్టి కాకతీయుల పూర్వచరిత్రకు ఆకరములను ఇతరత్ర వెదకవలసినదేగాని వారి శాసనములలో గాదు.

'కాకర్త్య' శబ్దమొకటి వేంగిచాళుక్యుల శాసనములలో కనబడి పరిశోధకులలో చాల తీవ్రచర్చకు కారణమైనది. రెండవ అమ్మరాజు కాలమున (క్రీ. శ. 945–70) అతని మాంగల్లు శాసనమున (955–6) దానార్ణవుని సహాయిగా నొక కాకర్త్య గుండ్యన కనబడుచున్నాడు. వేంగిని (అనగా కృష్ణా గోదావరుల నడిమి యాంధ్రరాజ్యమును) పాలించిన రెండవ అమ్మరాజు కాలమంతయు యుద్ధములలో గడచినది. క్రీ. శ. 945 లో నీతడు రాజ్యమునకు వచ్చినను దాయాదుల బాధచేత కొంతకాలము రాజ్యభ్రష్టుడై ప్రవాసమున నుండెను. అట్టి తరుణములలో నొకప్పుడు అతని జ్ఞాతి దానార్ణవుడు, రాష్ట్రకూట చక్రవర్తియైన ముమ్మడి కృష్ణరాజు సాయమున వేంగిని పట్టుకొన్న కాలమున, కృష్ణరాజు దానార్ణవునికి కాకర్త్యగుండ్యననే సాయముపంపెను. ఈ దానార్ణవుడు రాజరాజనరేంద్రునికి తాత. ప్రస్తుతము వేంగిచాళుక్య చరిత్రలో లోతునకుదిగక గుండ్యనను, అతని— 'కాకర్త్య' వంశ శబ్దమును మాత్రము గ్రహింతము. ఈ నామసామ్యముచేత కాకతీయుల పూర్వులలో నీ గుండన యొకడని కొందఱును, వట్టి నామసామ్యముచేత నిశ్చయింపరాదని కొందఱును వివదించుకొనిరి. ఎందులకనగా ఈ గుండన 'కాకర్త్య'డగుట మాత్రమేగాక రాష్ట్రకూటుడని కూడ గలదు. ఒకవేళ నిది అతని యుద్యోగమేమోయని 'గ్రామకూట' 'రాష్ట్రకూట' శబ్దార్థములచేత సాధించినను తర్వాత నొక శతాబ్దమునకు వెలసిన బేతరాజాదుల శాసనములలో నితనిపేరే కనబడదు. ఇందుల కొక సమాధానము చెప్పవచ్చును. కాకతీయులు తమ వంశవృక్షమును సక్రమముగా ఎచ్చటను చెప్పుకొనలేదు. ఆ విషయమై వారు శ్రద్ధ వహింపలేదని స్పష్టముగా చెప్పవచ్చును. కొన్ని శాసనములు రెండవ బేతరాజుతోను, కొన్ని త్రిభువనమల్లునితోను, కొన్ని అప్పటముగా ఆయాకాలపు పాలక ప్రభువులతోను మొదలుపెట్టి, ఎప్పటికి తోచినట్లు అప్పటికి వ్రాయించినవేగాని, వేంగిచాళుక్యులో, కల్యాణి చాళుక్యులో వ్రాయించినట్లు పౌరాణిక మూల పురుషునిలో ప్రారంభమై, ఎడతెగని అనుపూర్విలో విపులముగా వంశవర్ణనము చేసికొనుట కనబడదు. అచ్చట దుర్జయుడొకడు కనబడినను వంశవృక్షనిర్మాణశ్రద్ధ లేదు. దాదాపు ఇరువది ముప్పదియేండ్ల కాలములోనే మొదటి బేతరాజును పేర్కొనక వదలిన కాకతీయులు ఒక శతాబ్ది క్రిందటి గుండనను వదలియుండుటలో ఆశ్చర్యమేమి? కాబట్టి గుండ్యనను గ్రహించుటలో తప్పులేదు.

ఇచ్చట గుర్తింపవలసినది బలవత్తరసాక్ష్యము మఱియొకటి కనబడుచున్నది. కాకర్త్య శబ్దముగాక 'సామన్తవిష్టివంశః' అను నొక సమాసము. ఇది రెండవ బేతరాజు ఖాజీపేట శాసనములోనే యున్నది. 'సామన్త విష్టివంశః శ్రీమాన్కాకతిపురాధినాథో బేతః' అని. గుండనని 'సామన్త వొడ్డివంశః' అని మాంగల్లు శాసనపాఠము. 'విష్టి' 'వొడ్డి' శబ్దములు భిన్నముగా గ్రహింప దగినవి, వేర్వేఱు పదములు, సంబంధము కుదురదని కొందఱు పరిశోధకు లభిప్రాయపడిరి. చిలుకూరి వీరభద్రరావుగారు 'విష్టి' శబ్దమునకు ఏవేవో అర్థములు లాగినారు అర్థము రెంటికిని ఏదైనను రెండును 'విష్టియో' లేక రెండును 'వొడ్డియో' కావలెను. కాకర్త్య శబ్దముతో కలసియుండుటయే ఇందుకు బలమిచ్చుచున్నది. ఇరువురును కాకర్త్యులే, ఇరువురును సామంతులే. 'విష్టి— వొడ్డి' భేదమంతగా పాటింపదగినదిగా కనబడలేదు. ఇది లేఖక ప్రమాదమనుటకు అంతగా సందేహింపను పనిలేదు. 'గుండ్యన'

యేమి ? గుండన అన్నగదా సాధువు. 'కాకర్త్య'లోని రేఫము అంతే. మాంగల్లు శాసనమున లేఖక ప్రమాదములు చాలగలవు. చాళుక్య వంశానుక్రమము వర్ణించుటలో కూడ వ్యత్యాస మున్నది. బేతవిజయాదిత్యుడనుటకు 'బేక' విజయాదిత్యుడనియు ఇట్లే తారుమారుయి పడియున్నవి. బిట్టి—విష్టి—విట్టి—వొడ్డి శబ్దములు ఒకమాటకే గ్రామ్యోచ్చారణములుగా కనబడు చున్నవి. బిట్టి శబ్దముతోడి చతుర్థకులజులైన రాజవంశము వారి శాసనమొకటి తెలంగాణా శాసనము II సంపు. లో కలదు. నెం. 87. వీరు బిట్టి కులతిలక జినాలయమును కట్టించి క్రీ. శ. 1108 లో దానము లిచ్చియున్నారు ఈ శాసనదాత, భువనగిరి దండనాయకుడు, సంగనూరి విభుడు బీరయరెడ్డి, రాష్ట్రకూటుడనగా రాష్ట్రకూట వంశస్థుడుగా నుండనక్కఱలేదు. జయకేశి అరసులను నతడు శక. 996 (క్రీ. శ. 1074) లో పులిగెఱె రాష్ట్రకూటుడుగా పాలించు చుండెను. చిన్న సామంతరాజని యర్థము (బాంబే కర్నాటక శాసనములు—29. 1935—36 సం). ఇట్లుండగా రెండక్షరముల భేదముచేత చాలనఱు సరిపోవునట్టి వంశ వర్ణనను త్రోసిరాజనుట సమంజసముగా కనబడుటలేదు. ఈ విషయములో శ్రీ లక్ష్మీరంజనముగారు ఇంతదూరము చర్చింపక పోయినను, చేసిన నిర్ణయము—విష్టి-వొడ్డి—రెంటి యభిప్రాయము నొకటే—యనునది నాయభిప్రాయమునకు బలము నిచ్చుచున్నది. [చూ. సిద్ధేశ్వర చరిత్రము—ఆంగ్ల పీఠిక. పుట 38.]

మరి, బేతరాజువరకు ఈ గుండ్యనయొక్క తర్వాతి చరిత్రగాని, వంశానుక్రమముగాని తెలియరాదుగాని నాటి ఆంధ్రదేశ చరిత్ర మాత్రము కొంత తెలియుచున్నది. దానార్ణవ రాజు ఆ సంవత్సరమే (956) రాజ్యము కోలుపోయి, మరల 970 లో సంపాదించుకొనెను. అటువెనుకకూడ ఎడతెగని పోరాటములలో నుండి 973 లో, తెలుగు చోడుడైన జటా చోడ భీమునిచేత, రణనిహతుడాయెను. ఆ సంవత్సరమే తైల పుడును రాష్ట్రకూటులను జయించి మాన్యఖేటనగరమును గ్రహించెను. ఆ సంవత్సరమే మహాపరాక్రమశాలి, పరమార వాక్పతిముంజరాజు మాళవరాజ్యమునకు వచ్చి తైలపునికి ప్రతి ద్వంద్విగా నేర్పడెను. అది మొదలు గోదావరీ కృష్ణా తుంగభద్రా కావేరి తీరములు రణరంగములైనవి. వేంగిదేశము అనాయకమైనదని చెప్పుకొనుచు, దానార్ణవుని కుమారులు, శక్తివర్మ విమలాదిత్యులు, మొదట కళింగమునకును, తర్వాత చోళదేశమునకును పారిపోయిరి. చోళరాజు, రాజరాజ చోళుడు, దానార్ణవుని సోదరి కుందవ్వకు మనుమడు. అనగా కుమారుని కుమారుడు. శక్తివర్మ విమలాదిత్యులకు మేనత్త మనుమడు, బంధువు. ఏకారణము చేతనో చోళరాజ్యములో అంతఃకలహము లేర్పడి ఇతడు కొంత ఆలస్యముగా క్రీ. శ. 983 లో చోళ రాజ్యమునకు వచ్చెను. వెంటనే దానార్ణవుని కుటుంబమును ఆదరించి, తనకుమార్తెను కుందవాంబను విమలాదిత్యునకిచ్చి పెండ్లిచేసి క్రీ. శ. 1000 లో జటాచోడభీముని రణ రంగమున చంపి వేంగి రాజ్యమందు శక్తివర్మ విమలాదిత్యు లను ప్రతిష్ఠించెను.

ఇచ్చట నొక నూతనాంశమును గుర్తింపవలసియున్నది. అది నాటి రాజకీయ పరిస్థితి. ఇందు వేంగిశ చోళాధిపులు కలిసి జటాచోడభీముని, వేంగివారి శత్రువును, జయించి మరల రాజ్యము పొందుట మాత్రముకాదు. ఇందులో కన్నడరాజ్యము వారును కలిసియున్నారు. క్రీ. శ. 973లో రాజ్యమాక్రమించిన తైలపుడు జటాచోడభీమునికి స్నేహితుడు నుండియుండ వలయును. ఎందులకనగా, వేంగిమీదికి ఎత్తివచ్చి చోడభీముని చంపుటకుముందు, రాజరాజచోళుడు కర్నాటకము మీదికి దండెత్తిపోయి, మైసూరులో కొంతభాగమును, అనంతపూరులో సొద్దమువరకును దేశమును ఆక్రమించి క్రీ. శ 991 కి తర్వాతనే తెలుగు చోడభీముని తాకియున్నాడు. వేంగిని తన బంధువులకు సాధించుటకుముందు రాజరాజేల పశ్చిమ చాళుక్యు లను సాధింపవలసి వచ్చినది? వట్టి జిగీషయా, లేక, కన్నడ రాజే బాధింప అతనిని దండింపవలసి వచ్చినదా ? తైలపుడు మాత్రమేల వీరిమీదికి పరాక్రమించెను? ఇందులకు గొప్ప కారణము కలదు జటాచోడభీమునిది కర్నూలు జిల్లాలోని పెడకల్లు రాజ్యము. వేంగికి, అనగా బెజవాడకు పోవుటకు నెల్లూరిమీదుగా దారిలేదు. సముద్రతీరముగా పోయి కృష్ణను దాటుట అసాధ్యముగా నుండినది. గుత్తి, గుంతకల్లు మార్గమున పోయి కృష్ణనుదాటిపోవుటయే త్రొక్కినదారి. ఇట్లు వేంగిని సాధించుట శ్రమసాధ్యమై యుండెను. అనంతర చరిత్రయు దీనికి సమర్థకముగానే యున్నది. రైళ్లు ఏర్పడువరకు నెల్లూరు ఒంగోలు గుంటూరుల నుండి బెజవాడకు చుట్టుదోవలేగాని కృష్ణను బెజవాడకడ దాటు సదుపాయములులేవు. అందువలననే నాటి మార్గము

'కంచి నెల్లూరు మరి యోరుగల్లయోధ్య
యను పురంబులపై గంగ కరుగుమనినట్లు'

అని కేతన తన యాంధ్రభాషాభూషణమున వచించి నాడు. నాటి సంగ్రామము లన్నియు కృష్ణా తుంగభద్రా నదుల కూడలి ప్రవేశములకు సమీపముననే రాయచూరు జిల్లా ప్రాంతముననే జరిగినవి. ఆంధ్ర కర్నాటక దేశముల కూడలి ప్రదేశముననే కాళేరామేశ్వరము బాటయు నుండెనేమో. వేంగిని

స్వాధీనమందుంచుకొనుటకైన చోళచాళుక్య యుద్ధములకు కృష్ణా తుంగభద్రానదుల తీరములే రణరంగములు. ఈ ప్రదేశములు పశ్చిమ చాళుక్యులకు మిత్రులైన తెలుగు చోళుల కాణాచి స్థలములు. ఇది మొదలు చోళచాళుక్య యుద్ధములు వేంగిని వారు తమతమ స్వాధీనమందుంచుకొనుట కొఱకే పరిణమించినవి. జటాచోడభీముని చోళద్వేషమునకు పశ్చిమ చాళుక్యులును, కడప కర్నూలు అనంతపూరు ప్రాంతముల యందలి తెలుగు చోడరాజులును వారసులైరి. అట్లే పశ్చిమ చాళుక్యులకు శత్రువులైనందువలన పరమారముంజ రాజాదులు చోళులకు సహజమిత్రులైరి; శత్రు శత్రువు మిత్రుడగునని అర్థశాస్త్రము.

తైలపుని యనంతరము సత్యాశ్రయుడు రాజై చోళులమీదికి కత్తికట్టె. క్రీ. శ. 1006 ప్రాంతమున గుంటూరుసీమలోను వేంగియందును ప్రవేశించెను. శక్తివర్మయు విమలాదిత్యుడును చోళదేశమునకు తిరువయ్యారునకు పోయిరి. చోళులు దీనిని ప్రతిఘటించుటకు తాము బిజాపురమువఱకు కర్నాటకమును ధ్వంసమొనర్చిరి. ఇట్లు తీవ్రరూపమును దాల్చుచుండిన తమిళ కర్నాటక యుద్ధములు సత్యాశ్రయుని కాలమునఱకు తమిళ కన్నడదేశముల ఉత్తర దక్షిణపు టెల్లలమీదుగనే సాగుచుండినవి. వేంగి తెలంగాణములు దూరముగా నుండినందున ఆ ప్రదేశము లింకను యుద్ధరంగములు కాలేదు. రాజరాజ చోళుడు పశ్చిమ చాళుక్యులను తుంగభద్రా తీరమునఱకు వెనుకకు నెట్టుట, వారి సాయము జటాచోడభీమునికి అందకుండ జేయుటకొఱకు అని ముందే గ్రహించితిమి. అంతేకాదు. తుంగభద్రాతీరమును స్వాధీనము చేసికొనిన గాని కర్నూలు మార్గమున వేంగికి పోవుటకు సాధ్యముగాదనియు గుర్తించితిమి. రాజరాజ చోళుడు రాజతంత్రజ్ఞుడగుటచే తైలపుని శత్రువు ముంజరాజు కర్నాటకము మీదికి దండెత్తి అటువైపు ఒత్తిడి కలుగజేయుచుండ తానిటు దక్షిణమునుండి కొట్టుచుండెను. రాజరాజచోళుని యనంతరము అతని కుమారుడైన 'గంగైకొండ చోళు'డనబడిన రాజేంద్రచోళుని కాలమున చోళులు విజృంభించి రంగమును పెంచిరి. గంగవఱకును రాజేంద్రచోళుడు ఊరక వట్టిపుణ్యముకొఱకు తీర్థయాత్ర పోయినవాడుకాడు. భారత దేశమందలి ఇతర రాజులతో, అందును ఉత్తర హిందూస్థానమందలి వారితో సంధి యొడంబడికలు కుదుర్చుకొని తాను పశ్చిమ చాళుక్యులమీదికి ఎత్తి వచ్చిన వెంటనే వారును వెనుకనుండి వచ్చి చాళుక్యులను తాకునట్లు వ్యూహము పన్నినట్లు కనబడుచున్నది. ఇందుకు అనుగుణముగా భోజరాజు, మాళవపతి, చోళులతోడి మైత్రిచేతను, చాళుక్యులతోడి వైరముచేతను; జగదేకమల్ల జయసింహుని, అతని కుమారుని ఆహవమల్ల సోమేశ్వరుని, దక్షిణమునుండి చోళులు ఎత్తివచ్చి తాకుచుండినప్పుడంతయు, ఉత్తరమునుండి తానువచ్చి తాకుచుండెను. ఇట్టి సందర్భములలో చాళుక్యులు రెండువైపుల పోరాడవలసియుండెను. ఆ యవస్థలో కావేరితీరమొక రణరంగము, తుంగభద్రా కృష్ణానదీ మధ్య ప్రదేశమొక రణరంగము, వెనుకమండిన కొంకణ, సేవుణ కోసలాది దేశప్రాంతములు రణరంగములు. ఉత్తరమున వింధ్యనుదాటి నర్మదానదీతీరప్రదేశముకూడ రణరంగమునై, ఇవిగాక తూర్పున వేంగి తెలంగాణ మధ్యదేశము కూడ రణరంగమై చక్రకూట కొఱవిదేశములును ఇందులో చేరినవి.

ఇంత చరిత్ర — సంగ్రహముగనైనను — ఎందులకు చెప్పవలసివచ్చినదనగా నతవాడి, కొఱవిదేశముల యొక్క ప్రాముఖ్యమును, ఈకాలపు తెలంగాణముయొక్క ప్రాముఖ్యమును గుర్తించుటకొఱకే. కొఱవిదేశమునకును, అనుమకొండకును, సబ్బిసాయిరమునకును, చాళుక్యులలో తైలప సత్యాశ్రయుల నాడు లేని ప్రాముఖ్యమును రక్షణావ్యవస్థయు జయసింహ సోమేశ్వరులనాడు ఏర్పడినందువలననే కాకతీయులు వృద్ధికి వచ్చి పశ్చిమ చాళుక్యులకు సామంతులైరని అనంతర చరిత్ర చెప్పుచున్నది. ఈ కాలముననే కొల్లిపాకయు ప్రసిద్ధికి వచ్చి గడిదుర్గముగా దానిని కాపాడవలసిన యావశ్యకతయు ఏర్పడినది. అట్టి యీ యనుమకొండ రాజ్యము మొదటినుండియు ఎవరెవరి చేతులలో నుండెనో కనుగొన్న నూతనాంశములు గోచరింపగలవు.

## 3. అనుమకొండ పూర్వ చరిత్ర

నేటి తెలంగాణములో కాకతీయులు వెలసిన ప్రదేశములు పశ్చిమ చాళుక్యులకు లోబడియుండి, ఎక్కువ యభివృద్ధి గాంచని గడిప్రదేశములుగనుండి వారివలన కాకతీయులకు సంప్రాప్తించి క్రమముగా ఓరుగల్లు నగరము వర్ధిల్లి కాకతీయ మహాసామ్రాజ్య కేంద్రస్థానమైన విషయము చరిత్రకారసమ్మతము. తత్పూర్వము — అనుమకొండ రాష్ట్రకూటుల కాలమునుండినట్టిదే. ఖాజీపేటలో దొరికిన యొకశాసనమున క్రీ. శ. 872 — 3 నకు సరిపోవు నందన సంవత్సరమున అమోఘవర్ష మహారాజునకు ఒకానొక సత్యాశ్రయ భీమరసు సామంతుడై అనుమకొండలో దానములు చేసినట్లున్నది. శాసనములో అన్మకొండ యనుటకు అర్మకుండ యని యున్నది గాని అనుమకొండయే. ఖాజీపేట సామీప్యము ప్రబల కారణము. (A.P Govt Arch. Series 3 Wg. 18 Khajipet p. 85) ఈ శాసన మిట పునర్ముద్రితము. ప్రభుత్వమువారి సంపాదకులు

దీనికి 932 — 33 తారీఖు నిచ్చినారు. కాని అది కుదరదు. ఇందు శక సంవత్సరము పోయినది. '......త్తెంటెనెయ' అని ప్రారంభము. అది ఏదో పోయినది. 'ఐవత్తెంటెనెయ' అని ఉండియుండును. ఎందులకనగా ఇతడు క్రీ. శ. 814 లో రాజ్యమునకు వచ్చెను. గాన దానికి 58 వ సంవత్సరమునకు సరిపోవు వందన క్రీ. శ. 872 అగును. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రలో (1936 సం. ముద్రణము) దీనిని మొదటి యమోఘవర్షుని కాలముగా గ్రహించి ఈ భీమరసు భీమ చళుక్కియనియు, విజయాదిత్య నరేంద్ర మృగరాజు సోదరుడనియు, రాష్ట్రకూట తృతీయ గోవిందరాజు పాయమున కొన్నాళ్లు వేంగిని హరించియుండి తర్వాత పరాజితుడై, రాజ్యమును పోగొట్టుకొని, రాష్ట్రకూట రాజ్యమందే అనుమకొండలో నుండె ననియు, అర్మకుండ యనునది అనుమకొండకు పొరపాటనియు వ్రాసినారు. అర్మకుండయేమో అనుమకొండయే గాని ఈ భీమరసు, పై తారీఖుచేత, భీమచళుక్కి కానేరడు. /

## 'అర్మకుండము' గాని 'అనుమకొండ' గాదు

క్రీ. శ. 812 నాటికి మొదటి యమోఘవర్షుడు బాలుడు. రాజ్యమునకు రాలేదు. 872 నాటికి భీమచళుక్కి లేడు. అది గుణగవిజయాదిత్యుని కాలము. 932—33 సం. నాలవ గోవిందరాజుయొక్క మూడవ సంవత్సరము కాబట్టి '...త్తెంటెనెయ' ఎనిమిదవది ఏవిధమునను కాదు. ఈ భీమరసు కుసుమాయుధుని వంశస్థుడును కాడు. 'స్వస్త్యమోఘవర్ష శ్రీ పృథివీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర భట్టారక పాదపద్మోపసేవితలబ్ధ సమధిగత పంచమహాశబ్ద మహాసామంతాధిపతి సత్యాశ్రయ శ్రీమద్భీమరసర్' అని యుండుట చేత వీత డెవడో వేంగివాడుకాడు. వేములవాడవాడో, కల్యాణి చాళుక్యులలో పూర్వుడో భావి పరిశోధనమీద తెలియవలెను. అమోఘవర్షుని దయచేత సంపాదించిన సామంతపదవిగాని వేంగి రాష్ట్రకూట సామ్రాజ్యముల నడిమి, ప్రాంతీయ, రాజ్యరక్షణ ఇతనికిప్రదేశమును అమోఘవర్షు డిచ్చియుండునని తలంచుట యుక్తము. ఇతః పూర్వము శాసనములనుబట్టి అనుమకొండను గుర్తించి తెలియదు. 'అర్మకుణ్డ'అని ఇందులోను రెండవ బేతరాజు ఖాజీపేట శాసనములోను (Wg. 19 Khajipet Ar. Se. 3 Govt of A. P.) ఉండుటచేతను, ఇవే ప్రాచీనతమశాసనము లగుటచేతను, ఇదే దీని ప్రాచీననామమై యుండవలెను. అర్మ శబ్దార్థమేమో తెలియలేదుగాని (ఇచ్చట ప్రేమకాదు) అమోఘవర్ష శబ్దమునకు సంగ్రహరూపమై దానికి 'కుండము' అను ప్రదేశవాచకము చేర్చి ఏర్పరచిన రూపమేమో చెప్పలేము. అచట నొక తటాకముండి యుండవలయును. ఈ సందర్భముగ సిద్దేశ్వరచరిత్రయందలి అనుమకొండ నామోత్పత్తి కథను ఎంతమాత్రము విశ్వసింపజాలము. ఇది అనంతరకవి విరచితము; సంబంధములేని ప్రాచీన రాజకుటుంబముల విస్మృత విషయము లను, విష్ణుకుండిన, చాళుక్య, విజయనగరాజుల చరిత్రలని తాను భ్రమించిన వానినన్నిటిని కలిపి, విచక్షణలేక కలగా పులగముగా సంపుటీకరింపబడినది. దృఢమైన శాసనాద్యాధారములను బట్టి పోల్చి సరిపోయి, సంవాదము కుదిరిన గ్రహింపగలమేగాని దీనిని పరమ ప్రమాణముగా గ్రహించి గట్టియాధారములను కాదనజాలము. కాకతీయ యుగచరిత్రలోని గణపతి చక్రవర్తి, మనుమసిద్ధి, తిక్కన సోమయాజి వీరి చరిత్రలలో చాలవరకు శాసనములకు సరిపచ్చు చున్నది. కొన్నిచోట్ల పుక్కిటిపురాణ మగుచున్నది. కాబట్టి సిద్ధేశ్వర చరిత్రమును ప్రమాణముగా గ్రహించుటకు చరిత్రకారులు కొంత వెనుదీయుదురు. ఇచ్చట అనుమకొండ నామోత్పత్తి మాత్రము శాసనములతో సరివచ్చుటలేదు.

## 4. వేములవాడ కల్యాణి చాళుక్యుల కాలములో చేతులు మారినప్పుడు

అటుతర్వాత వేములవాడ చాళుక్యులు ఈ ప్రాంతమును, రాష్ట్రకూటసామంతులుగా తమ ఏలుబడిలో నుంచుకొని వేంగిచాళుక్యులతో యుద్ధ మొనరించుచుండిరి. మొదటి యరికేసరి రాజ్యకాలము సరిగా తెలియదుగాని ఇతడు క్రీ. శ. 780 మొదలు 793 వరకు పాలించిన ధ్రువనిరుపమదేవునికి సామంతుడు, వేంగిత్రికళింగములను జయించెను. ఇతనివెనుక బద్దెగడు 'సోలదగండ' బిరుదాంకితుడు వేంగిప్రభువును ప్రథమ చాళుక్యభీముని జయించెను. ఇతడును స్వతంత్రుడుకాడు, రాష్ట్రకూట సామంతుడు. ఇట్లే రాష్ట్రకూటుల పతనము వరకు ఈ దేశభాగము వీరి స్వాధీనమందే యుండినది. రాష్ట్రకూటులు క్రీ. శ. 973 లో పోయిరి వేములవాడ రాజకుటుంబముకూడ ఎట్లు పోయెనో తెలియరాక పోయినది. మూడవ యరికేసరియొక్క తామ్రపట్టికకాలము (క్రీ. శ. 966) తర్వాత వీరి శాసనములు కానరావు జాడకూడలేదు. రాష్ట్రకూటుల సామంతుడుగా రెండవ తైలపుని శాసనము క్రీ. శ. 957 నుండియు కనబడుచున్నవి. (బొంబే కర్ణాటక శాసనములు 178, 1933—34.) క్రీ. శ. 965 లో నితనికి 'మహాసామంతాధిపతి, చాళుక్యరామ, అహవమల్ల తైలపరస' అని బిరుదులతోడి ప్రశస్తి కనబడు చున్నది. అప్పటికీతడు తర్దవాడినాటిని (బిజాపూరులో నొక భాగము) 'అణుగ' జీవితముగా (కుమారవృత్తిగా, రాష్ట్ర

కూటుల లెంకగా) పాలించుచుండెను. ఇచ్చటనుండి వేములవాడను, తెలంగణమును తొలుత నాక్రమించియే ఈతడు రాష్ట్రకూటులను పడగొట్టినట్లుగా తోచుచున్నది. మహబూబ్‌నగర్ జిల్లా, మక్తల తాలూకా, ఉప్పలియనుచోట దొరకిన కల్యాణీ చాళుక్య శాసనములో రాజుపేరు పోయినదిగాని తారీఖున్నది, శకము 888 (క్రీ. శ. 967–67). ఇది తైలపుని కాలమే. మఱియొక శాసనము, నల్లగొండ జిల్లాలోని కొఱ్ఱపోలు గ్రామములోనిదానిలో, (శక. 895– క్రీ. శ. 973–4) 'ఆహవమల్ల నంకకాఱ సోమపెర్మాడి' యొకడు కనబడుచున్నాడు (తెలం. శా. I చాళు 41). దీనింబట్టి వేములవాడ చాళుక్యుల రాజ్యమైన నేటి తెలంగణము కల్యాణీ చాళుక్యుల స్వాధీనమైనట్లు స్పష్టపడుచున్నది.

ఇది యిట్లుండగా తైలపుని ఉత్తరపుటెల్ల గోదావరి యని తెలియుచున్నది. ఎందులకనగా ముంజమహీపతి, మాళవాధీశుడు, తైలపునిమీదికి పదునారు పర్యాయములు దండయాత్ర వెలిపినవాడు, తుదిపర్యాయము, అనగా పదునారవ పర్యాయము దండెత్తినప్పుడు అతనిమంత్రి రుద్రాదిత్యుడు, పెక్కు దుర్నిమిత్తములు కనబడుటచే అపశకునము వారించినను, ముంజుడు వినక బయలు వెడలినందువలన, గోదావరినిదాటి మాత్రము దక్షిణమునకు పోవలదని ప్రార్థించి రాజును వీడ్కొలిపెనట. నాడు గోదావరి దక్షిణభాగము, దక్షిణాపథములో తైలపుని వశమైయుండెను. కాని అంతటి ముంజమహీపతి, మంత్రి మాట వినక గోదావరినిదాటి శత్రువైన తైలపునిచేత చిక్కి పరాభూతుడై మరణించెనట. రుద్రాదిత్యుడు ఈ దుఃఖము భరింపజాలక ఆత్మహత్య చేసికొనెనట. ఇదంతయు మేరుతుంగాచార్యుని ప్రబంధచింతామణియందు కలదు.

ఇట్లు ముంజుని జయించిన వెనుకనో, అతనితోడి యుద్ధములలోని విరామకాలములయందో దక్షిణమునను తూర్పునను తైలపుడు జయించినవారిలో కాకతీయులుకూడ నున్నట్లు తలంచుటకు కొంత ఆధారము కనబడుచున్నది. రన్నమహాకవి సత్యాశ్రయునికి (తైలపుని కుమారునికి) సమర్పణగా వ్రాసిన గదాయుద్ధములో తైలపుని విజయములను తెలుపుచు నొక క్రాకళిక రాజశబ్దమును ప్రయోగించినాడు. 'శ్రీ పృథివీవల్లభ మహారాజాధిరాజ......భద్రకవిద్రావణం, కొంకణభయంకరం, క్రాకళిక రాజ గజకేసరి...శ్రీమన్నూర్మడి తైలపనెనిసిద ఆహవమల్ల దేవనిం...' ఇచ్చట 'భద్రకవిద్రావణం' కాకతి ప్రోలరాజుయొక్క 'భద్రాంగవిద్రావణ' అను దానిని తలపించుచున్నది. ఇది భద్రాచలప్రాంతమో, బస్తరుప్రాంతమో తెలియదుకాని క్రాకళిక కూడనుండుటచేత, కాకతీయులే యైనయెడల, (కాకర్త్యగుండన అమ్మరాజ దానార్ణవులకాలము వాడొకడు, తైలపుని సమకాలికుడుకూడ, స్పష్టముగా కనబడుచుండుటవలన) కొలనిదేశప్రాంతమో ఏదోయైయుండవలెను. నిజముగా నిది, అనగా వేంగి ఎల్లలవఱకు, వేములవాడవారి రాజ్యమనియు. చాళుక్యులచేత పడినదనియు, ముందే గ్రహించితిమిగదా. కొలనిని పాలించుచుండిన కుసుమాయుధుని వంశము వారైన ముదిగొండచాళుక్యులుకూడ ఈ కాలమునకు అంతరించినందున ఇచ్చట తైలపుడు జయించిన క్రాకళికులు కాకతీయులే యగుదురో భావిపరిశోధనలచే ఆధారములు దొరికిన తెలియవలెను. కాని ఇరువురును ఉండినస్థలములు ఒక్కటిగానే కనబడుచుండుటచే ఈ విషయమును మరల చర్చింతము.

సత్యాశ్రయునికాలము (క్రీ. శ. 998–1007) న చివర 1007 లో వరంగల్లుజిల్లాలో వరదన్నపేట రోడ్డుమీద పొన్నవోలుగ్రామమునుండి హైదరాబాదు లక్ష్మణరావు పరిశోధక మండలివారు సంపాదించిన యొకశాసనమున పల్లాశె చాళుక్య సత్యాశ్రయుని 'తంత్రపాలుడు' 'అంగరక్షకుడు' అన్నపయ్య కనబడుచున్నాడు. దీనివలన హనుమకొండప్రాంతము చాళుక్యుల చేతనే యున్నదని తెలియుచున్నది. సత్యాశ్రయుని కాలమున చోళచాళుక్య సమరముల సంగతి ముందే చెప్పబడినది. ఇతడు పోయి ఇతనితమ్మునికుమారుడు విక్రమాదిత్యుడు (ఐదవ) ఐదారేండ్లు పాలించి గతించినప్పుడు, జయసింహుడు (రెండవ) రాజగుటకు ముందు జరిగిన సంఘటన దక్షిణదేశ రాజకీయ చరిత్రయందు చాల ముఖ్యమైనది. జయసింహుని రాజ్యాధిరోహణము స్పష్టముగా తెలియక పోయినను క్రీ. శ. 1014 ప్రాంతము. చోళచక్రవర్తి రాజేంద్రచోళుడు క్రీ. శ. 1015 లో కొల్లిపాకవఱకు దండయాత్ర వచ్చినట్లు చోళ శాసనములలోకలదు. ఈ రాజేంద్రచోళుడు 1012 లో రాజై విమలాదిత్యుని, తన సోదరిభర్తను, వేంగియందు ప్రతిష్ఠించుటకై 1014 లో చేసిన దాడియొక్క కొనసాగింపే. ఇదంతయు 1012–1015 ల నడుమ తయారగుచుండినదే. ఎంతో పూర్వప్రయత్నము కనబడుచున్నది. చోళసైన్యములు తుంగభద్రాతీరమునుండి ఒకపాయ కొల్లిపాకను ప్రవేశింపగా మఱియొకపాయ వేంగియందు ప్రవేశించినవి. విమలాదిత్యుడు రాజ్యభ్రష్టుడై, అన్నశక్తివర్మ పోయినది మొదలు (1010) మామగారికడ తిరువయ్యారులో నుండెను. అక్కడి శాసనములలో నీతనికి 'పిళ్లైయార్ విష్ణువర్ధనదేవర్' అనికలదు. పిళ్లైయార్ అనగా, రాజకుమారుడు, యువరాజు అని యర్థము. సత్యాశ్రయుని వేంగినుండి చోళులు 1006 లో తఱిమినను విక్రమాదిత్యుని కాలమున 1010 తర్వాంను-డ

జయసింహుని రాజ్యాధిరోహణము వఱకు వేంగిరాజు ప్రవాసిగా యుండినందున చాళుక్యుల ఆధిక్యము అచ్చట నుండెనేమో. ఒకరాజు పోయి మఱియొకరాజు వచ్చుసమయమే శత్రురాజులకు ఉనుకూలతరుణము. విక్రమాదిత్యుని కాలమున ఎట్టి యుద్ధములును జరుగలేదని ఇంతవఱకు పరిశోధకులు తలంచిరిగాని చాల గందరగోళమైన రాజ్యకాల మాతనిది. ఒకవైపు భోజుడు, ఒకవైపు చేదిరాజు గాంగేయదేవుడు, కోసలాధిపుడు పశ్చిమ, ఉత్తర పార్శ్వములలో తాకగా దక్షిణమునను వేంగికి విమలాదిత్యుని రానీయక చూడవలసి వచ్చినది. ఇతడు మరణింపగా వీతని తమ్ముడు అయ్యన రాజాయెనుకాని ఆతనిగూర్చి 'రాజైవాడు' (నృప వాదం) అనుట తప్ప ఇక నొక్క యక్షరమైనను కానరాదు. అత్యల్పకాలము పాలించి దేశోపద్రవ సందర్భములో గతించినట్లు తెలియుచున్నది. జయసింహుడును తాను ఎంతో శ్రమపడి సింహాసన మారోహించినట్లు చెప్పుకొన్నాడు ఇక్కడ కాకతీయ చరిత్రకు ముఖ్యమైన విషయ మేమనగా అనుమకొండ ప్రాంత దేశమునకు రణరంగము వ్యాపింపలేదు. చోళులు కావేరీ ప్రాంతములనుండియు తుంగభద్రా తీరదేశములనుండి కర్నాటక రాజ్యములోనికి చొచ్చుచుండిరేగాని ఇంకను వేంగి, సత్రవాడి కొలని దేశములనుండి వచ్చుటకు ప్రయత్నింపలేదు. వీరు కాదుగదా వీరిమిత్రులైన చక్రకూటాది రాజన్యులుకూడ అటు విజృంభింపలేదు.

రాజేంద్ర చోళుడు విమలాదిత్యుని వేంగియందు ప్రతిష్ఠించి ఆతనికిని వేంగికిని రక్షణ యిచ్చుటకై గొప్పవ్యూహము పన్నెను. దీనిచే చక్రకూటము (నేటి బస్తర్ రాజ్యము) రణరంగమైనది. విమలాదిత్యుడు క్రీ. శ. 1019 వఱకు పాలించెను. ఆతనికి ఇరువురు కుమారులు. చోళరాజ పుత్రికి రాజరాజనరేంద్రుడు జనించెను. వంశపరంపరగా వచ్చుపేర్లు వదలి ఇతనికి మాతామహునిపేరు రాజరాజని పెట్టుట చోళుల ప్రీతికొఱకే. రెండవ కుమారుడు విజయాదిత్యుడు జటా చోడ భీముని దౌహిత్రాంశము. ఈ యన్నదమ్ములు తండ్రి గతించిన క్షణమునుండియు రాజ్యమునకు పోరాటము సాగించినవారే. క్రి. శ. 1019 లో, తండ్రి పోయినవెంటనే రాజరాజనరేంద్రుడు రాజ్యమునకు రాలేదు. ఆతని పట్టాభిషేకము 1021 లో జరిగినది. దీనికి ప్రబలకారణము ఈ విజయాదిత్యుడు పశ్చిమ చాళుక్యుల సాయమున అన్నను వేంగినుండి తరుముటగా నుండునని తర్వాతి రాజకీయ పరిణామములచే ఊహింప వచ్చును. క్రి. శ. 1019 నుండి మరల యుద్ధములు. ఉత్తరదేశపు రాజులు అటువైపునుండి దండెత్తగా రాజేంద్ర చోళుడు కర్ణాటకముమీదికి గొప్ప బలగముతో వచ్చి తుంగభద్ర కృష్ణలనడిమి ప్రదేశమునో మహాసంగ్రామము మొనర్చెను. ముసంగికడ (నేటిమాస్కి) తాను జయసింహుని ఓడించి తఱుమగొట్టినట్లు తన తమిళశాసనములలో చెప్పుకొని యున్నాడు. ఇది క్రీ. శ. 1021 లోని శాసనమున నుండుటచేతను రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము కూడ ఆ సంవత్సరమే జరుగుటచేతను, ఇంతటితో వదలక రాజేంద్రుడు వేంగికళింగముల మీదుగా గంగవఱకు పోయెను. చక్రకూటమునందలి సామంతరాజులు పశ్చిమ చాళుక్యులకు సాయపడినందున రాజేంద్రుడు వారిని దండించినట్లును, వీరు చాల పరాక్రమ వంతులనియు ఇతని తిరువాలంగాడు శాసనము చెప్పుచున్నది. వేంగిని జయించుటకు, నిలుపుకొనుటకు తుంగభద్రా కృష్ణా సంగమ ప్రాంతములలో రక్షణ కావలసియుండెను. ఆ ప్రాంతమందలి రాజులు, తెలుగు చోళులు, పశ్చిమ చాళుక్యుల స్నేహితులు, సామంతులు, ఆశ్రితులును కాని వేంగిమీదికి దండెత్తుటకు కృష్ణకు దక్షిణ పార్శ్వ మెంత యనుకూలమో తెలంగాణ చక్రకూటములుకూడ అంత యనుకూలములే పశ్చిమ చాళుక్యులకు. జయసింహునికి ఇంకను ఓఢ్ర కళింగ పతులు కూడ సాయపడిరి. రాజేంద్ర చోళుడు ఇంత దూరమువచ్చి ఇందరిని జయించి, విజయాదిత్యుని మిత్రులను పశ్చిమ చాళుక్యులను వేంగినుండి తఱిమి, తనకు అల్లుడును మేనల్లుడును నైన రాజరాజ నరేంద్రుని సింహాసనాసీనుని చేసి తాను చోళదేశమునకు మరలెను

ఈ విధముగా చాళుక్య చోళ యుద్ధములవలన దక్షిణమున నొళంబపాడి గంగపాడి రాష్ట్రములకు (నేటి అనంతపూరు జిల్లా మైసూరులలోని భాగములు) ఎంత ప్రాముఖ్యమో కొలని చక్రకూట అనుమకొండ ప్రాంతములకును అంత యేర్పడినది. ఇది జయసింహుని కాలమున ముసంగి యుద్ధానంతరము ఎక్కుడైనది. సంగ్రహముగా వ్రాయుచున్నాను. చోళులు పలుమార్లు కొల్లిపాక (నేటి హైద్రాబాదులో ఆలేరు స్టేషను సమీపపు కొలనుపాక) ను తగులబెట్టిరి. చక్రకూటమునుండి బెజవాడవఱకు సైన్యముల హడావిడి ఎక్కువయైనది. సామంత మాండలికులు బలవంతుల యండచేరి తమ తమ సీమలను రక్షించుకొనుచుండిరి. ఇట్టి సందర్భములో సత్రవాడి సీమలో, 964 లో, కనబడిన కాకర్త్య శబ్దమునంటిది కొలనిలో త్రైలోక్యమల్ల ఆహవమల్ల సోమేశ్వరుని కాలమున మరల కనబడిన, రెండును సంబంధములేనివని యెట్లు చెప్పగలము. గూడూరు శాసనమందలి బొట్టుబేతరాజు కొలనిదేశము వాడని యుండుటకూడ ఇందులకు బలము నిచ్చుచున్నది. చూడగా కాకతీయు లీ ప్రాంతములయందుండియే కల్యాణి చాళుక్యుల నాశ్రయించి వృద్ధికివచ్చినట్లు గట్టిగా

చెప్పవచ్చును. మొదట కొంతదేశమును సంపాదించి, తర్వాత అనుమకొండను గ్రహించి, తర్వాత సబ్బిసాయిరమునుకూడ పుచ్చుకొని చాళుక్యుల దయచే వృద్ధికివచ్చి, తుదకు చాళుక్యులు బలహీనులైన కాలమున స్వతంత్రులై సామ్రాజ్యాధిపాయకులైరి. ఆంధ్రదేశమంతయు వీరి ఏలుబడిక్రిందికి వచ్చినది. ఈ కాకతీయులు పైకివచ్చినతీరును మెట్టుమెట్టుగా పరిశీలింతము.

## 5 మొదటి బేతరాజు 'చలమర్తిగండ'

తర్వాత, కాకతీయులలో ఎఱిగినంతవఱకు అతిప్రాచీనుడు మొదటి బేతరాజు. ఇతనిగూర్చి హనుమకొండ శాసనమున నిట్లున్నది.

> "జయతి చలమర్తిగండః
> సమరజయశ్రీ విభా సబాహుదండః
> దుర్జయకులాబ్ధి చంద్రః
> సత్యధన స్సకలజగతి బేతనరేంద్రః"

ఖాజీపేట శాసనములో నిట్లు—

> 'సామన్త విష్టివంశః
> శ్రీమా న్కాకతిపురాధినాథో బేతః
> చోళక్ష్మాపాలచమూవార్ధి
> ప్రమథన సమార్జితోర్జితలక్ష్మీః'

ఇతడు ఎచ్చట పాలించుచుండినాడో తెలియదుగాని ఇతని కుమారుడైన మొదటి ప్రోలరాజు త్రైలోక్యమల్లాహవమల్లుని కడనుండి అనుమకొండను శాసనపూర్వకము గ్రహించెనని శాసనాధారముండుటచేత, మొదటి బేతరాజునకును అనుమకొండకును ఎట్టి సంబంధమును లేదని విశదము.

ఇతని కాలము ఏది? అను ప్రశ్నకుకూడ సమాధానము ఊహించియే చెప్పవలెను. మొదటి ప్రోలరాజు హనుమకొండను క్రీ. శ. 1068 మార్చినెలకుముందే గ్రహించియుండవలెను. అనగా ఆ చాళుక్యచక్రవర్తి మరణమునకుముందే. ఈ చాళుక్యుని కాలము క్రీ. శ. 1042—1068 కాబట్టి క్రీ. శ. 1042 కు ముందు జయసింహునికాలమున గ్రహించియుండజాలడు. పైగా మొదటి సోమేశ్వరుడైన యీ త్రైలోక్యమల్లాహవమల్లుడు రాజ్యమునకువచ్చిన రెండేండ్లు అతని శాసనములు చాలకొద్ది. 1044 నుండియే ఎక్కుడుగాను వరుసగాను న్నవి. అనుమకొండను గ్రహించిన ప్రోలరాజు సోమేశ్వరుని కాలమువాడైనచో అతని తండ్రి బేతరాజు తత్పూర్వుడు కావలయును. అనగా జయసింహునికాలమువాడు. లేదా, సోమేశ్వరుడే దాదాపు ఇరువదియాఱేండ్లు పాలించినందువ చేత ప్రోలరాజు లిరువురును ఇతనికాలమందే, ముందువెనుకలవారై యుండి, ఇరువురి సేవకును మెచ్చుకొని, తండ్రి గతించినందున కొమారునికి ప్రోలరాజున కిచ్చియుండవలెను.

మొదటి బేతరాజు జీవితమందలి ముఖ్యాంశములను పరిశీలింతము. ఈతడు చోళసైన్యమును జయించుటయని పై ఖాజీపేట శాసనములో నున్నదిగదా. ఈ చోళులెవరు? దూరపు కాంచీపురాధీశులు కాజాలరని ఇదివరలో చరిత్రకారులు వ్రాసిరి. కాని అది సరికాదనియు కాంచీపురమువారేననియు, కంచిలోనే, పశ్చిమచాళుక్యుల సామంతులుగానే—యనియు ఇటీవలి పరిశోధనచే తేలినది. కాకతి గణపతిదేవుని పాలంపేట శాసనస్తంభములో (క్రీ. శ. 1213) అతని సామంతుడు రేచెర్ల రుద్రదేవుడు తమ మూలపురుషుడు రేచెర్ల బ్రహ్మచమూపతిని గురించి ఇట్లు చెప్పుకొనెను—

> "తూర్యప్రణాద సమనంతరమేవ తూర్ణ
> మాక్షిప్య యో యవనికా సదృశం కవాటం
> కాంచీపురస్య సముపాదయ దాశు వీర
> లక్ష్మీ వివాహ మిహ కాకతివల్లభస్య"

"మంగళవాద్యముల మ్రోతల వెమ్మవెంటనే తెరవంటి కాంచీపుర కవాటములను త్వరగా తొలగించి, కాకతి వల్లభునికి వీరలక్ష్మీ వివాహమును తక్షణమే యెవడు కావించెనో" 'అతడు' అని బ్రహ్మచమూపతికి అన్వయము. అట్లే, రేచెర్లసోమచమూపతి పిల్లలమర్రి శాసనములో తమ మూలపురుషుడైన బ్రహ్మయను గూర్చి ఇట్లే చెప్పుకొనెను—

> "యః కాంచీనగరీ కవాటహరణం
> కృత్వా ప్రచండాహవ
> క్రీడ శ్చోడనరాధిపస్య కృతవాన్
> మానద్రుమోన్మూలనమ్."

ఈ రేచెర్లవారు మొదటినుండియు కాకతీయుల కాశ్రితులు. వీరి వంశావళులు పట్టికలువ్రాసి, చరిత్రకారులు వీరిలో ఈ బమ్మయ మొదటి బేతరాజు కాలమువాడని నిర్ణయించినారు. (చూ. 'ది హిస్టరీ ఆఫ్ ది దక్కన్' భా II పుట 577—8) ఇది సరిపడుచున్నది. కాకతి బేతరాజు చోళులను జయించినట్లు శ్లోకమే దొరికినది కాని ప్రోలరాజాదుల శాసనములలో కాంచీపుర ప్రస్తావము లేదు. పరవాలేదు. ఇందువలన మొదటి బేతరాజును అతని సామంతుడు బ్రహ్మయ్యయు కలసియే కంచిని సాధించిరని గట్టిగా నిర్ణయింపవచ్చును.

ఇది ఎప్పుడు? అను ప్రశ్నకు సమాధానము అహవమల్ల సోమేశ్వరుని కాలమునందే, అతని సేనానిగానే. ఏలయన కొమారు

డైన ప్రోలరాజే చాళుక్యుల కొలువులోనుండి వృద్ధికి వచ్చియుండగా, ఆతనికన్న ఒక్కువస్థితిలో నుండినట్టి తండ్రి చాళుక్యలను మించియో, లేక సమానస్కంధుడుగానో ఉండియుండుట కవకాశము లేదు. ఈతడు స్వతంత్రపాలకుడుగా నుండి స్నేహము నెరపుచుండెనేగాని చాళుక్యులను సామంతుడు కాడని కొందఱు తలంచినది నిరాధారము. కొలనువిదేశమే చాళుక్య సామ్రాజ్యము యొక్క అంతర్భాగముగా నుండినది గదా. ఇంత దూరము నుండి బేతరాజేల కంచికిపోయి యుద్ధ మొనరింపవలెను? చోళులు తనకు ఎట్టి శత్రువులు? కాబట్టి, తనకు ప్రత్యేకించికాదు. వేంగికొఱకు జరుగుచుండిన చోళచాళుక్య సమరములే యిందుకు కారణము. చాళుక్య సామ్రాజ్యము చెదరిపోయిన తమకును అధోగతియే. చాళుక్య చక్రవర్తి సోమేశ్వరుని యాజ్ఞచేతనే యాతడు కంచికి పోయియుండు ననుట తర్వాతి చరిత్రచే తెలియుచున్నది. జగదేకమల్లుని జయసింహుని కాలమున (క్రీ. శ. 1014—1042) చోళచాళుక్య సంఘర్షణలు చక్రకూటమునఱకు పోయినను, ఇందులకు ప్రతిగా చాళుక్యులు కంచివఱకు పోయిన జాడలు లేవు. సోమేశ్వరుడు కాంచిని తగుల బెట్టించినట్లు క్రీ. శ. 1058 తారీఖుగల నాగాయి శాసనమున మొదటి పర్యాయము కనబడుచున్నది. దీనినే కాబోలు బిల్హణకవి గొప్పగా, విక్రమాంకదేవ చరిత్రమున

> 'విధృత్య కాంచీం భుజయో ర్బలేన
> య శ్చోల రాజ్యశ్రియ మాచకర్ష'

అని చెప్పినాడు (అ 1—114—17). క్రీ. శ. 1059—60 లో సిందవాడి నాటిని పాలించుచుండిన తెలుగు చిద్దన (బిద్దన?) చోళ మహారాజు 'కాంచీపుర సంహరణ కారణ మహేశ్వరం' అని చెప్పుకొన్నాడు. అది అప్పుడు జరిగిన సంఘటనగా గాక, అంతకు కొంత మునుపటిదిగా నుండుటచే పై రెండు సంభవములును కొంతముందు ఏకకాలముననే జరిగి యుండును.

నాగాయి శాసనమున కంచిని తగులబెట్టిన విధమును సందర్భములును వర్ణింపబడియున్నవి. కన్నడ పద్యము :

> 'చలదిం ధారెయ నత్తు పుణ్ణురిపి,
> మున్నం మండవం గొండ దో
> ర్బలదిం కంచియ నిత్తలా ర్దురిపి కొయ్దుం,
> చోళనం కొందు వం
> దలెయం కొండనళుర్కె యుజ్జయినియం
> ధాళిట్టు ముట్టల్కి తో
> ళ్వలదిం బెళ్ళియగుండు గొండనదటం,
> త్రైలోక్య మల్లాధిపం',

దీని భావము—'చలము పూని (పంతముతో) ధారెను (ధారా నగరమును) అటు ప్రవేశించి తగులబెట్టి, మునుపు మండవమును (మాండ్వా) పట్టుకొన్న భుజబలముచేత కంచిని ఇటు విధ్వంసన మొనర్చి తగులబెట్టించి, చోళుని చంపి వాని పచ్చి తలను (బాడుదల) కోసికొని, ఆ వెంటనే ఉజ్జయినిని దాడి వెట్టి ముట్టడించి కాల్చి వెండిచెండును(?) హరించిన మహా పరాక్రమశాలి గదా త్రైలోక్య మల్లాధిపుడు.'

మైసూరు రాజ్యములో సొరబ యను చోటి యొక శాసనమున నీ క్రింది పద్యమున్నది.

> ఠాణెయ కెత్తి ముమ్మురియ గొణ్మ
> రిగొండ పదక్కె చోళ త
> న్నాణెయ నిట్టు కంచియ నిరాకు
> లదిం పొలకేశి సుట్టు క
> ల్యాణవ చోళ సుట్టనెన లొందె
> గజేంద్రదది నైదికొండ న
> క్కాణ పరాక్రమం సుభట చోళన
> వాహవ మల్లభూభుజం'

దీనిభావము—'ఠాణా (యనుప్రదేశము)ను పడొనర్చి ముమ్మురి (యనునత)ని గొంతునులిమి, ఆ పదముతోనే (అప్పుడే, వెంటనే) చోళునిమీద తన (ఆహవమల్లునియొక్క) ఆనపెట్టి, కంచిని నిరాకులముగా పొలకేశి (యను దండనాయకుడు) తగులబెట్టగా, కల్యాణ(నగర)మును చోళుడు తగులబెట్టెనని విని ఒక్కయేనుగుమీదనే వచ్చి జయించిన పరాక్రమశాలి ఆహవమల్ల భూభుజుడు.'

కల్యాణకటకమును చోళులు కాల్చినారని విన్నాడుగాన సోమేశ్వరుడును అప్పుడు తన రాజధానిలో లేడు. ఠాణా యనునది బొంబాయి మండలములోని ఠాణాజిల్లా. ఇది పూర్వము శిలాహారుల పాలనలో నుండినది. దీనిప్రభువే ముమ్మురి. ఇతనికే కన్నడ శాసనములలో ముమ్మణి, మాంవణి, అని నామాంతరములు గలవు. ఈ పద్యములోని పులకేశి (శ్రీ మూర్జానిగారు భ్రమపడినట్లు ప్రాచీన చాళుక్య చక్రవర్తి ఇమ్మడిపులకేశి గాడు) చాళుక్య దండనాయకుడు. ఆతడు ఠాణా దుర్గమును సాధించి ముమ్మురిగొంతు నులిమి (కాని చంపలేదని అనంతర చరిత్ర తెలుపుచున్నది), తత్క్షణమే చోళునిమీదికి—తన రాజైన సోమేశ్వరుని ఆనబెట్టి దండెత్తి, కంచిని తగులబెట్టగా, ఇంతలో కల్యాణకటకమును చోళులు తగులబెట్టగా, ఇదంతయు విని ఆహవమల్లుడు తాను (అప్పుడు మాళవదేశములో) చేయుచుండిన దండయాత్రను చాలించి గృహోన్ముఖుడాయెను—అని గొప్ప చరిత్రాంశము దీనివలన

తెలియుచున్నది. పైగా ధారామండపములమీద దాడి సలుపు చుండిన ఆహవమల్లుడు, ఆ సైన్యముతోనే కంచివరకు వచ్చి కంచిని తగులబెట్టి తర్వాత, తనదేశము నాక్రమించిన చోళుని జీకొనెననియు, చోళునిచంపి, తర్వాత మరల ధారానగరముపై దండు వెడలెననియు పై పద్యముల భావము. చోళుని చంపినది కొప్పం సంగ్రామమున 1054 లో అనుట తెలిసినదే. ఆ చోళుడు రాజాధిరాజు. కంచిని తగులబెట్టిన మహాదండ నాయకుడు పొలకేశి. ఏకకాలమున సోమేశ్వరుని దండనాయకులు ఒకవైపు దక్షిణమున చోళులతోను, పడమట కొంకణులతోను, పశ్చిమోత్తరమున మాళవరాజు భోజునితోను, ఎడతెగక పోరాడుచుండినట్లును, పై సంభవములన్నియు, ఒకదాని వెంబడి నొకటి, అతిత్వరగా, అందుకొన్నట్టు జరిగినట్లును, కనబడుచున్నవి. ఈ యుద్ధములు ఎందులకు? వీనికాలానుక్రమణిక యెట్లు? వీనిలో కాకతీయులపాలు ఎంత వరకు? వీనిని ముఖ్యముగా కనుగొన్నయెడల, త్రైలోక్య మల్లాహవమల్లుడు అనుమకొండను మొదటి ప్రోలరాజునకు ఎందుల కిచ్చినాడో, అనుమకొండ దానమునకును కంచిని తగులబెట్టుటకును ఏమిసంబంధిమో, బేతరాజును రేచెర్ల బొమ్మయయు ఎప్పుడు కంచిని ముట్టడించి ఆ నగరముయొక్క తలుపులను ఊడబెరికినారో విశదముగా తెలియగలదు.

కంచిని తగులబెట్టిన కారణము చాలగొప్పది. ఇంత ప్రయత్నమును వేంగికొరకు. దీనికి పూర్వపీఠిక ఎంతో కలదు. ఇదివరకే రాజరాజ నరేంద్రుడును, అతనితమ్ముడు విజయాదిత్యుడును వేంగికొరకు పోరాటము సాగించినదియు, రాజేంద్రచోళుడు రాజరాజనరేంద్రుని పట్టాభిషేక మొనర్చుటకొరకే గంగవరకు పయనము సాగించి ఎట్లు గంగైకొండచోళుడైనదియు ఇది వరకే చూచితిమిగదా. చాళుక్యుల బలమెట్టిదోగాని వేంగిని సంపాదించుటకు దానిని కాపాడుకొనుటకును చోళులు అఖిల భారతాంతర్జాతీయ మహాసన్నాహములు చేయవలసివచ్చినది. ఈ సందర్భమందే ఎక్కడనో కాంచీపురమందలి చోళులు కొల్లిపాకను తగులబెట్టుటవరకు వచ్చినది. ఇదివరలో సత్యాశ్రయుని కాలమున బిజాపూరులో దోనూరువరకుపోయిన వీరు ఆ తర్వాత పదునైదేండ్లకే ఇటు తెలంగాణములో ఇంతదూరము వచ్చిరనగా వీరి ద్వేషములు ఎంతకు పరిణమించినవో తెలియుచున్నది. ఈ సందర్భముననే తొలిసారి చక్రకూటప్రస్తావము వచ్చుటయు, ఉత్తరహిందూస్థానమందలి తన మిత్రులను హెచ్చరించి, చాళుక్యులను దండించి వేంగికి చక్రకూటము, కోశలి, తెలంగాణ ప్రాంతములనుండి ఉపద్రవము రాకుండజేయుటకే రాజేంద్ర చోళుడు ఇంత బృహత్ప్రయాణ మొనరించి గంగవరకుపోయి తత్కారణముగా 'గంగైకొండచోళన్'అన్న బిరుదమును వహించుటయేగాక తనకును చాళుక్యుల లాకిడి లేకుండుటకై తనరాజధానీ నగరమును కంచినుండి గంగైకొండచోళపురమని నూతనముగా తాను తంజావూరుజిల్లాలో నిర్మించుకొన్నపోటికి తరలించెను. ఇది నిజముగా చాళుక్యులతోటకు తట్టుకొన లేకయు, మున్ముందు ఎంతో పరిణామము ఎదురుచూచియు చేసిన ప్రయత్నముగాని ఊరక వినోదార్థముచేసిన పనిగాదు. తాను కొల్లిపాకను తగులబెట్టినందులకు చాళుక్యులు కసిదీర్పు కొందురని ఎదురుచూచి చేసినపని యిది. అట్టిదే జరిగినది.

చాళుక్య చక్రవర్తి జయసింహుడు ఊరకుండలేదు. చోళులకు సాయమొనర్చిన రాజులను వెంటనే దండింప నారంభించెను. కొంకణమును దండించి, భోజుని కొట్టి, తర్వాత చేదిరాజు గాంగేయ దేవుని జయించి క్రీ. శ. 1028 నాటికి మరల మసంగికడకు వచ్చిచేరెను. 1030 నాటికి విజయాదిత్యుడును కర్ణాటకుల సాయముతో వేంగికి వచ్చి 1031 లో తాను వేంగిమండలేశ్వరుడుగా గొప్పగా పట్టాభిషేకము చేసికొనెను. రాజరాజనరేంద్రుడు చేయునదిలేక సవతి తమ్మునికి రాజ్యమును వదలి తాను చోళుల నాశ్రయించి యథాపూర్వము తిరువైయారుకు పోయి చేరెను. ఈ కాలమునకు సరిగా ఆహవమల్ల సోమేశ్వరుడు, తండ్రికి జయసింహునికి శ్రమతగ్గించు వాడై, తాను యువరాజుగా రంగమును ప్రవేశించి, మొదటి జాగ్రత్త పథకముగా, తమ, చాళుక్యుల రాజధానీ నగరమును కూడ, మాన్యఖేటమునుండి కల్యాణీ నగరమునకు మార్చు కొనెను. ఆ నగరమును సోమేశ్వరుడే నిర్మించెనని విక్రమాంక దేవ చరితమున బిల్హణ మహాకవి వర్ణించి యున్నాడు. పరస్పరము పోరాటములను సాగించుటకొరకు ఇరువురు రాజులును తమ తమ దేశములలో వెనుకకు పోయిరి. ఇది వారి ఎత్తుగడలను సూచించుచున్నది. తర్వాతి మహాసంగ్రామమునకు ఎంతటి సన్నాహములు జరుగుచుండినవో, ఆంధ్రుడైన వేంగీశ్వరుని కొరకు అతని మామయైన తమిళ జనాధిపతి ఎంతటి భారీ ఎత్తుగడలను ప్రారంభించి చేయుచుండెనో, మనకు సరియైన ప్రమాణములు చిక్కక పోయినను సువ్యక్తమగుచున్నది. క్రీ. శ. 1022 లోనో ఆ ప్రాంతమునందో గంగైకొండ చోళపురము నిర్మితమైన తర్వాత పది యేండ్లకే కల్యాణ కటకము నిర్మితమైనది. నాటికి సోమేశ్వరుడు మంచి ముప్పదియేండ్ల యౌవనముందుండి యుండవలెను. క్రీ. శ. 1044 45 ప్రాంతమున చోళులతో మరల యుద్ధములు చేయునప్పుడు వారిని జీకొని ప్రసిద్ధికి రాగలిగిన రెండవ కుమారుడు, తర్వాతి ఆరవ విక్రమాదిత్యుడు, ఉండె ననగా నితనికి నాటికి సయినదియైన నుండి 1030 లేక 1032 ప్రాంతము నాటికి ముప్పదికి

పైబడియే యుండును. ఇంతే కాదు. విజయాదిత్యుడు, రాజరాజ నరేంద్రునిమీది స్పర్ధచే చాళుక్యుల నాశ్రయించిన వాడు, తాను సోమేశ్వరుని 'పుత్రుడ'నని చెప్పుకొనియున్నాడు. వాస్తవముగా కుమారుడు కాడుగాని 'అంకకా'డని యర్థము.

ఈ విజయాదిత్యుడును సామాన్యుడు కాడు. మహా యోధుడు. చాళుక్య చోళ సమరములలో చాళుక్య విక్రమాదిత్యునితో కూడనేయుండి పోరాడుచుండినట్లు శాసనములు తెలుపుచున్నవి. పైగా 'విష్ణువర్ధను'డను బిరుదును, వేంగిశాఖలో తండ్రి తాతలనుండి మారి మారి ఒకడు విజయాదిత్యుడైన ఒకడు విష్ణువర్ధను డనునట్లు, వచ్చుదానిని వహించెను. రాజరాజనరేంద్రుడును విష్ణువర్ధన బిరుదాంకితుడే. అన్నమీది స్పర్ధచేతను రాజ్యకాంక్షచేతను వహించిన బిరుదు. పైగా వేంగిమండలేశ్వరు డనియు వ్రాయించుకొనెను. చాళుక్యులసాయముతో వేంగిని గ్రహించినను చాలకాలము వేంగియందుండినట్లు కానరాదు. మహాసన్నాహముతో రాజరాజ నరేంద్రుడు చోళులను వెంటగొనివచ్చి కలిదిండి (కైకలూరు తాలూకా, కృష్ణాజిల్లా) గ్రామమునొద్ద పోరాడి మరల వేంగిని సంపాదించెను. ఇది క్రీ. శ 1035 ప్రాంతమున జరిగినట్లు తోచుచున్నది. ఈ సందర్భమున ముగ్గురు బ్రాహ్మణ వీరులు సేనాధిపతులు పోరాడి తమ ప్రాణము లర్పించినందున వారిపేరిట రాజరాజ నరేంద్రుడు మూడు శివాలయములను నిర్మించెనని ఆతని కలిదిండి శాసనమువలన తెలియుచున్నది. కాని ప్రయోజనములేక క్రీ. శ. 1039 నాటికి తిరుగ తిరువైయారుకే పోయి చేరవలసివచ్చినది. వేంగిలో లేడు. రాజేంద్రచోళుడును వయసు ముదిరి పెద్దవాడైనాడు కుమారులు రాజాధిరాజ రాజేంద్రచోళ వీరరాజేంద్రచోళులింకను చిన్నవాండ్రేమో క్రీ. శ. 1042 వఱకు వేంగి కొరకు యుద్ధములు కానరావు. జగదేకమల్ల జయసింహుడును రాజ్యభారమంతయు కుమారుడు సోమేశ్వరునిమీద పెట్టి, అంత వఱకు తాను జైనమతావలంబి, దానిని వదలి శైవమతమును, సోమేశ్వరుని తల్లి సుగ్గలదేవి ప్రోద్బలమున, అవలంబించి పొట్లచెఱువుకడనే కాలక్షేపము చేయుచుండెను. ఇది మొదలు చాళుక్యులందఱు శైవులే.

క్రీ. శ. 1042 నుండి పరిస్థితులు మారినవి. రాజేంద్రచోళ జయసింహు లిరువురును ఆ సంవత్సరముననే, కొద్ది ముందువెనుకలలో మరణించిరి. ఇంచుమించు ఏక కాలముననే సోమేశ్వర రాజాధిరాజులు తమతమ దేశముల కధిపతులైరి. సోమేశ్వరుడు త్రైలోక్య మల్లాహవమల్ల బిరుదద్వయమును ధరించి, తాను నిర్మించుకొన్న కల్యాణనగరమున పట్టాభిషేకము చేసికొని తండ్రికన్న నెక్కుడుగా విజృంభించెను. చోళులుకూడ అప్పుడే పట్టాభిషిక్తుడైన రాజాధిరాజుయొక్క ఆధిపత్యమున ఎత్తివచ్చిరి. దన్నాడ (ధరణికోట) వద్ద చోళులను చాళుక్యులు ఎదిరించిరి. పెద్దయుద్ధమైనది. సోమేశ్వరుని రెండవ కుమారుడు విక్రమాదిత్యుడును, విష్ణువర్ధన విజయాదిత్యుడును అడ్డగిలి వేంగికి మార్గము లేకుండ చేసినందున కాబోలు చోళులు తటాయన ఎత్తిపోయి కొల్లిపాకను తగులబెట్టిరి.

చాళుక్యులును చోళులవలె ఇప్పుడు రాజనీతినికూడ ననుసరించి వారివలెనే నీతి ప్రయోగములను ప్రారంభించిరి. చోళులకు కేరళ సింహళీయులు శత్రువులు. ఇదే సమయమని సింహళీయులు వెనుకనుండి చోళులను బాధింప నారంభించిరి. భోజుడు తమిళులకు వెరికాడై కర్ణాటకులను బాధించుచుండినట్లు సింహళమువారు కర్ణాటక మిత్రులై తమిళులకు ప్రక్కలో బల్లెమైరి. చోళులు వెంటనే కొల్లిపాకనుండి వెనుకకు మరలిరి. మరల 1047 నాటికి చాళుక్యులమీదికి ఎత్తివచ్చిరి. ఈమారు రాజాధిరాజు గొప్పప్రయత్నమే చేసెను. పెద్దసేనతో బయలుదేరి కంపిలిని తగులబెట్టి, తుంగభద్రను దాటి, అటనుండి వేంగికి వచ్చి, విజయాదిత్యుని తఱిమి, రాజరాజ నరేంద్రుని వేంగియందు ప్రతిష్ఠించి, చోళదేశము చేరి అశ్వమేధయాగము చేసెను. వెనువెంటనే చాళుక్యులు విజృంభించిరి. చోళులను ఎదుర్కొనిరి. పూందూరు మహానగరముకడ (నేటి హైదరాబాదు, మహబూబునగరుజిల్లా) పేరారు (హిరెహళ్ల) నదీతీరమున ఇరుసైన్యములకును యుద్ధమాయెను. వేంగి మరల కర్ణాటకుల స్వాధీనమాయెను. ఇందులకు ప్రతిగా చోళులు నొళంబపాడిలో ప్రవేశించి, స్వాధీనపఱచుకొని, విధ్వంసన మొనర్చిరి.

రాజరాజ నరేంద్రుడు మరల రాజ్యభ్రష్టుడు. ఈమాఱు మరల వేంగిని సంపాదించుకొనుటకు చోళులు రాజనీతిని ప్రయోగించిరి. భోజమహారాజును కర్ణాటకముమీదికి ఎగకొల్పిరి. కొంకణమువారి పితూరీలు లేవదీసిరి. క్రీ. శ. 1048 లో యుద్ధమొనర్చిరి. ఇందు చోళులు పరాజయమందగా, రాజరాజ నరేంద్రుడు తిరువయ్యారు దారిబట్టగా, వేంగియందు విష్ణువర్ధనుడు చలింపకయుండగా సోమేశ్వరుడు కొంకణమువారి అల్లరులను అణచుటకు పోయెను. మధ్య నితడు చోళులతో చేరిన నొళంబపల్లవుల నణచెను. కొంకణము నుండి ఇంకను పైకిపోయి భోజుని కొట్టు సన్నాహములో నుండెను. కొంకణ మాళవములను రెంటిని శిక్షింపవలసిన యావశ్యకత యుండెను. కొంకణమును పాలించుచుండినవాడు ముమ్మణి. ఇతనిని శిక్షించుటకు పులకేశి దండనాయకుని నిలిపి, తాను భోజునిమీదికి బయలుదేరెను. కొంకణమందు పాలకేశి సాయముగా సోమేశ్వరుని

మేనత్త అక్కాదేవియనునామె, 'సమరభైరవి' 'ఏకవాక్యె' 'గుణదబెడంగి' బిరుదులు దాల్చిన యామె యుద్ధమున పాల్గొనెను. సోమేశ్వరునితో మాళవదండయాత్రకు పోయిన వారు, అతని సామంతులు హోయసలులు, యాదవులు, తెలుగు చోళులు, కాకతీయులు అందఱును పాల్గొన్నట్లున్నారు. సోమేశ్వరునితో కలసి నూటముప్పదిమందిరాజులు భోజుని ఓడించిరని మేరుతుంగాచార్యుడు వ్రాసియున్నాడు. కర్ణాటకులతో చేదిరాజు కర్ణుడును, అణహిలపురాధీశుడు చాళుక్యభీమదేవుడును చేరిరి. వీరుగాక బ్రాహ్మణమంత్రులు సేనాధిపతులు, దండనాయకులు ఏందరో. వీరందఱును గుమిగా భోజుని ధారానగరమునేగాక ఉదయపూరు, మాండ్వా, ఉజ్జయిన్యాదులను ముట్టడించిరి. హొయసలులలో నొకడైన ఎరెగంగ లేక ఎరెయంగ అనువాడు ఈ యుద్ధములలో పాల్గొన్నట్లును, అతడు తగులబెట్టిన మాళవనగరముల జ్వాలలు కర్ణాటక రాజధానులకు కనబడినవని శాసనకవులు వ్రాసియున్నారు.

ఇంత గొప్పఊపుతో అలెగ్జాండరు దండయాత్రవలె సోమేశ్వరుడు ఒక్క భోజమహారాజును, ముసలివానిని కొట్టుటకు పోయియుండినకాలమున వేంగియందు ఒక గొప్పసంభవము జరిగినది. ఇది రాజరాజనరేంద్రుని రాజనీతి, లేదా ఆంధ్రమహాభారత రచనా ప్రారంభ మొనర్చిన నన్నయభట్టు రాజనీతి. రాజనరేంద్రుడు మూడు పర్యాయములు, మనకు తెలియవచ్చి, పదభ్రష్టుడై రాజ్యభ్రష్టుడైనాడు. చోళులు బలహీనులై చాళుక్యులు బలవంతులుగా నేర్పడుచుండిరి. చోళులు గంగను తెచ్చిన చాళుక్యులు నర్మదాసింధుకావేరీనదులను పలుమార్లు తాకుచుండిరి. (తన తమ్ముడు విజయాదిత్యుడు వేంగిని తనకు వదలునట్లులేదు. ఇట్టి పరిస్థితులలో నన్నయభట్టు సాయపడినాడు. ఈ భట్టునకు వాణసనారాయణభట్టు ఎచ్చటనో అదృష్టవశమున 'సహాధ్యాయి' 'ఇష్టుడు'. వెంటనే అతని సాయమున వాణసమధుసూదనయ్యను, చాళుక్యుల ప్రధానామాత్యుని, బాహత్తరనియోగాధిపతిని దర్శించి రాజరాజనరేంద్రుని పశ్చిమచాళుక్య మిత్రునిగా 1050 క్రీ. శ. నుండి వేంగియందు మరల ప్రతిష్ఠించినట్లు తోచుచున్నది. అది మొదలు క్రీ. శ. 1061 వఱకు రాజరాజనరేంద్రుడు నిరంతరాయముగా వేంగిని పాలించుచు నన్నయ్యచే భారతమును ఆంధ్రీకరింపజేసినాడు. ఇదంతయు సోమేశ్వరుని 'పల్లవదిగ్విజ'యానంతరమే జరిగియుండవలెను. ఏలయన 1049 లోను 1050 లోను రాజరాజనరేంద్రుడు తిరువయ్యారులో నున్నాడు. 1049 కి కొంతముందే చోళులు వేంగిని పట్టలేక నొళంబపాడిలో కొంతభాగమును పట్టుకొనిరి. నొళంబపాడిలో వారిని ఆపి దానినే పల్లవదిగ్విజయముగా పేర్కొని సోమేశ్వరుడు వర్ధమానపురమున 1049 లో నుండెను; ఉత్తరదిక్కునుకూడ జయించుటకు సన్నాహములు చేయుచుండెను. కొంకణమున చాళుక్యసైన్యమును దండనాయకులును ఉండిరి. వేంగిలో విష్ణువర్ధన విజయాదిత్యుడుండెను. ఇట్టి క్లిష్టపరిస్థితిలో 1050 లో తిరువయ్యారులోనుండిన రాజరాజనరేంద్రుడు తానే పశ్చిమచాళుక్యుల కాశ్రితుడాయెనేని ఇక ఈ చోళు లెవరికొఱకు యుద్ధములు చేయుదురు? చాళుక్యులును ఈ యవకాశమును వినియోగపఱచుకొన్నట్లున్నారు. ఎన్నివైపుల యుద్ధము లొనరించుచుండగలరు. దాదాపు అర్ధశతాబ్దముగా జరుగుచున్న పోరాటము ఇట్లు పరిణమించుట తమకే విజయసూచకముగా తలంచి రాజరాజనరేంద్రునే వేంగియందు ప్రతిష్ఠించి, వాణసమధుసూదనయ్యకు బంధువైన వాణసనారాయణభట్టును వేంగియందు తమ ప్రధానిగాఉంచి (కొంత సైన్యముతోననియే భావింపవలెను) విజయాదిత్యుని నేఱువిధముగా తృప్తిపఱచియుందురు. విజయాదిత్యుడు నొళంబపాడ విజయానంతరము, ఆ ప్రదేశమునకు పాలకుడుగా కనబడుచున్నాడు.

ఇంత రాజకీయములు జరుగుచుండిన యీ కాలమున కాకతి బేతరాజేమి? స్వతంత్ర పాలకుడుగానుండి యుండుటయేమి? అసాధ్యము. చోళులకు క్రోధము ఇనుమడించినది. చాళుక్యులు కొంకణ మాళవములుమీదికి పోయియుండిన యదను చూచుకొని రట్టపాడిమీదికి ఎత్తివచ్చి వేంగికి పోలేక పూండూరు వఱకునుపోయి ఆ నగరమును కాల్చివేసి అచటినుండి ఏతగిరి వఱకును పోయి, అచటనొక విజయ స్తంభమును నాటిరి. ఈ సందర్భమున (1051 లో) రాజాధిరాజు కడకు భోజరాజు దూత యొకడువచ్చినట్లు చోళ శాసనములలో నున్నది. ఇది భోజుడు సోమేశ్వరుని బాధను తప్పించుకొనుటకు చేసిన ప్రయత్నమై యుండును. ఏకకాలమందే మాళవమున సోమేశ్వరుడును కొంకణమున పొలకేశియు, ఏతగిరియందు రాజాధిరాజును పోరాడుచుండగా రాజరాజ నరేంద్రుడు వేంగియందు నన్నయ నారాయణభట్టుల సాయమున ఆంధ్ర మహాభారతమును వ్రాయించుచుండిన కాలమది. పొలకేశి కంచిని తగులబెట్టిన తర్వాత చోళుడు కళ్యాణమును తగులబెట్టెనని శాసనమందుండుటచేత చోళులు కల్యాణముమీదికి పోగలరనియో, పోవుచున్నారనియో, లేక కొంకణము స్వాధీనమైనందున, చోళులను వెనుకకు త్రిప్పుట కుపాయముగానో పొలకేశి కంచిమీదికిపోయి కంచిని కాల్పించియుండును. ఇది ఎరిగియో ఎఱుగకయో, లేక తమ తమ యుద్దేశములను పూర్తిగానించుటగానో ఇంచుమించు సమకాలముననె చోళులు ఏతగిరికడనుండినవారు, కల్యాణనగరముమీదికి పోయి, కోటను కాల్చి చక్రని ద్వార

పాలక విగ్రహములను అపహరించి, వానితోకూడ నగరమును ఎంతో దోపిడి చేసిరి. ఈ లోపల భోజుడు (1050) మరణించెనుగదా. తన రాజ్యములోని సంగతులు విన్న (త్రై)లోక్యమల్లాహవమల్లుడు వేగముగ వచ్చి చోళుని పందలె గొనెనని (పందల=పచ్చితల) యుండుటవలన, నిది 1054 లో కొప్పం సంగ్రామమున ఏనుగుమీద, పోరాటములోనే, నిహతుడైన రాజాధిరాజు వృత్తాంతముగాన, ఇదంతయు కొప్పం యుద్ధములో పరిసమాప్తమైన సంఘటనల పరంపరను సూచించుననుటలో సందేహము లేదు. చోళులు ఎంతకాలము కల్యాణమందుండిరోగాని 1052 నాటికి తమ శాసనములలో తాము కల్యాణమును కాల్చినట్లు చెప్పుకొనియున్నారు.

కొప్పం సంగ్రామమందు చోళరాజాధిరాజు మరణించెను గదా. ఆహవమల్లుని తమ్ముడు జయసింహుడనునతడుకూడ మరణించెను. అన్నిటికన్న పెద్ద విషయము, కొంకణ విజయమునకు కారకుడు కాంచీనగరదాహి, పొలకేశి దండనాయకుడు కూడ వీరస్వర్గ మలంకరించెను. చోళులు తాము జయించినట్లు చెప్పుకొన్నారుగాని వారికి తగిలినట్టిది పెద్దదెబ్బ. పొలకేశిమీద పగతీర్చుకొన్నారేగాని వేంగిని సంపాదింపలేకపోయిరి. కొల్లిపాకను, కంపిలిని, ఏతగిరిని, పూందూరును చోళులు తగులబెట్టియుండిరి గాని అన్నిటికిని ప్రతిగా చాళుక్యులు ఒక్కమారు కాంచీమహానగరమును తగులబెట్టిరి. విజయము చాళుక్యులదే. ఇది మొదలు పదేండ్లు యుద్ధములు లేవు. తర్వాతకూడ 1067 లో వీరరాజేంద్రుడు వేంగిని జయించునంతకు వేంగీమండలము చాళుక్యులదే. మొదటి పర్యాయము 1051లో కంచిని చాళుక్యులు కాల్చినందునను ఇతరత్ర బేతరాజుపేరు కానరానందునను, కాకతీయ సైన్యములు కంచియందే ప్రధానముగా నుండినట్లును, కొంకణమును జయించి అటనుండి పొలకేశి వీరికి సాయమువచ్చినట్లును గ్రహింపవచ్చును.

1051 లో కంచిని జయించి, నాటికి కొంత సామంత బలగముతో కనబడుచున్న ఈ బేతరాజుయొక్క పూర్వచరిత్ర ఎట్టిది? నాటి కితని వయస్సెంత? ఎప్పుడు మరణించినాడు? అనుమకొండను సంపాదించినవాడితని కుమారుడు గదా. మరి యాతడే రాజ్యమునకు పాలకుడు?—ఈ ప్రశ్నలకు సమాధాన

ముగా గూడూరు శాసనమొకటి విరియాలవారిది దొరికినది. కొంత చరిత్ర తెలిసినది. విరియాల ఎఱ్ఱనృపతి 'బొట్టు (పొట్ట?) బేతవసుధాధిపుచేకొని, వాని వైరినుద్వృత్తమున జంపి యాకొఱవి దేశమునందు బ్రతిష్ఠ సేసె'ననియు, 'అరుదగునట్టి యెఱ్ఱనృపునంగన కామసానియొక్క (యాక) మేల్గరదని బేత భూవిభుని గాకతివల్లభు బిన్నవాని దా బరగగ జేకబట్టి ఘను బల్లవరాయుని మోగిజొచ్చి భాస్కరవిభు చక్రవర్తిగని కాకతి నిల్పుట కోటిసేయదే' యనియు నుండుటవలన, ఈ బొట్టు బేత రాజు కాకతీయుడుగా నుండుటవలనను, — ఇది మొదటి బేతరాజు చరిత్రయని కొందరి యభిప్రాయము. ఈ శాసనమునకు తోడుగా మాటేడు శాసనము 1120 క్రీ. శ. నాటిదికూడ లంకింపబడినది. 'వేమ చోళ (చోళ) కులశేఖరు' డైన రేపడు 'బేతభూపతి నిజరాజ్య వర్ధనుడు' అనియు 'దారిద్ర్య వైరి' యనుపేర నెగడు కాకతిరాజునెం జేకొని దాయల నిర్జించి రాజ్యంబు నిలిపి నరిచేం బ్రతిష్ఠితుల బొం గ్రామ శాసనములు నూఱుంజేర్చ్లను నొప్పబడసె కడు రూఢిమంతుడై' అనియు నుండుటచేత — ఇదికూడ మొదటి బేతరాజును గూర్చినదని యభిప్రాయపడిరి. ఇందులకు ఇంకను తోడుగా రెండవ ప్రోల రాజునాటి శాసనమున వేతదండనాథుని తన తండ్రి వైజదండ నాథుడు, కాకతి బేతరాజును చాళుక్య చక్రవర్తి దర్శనము చేయించి ఆతనిచేత తన రాజునకు సబ్బిసాయిరము నిప్పించి నట్లు చెప్పిన విషయమునుకూడ చేర్చి ఈ మూడు శాసనములును రెండవ బేతరాజుయొక్క చరిత్రకు సంబంధపడినవని యభిప్రాయమిచ్చిరి. మరికొందరు మొదటి రెండు శాసనములే మొదటి బేతరాజును గూర్చినవనియు, వైజదండనాథుని చరిత్ర రెండవ బేతరాజుదనియు తలంచిరి. ఈ విషయములు ఇంత సులభముగా కుదురునవి గావు. ఇతర ప్రమాణములనుకూడ సమన్వయింపవలెను. సిద్ధేశ్వర చరిత్రపై నాధారపడుట గ్రుడ్డివాని ననుగమించుటవంటిది. చరిత్రకు అవి సరిపోయిన మంచిదేగాని దానిని చారిత్రకాధారముగా గ్రహింపరాదు. కాబట్టి కొంత అనంతర చరిత్రను పరిశోధించి తర్వాత ముందు దానిని సమన్వయించుట ప్రయోజనకారి.

### 6. మొదటి ప్రోలరాజు విజయములు

ఖాజీపేట శాసన మిట్లు చెప్పుచున్నది.

'పుత్త్ర స్తస్య జగత్పవిత్ర చరితః ప్రోల క్షమాపాలకో
నిర్వక్రీకృత చక్రకూట విషయః, భద్రాంగ విద్రావణః
జిత్వా కొంకణ మండలా నిజయశస్సంవాలితాశః పరా
డు త్సార్యార్యజనస్తుత స్స విసరత్ కీర్తిం సమావర్తయన్
'వ ఏవ

'జిత్వాపాన్తర మన్నెయాన్ పృథువనం కాద్పర్తి దుర్మాత్మజం
హత్వాజౌ గుణసాగరస్య పురకూటేశం చ గొన్నాహ్వయం
తత్తద్భూయుత మనమకొండవిషయం త్రైలోక్యమల్లక్షమా
ధీశాచ్ఛాసనబద్ధ ముద్ధతజయో సంలబ్ధవాన్ శాశ్వతం''

మొదటి ప్రోలరాజు కంపి యుద్ధమున పాల్గొనలేదు. ఇతని విజయములు తండ్రి విజయముల కన్న భిన్నములుగా నున్నవి. ''చక్రకూటము యొక్క వక్రతను తీర్చి, భద్రాంగుని తఱుముగొట్టి కొంకణమును జయించి కీర్తి నార్జించెను. ఇవి ఈతని విజయములలో పెద్దవి. తర్వాత చుట్టునున్న మన్నె దొరలను, పెద్ద అడవి దొరలను, కార్పర్తి దుర్గరాజు కొడుకును జయించి పురకూటేశ్వరుని గుణసాగరుని (లేక, 'గుణ సాగరస్య' అని అనియైన — లాటె గుణసాగరు డగుటచేత) గొన్నయ్య యనువానిని యుద్ధము చంపి, ఆయా భూములతో కూడిన యనుమకొండ విషయమును త్రైలోక్య మల్ల రాజు కడనుండి, తాను గొప్పగా జయించి నందువలన, శాసన పూర్వకముగా శాశ్వతముగా నుండునట్లు పడసెను.'

వీని కాలానుక్రమణిక నిర్ణయించుట సులభము కాదు. ఇవి క్రీ. శ. 1051 లోనో, లేక 1054 ప్రాంతమందో, లేక 1068 లో త్రైలోక్య మల్లుని మరణమునకు ముందో జరిగియుండవలెను. వీనిలో కొంకణ విజయము తప్ప మిగిలిన వన్నియు తెలంగాణమందును దానికి తూర్పునను జరిగినవే కాని ఇతరత్ర కానరావు. అనుమకొండ నుండి చక్రకూటము వఱకు ఈతడు పరాక్రమించియున్నాడు. కొంకణమును ఎప్పుడు జయించి యుండును? క్రీ. శ. 1051 లో నొకమారును 1067లో చాళుక్య విక్రమాదిత్యుడు తండ్రి మరణమునకు కొంత ముందు దిగ్విజయము బయలుదేరినప్పు డొక మారును ఆహవ మల్లుని కాలమున, ఈ ప్రోలరాజు కాలమునకు సరిపోవునట్లు రెండుమార్లు చాళుక్యులు కొంకణమును జయించి యున్నారు. 1051 లో నైనయెడల, ఈతడు తన తండ్రి కంచిని ముట్టడి బెట్టి నగర కవాటమును హరించిన కాలమునకే కొంకణమును జయించి, సొంకేశి సైన్యముతో చేరి కంచికి పోయి యుండ వలెను. అట్లు కాకపోయిన యెడల 1067 లోనో లేక 1066 లోనో విక్రమాదిత్యునితోకూడ పోయి కొంకణమును జయించి వెంటనే తెలంగాణ ప్రాంతమునకు వచ్చి ఆహవ మల్లుడు చనిపోవు లోపల ఆయా యుద్ధములలో పాల్గొని అనుమకొండను గ్రహించియుండవలెను. తండ్రి కొడుకుల కాలములో కొంత అంతరముండుటయు సహజమే. ఈ మొదటి ప్రోలరాజు క్రీ. శ. 1079 నాటికి లేడు. 1051 కి అనగా

అంతకు ఇరువది యెనిమిది యేండ్ల క్రింద కొంకణమును జయించి యుండుననుట కంటె సమీపమున, 1067 సం. ప్రాంతమున జయించి యుండుననుటయే సరిపడునేమో.

ఇచట నొక ప్రధానాంశమును గుర్తింపవలెను. పులకేశి జయించినది మమ్మురి రాజును ప్రోలరాజు జయించినది జయకేశియను రాజును. ఇంతవరకు ఈ శాసనమును పఠించిన వారెవరును దీనిని గుర్తింపక 'జిత్వా కొంకణమండలో నిజయశస్సంవారిరాశేః పరా దుర్వార్య...' అని తప్పులుగా పఠించి దానికి తగినట్లు అర్థము చెప్పుటకు బాధపడిరి. ఇచ్చట అర్థము కుదురని దటుండ పాఠమే నా కంటికి నేరుగా కనబడుచున్నది—'జిత్వా కొంకణమండలాని జయకేశిం వారిరాశేః పరా దుర్వార్య...' అని. కొంకణము ఏడు భాగములు. 'సప్తకొంకణ సప్తార్చి' ఇత్యాది బిరుదులు గలవు. వీనిని జయించి, (తత్పాలకుడైన) 'జయకేశిని సముద్రమున కవలికి విసరి'—అనిన కుదురుచున్నది. 'జయకేశిం' అని చక్కగా కనబడుచుండగా 'జయశస్సం' అని పఠించి, ముందరి యక్షరమును 'లోని' అని గ్రహించి 'కొంకణమండలోని జయశస్సం' అని చదివి 'కొంకణమండలో + నిజయశస్సం' అని విడదీసికొని దానికి 'పాలితాశా' ఇత్యాదు లూహించుకొన్నారు శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్య ప్రభృతులు. 'జయకేశి' అనుటయు 'వారిరాశేః పరా దుర్వార్య'యనుటయు లిపిజ్ఞానము గలవారికి చక్కగా కనబడుచున్నవి

ఈ జయకేశి కొంకణమునకు ప్రభువు. త్రైలోక్యమల్లుని మరణానంతరము, రెండేండ్లకు, క్రీ. శ. 1069–70 లో విక్రమాదిత్యుడు తన యన్న కెదురుతిరిగిన కాలమున, మొట్టమొదట, విక్రమాదిత్యుని పక్ష మవలంబించి, ఆతనికి చోళ వీరరాజేంద్రునితో సంధి కుదిర్చినవాడు—అని విక్రమాంకదేవచరిత్రము చెప్పుచున్నది. పులకేశి మమ్మురిని గొంతు నులిమినాడు (చంపలేదేమో!). ప్రోలరాజు జయకేశిని తరిమినాడు ('మమ్మురి గొమ్మురి' అని అనుప్రాస చమత్కారము). చాళుక్య దండనాయకుడైన రట్ట కార్తవీర్యుడు 'మమ్మురి కొంకణేగ జలధి బడబానలం, తాణేయకోలాహలం' అను బిరుదులను ధరించియున్నాడు. ఈ శిలాహారప్రభువు మమ్మురికి క్రీ. శ. 1059–60 లో, అని యప్పుడు శిలాహారంభిత రాజ్య కోటలలో నొక దానిని చాళుక్య చక్రవర్తి మరల స్వాధీనము చేసినట్లు శాసన ప్రమాణము కలదు. అనగా 1052 లో దండింపబడిన మమ్మురి రాజు 1060 లో అనుగ్రహపాత్రుడైనాడు. జయకేశి గోవాపాలకుడనియు ఆతని తారీఖు సుమారు 1050 80 క్రీ. శ. లని యొక యభిప్రాయమున్నది. (J.B.B.R.A.S.ix, p. 242' p. 278) కాని మమ్మురి చివరి తారీఖు 1060 గనుక ఆ తర్వాతి కాలమే మనకు గణ్యము

క్రీ. శ. 1061, రాజేంద్రచోళుని రాజ్యాంత కాలము. చోళులు మరల విక్రమించి గంగపాడి నాక్రమింపసాగిరి. యుద్ధములు జరుగుటయు గంగపాడి నొళంబపాడి మొదలైన మండలములయొక్క సరిహద్దులను విష్ణువర్ధన విజయాదిత్యాది రాజులు కాపాడుచుండుటయు కనబడుచున్నది. 1063 లో వీరరాజేంద్రు డెత్తి వచ్చి కూడల సంగమ ప్రదేశమందు మహా సంగ్రామము జరిగినది. కాని వేంగి మాత్రము చోళులవశము కాలేదు. 1067 లో వీరరాజేంద్రు డెత్తివచ్చెను. చాళుక్య చక్రవర్తి త్రైలోక్యమల్లుని కడపటి దినములవి; మరల గందరగోళపు దినములుగా పరిణమించినవి. శత్రువులు మరల బలవంతులైరి; కుమారులును దండనాయకులును కూడ బలవంతులు. ఒకరి కొకరు తెగిపోక పోరాడసాగిరి. ఇరు పక్షములును మరల కూడల సంగమక్షేత్రమందే యుద్ధమున కేర్పాటుచేసికొనినవి. చోళులు వచ్చి, ఒక నెలదినములు కాచుకొనియుండియు చాళుక్యులు రాకుండుట, రట్టపాడికి పోయి, ముసంగిలో జయస్తంభము నాటి వేంగిమీదికిపోయిరి. ఆహవమల్ల సోమేశ్వరుడు రణరంగమునకు రాకపోవుటకు కారణములు రెండుగా కనబడుచున్నవి. ఒకటి ఆ రాజును పీడించుచుండిన అనివార్యమైన యొకవ్యాధి. తర్వాత ఆ కారణముననే ఆతడు తుంగభద్రలో మునింగి మరణించెను గదా. రెండవది—రాజ్యతంత్రము; చాళుక్య సైన్యములు రెండుగా చీలి ఒకటి చక్రకూటమునకును రెండవది విక్రమాదిత్యుని యధ్వర్యమున దక్షిణాపథమునకును పోయియుండినవి. వీరరాజేంద్రుడు కృష్ణను దాటి బెజవాడకుపోయి, వేంగి కళింగములను జయించి చక్రకూటమున చాళుక్యులను ఎదుర్కొనెను. ఇప్పుడు వెనుకనుండి చోళులను బాధించుటకు పాండ్య సింహళీయులు తిరుగుబాటులు పితూరీలు లేవదీసిరి, తిరుగబడిరి. దక్షిణమున కేగిన విక్రమాదిత్యుడు కొంకణముమీదుగా కేరళమునకుపోయి పాండ్య సింహళులతో మైత్రి నెఱపి, అటనుండి చోళదేశమునకు వచ్చి, చోళరాజధాని 'గంగైకొండ చోళ' పట్టణమును కొల్లగొట్టి, కాంచీపురమును ప్రవేశించి అటనుండి వేంగికి బయలుదేరెను

విక్రమాదిత్యుని దక్షిణ జైత్రయాత్ర విని వీరరాజేంద్రుడు వెంటనే రాజధానికి మరలి రావలసిన పరిస్థితి యేర్పడినది. కొంత చోళ సైన్యమును రాజిగుడను రాజేంద్రుని (రాజరాజనరేంద్రుని కుమారుని) యధీనమున చక్రకూటమున నుంచి, విజయాదిత్యునితో సంధి చేసికొని, వేంగిని అతనికే వదలి, తాను గృహోన్ముఖుడై చోళదేశమునకు తరలెను.

శ్వరుని కాలమునందే, ప్రోలరాజు అనుమకొండను సంపాదించుటకు పూర్వమే మాళవయుద్ధములలో పాల్గొనియుండవలెను. ఏక కాలమున, ఇంచుమించు సమకాలములోనే తాత తండ్రి మనుమలు చాళుక్యుల యుద్ధములలో పాల్గొనియుండవచ్చును.

దీనికి తగినట్లు వారి రాజ్యకాలమును చూతము. క్రీ. శ. 1068 కి మొదటి బేతరాజు లేడు. తత్పూర్వమే గతించియుండవలెను 1079 నాటికి మొదటి ప్రోలరాజు కానరాడు 1090 నాటికి దుర్గరాజు (త్రిభువనమల్లుడు) ప్రభువు. 1090—1079=11, 1079—1068=11, 1068—1051=17. ఈ విధముగా వీరు మువ్వురును గడచినట్లు ఇంచుమించు తారీఖులు దొరకియుండుటచేత మువ్వురును దీర్ఘకాలము జీవించిన మహాయోధు లనవలసియున్నది. పైగా రెండవ బేతరాజు చాళుక్య విక్రమాదిత్యునికన్న చాల పెద్దవాడై యుండుననికూడ తెలియుచున్నది (దీని వివరణము తర్వాత). తుద కిట్లు తేలుచున్నది. తాత తండ్రి మనుమలు మువ్వురును పశ్చిమచాళుక్యుల నాశ్రయించియుండిరి. తాత మొదటి బేతరాజు క్రీ. శ. 1051 లో కంచిని జయించినాడు. అతని కుమారుడు 1066—67 లో కొంకణజయకేశిని జయించినాడు. అంతకుముందే చక్రకూటమును జయించి, బిరుదాంకుని తలమగొట్టి యుండవలెను. ఏమైయైన 1066—67 లో విక్రమాదిత్యునితో నేగియుండినవాడు, అంతలో 1068 మార్చి లోపల, (సోమేశ్వరుడు మరణించులోపల) వచ్చి చక్రకూటాదులను జయించి అనుమకొండను శాసనపూర్వకముగా పడయుట కవకాశము చాలదు రాజేంద్రచోళవిక్రమాదిత్యులు చక్రకూటము మీద దారసిల్లినప్పుడుగదా మొదటి సోమేశ్వరుడు గతించినాడు. అప్పుడు మొదటి ప్రోలరాజు తుంగభద్రకడ చక్రవర్తినే ఆశ్రయించియుండవలెను. తమ రాజ్యము అనుమకొండప్రాంతమై యుండ, చుట్టుపట్ల ఇంత యుద్ధములు జరుగుచుండ, మొదటి బేతరాజు కల్యాణదాక కంచివరకు పోయినాడనగా కుమారుడున్నాడన్న ధైర్యమే యై యుండవలెను క్రీ. శ. 1067 లో మొదటి ప్రోలయ్య చక్రకూటమును తాకినచో నది తత్పూర్వమే 1048 లోనో లేక కొంతతర్వాతనో, 1067 కు చాల ముందు. ఈలోపల, మధ్యకాలమున మన్నెరాజులను, చుట్టునున్నవారిని జయించి, చక్రకూటరాజ్య వంగిరాజ్యముల ఎల్లల వరకు తమ రాజ్యమును విస్తరించి పరాక్రమించియుండవలయును అపూర్వమే తన కుమారుడును పరాక్రమము చూపి మాళవయుద్ధములలో విజయము గాంచియుండగా—ఇప్పుడు—మొదటి సోమేశ్వరుని యవసానకాలమున—(1067—68) తాను, తన తండ్రియు, కుమారుడును, తమ సామంతులును శ్రమపడి ఆర్జించిన రాజ్యమునకు చక్రవర్తిముద్ర (శాసన బద్ధం) పడుట ముఖ్యమని యెంచి 1068 మార్చి 29 తారీఖుకు ముందే గ్రహించియుండును.

శాసన పూర్వకముగా గ్రహించుటలో నేదో ధ్వని యున్నది. ఈ విషయమును 1079 వ తారీఖు శాసనమున చెప్పుటలో కూడ నేదో అంతరార్థము కలదేమో. ఇట్టి యనుమానమే కలిగి శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు దాదాపు నలుబదియేండ్ల క్రింద నిట్లు వ్రాసిరి—"అనుమకొండరాజ్యమును ఇతడు స్వాధీనము చేసికొని యుండినను లిఖిత మూలమైన యాధారము ఏదియు లేదనియు నాతడా విషయమును స్వతంత్రముగానే సంపాదించియుండి తరువాత సోమేశ్వరునికి మిత్రుడై యాతనివలన లిఖితమూలముగా బొందియుండును" (కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము). స్వతంత్రముగా సంపాదించిన దానికి సోమేశ్వరుని అనుగ్రహ మెందుకో! చరిత్ర చక్కగా బయలుపడని కాలపు వ్రాతయిది. కొలువులో నుండియే సంపాదించినాడు. కాని 'శాసన బద్ధం' అనుట యెందుకు, 'ఉద్ధత జయా' గదా. కాబట్టి ఇందేదో ధ్వని నిశ్చయము. ఇది వ్యవహారిక వాక్యము గాదు. ఇక మా రిచ్చినది తొలగించరాదనియు, పైగా తాను ఎంతో సేవచేసినందుకు ప్రతిఫలముగా నొసంగబడినదనియు—ఇత్యాదిగా తోచుచున్నది.

శాసన పూర్వకముగా గ్రహించుటలో ప్రోలరాజు యొక్క దూరదృష్టియు రాజనీతిజ్ఞతయు కనబడుచున్నవి. అదిగాక యితడు చాళుక్య చోళరణరంగ వాతావరణమున పెరిగిన వాడు. మొదటి సోమేశ్వరుని యనంతరము రాబోవు రాజకీయాంతఃకలహములను ముందే పసిపట్టియుండును. పెద్దరాజు కన్నుమూసిన రెండేండ్లలోనే అన్నదమ్ముల వైరము నడచె గదా. చాళుక్య విక్రమాదిత్యుడు మొదటినుండియు అన్నమీద ప్రీతి గలవాడు కాడనుటకు నిదర్శనము లున్నవి. అన్నకు యువరాజ పట్టాభిషేకము చేయక, తండ్రి, తనకే పట్టాభిషేకము చేయనుండగా నితడు వలదని అన్నకే చేయుమనెనుగాని, ఆ యువరాజ పట్టాభిషేకానంతరము వెంటనే దిగ్విజయము బయలుదేరెనని బిల్హణుడు విక్రమాంకదేవచరిత్రమున వ్రాసియున్నాడు. ఈ వెంటనే బయలుదేరు టెందుకు? తర్వాత కూడ నితడు అన్నకు ఎదురుతిరుగుటలో అధర్మమునకు లోకము శంకించి యుండుననియు, ఇతడు దోషి కాదని నిరూపించుటకే విక్రమాంకదేవచరిత్రము వ్రాయబడినట్లును చరిత్రవలన తోచుచున్నది. కాబట్టి, విక్రమాదిత్యుడు దక్షిణ దిగ్విజయయాత్రపోయిన కాలమున నాతనితో కొంకణమువరకు పోయిన ప్రోలరాజు జయకేశిని జయించిన తర్వాత, అచటినుండి వెనుకకు వచ్చి, [illegible] చక్రవర్తి సేవనుండి,

అతడు మరణించు లోపలనే తన రాజ్యమును గట్టి చేసికొని, తన రాజనీతిజ్ఞతను దూరదృష్టిని ప్రకటించుకొనెను. ఇచ్చిన రాజ్యమును మరల గ్రహింతురని ఈతడు శంకించియుండు ననుటకు రెండవ బేతరాజు చరిత్ర చూచిన విశదము కాగలదు. ఈతడు తన దండనాథుడైన వైజయ సాయముచే త్రిభువన మల్లునికి మ్రొక్కి అనుమకొండను మరల సంపాదించు కొనుటయేగాక సబ్బిసాయిరమును కూడ గ్రహించెనని శాసన ముస్నదిగదా. ఆ సబ్బిసాయిరమును కూడ మరల పుచ్చుకొని ఆఱవ విక్రమాదిత్యుడు పరమార జగద్దేవుని కిచ్చినట్లు తెలియుచున్నది. కాబట్టి తమ రాజ్యము ధారాదత్తముగా తమకు ప్రాప్తించిననేగాని దక్కదని వీరు శంకించియుందురని, పైయూహలు సరియైనవే యనియు, రెండవ బేతరాజు చరిత్రను పరిశోధించిన తెలియగలదు.

## 7. రెండవ బేతరాజు

ప్రోలరా జెప్పుడు గతించెనో తెలియదుగాని తన బిరుదు పేరిట నీతడు జగతికేసరి తటాకమును నిర్మించినందువలన క్రీ. శ. 1068 కి తర్వాత కొంతకాల ముండెననుట నిస్సంశయము. చాళుక్య రాజసోదరుల యంతఃకలహము దెవరి పక్షము వహించెనో తెలియదుగాని అతని కుమారుడు రెండవ బేతరాజు శాసనము 1079 నాటికి లేదు. 1076 నాటికి విక్రమాదిత్యుడు రాజు. ఒకవేళ తండ్రి కొడుకులు రెండవ సోమేశ్వరుని పక్షముండిరేమో తెలియదుగాని రెండవ బేతరాజు తన హనుమకొండ శాసనము 1079 నాటి దానిలో త్రిభువన మల్ల చాళుక్యునిపేరు చెప్పలేదు. చాళుక్యుల ప్రస్తావమే చేయలేదు. కాని తర్వాత నొక తారీఖుపోయిన శాసనమున 'త్రిభువనమల్ల దేవర విజయరాజ్య మాచంద్రార్కతారం బలుత్తమిరె' యనిచెప్పి తాను 'తత్పాద పద్మోపజీవి' ననియు 'పతిహిత చరితం వినయ విభూషణం' అనియు చెప్పుకొన్నాడు. (Corpus of Ins No. 5 హనుమకొండ వరుణ ప్రతిష్ఠ) కాని ఇందులో ఎచ్చటను తాను త్రిభువనమల్లుడను బిరుదును ధరించినట్లు కానరాడు. త్రిభువనమల్ల దుర్గరాజు యొక్క ఖాజీపేట దర్గా శాసనములో (Corpus of HYB–13) కూడ ఈ విశేషణము ఉన్నవిగాని త్రిభువనమల్ల బిరుదము రెండవ బేతరాజున కన్వయించునట్లు కానరాదు. ఇది మొద లీతనికి 'విక్రమ చక్రి' యనియు 'త్రిభువనమల్ల' యనియు బిరుదులు గలవని పెద్దలు తలచినారు. క్రీ. శ. 1079 కి తర్వాత నీతడు త్రిభువనమల్లుని మన్ననకు పాత్రుడై యుండవచ్చును గాని ఆ బిరుదములు తాను ధరింపలేదు. ఆశాపవ శ్లోక మిది—

> "మానం రస్య పరశోష దవాగ్నిః
> చోళ మాళవ మదేభ మృగారిః
> విక్రమేణ భువి విక్రమ చక్రి
> బేత భూపతి రితి ప్రథితో భూత్"

విక్రమేణ=పరాక్రమముచేత, భువి = భూలోకమునందు, విక్రమ చక్రి=విక్రమ విష్ణువు (పరాక్రమనారాయణుడు), ఇతి=ఇట్లని, బేతభూపతిః, ప్రథితః అభూత్=బేతరాజు ప్రసిద్ధుడాయెను. అప్పట 'విక్రమేణ' యనగా విక్రమార్కుని చేత యనిగాని, 'విక్రమ చక్రి' యనగా విక్రమార్కు డనబడు చక్రవర్తి యనిగాని, చక్రవర్తియైన విక్రమార్కుడనిగాని కుదురదు. పై క్రీ.శ. 1079నాటి హనుమకొండ శాసనమందే 'శ్రీమ న్విక్రమచక్రి బేతమండలికోత్తమః' అని యున్నది దేనిలో చాళుక్యుల పేరు లేదనుచున్నారో అందులోనే విక్రమ చక్రియని యుండుట గమనింపదగినది. కావున 'విక్రమచక్రి' యని తన ప్రతాప సూచకముగా నీతడు పెట్టుకొన్న బిరుదుగాని ఈ ప్రతాప మీతనికి విక్రమాదిత్యుని తోడి సంబంధ మేర్పడినందు వలన వచ్చినదికాదు. అంతకు ముందునుండియు నున్నదే.

మఱి త్రిభువనమల్ల బిరుదము దుర్గరాజాది–ఖాజీపేట శాసనము (1090)లోనే స్పష్టము. మొదట ముప్పది నాలుగు పంక్తులు ఒక భాగము. అంతవఱకు ఓడికొండ ప్రభువైన దేవణభట్టుయొక్క కావ్యమట. తర్వాత 35 వ పంక్తినుండి 65 పంక్తివఱకు రెండవ బేతరాజు రామేశ్వర పండితునికి ఇచ్చిన దానము చెప్పబడినది. కాలము (శక 1012) క్రీ. శ. 1090 నాటికి రెండవ బేతరాజు సజీవుడై యున్నట్లే. ఈ పంక్తులకు కర్త 'బేతరసర' వాక్యము ముగింపు 65 వ పంక్తిలో 'ఇంతుసలిసిద' వఱకు. తర్వాతి విషయము ఆ పంక్తియందే 'ఆ నిజగురు ధర్మమం సముద్ధరిస ఆ బేతరసర సుపుత్ర' అని దుర్గరాజున కన్వయము. ఈ దుర్గ నృపతి 'త్రిభువన మల్లం'. ఈ ఖాజీపేట శాసనమందే రెండు తారీఖులున్నవి. మొదటిది 1090 క్రీ. శ. రెండవ బేతరాజుది, రెండవది క్రీ. శ. 1102 త్రిభువన మల్ల దుర్గరాజుది. తర్వాతి రాజుల శాసనములలో వారు విశేషించి త్రిభువనమల్లునే పేర్కొనుచుండిరి. రుద్రదేవుని అనుమకొండ శాసనము (తెలం. శా. కాక 5; Corpus 3 HYB) క్రీ.శ. 1162 లో, వంశావళిలో త్రిభువన మల్లుని కుమారుడు రెండవ ప్రోలరాజని యున్నది. అంతకు ముందుండిన రాజులను పేర్కొనరేదు ఖాజీపేట శాసనము ప్రకారము త్రిభువనమల్లుడు దుర్గరాజే గదా. ఈ దుర్గరాజు శాసనములలో రామేశ్వర పండితుడు కలడుగాని అతనికిని మొదటి ప్రోలరాజునకును ఎట్టి సంబంధమును కనబడదు. 'చలమర్తి

గండ' ప్రోలరాజుయొక్క తారీఖులేని యొక శాసనములో (Corpus 12 HYB) రామేశ్వరపండితునికి వైజనపల్లిని శివపురము గావించి యిచ్చినవాడు త్రిభువనమల్లావనీశ జనకుడు అని యున్నది. దీనిని మొదటి ప్రోలరాజు శాసనముగా పరిశోధకులు గ్రహించినారుగాని కుదురునట్లు లేదు. మొదటి ప్రోలరాజీతడే యైనచో రెండవ బేతరాజుయొక్క ఖాజీపేట శాసనములలో రామేశ్వరపండితుని ప్రశంసవచ్చినప్పుడు తన తండ్రిని గుఱించి ఆతడు చెప్పియుండడా? దుర్గరాజు తన తండ్రివలె తానును భక్తుడనని చెప్పుకొన్నట్లు బేతరాజు చెప్పుకొనలేదు అనుమకొండ ప్రాంత శివపురకర్త తానే. అట్లే ఈ ప్రోలరాజు వైజనపల్లిని శివపురముగా నిర్మించినవాడు త్రిభువనమల్లావనీశ జనకుడని చెప్పుట చూడగా ఇదికూడ రెండవ బేతరాజునకే అన్వయించునట్లున్నది. అనుమకొండ వైజనపల్లి—ఈ రెంటి దాతయు రెండవ బేతరాజే. వైజనపల్లి శాసనమందలి ప్రోలరాజు రెండవ ప్రోలరాజు. 'త్రిభువనమల్లుని తండ్రిని నేను' అని కొడుకుపేరు చెప్పి తండ్రి శాసనము వేయించుట ఏ రాజుకడను ఇంతవఱకు కనబడదు. వైజదండనాథుని పేర్కొన్న బేతనప్రెగ్గడ శాసనమునకూడ (రెండవ) బేతరాజు ప్రోలరాజులు తండ్రి కొడుకులని లేదు.

ఈ విధముగా 'విక్రమచక్రి' (=శౌర్యనారాయణః) యని పేరొందిన, 'త్రిభువనమల్లు'డను బిరుదును ధరింపని ఈ రెండవ బేతరాజు త్రిభువనమల్ల విక్రమాదిత్యుని ప్రతిపక్షకోటిలోనుండి, ఆతడు చక్రవర్తియైనంతట, ఆతనితో సమాధానపడి, అట్లుండియు అభిమానముచేత ఆ చక్రవర్తి బిరుదమును తాను వహింపక, తన కుమారునికి దుర్గరాజునకు పెట్టుకొనెను. రెండవ బేతరాజు త్రిభువనమల్లుని దర్శించినట్లు శాసనప్రమాణమే కలదు; కాని తర్వాతిది. రెండవ ప్రోలరాజు కాలపు అనుమకొండ శాసనము (1117) లో వైజదండనాథుడను మంత్రి బేతరాజును చక్రవర్తి పాదములకు మ్రొక్కించి చక్రవర్తిచేత తన రాజునకు సబ్బిసాయిరము నిప్పించెనని, వైజదండనాథునికొడుకు బేతనప్రెగ్గడ ప్రతిష్ఠగా చెప్పుకొని యున్నాడు. వైజదండనాథుడు కాకతీయులకు కులక్రమాగతుడైన మంత్రి, తాను యుద్ధవీరుడు, స్వామిభక్తిచేత తన కుమారునకు ప్రభువుపేరు పెట్టుకొనెను. ఈ బేతమంత్రి రెండవ ప్రోలరాజు ప్రధాని. ఇందు ప్రోలరాజు 'త్రిభువనమల్లమండలిక భూపాలసుపుత్రనప్ప'యని పేర్కొనబడియున్నాడు. త్రిభువనమల్లమండలికుడుగాని త్రిభువనమల్లరాజుయొక్క మండలికుడు గాడు. అనగా దుర్గరాజే త్రిభువనమల్లుడనబడు మండలికుడు. వైజదండనాథుడు తన రాజును, రెండవ బేతభూపాలుని మూల అనుమకొండరాజ్యమందు నెలకొల్పుట మాత్రమే గాదు. ఆతనికి పైపెచ్చు సబ్బిసాయిరమునుకూడ అధికముగా నిప్పించినది విశేషము. వేములవాడరాజ్యమే సబ్బిసాయిరముగా కనబడుచున్నది. అన్నదమ్ముల యంతఃకలహముంకాలమున విక్రమాదిత్యునికి ఎదురైయుండినందున చక్రవర్తియైనవెంటనే ఆతని యాగ్రహమునకు పాత్రుడైయుండెనేమో, దానికి సమర్పకముగా చక్రవర్తిని సమాధానపరచి, ఆతని పాదములకు మ్రొక్కునంతటి పని చేయించి వైజదండనాథు డీరాజనీతిని ప్రయోగించెనని చరిత్రకారులు తలంచినది సమంజసముగానేయున్నది. అంతటి పరాక్రమశాలి 'విక్రమచక్రి' తనకు సామంతుడుగా నుండుటయు రాజనీతిగానే పాటించి విక్రమార్కుడును ఆతని తొల్లింటిరాజ్యమును, తన తండ్రి యిచ్చినదానిని, మరల నిచ్చుటయేగాక క్రొత్త రాజ్యమునుకూడ నిచ్చెను.

సబ్బిసాయిరము—అనగా వేయిగ్రామములతోడి — సబ్బిదేశము వేములవాడరాజ్యమే యని అచటి తొంటిచాళుక్యుల పర్బణి శాసనము సాక్ష్యమిచ్చుచున్నది. ఇది నేటి కరీంనగర్ జిల్లాలోని భాగము. మూడవ యరికేసరి క్రీ. శ. 966 లో శుభధామ జినాలయమును బాగుచేయుటకు సోమదేవసూరియను వతనికి దారవోసినగ్రామము 'కుట్టుంబవత్తివనికటుపలు' సబ్బిసాయిరములోని రేపాకపన్నెండులో—నున్నది.

రెండవ బేతరాజు సబ్బిసాయిరమును పడసినకాలమును నిర్ణయించుటకు మఱికొన్ని శాసనములు కనబడుచున్నవి. క్రీ. శ. 1079 నాటికి రెండవ బేతరాజు చాళుక్యులను తనకు అధిపతులనుగా ప్రస్తావింపలేదు. 1090 నాటికి త్రిభువనమల్లాది బిరుదులు, కనబడుచున్నవి. ఈ మధ్య, వేములవాడలో దొరకిన యొకశాసనము (No. 12, K. 7, A. P. Govt. AR Series 3) క్రీ. శ. 1083 డిశంబరు 25 నాటికి సబ్బిసాయిరము మహామండలేశ్వర రాజాదిత్యుడను నతడు పాలించుచున్నట్లు చెప్పుచున్నది. ఈ తర్వాత దొరికిన తారీఖు ఖాజీపేట శాసనము క్రీ. శ. 1090 నాటిది. వేములవాడను గాని సబ్బిసాయిరమునుగాని కాకతీయులు ఏమధ్యకాలమున పాలించుచుండినట్లు అచ్చటి శాసనములు దొరకలేదు. పై రాజాదిత్యుడు కాకతీయులను పేర్కొనక కల్యాణీచాళుక్యులనే పేర్కొనెను. ఈ నడిమికాలమందే త్రిభువనమల్లుడు తమ్ముడు జయసింహుని తిరుగుబాటు అణచెను. ఈ రెంటికిని సంబంధమున్నదో లేదో గాని 1076 లో రాజ్యమును గ్రహించిన విక్రమాదిత్యునికి శత్రుబాధ పూర్తిగా తొలగక, 1079 లో కాకతీయులు తాము స్వతంత్రులము, మాదేశము మాకు శాసన పూర్వకముగా దత్తముగాన దానిని ఎవరును తారాదు అనునంతటి ధీమాతో విక్రమచక్రి పరాక్రమించుచుండ, తమ్ముడు చోళరాజుతో

కలిసి ఎదురుతిరుగగా క్రమముగా అందరిని జయించెనని, 1090 నాటికి కాకతీయులు కూడ లొంగిపోయిరని గ్రహింప వలసి యున్నది.

మరి, వైజదండనాథుని ప్రసక్తి బేతదండనాథుడు క్రీ. శ. 1117 లో ఎందులకు చేయవలసి వచ్చినది? మరల దానిని సంపాదించుటకు తమ హక్కును ప్రకటించుట యగునా? ఇచ్చిన రాజ్యమును మరల విక్రమార్కుడు ఊడబెరుకుకొనెనా? చూతము. సబ్బిసాయిరములో వీరి శాసనములు కానరాక పోవుట యటుండ మరల క్రీ. శ. 1106 నాటికి సరియగు చాళుక్య విక్రమ వర్షము 22, వ్యయ, వైశాఖ శు 5 సోమవారము నాటికి కుమార సోమేశ్వరుడు వేములవాడలో నుండి చక్రవర్తి యుత్తరువు పొంది దానములు చేసి యున్నాడు. ఇది సబ్బిసాయిరమం దంతర్భాతమని శాసనము, (A. P. Govt AR Series 3, Kn 6 no. 11 Lemulavada). ఇందు కాకతీయుల పేరులేదు. ఆ తర్వాతి శాసనము వేములవాడలో దొరకినట్టిది శక 1131 (క్రీ. శ. 1109) సర్వధారి. ఇది పరమార జగద్దేవునిది. ఇతడు చాళుక్య విక్రమాదిత్యునికి చాల ప్రియుడు. దన్ను చక్రేశ్వరుడు పిలిపించి కుమారునివలె చూచుచుండెనని కొల్లిపాక 1104 నాటి, శాసనమున చెప్పుకొన్నాడు. (A P. Govo A. R. 3 Kn 5. పు 60) వీని నెల్ల చూడగా సబ్బిసాయిరమును రెండవ బేతరాజు పొందిన నువ్వలోనే దానిని విక్రమాదిత్యుడు మరల తీసి మరియొకరికిచ్చినట్లు ఊహింపవలసి యున్నది. ఇది బేతరాజు ననంతరము జరిగియుండునేమో. వైజదండ నాథుడు 'సబ్బిసాయిరమ నాళిసిదుద్ధ యుశోధినాథ' అనగా సబ్బిని పరిపాలింపజేసిన యఖండ కీర్తి సంపన్నుడు. అనగా ప్రయత్న పూర్వకమైన పనిగా కనబడుచున్నది. బేతరాజు పాలించుట జరిగినది. దుర్గరాజు శాసనము ఒకటే దొరికినది, క్రీ. శ. 1102 ది, రామేశ్వర పండితునికి దానమిచ్చి నట్టిది. నాటికి రెండవ బేతరాజు లేడు కొల్లిపాకలోను మార్పులు కనబడుచున్నవి. రెండవ బేతరాజు రామేశ్వర పండితునికి దానమిచ్చు నాటికి రెండేండ్లు ముందు కందూరు తొండరస చోళమహారాజు కొల్లిపాక 700 పాలించు చుండినవాడు దానమిచ్చి యున్నాడు. ఈ తెలుగు చోళరాజువే మరికొన్ని తారీఖు చెడిపోయిన శాసనములున్నవి. తర్వాత పైన చూచిన పరమార జగద్దేవుడు క్రీ. శ. 1104 లోను అటు తర్వాత 1107 లో మహాప్రచండదండనాయకుడు అనంతపాలయ్యయు కనబడుచున్నారు. Ng 44. నానాటికి జగద్దేవ నారాయణదేవుడు వెలసియున్నాడు. ఆయనకే అనంతపాలయ్య దానమిచ్చెను. ఈ నడుమ 1106 కుమార సోమేశ్వరుడు వేములవాడలో నున్నాడు. 1109 లో జగద్దేవుడు వేములవాడలో కనబడుచున్నాడు. రెండవ ప్రోలరాజు తాను జయించినట్లు చెప్పుకొన్న జగద్దేవు డితడే. త్రిభువనమల్ల దుర్గరాజుతోడ యుద్ధము లొనరించినట్లు ఖాజీపేట శాసనములో నున్నది.

'ఆ బేతరసన సుపుత్రం......
'కుల తిలకం సకల జగ
తిలకం సౌజన్య సార్వభౌమ నెనిప్ప
గ్గళికెగె నంత మహిమం
డలేశ్వరం దుర్గనృపతి త్రిభువనమల్లం॥

'పరభూపాల కరుర్కుడంగె పణర్వర్
తమ్మిర్కియోళ్ సుక్కిన్మెయి
గరెయలు గండిన తొండినంకదధటర్
పొంకాళ్తనం బూణె ది
గ్వరితాత్మ జ్జ్వళ కీర్తి పర్వుతిరె లో
కాలోకము శాశ్వతం
ధరణీచక్రమ నాళ్వ తోళ్వలద గం
డం దుర్గభూపాళకమ్॥'

ఇంతటి యుద్ధవీరుడు చేసిన యుద్ధములేవో తెలియుట లేదుగాని చక్రవర్తికి ఎదురు తిరిగి యుండడని తోచుచున్నది. పైగా నిది మామూలు ప్రశస్తిగా కనబడుచున్నది. ఇతడు మృదుస్వభావుడు 'సౌజన్య సార్వభౌమం' గదా. ఇతని తర్వాత ప్రోలరాజు చాలకాలము రాజ్యము చేసినందున రాజ్యమునకు వచ్చి నప్పుడు బాలుడై యుండి యుండును. వీనినెల్ల సమాకలింపగా క్రీ. శ. 1102 లోనో కొంత అటో యిటో, దుర్గరాజు గతింపగా, సబ్బినాటిని పాలించుటకు బలవంతు డొకడు కావలసి యుండినందుచేతనో, రానున్న వేంగి దండయాత్రాదులకు పూర్వప్రయత్నముగా కొల్లిపాక ప్రాంతములను కాపాడుకొనుటకో లేక కాకతీయులయందు ప్రత్యయము తగ్గిపోవుటచేతనో— విక్రమాదిత్యుడు జగద్దేవదండనాయక అనంతపాలామాత్యాది మహావీరులను కొల్లిపాకలోను వేములవాడయందును నియమించి యుండవలయును. సబ్బిసాయిరము తమ చేతినుండి దాటిపోయిన ద్వేషము రెండవప్రోలరాజు హృదయమున ప్రజ్వలించి తర్వాత వారి యుద్ధములకు దారితీసియుండును. తర్వాత కాకతీయులు సబ్బిని సంపాదించినారు. క్రీ. శ. 1149 లో ప్రోలరాజు జగదేకమల్లుని సామంతుడుగా సబ్బిసాయిరమును పాలించు చున్నట్లు శనగవరము శాసనము తెలుపుచున్నది

## 8. రెండవ బేతరాజు పూర్వచరిత్రలో కొన్ని సందేహములు

సబ్బిసాయిరమునుగూర్చి ఇంత తెలిసినది గదా ఇచ్చట మరి కొన్ని యంశములను చర్చింపవలెను. ఇలనికి విక్రమాదిత్యునిలో

సంబంధము కుదిర్చినవాడు వైజదండనాథుడొక్కడుమాత్రమె కాడనియు, 'విరియాల' 'వేమచోళ' (వేమబోయని కొందఱు) వంశాలవారు ఎఱ్ఱయ రేచదండనాథులు ఇరువురుండిరనియు వీరు బేతరాజు శత్రువులను పరిమార్చి అతనిని రాజ్యమందు సుస్థిరునిగా నొనర్చిరనియు, ఇందులకు ప్రమాణము గూడూరు మాటూరు శాసనములనియు కొందఱు చరిత్రకారు లభిప్రాయపడిరి. గూడూరు శాసనములో శ్రీనివాసావారిగారి ముద్రణము ప్రకారము తారీఖులేదు; మాటూరుది క్రీ. శ. 1120. కాని ఇటీవల కొంత పరిశోధించి గూడూరు శాసనమును మరల ప్రకటించుచు దానికి క్రీ. శ. 1124 డిసెంబరు 24 తారీఖని శ్రీ కొల్లూరు హర్షవర్ధనశర్మగారు (కీ. శే) నిర్ణయించినారు. (ఆం. సా. ప. పత్రిక.) కాని వైజదండనాథుని ప్రయత్నమును, విరియాలవారిదియు, వేమ చోళవంశమువారిదియు, మూడును ఒక్కప్రయోజనమును ఉద్దేశించినవాయని సందేహము. వైజమంత్రి సాధించినది సబ్బిసాయినాము, విరియాల ఎఱ్ఱయ సాధించినది కొఱవిదేశము ఇది వేఱు, అది వేఱు. లేకపోయిన ఏకకాలములో నరువురును వేరువేరు ప్రయోజనములను ఒక్క రాజుకె సాధించియుండవలెను గదా. రెండవ బేతరాజే 'పొట్ట బేతరాజ'ను 'పిన్నవాడు'ను అనియు చెప్పవలసివచ్చును. కాలనిర్ణయము కుదురదు. వైజదండనాథునిది రెండవ బేతరాజునుగూర్చిన దనుటలో సందేహములేదు. విరియాలవారిది అస్పష్టము. కొఱవినిగూర్చి మఱియొకదును ఇట్టి చరిత్ర కానరాదు. అనుమకొండను ఏలిన ప్రోలరాజు కుమారుడు 'విషమచక్రి—చోళమాధవ మహేశమ్ముగారి' గూడూరు శాసనములో కనబడునంతటి బలహీనుడు గాడు; అంతటిబాలుడును గాడు.

హర్షవర్ధనశర్మగారు మాటూరు శాసనముగూడ ఇందుకు సంబంధించినదని తలంచి ఎఱ్ఱయ్యకులోడు రేవయ్యకూడ పొట్టబేతరాజునకు సాయపడెనని సిద్ధాంతకరించినారు. నాకు చూడ ఎఱ్ఱయ శాసనమొకటే మొదటి బేతరాజునకు సంబంధపడినది. ఈ మాటూరుశాసనమందు తారీఖు క్రీ. శ. 1120, దాత మల్లనాయకుడు, 'పెత్తసూపలి సిజరాజ్య పర్వసుడు.' ఇతని తండ్రి రేవడు. మల్లన రెండవ ప్రోలరాజునకు ఆశ్రితుడైనచో తండ్రి రెండవ బేతరాజునకు అతని తాత పెరరాజునకు లరిపూర్వునకు ఆశ్రితుడగుట యసాధ్యము. కాబట్టి ఎఱ్ఱయ 'పొట్ట

బేత'నికి వ్రాయబడగా వైజదండనాధదేవసామంతులు రెండవ బేతరాజునకు వ్రాయబడినట్లున్నారు. (ఈ బేతభూపతిని 'సన్న భూపతి'యని శ్రీ హర్షవర్ధనశర్మగారు వ్రాసినారు. 'సన్న' కాదు లావే. దాని చర్చ మున్ముందు.)

పైగా రేవడు 'దారిద్ర్య వైరి' యను పేర నెగడు కాకతిరాజులం జేకొని 'దాయల' నిర్జించెను 'దారిద్ర్యవైరి' 'దారిద్ర్యవిద్రావణ' బిరుదములు రెండవ బేతరాజవి. కొందరు తలచినట్లు త్రిభువనమల్ల దుర్గరాజునకు గాదు. ఖాజీపేట శాసనము రెండవ బేతరాజునకే ఈ బిరుదము ప్రయుక్తము '...చలమర్తిగండన్నపతిః దారిద్ర్యవిద్రావణః' (Corpus 13, No. 7). ఈ బిరుద మీతని హనుమకొండ శాసనములో గురుణ ప్రతిష్ఠా కాలమున కానరాక, దుర్గరాజు కాలమునాటికి కనబడుటచే, క్రీ. శ. 1090 లో అనుమకొండలో శివపురము నిర్మించి, శ్రీశైల మల్లికార్జునశిలామఠాచార్యులైన, పర్వతావళి (కాలాముఖ) రామేశ్వర పండితునికి దానమిచ్చి, తచ్ఛిష్యుడైనది మొదలు వచ్చియుండవచ్చును ఇది యొకవేళ ఈ మఠాచార్యుల బిరుదై యుండి వారి దయచే వారి శిష్యుడైన రెండవ బేతరాజునకు గురుప్రసాదముగా వచ్చియుండవచ్చు నేమో. శ్రీశైలమందలి మల్లికార్జునయోగిని, తన గురువు నన్నెచోడుడు స్తుతించును శివునకును, గురువునకును కూడ అభేదముగా చెల్లునట్లు, ధ్వనిపుష్టితో, దారిద్ర్యవిద్రావణస్తవమును రచించుటచేత నిశ్చయముగా నిది మఠమువారి బిరుదు రాజునకు అనుగ్రహింపబడినదని గ్రహించుట యుక్తము. చక్రవర్తుల బిరుదములు వారి సామంతప్రభువులు ధరించుచుండిరి. గురువుల బిరుదములు వారి శిష్యులు ధరించుచుండిరేమో. రెండవ ప్రోలరాజుయొక్క శాసన శకలములలో (Corpus 13, No. 12) రామేశ్వర పండితునిగూర్చి '...గుణరత్న రోహణగిరి ర్మాహేశ్వరగ్రామణీః.. దాతాన్నం విశిలార్త దీనమునివిప్రేభ్య స్తపోనిధిః' అనియున్నది. అన్నదాత, దీనపోషకుడు నెవడిన 'దారిద్ర్యవిద్రావణ' బిరుదము దొరకవచ్చును.

## 9. బొట్ట (లేక పొట్ట) బేతరాజు

ఇంతదూరము చర్చించినతర్వాత బొట్టబేతరాజు చాల చిన్నవాడని తెలిసినది. మొదటి బేతరాజు క్రీ. శ. 1051 లో కాంచీ కవాటహరణ మొనరించినవాడు కాబట్టి నాటి కతడు చాల వయసుచెల్లినవాడుగా నుండవలెను. చాళుక్య విక్రమాదిత్యునికన్న రెండవ బేతరాజే ఎంతో పెద్దవాడుగా కనబడుచుండగా మొదటి బేతరాజు, మొదటి సోమేశ్వరుడు త్రైలోక్యమల్లాహవమల్లుని కన్నను పెద్దవాడై, జగదేకమల్ల జయసింహునికి సమకాలికుడై యుండవలెను. లేదా మొదటి సోమేశ్వరునికి పూర్తి సమకాలికుడు. క్రీ. శ. 1068 తర్వాత ఇరువురును లేరుగదా. సోమేశ్వరుడు క్రీ.శ. 1042 లేక 1044 లో రాజ్యమునకు వచ్చునాటికి అతని యుద్ధవీరుడైన రెండవ కుమారుడు విక్రమాదిత్యు డున్నాడనగా నాటి కతనికి నలుబదియేండ్లకుపైన నుండియుండును. తండ్రి జయసింహుడు జైనుడు. ఇతనికి తల్లి సుగ్గలదేవి బాల్యమునుండే శివునిపేరు పెట్టుకొన్నది. భర్తనుకూడ శివమతమునకు (బసవపురాణము) మార్చినది కాబట్టి ఈతని జననకాలము క్రీ. శ. 1000 ప్రాంతమై యుండిన మొదటి బేతరాజుదికూడ ఇంచుమించు అంతే కావలయును. ముందుగానుండిన నుండవచ్చును. ఏలన సోమేశ్వరుని కుమారులకన్న బేతరాజు కుమారుడు పెద్దవాడుగా గన్పడుచున్నాడు. నాటికి సత్యాశ్రయుడు చక్రవర్తి. అనుమకొండ ప్రాంతము కొలనిదేశము తైలపునికి స్వాధీనమైనట్లే కనబడుచున్నవి. వేంగి ఎల్లలవఱకు పశ్చిమచాళుక్యుల రాజ్యమనియే చెప్పవచ్చును. తొలుతటి రాష్ట్రకూటముల రాజ్యమంతయు చాళుక్యుల యధీనము. నతవాటిసీమను గురించి స్పష్టముగ తెలియదుగాని కొలనిలో నాటికి కాకతీయు లున్నట్లే చెప్పవలెను. పూర్వచరిత్ర యటుంచి కాకర్త్య గుండనకాలమునుండి కొలనిపేరిదే. క్రీ. శ. 956 ఇతని తారీఖు. తర్వాతి చరిత్ర తెలియదు. జటాచోడ భీముడు దానార్ణవుని చంపి వేంగిని గ్రహించుటయు తైలపుడు కర్కర రణస్తంభులను చంపి రాష్ట్రకూట రాజ్యమును గ్రహించుట ఏకకాలముననే. క్రీ. శ. 973 వ సం.మున జరిగినవే. తైలపుని ప్రాంతీకరాజ విజయము కాకతీయుని మీదిదే యగునేని గుండనయో లేక యాతని సంతతివాడెవడో చాళుక్యులకు లొంగియుండవలెను ఇంచుమించు కాకర్త్య గుండన చివరికాలమును మొదటి బేతరాజు కాలమును దగ్గరనున్నవి. ఈ మధ్యకాల చరిత్రకు బొట్టబేతరాజు సాయపడు నేమో చూతము.

ఇతని తండ్రి యెవడో తెలియదు విరియాల ఎఱ్ఱరాజు (గూడూరు శాసనము) ఇతనిని సేవించినవాడు, ఇతనిని ఆపత్కాలమున ఆదుకొని ఇతని పెద్దల రాజ్యమునందు పునః ప్రతిష్ఠ చేసినట్లున్నది ఆ పద్యము—

"అతడని బొట్ట బేతవసు
ధాధిపు జేకొని వాని వైరిను
ద్ధతమున జంపి (యా) కొఱవి
దేశమునందు ప్రతిష్ఠసేసెత

త్తనెయురు పేరు పొడగల
దాయము బిట్టుల గద్యనంబు న
ప్రతిముడు వాని(చే) మొగుడు
పల్లియు పం(డ)డు నేలు నవ్వడే."

'ఆ' కొలవిదేశము గుర్తింపదగినది. అనగా వరం వరాగతమనియో లేక అతని తండ్రిదనియో తెలుచున్నది. 'బొట్టు' శబ్దార్థము పలుపురు పలు విధములుగా ఊహించి వారు. ఆ తరువాతి పద్యములు—

''అరుదగునట్టి ఎర్రన్నపు
నంగన కామమసాని (యొక్క) మే
ల్గరదని బేత భూవిభుని
గాకతివల్లభు బింనవాని దా
బరగంగ జేతబట్టి ఘను
బల్లవరాయని యోగి జొప్పి భా
స్కర విభు చక్రవర్తి గని
కాకతి నిల్పుట కోటిసేయుదే'

''కారకకాలుడై పడసె
కాడయ నాయకు జంపి మూ రడ
వ్వేలుపుగొండ రవ్వన్నపు
వేలుపుగొండన నిల్పి వానిచే
మేలుగ మూడ ముప్పయిని
మేలుగ నేరెడు బోటి పాడునుం
మేలుగ చేకుమావిడులు
మేలుగ రెండెయరాజ పంగడు.''

ఈ గూడూరు పద్యములకు మాచేడు శాసన పద్యమును జూచి ఏర్పుకొని 'పన్నబేత' భూపతిని ఒకనిని శ్రీ హర్షవర్ధన శర్మగారు సాధించిన దొకవింత (చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక శుభకృతు. చైత్రాషాఢములు). ఆ పద్యమిది—

''అమలగుణాఢ్యులై వరగు
నందతిలోం జడిసన్న బేతభూ
పతి విజ రాజ్య వర్ధనుడు
బాహుబలంబున జేసి భూమి పం
తతమునుం గప్పములు గొని బు
ధ(ప్రి)యుడై జయశాలి దేవం డూ
ర్జితుడై వేమబోలకుల
శేఖరు డాతడు దాని దండియై

''శ్రీరమణీయుండువాడుండు ధీరుండు దారిద్ర్య వైరి యనుపేర నెగడు కాకతిరాజులం జేకొని దయల నిర్మించి రాజ్యంబు నిలిపి వారిచేం (బ్రతివత్సరం తాం(బ్ర)శాసనములు మాఱుల్లంబేట్లను నొప్పు బడసె కడు రూఢిమంతుడై''

శ్రీ శర్మగారి యభిప్రాయములు బొత్తిగా పనికిరానివి. ఎందులకనగా—

(1) గూడూరు మాచేడు శాసనములు రెండును ఏకైక విషయ బోధకములు గావు. గూడూరు దొక్కటే మొదటిబేత బొట్టు బేతరాజుది. ఈ విషయము ముందే చర్చింపబడినది.

(2) 'పన్న-పిన్న బొట్టు-రవ్వ' పదములు సమానార్థములనియు పొట్టి బేతరాజన కన్వయించునవియు వీరి యభిప్రాయము. (చూ. భారతి, 1962 నవంబరు.) పై పద్యములోనిది 'పడిసన్న'గాని పట్టి నన్నగాదు, ప్రసిద్ధుడైన యని యర్థము. నిందలేనివాడు, ఎట్టి పడి, దోషము లేనివాడు—నిష్కళంకుడని భారత ప్రయోగములు కలవు. అమలగుణాఢ్యులై పరగు నందరిలోను వారికన్న గొప్పవాడు—పడిసన్నవాడు, బేత భూపతియొక్క రాజ్యమును వర్ధిల్ల జేసినవాడు...ఇత్యాది—రేవడు. వీరికి తెలుగుపద్య మర్మము కాలేదు. ఎందులకో 'పన్న'ను మాత్రము గ్రహించి 'పడి'ని ఉపసంహరించినారు! ఇట్టి రేవడు ముమ్మన్న తండ్రి, క్రీ. శ. 1120 కి ఒక తరము ముందువాడు. రెండవ బేతరాజు యొక్క 'నిజరాజ్యవర్ధనుడు' శ్రీ శర్మగారు తారీఖును బట్టి చూచుకొనలేదు. పైగా పద్యములో 'అమలగుణ' అన్న చోట ప్రాసభంగము. 'అతుల' యుండవలెను.'

'పిన్న' శబ్దము సరియే. అది గూడూరు శాసనమునది. 'కాకతివల్లభు బిన్నవాని'—బొట్టు — కొలనా — చినదబ్బు' ఇత్యాది వ్యవహారముండినను ఇట 'బొట్టు'యని మరల 'బిన్నవాని' యని రెండుమార్లు అర్థాంతరముగ పేరు గ్రహించినారు. 'అతణ్ణని బొట్టు', అతడు - ఎర్రయ, అనిన్ - యున్నముకుందు, పొట్టు...ఇది సంధివేత వచ్చిన బొట్టు ఏల కారాదు? బొట్టుయేమైనను బొట్టయ్య కొడుకు' బేతయ్య కూడా కావచ్చునుగదా, నాచన సోమన ఇత్యాదులవలె.' ప్రతాపరుద్రుని వెంకటేశుని గుడిశాసనములో (Corpus 13, p 65) పంక్తులు 11, 12 లో ''అఘోరశివాచార్యుల కున్ను అయ బొట్టయు గొడుమరేటి అన్నయ్య'' ఇత్యాది వాక్యములలో బొట్టయయని పేరుగా కనబడుచున్నదిగాని అల్పార్థకముగా కనబడుటలేదు. ఇది ఒకవేళ 'ప్రోలబేత' యనుటకు పొరబాటో! తండ్రి మరియొక ప్రోలరాజు ప్రాచీనుడుండెనా? ఈ శాసనమందు పొరపాట్లు లేకపోలేదు. ఈ పద్యమందే మూడవపాదమందు మరల 'తత్తనెయురు' అన్నచోట ప్రాసభంగము. 'అతణ్ణని'—'ద్విత్తమున'—'వలిముసు' అని

1, 2, 4 చరణములలో ద్వితీయాక్షరము తకారముండగా మూడవపంక్తిలో 'నె' ఎట్లు. శ్రీ శర్మగారు తెలుగు ఛందస్సునకు పరిమితముకొనుటలేదు. అట్లే 'కారకకాలుడై' పద్యములోకూడ 'ల' ప్రాసము. శర్మగారు సాధుపాఠము సూచింపలేదు. శ్రీనివాసాచారికూడ ఇట్లే ముద్రించినారు. 'కాలకకాలుడై' యనియుండునేమో! ఇది కాడయనాయకుని గూర్చి వచ్చినప్పుడు చర్చింపదగినది. ప్రస్తుతము రవ్వ మిగిలియున్నది. ఇది నామవాచకముగా వగపడుచున్నది. 'రవ్వనృపుడు' రవ్వభటుడు—రవ్వసాని—రవ్వనూంబ' ఇత్యాదులు బహుళములు. పై పద్యములో సూరనికిని బేతరాజునకును గల సంబంధమేమో తెలియదు. పద్యములే సంబంధములేనివా? ఈసూరడెవడో, ఈ కాడయనాయకుడెవడో, ఎఱ్ఱయ్యకును ఏమి సంబంధమో! ఈ సమానార్థకముల పీడయే లేక, బేతరాజు పిన్నవాడనియేయున్నదిగాన, ఇంత బాధపడియుండనక్కఱలేదు. ఇదంతయు వేలుపుగొండకు వచ్చినది. అది కాకతిపురమని నిర్ణయింపదలచినారు. ఎట్టి ఆధారమును లేదు. రవ్వనృపుడు బేతరాజుకాడు. అతడెవడో వేలుపుగొండరాజు. విరియాలవంశములో ఎఱ్ఱన తర్వాత సూరనచేసిన ఘనకార్యము గబోలు పద్యమందు చెప్పబడియున్నది. 'కారక' కాదు 'కాలకకాలుడై' (లేదా కాళకకాలుడై—)లడయోరభేదః 'కాడయ్యయనువానికి యముడై అందుచేతనే (ఆ) కాడయనాయకుని చంపి—అనిన ప్రాసమును అన్వయమును కుదురును. ఈ కాడయనాయకుడెవడో గుర్తించిన చరిత్ర దొరకును.

బొట్టుబేతరాజును గూర్చిన చరిత్రాంశములకు వత్తము. ఇదివరలో చూచినట్లు క్రీ. శ. 1051 లో కంచి కవాటహరణ మొనర్చిన మొదటి బేతరాజుయొక్క బాల్యము క్రీ. శ. 1000 లేక దానికి ముందు వెనుకల నున్నను, అప్పటికి కొలవి ప్రాంతములను గ్రహించిన కల్యాణి చాళుక్యులు కట్టుదిట్టములను ప్రారంభించి యుండవలెను గదా. ఈ కాలమున బేతరాజు బాలుడు గాన విరియాల ఎఱ్ఱపరాజు బేతరాజును రక్షించినాడు. పద్యములో తర్వాతి భాగము 'తత్తనెయురు' నుండి చక్కగ అర్థమగుటలేదు. 'అరువగునట్టి ఎఱ్ఱనృపునంగన కామమసాని' పద్యమొక గందరగోళమైనది శ్రీ శర్మగారి చేతబడి. ఈ పద్యమున కర్త ఎవరు? ముందు పద్యములో ఎఱ్ఱయ గదా. దీనిని గురించి వ్రాసినవారు చాగంటి శేషయ్య, శ్రీనివాసాచారి, లక్ష్మీరంజనముగారలు కామమసాని యని యభిప్రాయపడి ఆమెయే (ఎఱ్ఱయ్యను ఇంటిలో కూర్చుండబెట్టి) చక్రవర్తిని దర్శింపినట్లు వ్రాసినారు! పైగా నీమె బేతరాజునకు మేనత్తయని కూడ నొక బాంధవ్యమును లాగినారు. 'చక్రవర్తి గని' అనుచోట 'కనికి' ప్రసవించి యని హర్షవర్ధన శర్మగారు వ్రాసిన దానికి తగినంత ఆశ్చర్యపడగలమా! దర్శించి యనుటయే సరి.

ఈ పద్యమునకును కర్త ఎఱ్ఱయ్యయే. మేల్కరుడని యున్నదానిని 'మేల్కరదుని' అని దిద్దుకొన్న, కరణముగా పన్ను, కరదును, మేల్కరమును (మేల్వట్టి—కీళ్వట్టి ఇత్యాదులు కలవు) కామమసానికిచ్చినవాడని యర్థమగును. ఎఱ్ఱయకిచ్చినట్లే ఆమెకును ఇచ్చియుండును. రాణులకు, రాజబంధువులగు స్త్రీలకు ఆయా పన్నులను భోగ్యముగా నిచ్చుట కలదు. అట్టి 'మేల్కరము'ను ఇచ్చుచుండిన వానిని బేతరాజును చక్రవర్తి దర్శనముచేయించి ఎఱ్ఱయయే కొలవియందు ప్రతిష్ఠించెను. దీనినే కాకతి నిల్పుట యనెను. అనగా కాకతీయుల వంశముగాని ఆ పేరిటి ఊరునుగాని రాజ్యమునుగాని నాటికి కాదని యర్థము—దేశము కొలవి గదా.

మరి కాకతి పురమేది? హనుమకొండయు నచ్చిసాయిరముకు వచ్చుటకు ముందుండియు ఇంకను కాకర్త్య శబ్దమును బట్టి గుండన కాలమునుండియు వీరు కాకతీయులే. అదేదో వీరి యింటిపేరు చిరకాలమునుండియు వీరికి ఉన్నట్లు తెలియుచున్నది. కాని అసలు వీరిది కొలవిగాదు. వీరు వచ్చినవారు. పూర్వమచ్చట ముదిగొండ చాళుక్యులు పరిపాలించుచుండిరి. ఇటీవల దొరకిన కొన్ని శాసనములచేత కాకతీయులు రాష్ట్రకూటులనియు, వారికి సామంతులుగనుండి వారి మూలముగానే వేంగి చాళుక్యులకడకు దానార్ణవుని కాలమున వచ్చిరనియు తేలినది. అది మొదలు కొలవియే వీరి స్వస్థానమైనది. (చూ. శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రిగారి వ్యాసములు (Mangallu grant Of Danarnava and The Bayyaram Tank Inscription of Kakati Mailama - Epegraphia Andhrika, Vol 1 A· P· Govt., Hyderabad) బయ్యారము చెఱువు శాసనమునుబట్టి వీరి మూలపురుషు డొకవెన్నడనియు అతడు కాకతి పురమునుండి పాలించుచుండెనందు వీరు కాకతీశులైరనియు కలదు. దీనిని గూడ శ్రీ పరబ్రహ్మశాస్త్రిగారే పై పుస్తకమందే ప్రకటించియున్నారు. గణపతిదేవుని గారవపాడు శాసనములో వీరు (కాకతీయులు) కరికాలచోళుని తమ మూలపురుషునిగా పేర్కొన్నప్పుడు కూడ కాకతిపురమును వదలలేదు. తర్వాతి కాలమున కాకతిపురము కాకతి దేవతోపాసనగా మారి ప్రతాపరుద్రీయ క్రీడాభిరామములకు ఎక్కినది. ఇంతేకాక కాకతీయులు దుర్జయు నొకనిని తమకు మూలపురుషునిగా శాసనమందు పేర్కొనియున్నారు. ఇందును కలదు. కాకతిపురములు ఆంధ్రదేశమందు పెక్కులు గలవు. దీనిని గురించి గతసంవత్సరాది సంచికయందు చర్చించి, కావేరి ప్రాంబట్టణమునకును, అట్లే గూడూరు (నెల్లూరుజిల్లా) లో సముద్రతీరమందొక భాగమునకును ప్రాచీనకాలమందు కాకందియన్న పేరుండిన విషయము గుర్తించి యుండుటచే ఇప్పుడా విషయమును వదలుచున్నాను. కాకతీయులు రాష్ట్రకూట రాజ్యమునుండి కొలవికి వచ్చినను వీరెచ్చటను రాష్ట్రకూటులుగా స్పష్టముగా

కానరాక పోవుటయు 'లట్టలూర్పురవరాధీశ్వర' యని రాష్ట్ర కూటులవలె చెప్పుకొనక వేరుపురమును చెప్పుటయు, తర్వాతి కాలమున కరికాల చోళుని లాగుటయు రాష్ట్రకూట సంబంధమునకు బాధకములుగా నున్నవి. ఒకప్పుడు దక్షిణదేశమందుండి దక్షిణాపథమునకు ఎగ్రబాకి తర్వాత కొలనికి వచ్చియుండ వచ్చును. ఇక నన్నియు ఊహలే యగును. చారిత్రక కాలమున వెన్నయ్యతో ప్రారంభించి మొదటి బేతరాజవఱకు లెక్కించి ఇతడే కాకర్త్యగుండన కుమారుడుగాను తర్వాతి శాసనములందలి గరుడబేతడుగాను నుండునని ఊహించినారు. శ్రీ పరబ్రహ్మ శాస్త్రిగారు వారి ఉపపత్తు లెట్టివైనను మొదటి బేతరాజ కాల నిర్ణయమును గూర్చి వారు వ్రాసినదంతయు బొట్ట బేత రాజునకు సరిపోవుచున్నది. కాని లట్టలూర్పురవరాధీశ్వరులు కాకయే కాకతీయులకు గరుడధ్వజ మెట్లు ప్రాప్తించినదో అరయవలయును.

మఱియొకటి బేత శబ్దము. ఇది ప్రేత శబ్దభవముగా తోచుచున్నది. బేతాళోపాసనము శైవమత భేదములలో నొకటి యగుటయు బేతాళుడు శవములలోనే ప్రవేశించి శవములు కదలి ఆశ్చర్యకరముగా ప్రవర్తించుటయు విక్రమార్కుని కథలలో జగత్ప్రసిద్ధము. ఆంధ్రదేశములో ప్రేతేశ్వరాలయముకూడ (ఎచ్చటనో జ్ఞప్తి లేదు) కలదు ఈ బేతశబ్దము రాష్ట్రకూటులలో కానరాక వేంగీ చాళుక్యులలో కనబడుచున్నది. బేతవిజయాదిత్యుడు కంతికా విజయాదిత్యుడు మొదటి అమ్మరాజు కుమారుడు తండ్రి యనంతరము క్రీ. శ. 927 లో పదునైదు దినములు మాత్రమే పరిపాలించెను. కాకర్త్య గుండన తండ్రి బేతనామధేయుడు మాంగల్లు శాసనమున కనబడుచున్నాడు. ఇరువురి కాలమును ఇంచుమించు సరిపోవుచున్నది. సాధారణముగా రాజులపేళ్లను బిరుదములను వారి సామంతులు వహించుటను శాసనములలో నాటి ఆచారముగా చూచుచున్నాను. బ్రాహ్మణమంత్రులుకూడ ధరించుచుండిరి. కాకతీయులలో బేతనామధేయము ఎక్కువగా కనబడుటయేగాక వారి సామంతులైన 'రేచెర్లనాగికి ఈ బేతాళ శబ్దమును దానితోడి పెద్దకథయు జోడింపబడి యుండుటయు గుర్తింపదగినది. దీనిని చక్కగా పరిశోధించిన యెడల కాకతీయుల పుట్టుపూర్వోత్తరములు ఇంకను చక్కగా తేలియునేమో.

కాగా కాకతీయులు మొదట కొలనిలో రాజ్యము సంపాదించి కొలని విడిచి అచ్చటనుండి అనుమకొండను సంపాదించి ఆవెనుక సబ్బిసాయిరమునుకూడ గ్రహించి నేటి తెలంగాణమందధికభాగమునకు రెండవ ప్రోలరాజు కాలముననే లనగా చాళుక్య విక్రమాదిత్యుడు రాజ్యమునకు వచ్చిన మొదటి ఏదేండ్లలోపలనే పొందిరి. కాని తర్వాతిచరిత్ర కొంత చక్కగా తెలియవచ్చుటలేదు. రెండవ ప్రోలరాజు ఎప్పుడు రాజ్యమునకు వచ్చెనో తెలియదుగాని రాజ్యారంభకాలమందే సబ్బిసాయిరము మరలపోయినది. దీనినిగురించి ఈతడు క్రీ. శ. 1117 లో, చాళుక్య విక్రమకాలము 42 లో చెప్పకొనుట చూడగా ఆ చోటు తన తండ్రికుండినదిగన తనకును హక్కుగలదని తెల్పు ధ్వనిగా తోచుచున్నది. ఈతనికాలమున చాళుక్యులకును కాకతీయులకు చెడినట్లు తోచుచున్నది. అదిలోనే సబ్బిసాయిరము పోవుటయేగాక ఈతడు తర్వాత యుద్ధమొనర్చినవారందఱును చాళుక్యుల సామంతులుగానుండినవారే, ఈతడు గోకర్ణ చోళుని పుత్రుని తన రాజ్యమందు పునఃప్రతిష్ఠితుని చేసెను. మేడరాజును జయించి పాలనాసదేశమును ఆక్రమించి గంగరాజునువాని లధీన మొనర్చెను. ఇదంతయు చాళుక్య విక్రమాదిత్యునికాలమున జరిగెనో లేదోగాని సబ్బి మాత్రము పరమార జగద్దేవుని యధీనమందే యుండెను. పరమారులలో భోజుని యనంతరము గందరగోళమై అంతఃకలహము లేర్పడగా విక్రమాదిత్యుని తండ్రికాలమందే జయసింహుడనువానిని రాజును చేసెను. వాని వెనుక ఉదయాదిత్యుడు వచ్చెను. వాని కుమారుడు జగద్దేవుడను నాతడు ఆఱవ విక్రమాదిత్యునికి చాల విధేయుడాయెను.

* ఈ జగద్దేవుడు ఆంధ్రరాజు నొకనిని జయించి, చక్రకూటము నిర్జించి, ద్వారసముద్రమును ప్రవేశించి విక్రమాదిత్యుని మెప్పునందినవాడు. ఈతడు హొయసలులను జయించినది విక్రమాదిత్యుని చివరికాలమున. కాని అంతకు చాలముందు విక్రమాదిత్యుని రాజ్యారంభకాలముననే సబ్బిసాయిరమున పాలకుడుగా నున్నాడు. అనుమకొండమీదికి వచ్చినయొక జగద్దేవుని ప్రోలరాజు తరిమినట్లు చెప్పుకొన్నాడు. వీరి శత్రుత్వము ఇప్పుడు అర్థమగుచున్నది. విక్రమాదిత్యుని రాజ్యాంతకాలమున హొయసలులు తిరుగబడినట్లే పలువురు తిరుగబడిరి. వేంగియందును చిక్కు లేర్పడినవి. అనంతపాలాది దండనాయకులు పలుచోట్ల కనబడుచున్నారు. చక్కగా పరిశోధించినయెడల ఈ కాలమున కాకతీయులును విజృంభించినట్లు తెలియగలదు. హొయసలులను జయించినట్లే జగద్దేవుడును కాకతి ప్రోలరాజును జయింప అనుమకొండను ప్రవేశించి ముట్ట

---

* పరమారభోజరాజును గురించి సంస్కృత వాఙ్మయమందలి భోజమహారాజచరిత్రను తర్వాతి కవిబల్లాలుడు కలగా పులగముగా కాళిదాసుని, భారవిని, మల్లినాథుని కాలసంబంధము లేక చమత్కారముగా వ్రాసినది విద్యార్థులకు. అనంతామాత్యుని భోజరాజీయమునకు మూలమేదో తెలియదుగాని ఆంధ్రులు ఆతనికిగూర్చి ఇట్లు చెప్పకొనుట. భోజుని కుటుంబమువారు ఆంధ్రదేశములో, అందును తెలంగాణమువారిలో చేరుట పరికింపదగినది.

డించలేక వెడలిపోయెనట. చాళుక్య విక్రమాదిత్యుడు 1126లో గతించువఱకు ప్రోలరాజు కాచుకొనియుండి ఆ తర్వాత మరల మూడవ సోమేశ్వరుని కాలమందును, జగదేకమల్లుని (రెండవ) కాలమందును, బలవంతుడై మూడవ తైలపుని కాలమందు విజృంభించి స్వాతంత్ర్యము సంపాదించియుండును. తెలుగు కందూరు చోడులు ఇటు నటు మారుచుండిరి. కాకతి రుద్రదేవుడు, ప్రోలరాజు కుమారుడు తన అనుమకొండ శాసనములో ప్రోలరాజు చాళుక్య తైలపుని జయించినట్లు వ్రాసియున్నాడు.

'హస్త్యారోహణకర్మకర్మఠగలిం
చాళుక్య చూడామణిం
తైల్పదే యుద్ధనిబద్ధగహ్వరమతిం
యుద్ధే బబంధ క్షణాత్
భ్రమత్ తైలపదేవ మంబుదనిభ
స్తంభేరమస్థం క్షణాత్
ప్రఖ్యాతో రిపుకంఠఖండనవిధౌ
భక్త్యానురాగాజ్జహౌ.'

ఇంతేకాక మంత్రకూటనగరమును (మంథెన కాళేశ్వరము) పాలించుచుండిన గుండరాజును పిల్లవానివలె పట్టి వెత్తించెను. గోవిందరాజునుతని జయించి చెఱబట్టి తర్వాత విడిచి ఆతని రాజ్యమును ఉదయుని కిచ్చెనట. వీనిని చూడగా సబ్బిసాయిరమును మరల సంపాదించునాతఁ డాతనిని వదలలేదు. చాళుక్యులను జయించినను పూర్తిగా వారికి ఎదురుతిరుగుటకును తెగువలేక యుండెను. వీని వివరములు ఈ వ్యాసమున తడవ నుద్దేశము లేదు. ఇంతకు చాలముందే (అనగా మూడవ తైలపునికాలము 1148 నుండి 1163 వఱకు) కల్యాణ చాళుక్యులబలము క్రీ. శ 1139–40 ప్రాంతములకు తగ్గిపోయినది. వెలనాటిరాజులు మొదలగువారు బలవంతులైరి. కాబట్టి కరీంనగర్, నల్లగొండజిల్లాలలో తన బలమును పెంచుకొనినతర్వాత నతడు వేంగిమీదికి దాడి వెడలెను. ఈలోపల కల్యాణకటకమందు చాళుక్యుల బలము తగ్గ కాలచుర్యులు ఆక్రమించిరి. వేంగిమీదికివచ్చిన ప్రోలరాజు క్రీ. శ. 1160 కి ముందే రణనిహతుడైనట్లు శాసనము లున్నవి.

ప్రోలరాజు కుమారుడు రుద్రదేవుడు. ఈతఁడెప్పుడు రాజ్యమునకు వచ్చెనో గాని క్రీ. 1162 నుండి ఈతని శాసనములు కనబడుచున్నవి. నాటికే ఈతఁడు అనేకులను జయించి తన సామ్రాజ్యమును విస్తరింపజేసికొనినట్లు అనుమకొండశాసనము (1162) చెప్పుచున్నది.

'రాజ్యం ప్రాచ్యాం లవణజలధే
స్తీరపర్యంత మస్య,
శ్రీశైలాన్తం ప్రచరతి సదా
దక్షిణాశాం సమగ్రాం,
ప్రాతీచ్యాన్తు కటకనికట
స్థాయిని రాజ్యలక్ష్మీః
కౌవేర్యాశా తటవిలసితే
మాల్యవన్తం ప్రదేశే॥'

ఈతని రాజ్యమునకు తూర్పున సముద్రతీరము ఎల్ల; దక్షిణపు టెల్ల శ్రీశైలము; పడమట కటకము (అనగా కల్యాణ కటకము), ఉత్తరమున మాల్యవంతి ప్రదేశము. నాటికి చాళుక్యు లున్నను పోయినవారితో సమానులే. కాకతీయులు బలవంతులైరి.

## ఉపసంహారము

ఇంతవఱకు వీరి శాసనములలో ఎల్లెడ ప్రసక్తము గాని తెలంగాణమనియో, తెలుగుదేశమనియో, త్రిలింగమనియో కానరాదు. తిలంగ్, తెలంగ్ మొదలైన ప్రయోగములుకూడ ఈ తర్వాతివే. తెలుగు శబ్దమును గుఱించి తెలుగు వారెఱుగను వ్యాసము గత యుగాది సంచికయందు వ్రాసియే యున్నాను. ఇది మొదలు ఎల్లలు మారుచు రాగరాగా త్రిలింగ తెలుంగు పేళ్ళు ప్రబలి కాకతీయుల రాజ్యము విద్యానాథుని కాలమునకు పూర్తిగా త్రిలింగదేశమైనది.

చిలుక (బాతిక్ చిత్రం):

డిజైన్—శ్రీ ఎల్ కృష్ణారావు. రంగుల అద్దకం - శ్రీ పి. వాసుదేవన్. (తమిళనాడు ప్రభుత్వం లలిత కళాశాల, డిజైన్ డెమోన్‌స్ట్రేషన్ కేంద్రం, మద్రాసు—3 సౌజన్యంతో)

# ఆహత జ్వాల

శ్రీ 'కొలకలూరి'

వెంకటేశం ఉలిక్కిపడి నిద్రలేచి నిలబడ్డాడు. నిలవ లేనంతగా వణికిపోతున్నాడు. శరీరం విపరీతంగా సంచలించి పోతూ వుంది. గాలి దుమారానికి పూరిపాక వూగిసలాడినట్లు వూగిపోతున్నాడు.

ముఖం నిండా చెమటపట్టింది. చెమట బొట్లు వెలుతురుండి పసివాడి కన్నీటి బిందువులలాగా కదులుతున్నాయి. ఫేన్ తిరుగుతూవున్నా చెమట ఆరిపోవటం లేదు. అధికమౌతూ వుంది. తలలో ఎక్కడో పుట్టిన చెమటబొట్టు పడగ ఎత్తిన పాములాగా చెవిప్రక్కగా క్రిందికి దిగుతూ వుంది. కంఠం మీదికివచ్చి, ముందుకు పోలేక భయంగా ఆగి పోయింది.

ఎదుట రోడ్డుకు అవతల హాస్పటల్ గుండెవంటి టవర్‌క్లాక్ మూడు గంటలు చూపుతూ కొట్టుకొంటూ వుంది. మే నెల రాత్రి తెల్లవారుజాము మెట్టప్రాంతంలో తోలే చల్లని గాలి స్పర్శకు సుఖంగా ఒడలుమరచి నిద్రపోతున్న ప్రాణి సమూహం రోడ్డుకు రెండు ప్రక్కలా ఎవరి దృష్టినయినా ఆకర్షిస్తుంది.

వెంకటేశం వేసవిరాత్రి నిద్రసుఖం తెలియనివాడుకాడు. పన్నెండుగంటలకు లోపలికి వచ్చి, హాలులో నిలబడి ఎగచూస్తూ, కుర్చీలు బోర్లించిన టేబుళ్లమధ్య, క్రింద గోనెబట్టలో చుట్టిన సన్నటిపరుపు విప్పుకొని పడక సిద్ధం చేసుకొని, కోటినీ, నాగలింగంనీ ప్రక్కనే పడుకోబెట్టుకొని, తలుపులు కిటికీలు మూసి, బోల్టులుపెట్టి, లైటు ఫేను వేసుకొని నిద్రపోబోయి, నిద్రపట్టక పడకఅంతా పొర్లాడి, కొట్టుకొని, చివరకు కునుకుపట్టి, ఆకస్మికంగా మెలకువవచ్చి, వణుకుతూ, చెమటలో తడిసిపోతూ నిలుచున్నాడు వెంకటేశం.

చెరొకప్రక్క కోటి, నాగలింగం పడుకొనేవున్నారు. నిద్రపోతూనేవున్నారు. అంతగా చెమటపట్టలేదు. అసలు కదలికే లేదు. కిటికీతీసి చూశాడు వెంకటేశం. ఎదుట లైటుస్తంభం క్రీనీడలో పడుకొన్నకుక్క లేచి, వళ్లు విరిచుకొని, గోడ ప్రక్కగా జరిగి కాళ్లువిదిలించుకొని, బార్లా జాపుకొని పడుకొంది. కుక్కల అరుపులూ పోలీసుల విజిల్స్ దూరంగా వినబడుతుంటే, ఆ కుక్క, శరీరం కదలకుండా తలమాత్రం ఎత్తి, అనాసక్తంగా చూచి, తలవాల్చుకొని, నిద్రలో కూరుకుపోయింది. బల్బ్ వెలుతురుచుట్టూ, రాత్రిఅంతా ఎన్నోరాత్రులనుంచి తిరుగుతున్న పురుగులు వెలుతురు వలయంలో, చీకటిలోనుంచి వచ్చి, సంతోషం కలుగుతుందన్న ఆశతో పరిభ్రమిస్తున్నాయి. వెలుతురు అందదు, ఆశ తీరదు.

జనతా హోటల్‌ముందు ఫుట్‌పాత్‌మీద నవారుమంచం మీద పడుకొన్న లావుపాటి వ్యక్తి సుబ్బారావు నిద్రలేచాడు. సుబ్బారావు హోటల్ ఓనర్ కమ్ మేనేజర్ కమ్ కేషియర్. హోటల్ మెయిన్ గేట్ మూసివుంటే అటూ ఇటూ చూచి తలుపుతట్టాడు వెంకటేశం తీసి, అటూ ఇటూ చూచి లోపలె వణుకుతూ వున్నాడు

కిచెన్‌లోకి పోయి, ముఖంమీద నీళ్లు జల్లుకొని లుంగీ పంచతో తుడుచుకొని బొట్టువేసి, వేంకటేశ్వరస్వామి పటానికి నమస్కరించి, గోడగడియారం వైపుచూచి తిట్లు ప్రారంభించాడు.

'లెండ్రా వెధవల్లారా! కునుకిట్టాడుతా వేండ్రా గాడిద కొడకా! లేరా దొంగనాయాలా! లెండెహె! హోరి కోటీ లేవండరా! నాగలింగం హోరి నాగలింగం లేరా బాబూ! లే!— ఇంకా నిద్దరబోతన్నార్రా దొర్లు!'

సుబ్బారావు హాలులోకి వెలుపలికి తిరుగుతూ అందరినీ నిద్రలేపుతున్నాడు జనతముందు క్లీనర్‌లు పడుకొన్నారు. చెంగాయి దోసెడంతయి వున్నాడు. క్లీనర్లు అందరిలో చిన్న వాడు. సుబ్బారావు లేరా అంటూ కాలుతో కదిపాడు చెంగాయి ఉలిక్కిపడి లేచి, కళ్లునులుంకొంటూ, అటూ ఇటూ చూచి ఆవులించి, వణుకుతూ నిలబడ్డాడు.

'పందులు! పందుల గాడిదకొడుకులు! ఎగబడి దింటంవే గానీ పనింటంలేదు గందా!' సుబ్బారావు మేలుకొలుపు—వైతాళిక గీతి—ఆలపిస్తూనే వున్నాడు. అంతమదుసుగా ఆ మధ్య ఎప్పుడూ ప్రవర్తించలేదు. అతనికి తన హోటల్‌లో పనిచేసే అందరికీ

ఇంత తిండితిప్పలుపెట్టి పోషిస్తున్నానన్న అహంకారం వుంది. ఆ అందరూ తనకంటే తక్కువ అన్నభావమూ వుంది. వెంకటేశం విషయంలోమాత్రం భిన్నంగా వుంటాడు. అయితే ప్రతిపని వాడూ ఒకపంది అనీ, వెంకటేశం ప్రబుద్ధవరాహావతారం అనీ అభిప్రాయం. అయితే బైటికి మాట అనడు.

సుప్రభాతం ముగించి లోపలికి వస్తూ తన పడకమీద కూర్చున్న వెంకటేశంవైపు పరీక్షగా చూశాడు సుబ్బారావు. కోటి నాగలింగం పడకలు చుట్టుకొని లేచి లోపలికిపోయారు. వెంకటేశం ముఖంమీద చెమట తుడుచుకొన్నాడు. అంతగా చెమటలేదు! వణుకుకూడా తగ్గింది. ముఖం నల్లగా అయిపోయింది. కళ్ళు, నూనెలేక వత్తిఎండి ఆరిపోబోతున్న ప్రమిదలులాగా వున్నాయి.

'యేందిరా యెంకటేశం యేందిది? యేండిట్టుండా?'

వెంకటేశం ఏమీ మాట్లాడలేదు. గోళ్ళు గిల్లుకొంటూ కూర్చున్నాడు. సుబ్బారావు కంగుతిన్నట్లు అయిపోయాడు. అసలు పలకరించటానికి కారణం లేకపోలేదు. సుబ్బారావు, ఎవరివయినా, ఎప్పుడయినా, దురుసుగా నోరు జారితే వెంకటేశం వూరుకోడు. వూరుకోవటం సహించలేక పలకరించాడు.

'వారే యెంకటేశం! మాట్లాడవేందిరా! యేందనలి సంగతి! యెపుడన్నా యావన్నా అంటె జెప్పరావేంటరా!'

'ఏమీ లేదు!'

సుబ్బారావు కిచెన్‌లోకి నడిచాడు. చెంగాయి హాలు తుడుస్తున్నాడు. ఇంక ఇద్దరు పిల్లలు—ఒకడు నీళ్ళు జల్లుతుంటే, మరొకడు గోనెపట్టాలో తడి తుడుస్తున్నాడు. స్పెషల్ గదుల ప్రక్కనుంచి తమపని—త్రిమూర్తుల కార్యక్రమం—ప్రారంభించారు.

హాస్పటల్ టవర్‌క్లాక్ నాలుగు కొట్టింది. క్లీనర్, బక్కెట్ నిండా నీళ్ళు తెచ్చి, బోర్నవిటా టిన్నుముంచి నీళ్ళు జల్లుతున్నాడు, హోటల్ ముందు తాటాకు పందిరిక్రింద, దుమ్మురేగకుండా, అణిగి వుండేటందుకు. చెంగాయి కొబ్బరీనెల చీపురుతో హాలంతా వూడుస్తున్నాడు. వెంకటేశం ఇంకా లేవలేదు.

'అన్నా! అన్నా!'

'ఏమిటిరా!'

'యేందింకా లెక్కుండా కూసునే వుండా!'

'లేస్తున్నాను లేరా!'

చెంగాయి వూడ్చినంతవరకు నీళ్ళు జల్లారు తుడిచారు పిల్లలు! కోటి నాగలింగం వెలుపలినుంచి వచ్చారు. వెంకటేశం అందరికంటే ముందుగా నిద్రలేవాడు అందరూ లేని పని చేసుకొంటున్నా కదలకుండా కూర్చున్నాడు. వణకటం లేదు. చెమట లేదు. నిస్సత్తువగా కూర్చున్నాడు. చలనం లేదు. కానీ కళ్ళలోమాత్రం నీళ్ళు కదులుతున్నాయి.

అక్కడున్న అందరూ చూశారు. వాళ్ళు మనుసు అతని కన్నీళ్ళు చూళ్ళేదు వాళ్ళకు వెంకటేశం తీరు వింతగా వుంది. బాధ కలిగింది. దిగులుగా ఏందంటే ఏందన్నారు. ఏమీ లేదని బాధగా చెప్పి, బాధపడవద్దని సముదాయించి, లేచి, పడక మడచి, కళ్ళు తుడుచుకొని, పడక లోపల పడేసి, వేపపుల్ల తీసుకొని, కొనకొరుకుతూ వెలుపలికి నడిచాడు. పిల్లలు త్రిమూర్తులు తుడుపు కార్యక్రమం బాధ్యతాయుతంగా నిర్వహిస్తున్నారు. కిచెన్‌లోంచి పొగ బయలుదేరింది. సుబ్బారావు, అరిగిపోయిన పాతరికార్డుల సంగీతంతో పట్టణం రక్తంలో ఒక ప్రక్కనుంచి చైతన్యం సాధిస్తున్నాడు.

వేపపుల్లో పళ్ళపొడో తీసుకొనివెళుతున్నవాళ్ళు తను ఇచ్చే ధర్మం స్వీకరించేవాళ్ళులాగా కనిపిస్తున్నారు సుబ్బారావుకు. కాఫీతాగి బిల్లు చెల్లించేవాళ్ళు 'బతికిపో' అన్నట్లుగా డబ్బు బిల్లుముఖాన గిరవాటు పెట్టినట్టుగా వెళుతున్నారు. ఏమి స్వభావాలో!?

వెంకటేశం ముఖం కడుక్కొని చేతులు తుడుచుకొంటూ లోపలికి వస్తుంటే హోటల్—కేషియర్, సాంబ్రాణి పొగ, రికార్డులతంతు, లోపలనుంచి కమ్మనితావులు—వేశ్యలాగా అలంకరించుకొని వీధిలో నిలబడి, లోపనుపోయేవాళ్ళను పలకరించి, పలికినవాళ్ళను పిలుస్తున్నట్టుగా వుంది, అనిపించింది.

వెంకటేశం లోపలికి వచ్చేసరికి హాలు శుభ్రంగా వుంది. రాత్రి టేబుళ్ళమీద బోర్లాపడుకున్న కుర్చీలు వెల్లకిలగా, రొమ్ము విరగదీసుకొంటూ గర్వంగా కూర్చున్నాయి. స్పెషల్ గదులు రెండూ సరిచేయబడ్డాయి. క్రింది తడి ఆరిపోయింది. కిచెన్ ముక్కుపుటాలకు విందు చేస్తూవుంది. ఒకరొకరే రాసాగారు. కుర్చీలు మూలుగుతూ ఒప్పుకొంటున్నాయి. ఒక్క మనిషి కాఫీకి ఆర్డరిస్తే పెక్కుచోట్ల ధ్వనీ, సంచలనం బయలుదేరుతున్నాయి.

వెంకటేశం వయస్సు పాతికకు ఒకటి అటో ఇటో ఉండవచ్చు. పుట్టినతేది మాత్రమేకాదు సంవత్సరమేదేని మనుష్యులు ఈ దేశంలో ఎక్కడచూచినా వున్నారు. మనిషి ఎత్తు! లావు! భారీవిగ్రహం! వయస్సుకు వయ్యారం తెచ్చే గుణం సహజం! అందువల్ల బాగా వున్నాడని ఎవరయినా అనుకొంటే అనుకోనూ వచ్చు! అతని కళ్ళలో ఏదో మంట ఉన్న

ట్లుగా వుంటుంది. ఆ మంట ముఖంఅంతా వెలుతురు చిమ్ముతూ వుంటుంది. ఎక్కడో హృదయంలో గుండెలో పొయ్యివుండి వుంటుంది. ఆ పొయ్యి ఆరిపోదు. ఈ మంట చల్లారదు. పైగా రోజరోజుకూ ఎక్కువవుతూ వుంది.

అటువంటి వెంకటేశం ఆ రోజు వరదవచ్చి తగ్గిపోయిన ఏరులా, కాలిఆరిపోయిన కొంపలా, మండిబూడిదయిన కట్టెలా, ప్రాణంలేని మనిషిలాగా వున్నాడు. ఎందుకిలా వున్నాడో ఎవరికీ తెలియదు! అతనికి తెలియవచ్చు!

జనతలోకి జనం రాసాగారు. వచ్చినవాళ్లు కావలసింది చెబితే ఉన్నదిచ్చి సేవించింతర్వాత బిల్లురాసి ఇస్తున్నాడు వెంకటేశం. హాలులో రెండు టేబుళ్లు స్పెషల్ రూంలలో నాలుగు టేబుళ్లు అతని వంతు!

ఒక ముసలాయన వచ్చి టేబిల్‌మీద తల పెట్టుకొని కూర్చున్నాడు. వెళ్లి, 'ఏం కావాలి?' అని పలకరించినా మనిషి తలెత్తలేదు లోపల్నుంచి కాఫీ కపులు తెస్తున్నప్పుడు కళ్లొత్తుకొంటూవున్న ముసలాయన ముఖం చూచీ చూడటంలోటే జ్వరం వచ్చినట్లు అయింది. అక్కడికి పోలేకపోయాడు.

'బాబూ! కాఫీ యిస్తా?' అంటూ పలకరించాడు ముసలాయన. అవుననకుండా లోపలికిపోయి కుక్‌తో 'నటేశం! మంచి కాఫీ! ఫస్ట్‌క్లాస్ కాఫీ! ఫస్ట్ అంటే ఫస్ట్! ఇవ్వు!' అన్నాడు. అరవ భాష ఊనికతో తెలుగు పలికే నటేశం వెంకటేశంతో 'ఏమి సంగది?' అంటూ కాఫీ కలిపి ఇచ్చాడు. ముసలాయనకు కాఫీ ఇచ్చి అటు తిరుగగానే కళ్లవెంట నీళ్లు తిరిగాయి.

ముసలాయని సుబ్బయ్య అనీ, అంటే ఎవరో—వెంకటేశం పోల్చుకొన్నాడు. ఆయన తనను గుర్తుపట్టలేదు అని తెలుసుకొన్నాడు. ఎందుకంటే నువ్వు ఫలానా కదా అని అడగలేదు కాబట్టి.

'అబ్బాయ్ కాఫీ బాగుందంటే బాగుంది!' అన్నాడు ముసలాయన.

వెంకటేశం బిల్లు రాసి ఇచ్చి, ఆయన వెళిపోతాడు కాబోలు అనుకొంటూ వుండగా 'సూడమ్మా మందేవూరు?'

వెంకటేశం చెప్పాడు. బయలు చెప్పాడు. ఊరు పేరు కూడా చెప్పాడు. ఆ వూరు వూరుకాదు. అసలు వూరుకాదు. ఏదో వూరు. అలాగే పేరు. ఏదో పేరు. తన వూరూ పేరూ సుబ్బయ్యకు చెప్పటం ఇష్టంలేక పోయింది. చెప్పలేనను కొన్నాడు.

ఇంకా రష్ పెరగలేదు హోటల్ పూర్తిగా నిండటం లేదు. మీదేవూరు, ఇక్కడికెందుకు వచ్చారు అని వెంకటేశం అడిగితే ముసలాయని గుండె చెరువయింది.

'ఆ డిల్లొదిలెళ్లిపోయిం కాణ్ణుంచి అది మంచం ఎక్కింది. కూళ్లే నీళ్లే! అంతా మనేద న్నారు. ఆళ్లకేళ్లకి మా పిచ్చా! ఏటీ లాబం గనపళ్లే! ఏందిరి దీనేల యిట్టాటి జబ్బొచ్చిందని పెద్దడాట్రుకు జూపిత్తే పెద్దాస్పటల్లో సూపిచ్చాలా ఇది కేంచరు అవటాంటె అబాగే లెమ్మనుకొని ఈడి కేసుకొచ్చా! ఏటీ మెరు గ్గనబట్టంలే! వొచ్చి వోరం అవుద్ది రేపుటిలో. ఎన్నాళ్ళుండాలో యేందో తెలియకుండా వచ్చింది. వత్తాను బాబు! వత్తా!'

వార్డు బెడ్డు తెలుసుకొన్నాడు వెంకటేశం. తనెవరో చెప్పకుండా ఆమెను చూచి రావాలని అనిపించింది. సుబ్బయ్య వెళుతుంటే అసహాయంగా చూస్తూ వుండిపోయాడు. సుబ్బయ్య హాస్పటల్ మలుపు తిరిగింతర్వాత దృష్టి మరల్చుకొని తన పనిలోకి వచ్చాడు.

కొడుకు కోసం వెదకుతున్న తండ్రిలాగా, తండ్రికి తన ఉనికి తెలియకుండా వుంటే మంచిదని తప్పించుకొంటున్న కొడుకులాగా, సూర్యుడు ఉదయించాడు. ఎండకాలం ఉదయం స్వచ్ఛమయిన సూర్యకిరణాలు రోడ్డుమీద మెరుస్తున్నాయి. తెల్లవారేముందు వంటికి హాయిగా తగిలిన గాలి, సూర్యోదయంతో పాటు వేడిమిని పొంది సూదులు గుచ్చుకొన్నట్టు తోలుతూ వుంది.

కట్టుగొయ్య దగ్గర కోడెదూడలకు అప్పుడే వామిలోంచి దూసిన రెండు జనపకట్టలు, రెండువనల ఎండుగడ్డి వడేసి, వాటిపీపులు నిమిరి, వెంకటేశం ఇల్లు వదిలి వచ్చేశాడు.

ధర్మసారం నాలుగోసారి చదవటం ఇష్టంలేక ఇంటి దగ్గరే ఉన్న ఒక్కగానొక్క కొడుకు వెంకటేశంను ప్రేమ కొద్దీ కసిరి తిట్టింది తల్లి. ప్రేమ అర్థంకాక, కోపమే తెలిసి ధాం ధూం లాడాడు వెంకటేశం. కొడుకు భార్యను తిట్టాడని పొలంనుంచి ఇంటికి రాగానే విన్న తండ్రికి వళ్ళు మండిపోయింది. 'పదూలేదు సందెలేదు తిని ఊరంతా బలాదూరు దిరుగుతూ, దున్నపోతల్లే కొవ్వి కొట్టుకొంటన్నాడు గాడిద' అంటూ పాలిగట్టె తీసుకొని గట్టిగా తగలనిచ్చాడు. దెబ్బలు జాగా తగిలాయి. వాతలు తేలాయి. రక్తంకూడా వచ్చింది. దెబ్బలనొప్పి భరించలేకుండా వుంటే సూటి పోటి మాటలు మరి నొప్పి పుట్టించాయి.

'తల్లిం దిట్టేనోడికి పుట్టగతులుంటయ్యా?'

'ఇట్టాటోణ్ణి గోసి పోగులెయ్యాల!'

'ఆవిటి గాకుండా దీని అడ్డంగా బరిత్తే యింతే!'

అటువంటి మాటలు వినలేకపోయాడు. పదేళ్ళయింది వూరు వదిలిపెట్టి. ఇల్లు వదిలిపెట్టి రావటం అయితే

తేలికగానే అయిపోయింది. కాని తల్లిదండ్రీ, ఇల్లూ వాకిలీ లేనివాడు ఈ లోకంలో బ్రతకటం ఎంత కష్టమో తెలిసి రావటం మొదలయ్యేసరికి ప్రాణం పోతున్న పని అయింది. మళ్లీ యింటికి పోవటం ఇష్టంలేదు. ఎవరూ గుర్తించని దూరపు వూరు వెళ్లిపోవాలనుకొన్నాడు. ఎక్కడికిపోయినా ఎవరో ఒకరు నువ్వు ఫలానా కదా అంటే ఆ వూరు వదిలిపెట్టి మరో వూరు పోతూ, చివరకు ఇక్కడ స్థిరపడిపోయాడు. తన ఉనికి దాచుకోవటం నేర్చుకొన్నాడు.

మొదట్లో అడుక్కుతిన్నాడు. ఎవరో ఏమో పెడితే తిన్నాడు. తిడితే పడ్డాడు. 'ఎద్దల్లే వుండావే ఏపన్నా జేసుకో రాదా?' అనే తిట్టు దీవెన! రైల్వే ప్లాటుఫారం మీదో, ఫెన్సింగ్ ప్రక్కనో, గూడ్స్ షెడ్‌లోనో, లగేజీ మధ్యలోనో ఎక్కడో మునగర దీసుకొని పడుకొనేవాడు ఎవరెవరో తిట్టగా కూలీ మోయటం ప్రారంభించాడు. అందుకు లైసెన్సు కావాలని తెలిసి రైల్వేస్టేషన్ వదిలి బస్సుస్టాండ్ చేరుకొన్నాడు.

బస్సుల్లో లగేజి దించటం పైకి ఎక్కించటం, ఇళ్లల్లోకి మోసుకుపోవటం వంటి పనులు కొంత తిండి పెట్టగలగాయి. ప్రతిరోజూ తప్పనిసరిగా పని దొరుకుతుందనిగానీ, ప్రతిరోజూ తిండి తినగలనని గానీ ఏ మాత్రం నమ్మకం లేక పోవటం వల్ల, ఇంతకంటె మంచి పని ఏదయినా దొరికితే బాగుండునని వెంకటేశం ఆలోచింప సాగాడు.

లైసెన్సు లేకుండా రిక్షా తొక్కటం నేరమని మొదట్లో తెలియదు. ఒకరోజు నారోడు 'బువ్వ తింటానికి' ఇంట్లోకి పోతే, బైట వున్న రిక్షా తొక్కుకొంటూ వెలుపలికిపోయి, మనిషిని ఎక్కించుకొని, తొక్కుకొంటూ పోతూ, ఎదురుగా వచ్చే ఫూటీగా వున్న లారీకి గుద్దేనంత పనిచేసి తను పడి, రిక్షాలో మనిషిని పడేసి, మోకాటి చిప్ప తొలగి రెండేళ్లదాకా రిక్షా జోలికిపోలేదు. ఆపైన లైసెన్సు సంపాదించుకొన్నాడు.

రైల్వే ప్లాటు ఫారం మీద తనకు సామాను మోసే లైసెన్సు లేదు. బక్కపీను పీరాకి లైసెన్సు వుంది. రిక్షా తొక్కలేని నారోడికి లైసెన్సు వుంది. బలంగా వున్న తనకు లైసెన్సు లేదు. లైసెన్సులేని వాళ్లు బ్రతుకుతున్నారు! బలం వున్న వాళ్లు లైసెన్సు లేక బ్రతకటం లేదు. ఏదో వింత లోకం కళ్లముందు తిరిగినట్లయింది!

ఆ రోజుల్లో సుబ్బారావుకు జనతా హోటల్ లేదు. టీ కొట్టు వుంది, పొగాకు కంపెనీ దగ్గర. దానికి సుబ్బారావు క్లీనర్–ఓనర్—సర్వర్. కంపెనీలో గ్రేడింగ్ ఆడవాళ్లు ఆ కొట్టులో టీ నీళ్లు తాగుతారు.

ఒకరోజు మార్కెట్టులో కూలిమోసి చెరువులో ఈతకు వెళ్లే వెంకటేశం సుబ్బారావు కొట్టులో టీ తాగాడు. డబ్బు లిద్దామని నిక్కరు జేబు ఎంత వెదికినా చిల్లర దొరకలేదు గాని, బట్ట చిరిగిపడిన రంధ్రం దొరికింది. సుబ్బారావు మండి పడ్డాడు. నెత్తీనోరు కొట్టుకొన్నాడు. నోటికి వచ్చి నట్లు తిట్టాడు. ఎంగిలి ప్లేట్లు కడిగించాడు. గ్లాసులు తోమించాడు. పంపులోంచి నీళ్లు తెప్పించాడు. ఏం చెయ్య మంటే అది చేస్తున్న వెంకటేశంకు ఏం కావాలంటే అది యిచ్చాడు. ఆ రోజు నుంచి టీ కొట్టు సుబ్బారావుకు సర్వెంట్ దొరికాడు.

ఆ రోజు నుంచి సుబ్బారావు టీ కొట్టు మూడు కవళ్లారు ప్లేట్లుగా పెరిగింది. సంవత్సరం తిరక్కముందే హాస్పటల్ ముందు హోటల్ అయింది. ఆ హోటల్‌లో తిన్న వాళ్లు ఆ హాస్పటల్‌లో చేరవలసిందేనన్న గిట్టనివాళ్ల మాట లెక్క పెట్టకుండా చిన్నదయినా జనతా హోటల్ శుభ్రంగా వుంటుం దనే ఖ్యాతి సంపాదించుకొన్నాడు. ఆ రోజు మొదలు వాళ్ల సంబంధం — స్నేహం పెరిగి పెద్దదయింది సుబ్బారావు పెరుగు తున్న కొద్దీ వెంకటేశం హోదా పెరుగుతూ వుంది. ఇప్పుడు సర్వర్ స్థాయిదాటి, అప్పుడప్పుడు కేషియర్‌గా కూడా వుంటు న్నాడు. అతని మాట సర్వర్‌లకు వేదవాక్కు! సుబ్బారావుకు బ్రహ్మవాక్కు!

హాస్పటల్‌లో ఉన్న కేన్సర్ పేషెంట్‌ను చూచి రావాలని పించింది. బైటికి రావటం ఇష్టం లేదు. పైగా భయంగా వుంది. ఆమెను చూడాలని ఆరాటం! తొందర! వెళ్లటానికి భయం! ఏమయితే అదే అవుతుందని బైలుదేరాడు.

ఓ. పి. నిండా జనం. గదుల్లో వరండాల్లో బెంచీలమీద, నేలమీద రోగులు! సైకిల్సుమీనా, రిక్షాలమీనా, కార్లుమీదా టాక్సీలుమీదా వస్తున్నారు రోగులు! తెల్లవారేసరికి పట్టణంలో పుట్టిన జబ్బులు ఉదయమే ప్రత్యక్షమయ్యే తావు ఓ. పి. ఎందరో మనుష్యులు! ఎంతో బాధ! పసిపాపల దగ్గర్నుంచి పండు ముదుసలివాళ్లదాకా అందరికీ జబ్బులు! బాధలు! ప్రతి రూం ముందు జనం. క్యూలో జనం! క్యూలో రోగం! ముందుకు కదులుతూ వుంది. మూలుగులు! అరుపులు! ఏడ్పులు! నడిచే రోగం! నడవలేని రోగం! స్ట్రెచర్‌మీద పోతున్న రోగి, నడిచి బాధపడుతున్న రోగి. వరండాలో మూలగా, రోగంలేని కాలేజి విద్యార్థి—బెంచ్‌మీద యువతి. కళ్లలో వెలుతురు! క్షయరోగి దగ్గి ఉమ్మివేసిన కళ్లెలోపడి లేవకుండా వున్న ఈగలు!

వార్డులో మెట్లు ఎక్కుతూ పైకి చూశాడు! మెట్లు దిగుతున్న వ్యక్తివైపు చూచి క్షణంసేపు ఆగిపోయాడు. వెంటనే

వెనుదిరిగాడు. వణుకు! చెమట! పరుగెత్తినట్లు హోటల్ వైపు నడిచాడు!

అంతకు మునుపు హాస్పటల్‌కు బైలుదేరిన వెంకటేశం కాదీ తిరిగివస్తున్న వ్యక్తి. మనిషి బాగా కుంగిపోయాడు. మునుపున్నంత ఎత్తూ లావూ లేడేమో ననిపించింది. దిగాలుగా వెనుదిరిగి చూసుకొంటూ, ఆమెను చూడలేక పోయినందుకు బాధపడుతూ స్మశానంలో సర్వం కోల్పోయి వస్తున్నవాడి విధంగా కనిపించాడు.

హోటల్‌కు వచ్చేసరికి గందరగోళంగా వుంది. అదిచూసి వాకిట్లో ఆగిపోయాడు. వణుకు! విపరీతంగా వణుకు! చెమట! భయంకరంగా చెమట! సాంబారులో కాళ్ల జెర్రిపడిందనీ, ఇంత అశ్రద్ధ అయితే ఎట్లా అని ఎవరో ఎగురుతున్నాడు. విషయం విన్నతరువాత వెంకటేశం నెమ్మది చెందాడు ఆ మనిషిని పిలిచి, వెలుపలికి తీసుకువచ్చి, సాగనంపి, తిరిగి వస్తూ:—హోటల్‌ముందు కిళ్లీకొట్టు దగ్గర ఎవరో చెక్కెర కేళీ కొని, తిని, తొక్క పడేసి పోతే, — చూడకుండా కాలువేసి జారిపడి, నడుం నొప్పి పుట్టి, నెమ్మదిగా లేచి లోపలికి వచ్చాడు.

ఎందుకో తెలియదు. ఎక్కడో తెలియదు. భయం పుడుతూ వుంది. దిగులు కలుగుతూ వుంది. ఉదయం నుంచీ, ఎప్పుడూ రాని, ఎన్నడూ లేని విచిత్రానుభూతి! భయం తెరలవెనుక చీకటి మైదానంలో ఆకస్మాత్తుగా మంటలు లేచి, చప్పున ఆరి పోతున్నాయి. గాలి లోలనట్టు, ఊపిరి ఆడనట్టు, ముక్కు బిగిసిపోయినట్లు, ప్రాణం పోతున్నట్లు ఏదో చెప్పరాని భయం.

కోటి కాఫీ తాగి వస్తూ 'బాగుండావా?' అంటే 'ఏ?' అని 'వూఁ' అన్నాడు వెంకటేశం. ఈ కోటి ఒకరోజు హోటల్‌కు వచ్చి, కాఫీ ఆర్డర్ చేశాడు కోటికాళ్లు బురదతో మురికిగా వున్నాయి. కాళ్లు ముడిచి కుర్చీమీద కూర్చున్నాడు కుర్చీమీద కాళ్లు తీయమంటే, తీయకపటంతో మాటా మాటా పెరిగాయి మాటకుమాట తెగులు నోటికి పాలి తెగులు అన్నట్లు బూతులు చేతలయ్యాయి. దెబ్బలాట అయింది. ముష్టా ముష్టి కాలాకాలి, జుట్టాజుట్టి, కొట్టుకొంటున్నారు. తన్నుకుంటున్నారు. వంచుకొంటున్నారు. అంతా గోల గోలయింది.

అంతా సర్దుబాటు అయింది. కాని సుబ్బారావు కోపం చల్లారలేదు. తగువులాట జరిగితే హోటల్‌కు ఏం గౌరవ ముంటుంది? అందువల్ల కోటిని పనిలోనుంచి తీసివేస్తానని పట్టుబట్టాడు. వెంకటేశం వద్దంటే మన్నించాడు. రెండో రోజు నుంచి ఏ హోటల్‌కయినా పొమ్మని కోటికి సుబ్బారావు చెప్పాడు. ఆ మధ్య హోటల్‌కురాని కోటి ఆ రోజు వచ్చి కాఫీ తాగి పోతున్నాడు. కాలం చాలా జబ్బులు నయంచేసే మందు! ఆ రోజునుంచి పనివాళ్లకు వెంకటేశం అంటే గురి! ఏం కావాలన్నా అడిగేవాళ్లు! కష్టాలు చెప్పుకొనేవాళ్లు! సహాయం పొందేవాళ్లు! సంహా చివేవాళ్లు!

తను వచ్చేసరికి తన టేబుళ్లు చూస్తున్న కోటి, పోయి టిఫిన్ తిని రమ్మన్నాడు. వెంకటేశం కాఫీమాత్రమే తాగి 'నాకేం బాగాలేదు' అన్నాడు.

కిటికీదగ్గర కూర్చున్న ముసలాయన ఎవరో అప్పుడె మూడోసారి సాంబారు వేయించుకొన్నాడు. ఇడ్లీలు అలాగే వుంచి సాంబారు పూర్తిచేస్తున్నాడు అంత పెద్దవాణ్ని ఏమనటం బాగుంటుంది?

ఉదయమే లేచి, చద్దన్నం తిని, పనీసాటూ చూసుకొనే జాతికి కాఫీ తాగే అలవాటు ఆంగ్లేయులమూలంగా వచ్చిందేమో కాని, సాంబారు ఇడ్లీ సంగతి—అనుమానం దాంపత్యం—మాత్రం మద్రాసునుంచే దిగుమతి అయింది. నాగరికత జాతి జీవితంలో కదలిక తెచ్చింది. ఉన్నచోట ఉంచలేదు. అది పురోగమనమో కాదో ఆలోచించే అవకాశమే లేదు ఈ మహాప్రవాహంలో పడి కొట్టుకుపోయే జాతి ఎప్పుడు ఒడ్డెక్కి తిరిగా గతాగతాలు పరికిస్తుందో!

ఎవరో వచ్చారు కాఫీ చెప్పారు. ఇచ్చాడు. ఇడ్లీ వడా సాంబారు చెప్పారు తెచ్చాడు. 'మినపట్టు—మూడు పార్శిల్'—కట్టించాడు. అల్లం ముక్కలు లేవని గోల! అల్లం పచ్చడి కావాలని కేక! కాఫీ చల్లగా వుందని—రిపోర్టు! ఈగలతో చచ్చే చావు అయింది—విరామ!

'కాఫీ స్పెషల్—కాఫీ అర్జంట్—కాఫీ స్ట్రాంగ్. కాఫీ షుగర్ వద్దు—రేయ్ వెంగాయి—ఏంది తలాతోకా లేని బిల్లు!—ఒక కాఫీ!—కొంచెం సాంబారు — ఏం వుంది — ఇడ్లీ వడా మినపట్ పెసరట్—మినపట్ ఉల్లిపాయ ముక్కలు బాగా — కాఫీ స్ట్రాంగ్— చూచి నడుపు! నీ ముఖం లాగా వుంది కాఫీ—నన్నేం చేయమంటావు — రేయి పైపడుద్ది అటు ఇటు—ఛా ఛా!— కాఫీ స్పెషల్— బిల్లెంత—కాఫీ పార్శిల్—ఏం గురూ పనబళ్లేదు— కళ్లంటే—నీళ్లు పొయ్యి— చచ్చే చావు—ఎప్పుడొస్తా—ఇడ్లీ వడా సాంబారు రెండు ప్లేట్లు.'

హోటల్ ధ్వనులు—రణగొణ ధ్వని!

వాష్ బేసిన్‌లో చేయి కడుక్కొని పంపు ఆపకుండా పోయి కూర్చున్న యువకుడి వైపు అసహనంగా చూశాడు వెంకటేశం. అతను పోయి పంపు ఆపి రావటం చూచి కోటి

ఒళ్లంతా చెమట! నుదుట నీళ్లు! గుండె వేగం! కళ్లు మంట! నోటివెంట మాట లేదు.

జగ్గు వెళ్లిపోయి అయిదు నిమిషాలయినా సుబ్బారావు కోలుకోలేదు. జగ్గు హాస్పిటల్‌లోకి పోవటం చూసి వెంకటేశం కంగారు పడసాగాడు. నిలబడలేక పోయాడు. లోపలికిపోయి ముఖంమీద నీళ్లు జల్లుకొని ఆయాసంగా వచ్చాడు.

మూడేళ్ల క్రితం జగ్గు హోటల్‌కు వచ్చి టిఫిన్ కాఫీ తీసుకొని, బిల్లు తీసుకోకుండా అనవాయితీ ప్రకారం వెళ్లిపోతుంటే చొక్కా కాలర్ పట్టుకొని నిలబెట్టాడు వెంకటేశం!

జగ్గు ఏ హోటల్‌లోనూ కాఫీ అయినా భోజనం అయినా బిల్లు తీసుకోడు. రైలో బస్సో టిక్కెట్టుకొని ఎక్కటం ప్రయాణం చేయటం తెలియదు. లా అండ్ ఆర్డర్ అతనికి తెలియవు. నాగరకత జీవితంలోని చాలా నియమాలు అతనికి వర్తించవు.

ఆటో మొబైల్ ఇంజనీర్స్ వర్క్‌షాపులో మెకానిక్కు! ఎక్కువ మాట్లాడడు! సాధారణంగా అతనికి డబ్బు అవసరం ఉండదు! అడిగితే షాపులో ఎవరయినా ఇస్తారు. ఇవ్వకపోతే తీసుకొంటాడు. అవసరంకంటే మించిన డబ్బు తీసుకోవటం ఉంచుకోవటం అతనికి అలవాటు లేదు. భార్యలేదు. పిల్లలు లేరు. బాదరబంది లేదు. ఏకాకి!

ఆ రోజు బిల్లు చెల్లించవలసి రావటం జగ్గు జీవిత గమనంలో ఎదురు దెబ్బ! 'పోరా పో' అని టలాయించి పోబోయాడు. వెంకటేశం పోనీలేదు. 'భోం చేస్తావేందిరా సన్నాసి నాయాల!' అంటే బిల్లు చెల్లించమన్నాడు వెంకటేశం. 'తిను! తినరా నా కొడక!' అంటూ వెంకటేశంను వంచి వీపు మీద గుద్ది 'సాలా? ఇంకా గావాల్నా వొడ్డన?' వెంకటేశం తిరగబడ్డాడు—జగ్గు చివరకు బిల్లు చెల్లించి పోయాడు.

అంతే! అది మొదలు ఈ మూడేళ్లలో జగ్గు ఆ వైపు రాలేదు. ఇంతకాలం తర్వాత రావటం వింత! ఆశ్చర్యకరమయిన సంగతి. బిల్లు చెల్లించకుండా పోలేదు. చెల్లించాడు. కోపంగా చూశాడు. నవ్వాడు. సుబ్బారావు గుండెలు చెమటతో తడిసి, నాని ముద్దయి జావగారిపోతున్నాయి.

సూరి ఊళ్లోకి వస్తూనే హోటల్‌కు వచ్చి వెంకటేశంను పలకరించాడు. రెణ్ణెల్లనుంచి సెలవులో వున్నాడు. సూరి హాస్పిటల్‌లో గుమాస్తా! చివరికి 'పరీక్షలు ఎలా వ్రాశావ్?' అని అడిగాడు. 'బాగనే' వెంకటేశం సమాధానం.

థర్డ్‌ఫారం ఆనర్స్ చదవటంతో పునాది బాగా గట్టి పడిందని పాతకాలపు జోక్ విసరటం సుబ్బారావుకు అలవాటు. ఆత్మీయంగా మాట్లాడేటప్పుడు 'నీ జాతకం గొప్పది. నీ మూలంగానే గండా నాకీ దసె!' అని కూడా అంటాడు. హోటల్‌లో పనిచేసుకొంటూ మెట్రిక్ పాసయి, నైట్ కాలేజీలో పి. యు. సి. చదివి పైకి వస్తున్నాడు తన సర్వర్ అని సుబ్బారావుకొక గర్వం. ఆనందం. గొప్ప!

'చూడరా' సూరి ప్రారంభించాడు. 'నీకేం దిగుల్లేదు—ఎందుకంటావా? నిన్ను అడిగేవాళ్లు లేరు అనేవాళ్లు లేరు. నీ యిష్టం నీది. మరి నా సంగతో? అంతా పేచీ! మరత పేచీ! అన్నీ ఆ ముసలాడితో చెప్పాలి—దేని కవునంటాడో, దేనిక్కాదంటాడో, నాగ్గానీ, ఆయనగ్గాని మమ్మల్ని పుట్టించిన ఆ దేవుడిగ్గానీ తెలియదు. నైట్ కాలేజీలో చేరుతానంటే ఊఁ! ఊఁ! చేరుచేరు అన్నాడు. తీరా చేరింతర్వాత ఎందుకు చేరావు మానేయ్ అని గొడవ. ఎట్టా చచ్చేటట్టు ఆయనో! అదంటే అట్టుంచు! కంతేరమ్మాయి న్యూసాప్పి బాగుందంటే బాగుందనుకొని వాళ్లకా సంగతి అంతాజేసి రాసి, నిన్న ఆ సంబంధం వద్దంటేపదు మానేద్దామంటాడు. అంతా ఆయనిష్టమే! నేనొకణ్ణున్నాననిగాని, నాగ్గూడా ఇష్టం గిష్టం ఉండొచ్చుననిగానీ అనిపించ దా మనిషికి? ఏం చెప్పేటట్టు? అసల్నేనంటే లెక్కాపత్రం లేదామనిషికి? ఏడకన్నా పారిపోదామనిపిస్తుంటుం దప్పుడప్పుడూ!' సూరి చెప్పటం ఆపి కళ్లు అద్దుకొన్నాడు. సూరి మునుపెప్పుడూ తన గోడు చెప్పుకోలేదు.

తను ఇల్లు విడిచి పారిపోయి వచ్చిన పరిస్థితులు గుర్తుకు తెచ్చుకొన్నాడు వెంకటేశం!

పొన్నుగర్ర ధోవతి, లాల్చీ కళ్లజోడు లేకపోతే ఆ ముసలాయనకు అస్తిత్వంలేదు. నల్లకోటుప్లీడరు ప్రక్కనుండకపోతే, అతనెవరి దృష్టినీ ఆకర్షించడు. కాఫీ చెబితే నాగలింగం తెచ్చియిచ్చాడు. ఉన్నట్టుండి 'వాడికి నేనేం తక్కువ జేశాన్రా చెప్పు! చెప్పరా! నువ్ జెప్పు!' ప్లీడరు మాట్లాడలేదు. 'నువ్ వాడికి ప్లీడరునికదా! చెప్పు నా ముఖం చూచి చెప్పరా కిట్టూ! నేనేం అన్యాయం జేశాన్రా వాడికి. చదువు చెప్పించలేదా? ఉద్యోగం ఇప్పించలేదా? కోరుకొన్నదాన్ని కట్టుకోనివ్వలేదా? నేనేం జేశానిరా వాడికి కష్టం! పోతూపోతూ కట్టుకుపోతానా? నాతో కాల్చుకొంటానా? ఏం జేసుకొంటాన్రా యీ ఆస్తి! ఎంత లేదన్నా ఆస్తంతా వాడిదే గందా! ఎందుకురా యీ ఆరాటం వాడికి? నేను హరీ అన్నదాకా ఆగలేకపోతే మానె! అవసరం అయితే నా కింతకావాలి తే అని తీసుకుపోవచ్చుగా అది లేదా? లేకపోగా కోర్టుకెక్కిస్తాడ్రా వీడు నన్ను? గుడ్డొచ్చి పిల్లనెక్కిరించదని వీడునా అంతు చూస్తా

వంటాడా? ఇల్లు నా కష్టార్జితం! ఆస్తి యావత్తూ నా సంపాదన! వాళ్ల తాతముత్తాతల ఆస్తి దమ్మిడీ—దమ్మిడీ లేదు దద్దమ్మని చచ్చుదద్దమ్మ అది వీడి చెవులకు తాటాకులు గట్టి ఆడిస్తుంది పిచ్చిసన్నాసి బొత్తిగా తెలివిలేదు వాడికి. వాడికి మప్ తోడు. కిట్టూ వేన్నెప్పుడున్నాడు వాడి కేమాత్రం వయినా తల్లిదండ్రి గురువూ దైవం అనుంటే అయిందేదో అయిపోయింది పొరపాటే చేశాను క్షమించమని ఏడవ్వను లేదో వాడిష్టం తర్వాత్తర్వాత నన్నని లాభంలేదు. చెప్పు వాడి కిదంతా—అం'అని గటగటా కాఫీతాగి, కోపంగాలేచి, పొన్నుగ్గర తాటించుకొంటూ బిల్లు దురుసుగా లాక్కొని చెల్లించి, వెను దిరిగి చూడకుండా మెట్లుదిగి వెళిపోయాడు.

ప్లీడరు కృష్ణమూర్తి కూర్చున్న చోటునుంచి కదలేదు. కోటు జేబులోంచి పొగాకుచుట్ట తీసి తుది మొదళ్లు విరిచి, నోట్లో పెట్టుకొని, వెలిగించుకొని, తన్మయత్వంతో పీల్చి, కుర్చీవెనక్కు చేరబడి, భువనమోహిని పంచిన అమృతం ఆరగించే మహేంద్రుడులా, ఆదమరచిపోతున్నాడు.

పొన్నుగ్గర పెద్దమనిషి వెళుతుంటే వెంకటేశం దృష్టిలో నూరి మెదిలాడు. ఆర్యనాగార్జునుడి మాధ్యమిక వారి కలలో తండ్రులు—కొడుకులు ఉదాహరణలు మాదిరిగా — ఒక దృష్టిలో—లేరు. ఏదో లోపం వుంది. తండ్రికొడుకుల కల నేతలో ఎక్కడో పోగులు తప్పిపోయాయి. గతంలోని ప్రాచీనతా వాసన, అధికారం వదులుకోలేని తండ్రులు భవిష్యత్తులోకి గమించే ఆధునికాకాంక్షలు చైతన్యులు అయిన కొడుకులుమధ్య వర్తమానం చిత్రవధకు గురిఅవుతూవుంది.

తన విషయమే గుర్తుకు వచ్చింది. అప్పటిలో తండ్రి ఛాందసుడూ కాడు. తను సాహసుడూ కాడు. అయినా విడి పోవడం సంభవించిం దెందుకో తెలియదు.

అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూచి చంద్రుడో, చంద్రుణ్ణి చూచి సూర్యుడో, ఆరిపోయే దీపాన్ని చూచి ప్రమిదో, ప్రమిదను చూచి దీపమో, ఎగతాళిగా అనహనంగా నవ్వుతున్న పోలికే యిది. గతం అనుభవం నీడలో వర్తిల్లబోయే ఆగతం, వర్తమానంలో కొట్టుమిట్టాడటమే తండ్రి కొడుకుల సంఘర్షణ!

ఈ సంఘర్షణ ఒక్కనాటిది కాదు. సృష్టి ఆరంభం నుంచీ ఉండవచ్చు. యయాతి కొడుకు యౌవనం కోరటం అటు వంటిదే కావచ్చు! ఏమయినా పూర్వం లేని విశృంఖలత నాగరి కత తెరమాటునుంచి రంగస్థలప్రవేశం చేయటానికి అనుక్షణం యత్నిస్తూవుంది. పూర్తిగా అవకాశం వస్తే అంతా అడ్డమా కలు లేని విశృంఖలత అయిపోతుంది.

'కృష్ణా! కృష్ణపరమాత్మవైపోయావు మహానుభావా! ఎంతెందు వెదకిచూచిన అందందే!' — 'ఆపవయ్యా స్వామి. వింటే పంచరత్నాలు పఠించేలాగున్నావ్. ఏమిటి కథ' కృష్ణ సమాధానంగా పలికాడు.

'అలనాడు విజయుడికి సారథివై చేసిన గీతోపదేశం ఈనాడు తండ్రి కొడుకులమధ్య తగాదాలు—' —'ఆపవయ్యా పంతులూ ఆపు! ఏం గావాలి చెప్పు! స్వీట్ హాట్ కాఫీ.'

'ఏమీ వద్దు—ఒక్కమాట' ఇద్దరూ వెలుపలికి వెళ్లారు.

'అడకత్తెరలో ప్రజాస్వామ్యం. హక్కులు గుర్తించి బాధ్యతలు నెరవేర్చే సామూహిక కృషి సంకల్పం అవరోధాలతో గమిస్తూవుంది. బాధ్యతలు గమనించని హక్కులు బలాత్కారం చేసే దుష్టశక్తుల తీవ్రత పెచ్చుమీరుతూ వుంది. విభిన్న శక్తుల పోరాటంలో ప్రజాస్వామ్యం—చావుబ్రతుకుల్లో వుంది.'

గోపాలం సంపాదకీయం చదువుతున్నాడు. సన్నగా, పొడ దుగా వుంటాడు. పైజామా లాల్చీ అతనికి ఎప్పుడూ వుండే బట్టలు! హాస్పటల్లో పనిచేస్తుంది దాతని భార్య! ఆమె నర్సు! గోపాలంను నర్సుభర్త అనటంకూడా కద్దు! ఉద్యోగం లేదు. కాలం గడపటమే అతనికి కష్టం! ఉదయం ఆలస్యంగా నిద్ర లేచి, పదకొండు పన్నెండు గంటలకు జనతకొచ్చి కాఫీ తాగి మూడు నాలుగు పేపర్లు చదివి, ఒంటిగంటకో రెండింటికో ఇంటికి పోతాడు. వెంకటేశం మిత్రుడే! అప్పుడు కాఫీతాగుతూ పేపరులో సంపాదకీయం చదువుతున్నాడు.

'తరతరాలనుంచి కుంచించుకొని, బిగిసి రాటుదేలిన ఈ జాతి గుండెల్లోంచి నిజమైన అభివృద్ధి పుట్టదు. వికాసం జన్మించదు. పెరుగదు. ఏ రంగంలోనయినా నూత్న పరిణామం ఆవిష్కరించే ప్రయత్నం జరుగుతుంటే అదే సమయంలో దీనిని అణిచిపెట్టే ప్రయత్నాలు బలవత్తరంగా విజృంభిస్తాయి. ఈ దేశం ముందుకు పోదు. ఈ జాతికి మనుగడ లేదు.'

'అంతనిరాశ పనికిరాదు!' వెంకటేశం ఎదురుగా నిలబడి బాధగా నవ్వుతూ నిరాశగాచూస్తూ చెప్పాడు. గోపాలం అర్థం కాక అయోమయంగా చూశాడు. 'ఈ దేశం అభివృద్ధి సాధి స్తుంది. ఈ జాతి జీవిస్తుంది—ఏమీ అనుమానంలేదు. పీకి తులు మేల్కొంటున్నారు.'

గోపాలం అనుకొన్నాడు, ఈ ధోరణి సహజంగాలేదుఅని, ఏదో వెలితి కృతకత్వం ఉన్నాయని.

ఎవరో కాఫీ అడిగితే ఇచ్చినవ్వాడు వెంకటేశం. వీధిలో ఎవరో యువతితో వెళుతున్న రంగడు కనపించాడు. 'రంగడు పెద్దవాడయ్యాడు' అనుకొన్నాడు.

నాలుగునెలల్రకితం ప్రొప్రయిటర్ తనని తిట్టి, కొట్టి, బైటికినెట్టి, ఉద్యోగంలోంచి తొలిగించాడని రంగడు ఏడుస్తూ చెబుతుంటే వెంకటేశం వినలేకపోయాడు.

చెంపలువాచి, కళ్ళుబ్బి, జుత్తురేగి, చొక్కా చిరిగి, వికారంగా, దయనీయంగా కనిపించాడు రంగడు. మనిషిని చూచి, జరిగిన క్రూరత్వం ఊహించుకోగలిగాడు.

ఉద్యోగంలోంచి తొలిగించిందెందుకో కనుక్కొంటే కారణం సమంజసంగా కనిపించలేదు. రంగణ్ణి హాస్పటల్లో చేర్చి, ప్రొప్రయిటర్ని కలుసుకొని సంజాయిషీ అడిగేతీరులో మాట్లాడాడు. ఇష్టంవచ్చినట్లు తిడుతూ వెంకటేశంను వెళ్ళగొట్టాడు ప్రొప్రయిటర్.

నాలుగు పెద్దహోటళ్ల ప్రొప్రయిటర్లను కలుసుకొని 'ఈ అన్యాయం వినండి, న్యాయం చేయండి'అని కోరాడు. 'మాకేం పట్టింది. మాకెందుకు కా రొచ్చు' పొమ్మన్నారు. ఈ అన్యాయం సహించవలసిందేనా? అందరూ పట్టుబట్టారు.

'రంగణ్ణి పనిలోకి రానీకపోతే మేమూ రాం' అని వాకిట్లో హోటల్ముందు కూర్చున్నారు. ప్రొప్రయిటర్ తిట్టి కొట్టి తరిమివేయాలని చూచాడు. వీలు కాలేదు.

తెల్లవారి ఎనిమిది అయ్యేసరికి ఆకలితో అలమటించి పోయేవాళ్లు వచ్చినవాళ్లు వచ్చినట్లే మరో హోటల్కు అయినా వెళుతున్నారు. లేదంటే ఏమయిందంటే ఏమయిందని అడుగుతున్నారు.

పదినిమిషాల్లో కుక్లు, సర్వర్లు తీసుకురాబడ్డారు. వెలుపలివాళ్ళు లోనికి పోబోతే, మెట్లమీదవాళ్ళు అటకాయించారు. కొట్లాట లేదుగాని నెట్లాట జరిగింది.

రెండోరోజు హోటల్ మూసివేస్తానని ప్రొప్రయిటర్ శేఖర్ బెదిరించాడు బెదిరింపే అనుకొన్నారు గానీ, నిజంగా తాళాలువేసి వెళ్లాడు. మూడోరోజు పట్టణంలో ఉన్న హోటళ్లలో చాలామంది పని మానివేసారు. ఆ సాయంకాలం హోటల్ యజమానులందరూ కూడబలుక్కున్నారు. ఆ రాత్రి సుబ్బారావు వెంకటేశంను పిలిచి 'నీ కెందుకు జెప్పిందులో జోక్యం— ను వ్వారుకో నీకేం దెల్సు' అని చెప్పిచూశాడు. వెంకటేశం కోపంగా సమాధానం చెప్పాడు. ఏమయిందో తెలియదు గానీ రాత్రికి రాత్రి రంగణ్ణి పనిలో చేర్చుకొన్నాడు ప్రొప్రయిటర్ శేఖర్.

ఆ మర్నాడు రంగణ్ణి పలకరించి, మెట్లు దిగి, రోడ్డు ప్రక్కనా సిగరెట్టుషాపు నటరాజన్తో మాట్లాడుతూవున్నప్పుడు చాలా స్పీడ్తో మీదపడుతుందేమోనన్నంత భయం కలిగించిన కారు, తప్పుకొన్నా ఎడంచేతికి బలంగా తగిలి పోయింది. ' శేఖర్ కారులో వున్నాడు. అప్పట్నుంచి ఆ కారు కనిపిస్తే దూరంగా పోతున్నాడు వెంకటేశం.

హాస్పటల్నుంచివచ్చిన డాక్టర్లు నలుగురూ వెంకటేశం టేబిల్ ఆక్రమించి కాఫీ ఆర్డరుచేయటంతో ఆలోచనలలోనుంచి వెలుపలికి వచ్చాడు. 'వెంకటేశం పలుకువున్నమనిషి' అంటాడు డాక్టరు రవీంద్ర. అతనే జబ్బునుగూర్చి ప్రారంభించాడు. 'వాకీ జబ్బు అర్థంకాలేదు' ట్రీట్మెంట్ ఇంపాజిబుల్!' ఆ జబ్బునుగూర్చి ఆలోచించుకొంటున్నారు.

'ఇవి సృష్టి ప్రారంభంనుంచి ఉన్నజబ్బులే! దారిద్ర్యం జబ్బు! ఆకలి జబ్బు! వర్గం జబ్బు! అంతస్తు జబ్బు! కులం జబ్బు! ఈర్ష్యజబ్బు! కుళ్ళు జబ్బు! లోకంనిండా జబ్బులు! విపరీతంగా జబ్బులు! 'ఈ జబ్బులు నయంకావు. వీటికి మందులు లేవు.'

గోపాలం సంపాదకీయం చదువుతున్నాడు. క్రొత్తజబ్బును గూర్చి చర్చిస్తున్న డాక్టర్లలో ఎవరు కాఫీకి ఆర్డరుచేశారో, ఎవరు తాగుతున్నారో లేదో, ఎవరు బిల్లు తీసుకొన్నారో ఏమీ తెలియదు. బిల్లు టేబిల్మీద ఫేన్గాలికి నృత్యంచేస్తూవుంది.

రోడ్డుప్రక్క పడేసిన హోటల్ ఎంగిలికోసం కుక్కలు ఎగబడుతున్నాయి. హోటల్ అడుక్కొన్న పకోడిముక్క ఆవురా వురుమంటూ తింటున్నాడు బిచ్చగాడు. గ్లాసులో కాఫీ సగం మిగిల్చి లేచిపోయాడో విద్యార్థి! హోటల్ప్రక్క ఎంగిలి కోసం అరుచుకొంటున్న కుక్కలమధ్యకు తోలుకొంటూ బలహీనుడు పిట్టమనిషి—పిల్లాడొకడు చొరబడ్డాడు

'కుక్కలు కవర్లాడుతున్నాయి కుక్కలు పోటీపడుతున్నాయి. కుక్కలు కరుచుకొంటున్నాయి కుక్కలు అరుచుకొంటున్నాయి. బలంవున్నకుక్క బ్రతుకుతుంది. బలంలేనికుక్క చస్తుంది బలం బ్రతుకుతుంది. బలహీనత చచ్చిపోతుంది.'

గోపాలం కళ్ళు చెమ్మగిల్లాయి.

ఆ కుక్కలమధ్య పోటీకి నిల్చుకోలేక, తిండిలేని, బట్టలేని, బలంలేని, భవిష్యత్తు మానవజాతి అభ్యుదయానికి మూలవిరాట్టు, గత మానవజాతి పురోగతికి వారసుడు ఏడుస్తూ అసహాయంగా ఎంగిలికుప్పఎదుట నిలబడ్డాడు!'

గోపాలం గొణుక్కొంటున్నాడు

జోగి రొప్పుతూవచ్చాడు. లోపలికిపోతూ కిచిన్వాకిట్లో ఎదురయిన వెంకటేశంతో 'నూకా!' అన్నాడు. 'ఏమిటిది?', 'ఇనువరి!', 'చెప్పవేం విషమేముంది?' 'లేదు చిన్నా ఈనవంటున్నాడు!'

కాఫీ సర్వ్‌చేసి విషయం వివరంగా అడిగి తెలుసుకొన్నాడు.

వీరయ్య సైకిల్‌రిక్షాల ఓనరు. అన్నిరిక్షాలు ఆ పట్టణంలో మరెవరికీలేవు. జోగికి ఆ రోజు—కారణంలేకుండా రిక్షా ఇవ్వనన్నాడు. నిజానికి కారణం లేకపోలేదు.

రెండునెలల క్రితం వీరయ్య రిక్షా అద్దె రెండున్నర నుంచి నాలుగు రూపాయలకు పెంచాడు. ఒక్కసారిగా అంత ఎక్కువగా పెంచటం అన్యాయమనీ, తగ్గించమని అడిగారు. వీల్లే దన్నాడు.

అందరూ కలిసి కలెక్టరు దగ్గరకు పోయారు. ఆలోచిస్తా నన్నాడు కలెక్టరు. 'పైసా తక్కువయినా రిక్షా ముట్టుకోవద్దు' అన్నాడు వీరయ్య. వెంకటేశం అన్యాయం అనుకొన్నాడు. కోటి, నాగలింగం, వెంకటేశం ముగ్గురూ ఒక రిక్షా రోజంతా, ఎవరికి తీరుబడిగావుంటే వాళ్ళు తొక్కుతూ వుండేవాళ్ళు.

ఒకరోజు ఎవరూ రిక్షాలు తీసుకోలేదు. రెండోరోజు మామూలువాళ్ళు తీసుకోలేదు గాని, షెడ్‌లో ఒక్క రిక్షా కూడా లేదు. రిక్షా తొక్కాలని రిక్షాలు లేక ఎంతమంది అవస్థ పడుతున్నారో తెలిసివచ్చినట్లయింది పాతవాళ్ళకు క్రొత్తవాళ్ళమీద కోపం వచ్చింది. కడుపు మండిపోయింది.

ఆకలి, పిల్లల ఏడ్పులు, భార్యల తిట్లు. పోనీ ఆ నాలుగు రూపాయలూ ఇచ్చి రిక్షా తీసుకొందామా అని కొందరు ప్రయత్నించారు. కొందరు తీసుకున్నారు. మిగిలినవాళ్ళు భరించలేకపోయారు.

ఆ రోజునుంచి వీరయ్య రిక్షాలు కనిపిస్తే, ఆపి, టాప్ చింపారు. సీట్ కాల్చారు. బెల్లు లాగేశారు. బ్రేకులు పీకేశారు. చక్రాలు వంచేశారు. నానారోతా పట్టించారు.

కొన్ని అంగవైకల్యంతో షెడ్ చేరాయి. కొన్ని నామరూపాలు గుర్తు తెలియకుండా అయిపోయాయి. కొన్ని రోడ్లమీదే వుంటామని మొండికెత్తాయి. కొత్తవాళ్ళు పత్తా లేకుండా పోయారు.

వీరయ్య రిక్షాలన్నీ షెడ్‌లోకి తెప్పించి పోగుచేసి చూసి, పునాది కూలి పడిపోయిన విశాలభవనంలా ఉన్న కుప్ప, యుద్ధం ముగిసింతర్వాత పీనుగుల ప్రోగులాగా వున్న రిక్షాలు చూచుకొని, అవురుమని ఏడ్చాడు.

మళ్లీ రిక్షాలు అన్నీ బాగుచేయించి, పూర్వం ప్రకారమే అద్దె ఇమ్మని రిక్షాలు ఇస్తుంటే వెంకటేశం జోగి [illegible]టూ కలిసి మూడ్డరూపాయిలు అద్దె ఇద్దామని నిశ్చయించుకొని, ఆ మాట చెబితే ఆనందించిన వీరయ్య సామాన్యుడేం కాదు.

ఇవాళ రిక్షా ఇవ్వనన్నాడంటే బలమైన కారణమే వుండాలి. మునుపు చాలా మర్యాదగా పలకరించేవాడు వీరయ్య. ఆ మధ్య ఎవరి మాటలు విన్నాడో ఏమో బాగా మారిపోయాడు. ఏరా, ఒరె, పోరె అంటున్నాడు. ఆ మొదటిలోనే అద్దె పెంచు తానని మానుకొన్నాడు

రాత్రి కోటికి రిక్షా లేదు, చెడిపోయిందని ఎవరికో ఇచ్చాడు. ఉదయం జోగికి రిక్షా ఇవ్వననీ చెప్పాడు. రేపు తనకు ఇష్టంలేనివాళ్ళు ఈ వూళ్లో రిక్షా తొక్కకూడదన వచ్చు. ఆపైన ఏమయినా అనవచ్చు. జాగ్రత్తగా వుండాలి.

వెంకటేశం జోగి మాట్లాడుకొంటుంటే గోపాలం వింటున్నాడు. వెంకటేశం చలిజ్వరంవాడిలాగా వణికిపోతున్నాడు. విలువెల్లా కంపించిపోతున్నాడు. 'ఏరా తమ్ముడూ వెంకటేశం—తొక్కేవాడిదే రిక్షా అని నినాదం ప్రారంభిస్తావేం దున్నేవాడిదే భూమి అన్నట్లుగా' పలకరించాడు గోపాలం.

వెంకటేశం ఏమీ మాట్లాడలేదు 'తొక్కేవాడిదే రిక్షా' అనుకొంటూ జోగి వెళిపోయాడు. ఉద్రిక్తమైన పరిస్థితి భరించలేకపోతున్నాడు వెంకటేశం.

రిక్షావచ్చి ఆగింది. డ్రైవర్ చెమట తుడుచుకొంటున్నాడు. సుబ్బయ్య రిక్షా దిగి, అర్ధరూపాయిబిళ్ల ఇవ్వబోయాడు. వద్దు అని రూపాయి కావాలని రిక్షాడ్రైవరు పట్టుబట్టాడు.

వెంకటేశం వచ్చి విషయం కనుక్కొంటుంటే అర్ధ రూపాయి తీసుకొని వెళిపోయాడు రిక్షా డ్రైవరు. సుబ్బయ్య కృతజ్ఞతాపూర్వకంగా చూచి వెళ్లిపోయాడు. రిక్షాడ్రైవర్ వెంకటేశం కొడతాడనుకొని మాటాడకుండా వెళిపోయాడని అనుకొన్నాడు గోపాలం.

ఒకప్పుడు మనిషికి కండ బలం! ఆ తర్వాత ఎప్పుడో గుండె బలం! ఆ మధ్య ఎప్పుడో మెదడు బలం! ఇప్పుడు డబ్బు బలం!! దాన్నుంచి అన్నిబలాలు పుడతాయి. దానిలోకి అన్ని బలాలు చేరుతాయి. పరమాత్మనుంచి ఆత్మలు ఆవిర్భవించి, మళ్లీ అందులో అంతర్లీనమయినట్లు!

వెంకటేశం హాస్పటల్‌వైపు చూశాడు. ఉదయం వెళ్ళి ఆమెను చూడకుండా తిరిగివచ్చిన పరిస్థితి గుర్తుకు తెచ్చుకొంటుంటె భయంగా వుంది. మళ్ళీ వెళదామని అనిపించింది. 'పోలేను' అనుకొని కళ్లలో తిరుగుతున్న నీళ్లు శారదను చూచి, ఆమె చూడకుండా తుడుచుకొన్నాడు.

శారద హేశాన్ సర్జన్! గులాబి రంగు శరీరం! సన్నని ఆకారం! ఎత్తుపాటి రూపం! అందమయిన ముఖం! ఆకర్షణ ఉన్న కళ్ళు!

ఆమె స్పెషల్ గదిలోకిపోయి కూర్చుంది. వెంకటేశంవెళ్ళి ఎదుట కూర్చున్నాడు. కోటి వచ్చి 'ఏం కావాలి?' అంటే రెండు కాఫీ అని చెప్పింది శారద.

'అమ్మ రమ్మంది. అమ్మతోపాటు వూరు వెళుదామను కొంటున్నా, మీరు చెప్పి, మీరు వస్తామంటే, కంపెనీ పోదా మని అడగటానికి వచ్చాను.

'నా కెక్కడ తీరుతుంది శారదా! రావటం కష్టం! ఇక్కడ బోలెడంత పని! నువే పోయిరా!'

'ఇక్కడేం పని, బోలెడంత పని, ఈ పనేగా! ఈ పని మానమంటే మీరు మానరు?'

శారద నిజంగా బాధపడిందనిపించింది. వెంకటేశం మౌనంగా కూర్చున్నాడు.

'ఆ నలుగురూ మీ చేత సర్వ్ చేయించుకొనే వుంటారు. అప్పుడు గదా! సన్మానం చేయాలని వాళ్ళు!' శారద వ్యథ చెందుతూ వుంది.

'ఎలా ఎందుకనుకోవాలి! మొన్న నీ దగ్గర్నుంచి వస్తుంటే ఎదురుదెబ్బ తగిలి రక్తం వచ్చిందని చెప్పాను గదా! డాక్టరు రంగారావు నా కాలు పట్టుకొని దెబ్బచూచి తుడిచి మందువేసి, కట్టుకట్టాడు— దాని కేమనాలి. అది అతనికి అవమానం కాదు గదా!'

'అది అతని డ్యూటీ!'

'ఇది నా డ్యూటీ శారదా! ఎవరైనా తాని కోరుకొని చేస్తున్న పనిని, తన పనిని పూర్తిగా, సంతృప్తిగాను, హృదయపూర్వకంగా చేయటమే తన విధి తాను నిర్వహించటం! అందులో ఏమయినా లోపం వచ్చిందంటే తనంగాని, చెప్పేవారిలో దోషంగాని, చేయగలిగినంతకాలం, సక్రమంగా చేస్తున్నంతకాలం, ఏ పని చేస్తున్నవానికయినా ఆత్మతృప్తి వుంటుంది. ఈ పని చిన్నది, ఈ పని పెద్దది అని ఎక్కడా లేదు. నేను రిక్షా తొక్కుతూ తప్పు చేస్తున్నా ననుకోవటంలేదు. నేను సర్వర్‌గా వుంటూ అవమానకర మయిన పని చేస్తున్నా ననుకోవటం లేదు. నువ్వు చెప్పేది ఒకటి ఒప్పుకొంటాను ఇంతకంటే సుఖంగా వుండే పని కోరుకోవచ్చని. నేను అవసరమయినప్పుడు తప్పకుండా కోరు కుంటాను, సంపాదించుకొంటాను, భగవంతుడు దయతలిస్తే, నేను బ్రతికివుంటే! కలెక్టరయినా, డాక్టర్ అయినా సర్వరయినా, వీధి వూడ్చేవాడయినా తన పని తాను చేస్తుంటే తప్పు చేస్తున్నవాడు కాదు.'

శారద ఏమీ మాట్లాడలేదు. కోటి రెండు కాఫీలు తెచ్చాడు. ఇద్దరూ తీసుకున్నారు. 'ఏమిటో' శారద పలి కింది. కాఫీ చప్పరించింది. 'మీరు చెప్పింది, నిజమే' కాఫీ ముగించింది. వెంకటేశం బిల్లు తీసుకొన్నాడు. 'మళ్ళీ ఎప్పుడయినా వేదాం—బ్రతికి బాగుంటే' విచిత్రంగా నవ్వాడు. ఆమె లేచి నిలబడింది. ముఖంలోకి చూచి, 'మిమ్మల్ని చూస్తుంటే భయంగా వుంది' అంది. 'సరి సరి!' నిశ్చ విహీనంగా నవ్వాడు వెంకటేశం. ఆమె బయలుదేరింది. 'మళ్ళీ ఎప్పుడు?' అడిగాడు. 'రేపే! ఉదయమే వచ్చే స్తాను' నిట్టూర్పు విడుస్తూ 'శారదా! నాకోసం ఎదురు చూస్తూవుండమని కోరుకోను!' ఆమె అడుగువేయకుండా నిలబడింది. 'ఎందు కోరుకోను!— ఏమిటి మీ రిలా!' 'వెళ్ళిరా శారదా వెళ్ళిరా' ఆమె నడక సాగించింది. గొంతు బిగబోతూవుంది. ఆమె బైటికి వెళ్ళగానే స్పెషల్ రూంలోకి పోయి, టేబిల్‌మీద తల పెట్టుకొన్నాడు. వీపు ఎగిరెగిరి పడుతూవుంది.

ఎవరు ఎవరిచేత ఎందుకు ఆకర్షింపబడతారో చెప్పటం కష్టం! వయస్సు సరద! మాయని పరిస్థితులయితే వాయిన పోవచ్చు! ఒక్కొక్కప్పుడు ఎదురెక్కవచ్చు. గాలి తప్పి పవ్వు. మిట్ట రెక్కలప్పు! ఎక్కడో ఎప్పుడో ఆగిపోవచ్చు! ఇంతదూరం ఎలావచ్చాడు అని ఎప్పుడు ఆలోచించినా అర్థం కాదు అంటు బట్టను. యౌవనం ఎంతటిదైనా! వయస్సు కంటే వాళ్ళిద్దరికీ దగ్గరకు చేర్చిన శక్తి ఏముంటుంది?

శారద అందంగా వుండటంతో అంత ఆకర్షణయినా కష్టం కాదు. కాఫీ ఇస్తూ 'శారదగారూ, మీరు చాలా అందంగా వుంటారు' అన్నమాట ఆమె హృదయంలో చోటు చేసుకో వటం విచిత్రమే.

హాస్పటల్లో పేషెంట్‌గా చేరిన వెంకటేశం మూడు రోజుల్లో శారదకు అతి సన్నిహితుడుగా మారటం, ప్రేమించు కొన్నామనుకోవటం నమ్మలేని నిజాలు! అయితే పెళ్ళి చేసు కొందామనుకోవటం గుండెలు పిండే సత్యం.

శారద ఒక్కతే కూతురు. అన్నలు నలుగురు. ఆస్తి అంతస్తు ఉన్న కుటుంబం! తండ్రి ఈ అవమానం భరింప లేక పోయాడు. మధ్యవర్తులతో కబురు చేశాడు, జాగ్రత్తగా వుండమని. జాగ్రత్తగా ఉన్నానని సమాధానం. భయాన ప్రారం

ించిన సంధి నయాన సాగించాడు. కావలసినంత డబ్బు తీసుకొని, కనిపించని చోటికి పోయి, హోటల్ పెట్టుకోమని. ఏం చెప్పాలో తెలియక వెర్రిగా తిట్టి మధ్యవర్తుల్ని సాగనంపాడు వెంకటేశం.

ఒకరోజు శారద తండ్రి పరంధామయ్య వచ్చి చేతులు పట్టుకొని, అభిమానం ఉన్నవాడేవడూ, అనలేని మాటలన్నీ అని బ్రతిమాలి పూరొదిరి వెళ్లమంటే ఎలాగో ఒప్పుకొన్నాడు వెంకటేశం.

తండ్రి చేస్తున్న ప్రయత్నాలు విని ఆత్మహత్యకు శారద ప్రయత్నించిందనీ, వారించారనీ, అందువల్లే మళ్లీ పొమ్మనలేదనీ, ఊరు వదిలిపోతే ఆమె దక్కదనే భయంతో పూరుకొన్నారని వెంకటేశం విన్నాడు. శారదకూడా చెప్పింది. కాన్ నర్సుల్ని పూర్తిచేసేదాకా ఎక్కడకు పోవద్దనీ ఆ తర్వాత కలసే ఎక్కడికయినా పోవచ్చుననీ శారద చెప్పింది. అలాగే నంటే ఒట్టు వేయించుకొంది.

హాస్పటల్ టవర్‌క్లాక్ రెండుకొట్టింది. స్పెషల్ రూంలో టేబిల్‌మీద తలపెట్టుకొనివున్న వెంకటేశం ఉలిక్కిపడి లేచాడు. తూలు వచ్చినట్లుగా వుంది. కళ్లు వాచి వున్నాయి. తడిమరకలు ముఖమంతా వున్నాయి.

బైట ఎండ! మాడిపోతూ వుంది! గాలి లేదు. ఆకయినా కదల్లాడటం లేదు. విపరీతంగ ఉక్క! చెమట! ఎంతగా ఫేన్ తిరిగినా చెమట ఆరిపోవటం లేదు. హాస్పిటల్ వైపు, ఉదయంవెళ్లి వచ్చిన వార్డువైపు ఆశగా చూచి నిరాశగా దిగులుగా తలదాచుకొన్నాడు.

రోడ్డుమీద జనం పలచబడ్డారు. అప్పుడొకరు ఇప్పుడొకరు వస్తున్నారు పోతున్నారు. కార్లు, రిక్షాలు, సైకిళ్లు ఎక్కువగా రావటం లేదు. లారీలు రెండో మూడో వచ్చి పోయాయి. హోటల్‌లోకి కూడా జనం ఎక్కువగా రావటం లేదు.

గోపాలం పేకర్లు అన్నీ ముగించాడు. సుబ్బారావు కేష్‌ముందు తూగుతున్నాడు. చెంగాయి, రెండు టేబుళ్ల మధ్య గోడకు ఆనుకొని కునుకుపాట్లుపడుతూ 'అన్నా! అన్నా!' అని కలవరించి లేచి అటూ ఇటూ చూచి స్పెషల్ రూంలోంచి వెలుపలికి వస్తున్న వెంకటేశంను చూచి నిశ్చేష్టుడయి నిలబడ్డాడు.

నాగలింగం దగ్గరకు వచ్చి ముఖంలోకి చూస్తూ ఏమైంది? మరీ ఎట్టో అయిపోతన్నా!' అన్నాడు. చెంగాయి దగ్గరకు వచ్చాడు. ఇద్దరి ముఖాలలోకి పిచ్చిగా చూచి, తల వంచుకొన్నాడు. కళ్లవెంట నీళ్లు కారుతూ వున్నాయి. దిగా నోరు విప్పి, 'నాకు భయంగా వుంది!' అన్నా 'యేందన్నా యేంది?' అంటూ ఏడ్పుముఖం పెట చెంగాయి.

నాకు భయంగా వుంది అని ఎప్పుడూ వెంకటే అనటం ఎవరూ వినలేదు 'అడుగో కారు!' అన్నాడు రుగా వెంకటేశం! అది శేఖర్ కారు! రంగడు పనిచేసే హోటల్ ప్రొప్రయిటర్‌ది. అది హాస్పిటల్‌లోకి పోయింది

వెంకటేశం 'మీరు...మీరు...' చెప్పబోయి ఆగి, వ 'నన్ను—నన్ను మీరు' అని వాక్యం పూర్తి చేయకుండా కొని, 'వద్దులే?' అని ఆపేశాడు. 'సెప్పు! యేం మంటావో సెప్పు' అన్నాడు నాగలింగం.

వెంకటేశం వళ్లంతా విపరీతంగా చెమటతో త ముద్దయిపోతూ వుంది. కోటి వచ్చి వాళ్లు ముగ్గుర్నీ చూ 'యేంది యావయిం దేంది? యేం దేవీ చెప్పరు సచ్చింసె దగ్గరోళ్లలాగా! సెప్పం డేంయింది?' ఎవరూ మాటా లేదు.

రాత్రి ఫస్ట్‌షో వదిలిం తర్వాత మెయిన్ రోడ్డుకి వస్తూ తనను వెంటాడుతున్నారెవరో అని వెంకటేశం అ మానించాడు ఫోటో స్టుడియో దగ్గరకు వచ్చేసరికి నాల ప్రక్కలా నలుగురూ వచ్చి చుట్టుకొన్నారు. భయం ఎక వయింది.

పట్టణంలో నడిరోడ్డుమీద రాత్రి పదిగంటలకే వెం కటేశంను ఎటూ పోనియకుండా ఏమో చేయాలని చూస్తు వాళ్ల దగ్గర పదునైన కత్తి కనిపించటంతో వాడుప తప్పించుకొని, సినిమాహాలు గోడదూకి, పార్కు ప్రక్కనుం స్కూలులోనుంచి తప్పించుకొని వచ్చాడు, వెంకటేశం.

చెప్పటం ముగించేసరికి వణుకు ఎక్కువయింది. చెమ నీళ్లు పోసినట్లు జారిపోతా వుంది.

'ఆళ్లని గురుతు బట్ట లెవ్వేంది?'

'గుర్తుబట్టి' విచారంగా నవ్వాడు. 'ఏంచేయాలి నీళ్లు నన్ను చంపబోయారనికనా చెప్పాల! ఎవరికి? నమ్ముతారు? నమ్మినా అది సత్యమని ఋజువుచేయటం ఎ తలవంచుకొని, 'అయినా నేను వాళ్లను గుర్తుబట్టలేను.' దిగులుగా నవ్వి 'పేదవాడి ప్రాణం ఏం విలువ?' వెంకటేశం ఆ పెదాలు నాలుకతో తడుపుకొన్నాడు.

కోటికి ఎక్కడ్లేని కోపం వచ్చింది. తోకతొక్కిన తాచులాగా బుసకొడుతున్నాడు. నాగలింగం గుండెలో భయం అలలు అలలుగా లేస్తూవుంది.

'ఇక్కణ్ణుంచి పారిపోతే పోలా?'

వెంకటేశం విని పిచ్చిగా తలవూపాడు. శారద దృష్టిలో మెదలింది. వెంటనే విషాదంగా నవ్వాడు. శవం నవ్వినట్లుంది.

'ఎక్కడికి పారిపోవాలి? ఎప్పుడు పారిపోవాలి? గోడలున్న ఈ హోటల్లోఅయినా దాక్కోవచ్చు. గోడల్లేని పట్టణంలో ఎక్కడ కనిపించినా—కాచుకొని వుంటారుగా—ఏముందింక?'

కోటి దురుసుగా అటూ ఇటూ తిరిగాడు. అన్యాయం అని అరిచాడు. 'మనోళ్లందర్నీ పిలుద్దాం ఈడేలి, తాడో పేడో తేలి పోవాల!'

'వద్దు! వద్దు!! వద్దు!!!—ఆ ప్రయత్నమే వద్దు! ఇప్పుడున్న పరిస్థితే మనవాళ్లకు అంతంతమాత్రం! అంత కంటే ఏం కష్టమొచ్చినా మనవాళ్లు బాధపడతారు. నాకోసం ఎవళ్లకూ నష్టం వద్దు! వాళ్లూ, వాళ్ల పిల్లలూ వాళ్ల సంసారాలూ—వాళ్లలో ఏ ఒక్కడికి ఏం కష్టమయినా అది ఆ ఒక్కడితో పోదు—నేనంటే'...ఏమీ అనకుండా ముగించాడు.

నాగలింగం భయంతో కోపంతో ఉడికిపోతున్నాడు. కోటి పట్టరాని ఆవేశంతో విసురుగా దురుసుగా దూకుడుగా ఉన్నాడు. చెంగాయి కేమీ అర్థం కాలేదు.

'అన్నా! అన్నా!!' పిలిచాడు చెంగాయి.

'ఏం రా!' ప్రేమగా పలకరించాడు వెంకటేశం.

'ఎందన్నా విూరంతా ఎట్టాగో వుండారు?'

'ఏం లేదురా!' చెంగాయి బుగ్గ పులిమి దుఃఖం ఆపు కొంటూ, 'చూడు నువ్వా టేబిల్ క్లీన్ చేయలేదు' అని ముఖం తిప్పుకొన్నాడు.

'ఎవరో నలుగురు వచ్చారు. 'కాఫీ!' అని పిలచారు ఎవరూ పలకలేదు కునుకుతీస్తున్న సుబ్బారావుకు మెలకువ వచ్చింది. 'వారే కోటీ! వారే నాగీ! ఏందిరా మీ ముచ్చట్లు? ఈడ కాఫీలు గావాలంటంటే యేందిరా మీ త్తైలెక్కలు లెండిరా కాఫీలు!' కసురుకొన్నాడు. మళ్లీ కునుకు తూగు తున్నాడు

గోపాలం వాళ్ల మాటలు కొంతలో కొంత విన్నాడు. వెంకటేశంతో 'ఒరే తమ్ముడూ! ఏమిటిరా పరిస్థితి ఘోరంగా వున్నట్లుంది' అంటే, 'అవును' అని ముఖం అవతలకు తిప్పు కొని, కిటికీలోంచి వెలుపలికి చూస్తున్నాడు.

గోపాలం బైటికి వచ్చి మురుగుకాలవలో ఉమ్మివేసి, ప్రక్కకుపోయి, సిగరెట్టుకొట్టులో సిజర్స్ ఒకటి తీసుకొని, కొబ్బెరతాడుకొసతో వెలిగించుకొని గట్టిగా పొగ పీలుస్తున్నాడు.

వెంకటేశం కిటికీలోంచి, దూరంగా రోడ్డుమీద తిరుగు తున్న బట్టనెత్తిమనిషిని చూచి, వణికిపోయి, వెనక్కి తగ్గాడు. వేగంగా హాలులోంచి గేటుదగ్గరకు వచ్చాడు. గుండె నీరసంగా కొట్టుకోసాగింది.

రోడ్డు కవతల హాస్పిటల్ గోడ ప్రక్కనే ముఖంమీద చెమట తుడుచుకొంటూ నిలబడ్డ వ్యక్తినీ, హోటల్‌గేట్ ప్రక్కనే నిలబడి సూటిగా హాస్పిటల్‌లోకి చూస్తున్న వ్యక్తినీ చూచి కిచెన్ వైపు పరుగెత్తాడు.

కిచెన్ వెనుక ఎక్కువ వెడల్పులేని వాకిలిలో వెడల్పుగా నిలిచివున్న మనిషి క్రూరంగా చూస్తున్నాడు. గబగబా హాలు లోకి పరుగెత్తుకొని వచ్చాడు వెంకటేశం!

'యాం-యిందేం-యింది!' వంటవాళ్లు. 'యేందేంది' సర్వర్లు. 'యేందన్నా యేది?' పనిపిల్లలు, అందరూ చుట్టూ మూగారు.

కళ్లవెంట నీళ్లతో నిశ్చలంగా నిలబడి 'వాళ్లొచ్చారు!' అన్నాడు వెంకటేశం! గబగబ సుబ్బారావు దగ్గరకు పోయి, 'పోలీసుల్ని పిలుస్తా!' అని ఫోన్ అందుకొన్నాడు.

సుబ్బారావు కళ్లు నులుంకొంటూ 'పోలీసుల్నా? ఎందుకు?'

వెంకటేశం జవాబు పలకలేదు. డైల్ చేశాడు. సమాధానంలేదు. మళ్లీ! జవాబు లేదు. మళ్లీ! ఊటో! 'ఏం దిది?' వెంకటేశం ఏడ్పుగొంతు విని సుబ్బారావు ఆశ్చర్య పోయాడు.

'పొద్దుణ్ణుంచి లయిను సరిగ్గలేదు' ముఖం చిట్లిస్తూ ఎందుకూ అన్నట్లుగా చూశాడు సుబ్బారావు!

వెంకటేశం వణకటం లేదు, ఊగిపోతున్నాడు, పెద్ద గాలికి సంచలించే తీగలాగా. అంత పెద్దశరీరం వూగుతూ అకస్మికంగా ఆగిపోయింది. ఊగటంలేదు

ఇంక తాను చేయగలిగిన ప్రయత్నం ఏదీ లేదనిపించింది' కళ్లవెంట రెండు బొట్లు రాలిపడి ఆగిపోయాయి.

'తలుపు లేత్తే!' కోటి సూచన!

'బాగానే వుంటది' నాగలింగం సమ్మకం!

వంటవాళ్లు పోయి, కిచెన్ తలుపు మూయబోయారు. పనిపిల్లలు పోయి, సైడ్ ఎంట్రన్స్ మూయబోయారు. వీలు కాలేదు.

వెనుకనుంచి, ప్రక్కనుంచి తలుపులు తోసుకొని లావు పాటి మనిషి, బట్టనెత్తిమనిషి వచ్చారు.

ముందు, హాస్పటల్ గోడదగ్గర, గేటులో ఉన్న ఇద్దరూ, మెయిన్‌గేటులోంచి వచ్చారు.

లావుపాటిమనిషి రెండే దెబ్బలకు కయ్‌కుయ్‌మంటున్న కోటిన్నీ, నాగలింగంని వేలమీద పడేటట్లు కొట్టాడు.

మూడు ప్రక్కలనుంచి నలుగురు తాపీగా దగ్గరకు వస్తున్నారు. కాఫీ తాగుతున్న ఎవరో ఇద్దరు లేచి పారిపోయారు.

పసిపిల్లలు పనిపిల్లలు అవురుమని ఏడుస్తున్నారు.

'వద్దు' అన్నాడు చెంగాయివైపుచూసి, వెంకటేశం. నిలుచున్న చోటినుంచి కదల్లేదు

సర్వర్ ఒకడు కుర్చీ ఎత్తాడు. వద్దని వారించాడు వెంకటేశం. అది చూచిన బట్టతలమనిషి ఆ సర్వర్‌ని బిళ్ళ బీటుగా పడేటట్లు కొట్టాడు.

నలుగురిలో ఇద్దరు నిశ్చలంగా ప్రశాంతంగా వచ్చి వెంకటేశం గూన్నక్రింద చేతులువేసి పట్టుకొన్నారు.

పరమశాంతంగా వాళ్ళముఖంలోకి చూశాడు వెంకటేశం. ఏ మాత్రం కదలలేదు. ఏ ప్రయత్నమూ చేయలేదు స్థిరంగా నిలబడి వున్నాడు నలుగుర్నీ చూస్తూ 'మీకేం అపకారం చేశాను' అంటూ హాస్పటల్లో ఆమెవున్న వార్డువైపు చూస్తున్నాడు.

వెనుకనుంచి వచ్చిన లావుపాటి వ్యక్తి రెండు చేతులూ పిడికిలిపట్టి, ఎత్తి, ముచ్చికల గుండెమీద బలంగా కొట్టాడు 'అమ్మా!' అంటూ హాస్పిటల్ వార్డువైపు చూస్తూ క్రింద పడిపోయాడు. స్పృహ తప్పింది. వాళ్ళ చేతుల్లో వాలిపోయాడు

సిగరెట్టు విసిరి నేలమీదకొట్టి, పళ్ళు కొరుకుతూ 'ఏమిటీ అన్యాయం' అంటూ లోపలికి పోబోయాడు గోపాలం.

'అన్నా! అన్నా!' అరచి కేకలుపెడుతున్నాడు చెంగయి.

గుడ్లు మిటకరించి, నోరు తెరిచి, ఊపిరి బిగబట్టి, కూర్చున్న చోటునుంచి లేవకుండా చూస్తున్నాడు సుబ్బారావు, ఉలకలేదు పలకలేదు.

స్పృహ కోల్పోయిన వెంకటేశంను చేతులమీద తీసుకు వస్తున్న వాళ్ళనలుగురినీ చూసి, 'వదలండి వాణ్ణి!'అంటూ అడ్డంపోయాడు బక్కపలచటి గోపాలం!

వాళ్లేమీ పలకలేదు. బట్టనెత్తివాడు ఒక్కనెట్టు నెట్టాడు. అంతే! గోపాలం మురుగుకాలవలో పడి, తెప్పరిల్లి, పైకిలేచి, మొలలోతు బురదలో వెలుపలికి రాలేక గింజుకొంటూ వెంకటేశంను తీసుకుపోతున్నవాళ్ళను అయోమయంగా చూస్తున్నాడు.

లోపల్నుంచి 'అన్నా! అన్నా!!' చెంగాయి ఏడుస్తూ గబగబా వెలుపలికి వచ్చి, సిగరెట్టుకొట్టు పక్కనే నిలబడి చూస్తున్నాడు.

వెంకటేశంను రోడ్డు మధ్యకు లాక్కుపోయారు. హాస్పటల్లోనుంచి ఏదో కారువచ్చి వెళిపోయింది.

రోడ్డు మధ్యకు లాక్కుపోతున్నప్పుడు ఆ కారు హారన్ వల్ల మెలకువ వచ్చింది. స్పృహవల్ల కాళ్ళూ చేతులూ విదిలించాడు.

'పిచ్చి! పిచ్చి!!' గోపాలం కేకలు పెడుతున్నాడు.

'అన్నా! అన్నా!!' చెంగాయి ఏడుస్తున్నాడు.

ఒకడు రెండు చేతులూ గట్టిగా పట్టుకొన్నాడు. ఇంకొకడు రెండు కాళ్ళూ గట్టిగా పట్టుకొన్నాడు. నడిరోడ్డులో పడుకోబెట్టారు.

వెంకటేశం కళ్ళు బాగా విచ్చుకొన్నాయి. అంతా స్పష్టంగా కనబడుతూవుంది. అది, ఎదుట, అక్కడ, అక్కణ్ణుంచి, ఎక్కడో, ఎటో దూరంగా క్షణంలో ఎండలో చల్లగా హాయిగ, స్పష్టంగా అందంగా కనిపించింది.

బట్టతలవాడు జుట్టు పట్టుకొన్నాడు. ఏ శత్రుత్వాలో తనకు తెలియదు. హాస్పిటల్ వార్డువైపు చూపు మరలింది. తానేమీ ద్రోహం చేయలేదు. వీళ్ళకే కాదు. ఎవరికీ అకారణంగా కష్టం కలిగించలేదు.

లావుపాటివాడు పొడవైన కత్తి బైటికి తీశాడు. కళ్ళు తిరుగుతున్నాయి. గొంతుమీద పెట్టాడు. వెంకటేశం చూస్తున్నాడు. 'భగవంతుడా!'

'పిచ్చి! పిచ్చి?! పిచ్చి!!!' మురుగ్గుంటలోంచి గోపాలం పిచ్చిగా అరుస్తున్నాడు.

'అన్నా! అన్నా!! అన్నా!!! చెంగాయి గొంతు చించుకొంటూ ఏడుస్తున్నాడు.

అటునుంచి వచ్చే బస్సులూ లారీలు కారులు, ఇటునుంచి వచ్చేవి సడన్ బ్రేకులు వేసుకొంటూ ఆగాయి.

గొంతు మీద కత్తి చొచ్చుకు పోతూవుంది. గొంతు తెగింది.

పట్టణంలో పట్టపగలు రెండుగంటలకు నడిరోడ్డు మీద, జనం చూస్తున్నారు. వీలయిన చోటులోనుంచి జనం చూస్తున్నారు.

ఎక్కడా కదలిక లేదు. గాలిలేదు. ఆకు అల్లల్లాడటం లేదు. ఉక్క! పిచ్చిఉక్క!

కత్తి కదులుతూ వుంది. మెడనరం తెగింది. మెడ తెగింది. తల వేరయింది. బట్టతల వాడి చేతిలోకి జుట్టున్న తల వచ్చింది. తీసుకొన్నాడు, వెళిపోయారు

మొండెం లోంచి రక్తం చిమ్మించి కొడుతూ ఫౌంటెన్. తొక్కి పట్టివున్న చేతులూ కాళ్ళూ వదిలి పెట్టటంతో మొండెం మొత్తం ఎగురుతూవుంది. మొండెం ఎగిరెగిరి పడి రక్తంలో తడిసి, నాని, అంతా బురద బురద అయిపోయింది.

చెంగాయి 'అన్నా! అన్నా!! అన్నా!!!' అంటూ ఎగిరెగిరి పడుతున్న మొండెం కాళ్ళూ చేతులూ ఆపబోయి, ఆపలేక, క్రిందపడి పైకిలేచి, పడుతూ లేస్తూ, రక్తంలో తడిసి, ఎర్రగా రక్తం ముద్దయిపోయాడు.

'పిచ్చి! పిచ్చి!! పిచ్చి!!!' కేకలుపెట్టి పెట్టి, స్పృహ తప్పి మురుగు కాలవలో పడిపోయాడు గోపాలం.

అరచి, అరచి, తిరిగి, తిరిగి, ఏడ్చి ఏడ్చి, కళ్ళు బైర్లు కమ్మి, చెంగాయి, ప్రాణం ఉన్న చెంగాయి, స్పృహ తప్పి, ప్రాణంలేని వెంకటేశం ప్రక్కనే పడిపోయాడు.

# మానవత్వము: ఆధునికత

శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

మానవత్వాన్ని మానవ జీవితం దృష్ట్యా నిర్వచించే ప్రయత్నంలో పురుషార్థాల ప్రసక్తి తప్పదు. మానవుణ్ణి ధార్మిక మానవుడు ((moral or ideological man), ఆర్థిక—రాజకీయ మానవుడు (economic and political man), శృంగార మానవుడు (erotic and aesthetic man), ఆధ్యాత్మిక మానవుడు (spiritual man) అంటూ ధర్మార్థ కామ మోక్షాల ననుసరించి విభజన చేయవచ్చు.

ప్రతియుగంలో ఆనాటి సాహిత్యక, సాంఘిక, రాజకీయ, తాత్త్విక వ్యవస్థలలో పై చెప్పిన పురుషార్థాలలో దేని ప్రాబల్యం ప్రధానంగా వున్నదో పరిశీలించి గుర్తించడం ఒక పద్ధతి. సాహిత్య వ్యవస్థ తీసుకుంటే పూర్వ సాహిత్యంలో, మతగ్రంథాల్లో, శాస్త్రాల్లో కనిపించేది ఆధ్యాత్మిక మానవుడు, ధార్మిక మానవుడు. తర్వాత కావ్యాల్లో కనిపించేది శృంగార మానవుడు. నేటి యుగంలో ఆర్థిక—రాజకీయ మానవునికి సాహిత్యంలో ప్రధానస్థానం కల్పించే ప్రయత్నం జరిగింది. ఇది మారిన యుగలక్షణం. సాంఘిక వ్యవస్థ తీసుకుంటే ఒకానొక కాలంలో సంఘంలో ఆధ్యాత్మిక మానవునిదే ప్రథమస్థానం. తర్వాత ధార్మిక మానవుడు, ఆర్థిక మానవుడు ప్రాబల్యం వహించారు. నేడు రాజకీయ మానవుడు ప్రధానస్థానంలో వున్నాడు. ఈ యుగం మార్పుచెందుతూ రాజకీయమానవుని స్థానాన్ని భవిష్యత్తులో శృంగార మానవుడు ఆక్రమించే సూచనలు లేకపోలేదు. రాజకీయ వ్యవస్థ పరంగా ఆలోచిస్తే పూర్వం రాజు ధార్మికుడు. తర్వాత అర్థబల, అంగబల ప్రధానుడయ్యాడు. నేడు రాజకీయవాది. రేపు ఎలా మారుతాడో ఊహించడం కష్టం. తాత్త్విక వ్యవస్థలో ప్రథమంగా ఆధ్యాత్మిక మానవుని ప్రాబల్యమూ తర్వాత ధార్మిక మానవుని ప్రాబల్యమూ కనిపిస్తుంది. వైదికమతం తర్వాత బౌద్ధం వచ్చింది. బౌద్ధానికి ఆధ్యాత్మికతకంటే ధర్మమే (morality, righteousness) ప్రధానం. తర్వాత బౌద్ధం క్షీణించి, హిందూమత వికాసం దేవాలయనిర్మాణం ప్రధానంగా సాగిన కాలంలో ఆర్థికతే ప్రాబల్యం వహించింది. దానిచే ఆకర్షింపబడి యిస్లాంమతం దాడులు ప్రారంభించిన తదుపరి భక్తిప్రధానమైన ఉద్యమాలు ప్రబలిన కాలంలో శృంగారం ప్రధానమైంది. అటుతర్వాత నేటిదాకా తాత్త్వికంగా మన దేశంలో అవ్యవస్థతప్ప వ్యవస్థ లేదు. రామకృష్ణ, వివేకానందులు ఆధ్యాత్మికతను ప్రతిష్ఠించడానికీ, గాంధీ ధార్మికతను ప్రతిష్ఠించడానికీ ప్రయత్నించి విఫలురయ్యారనే చెప్పాలి. అందుకు కారణం యీ యుగంలో వ్యవస్థలన్నింటిలో ఆర్థిక—రాజకీయ వ్యవస్థకున్న ప్రాధాన్యం మరొక దానికి లేదు. సాహిత్యమూ, సంఘాచారమూ, తాత్త్విక దృక్పథమూ, మూడూకూడా ఆర్థిక—రాజకీయ వ్యవస్థకు లోబడి ఊడిగం చేస్తూవున్న పరిస్థితి నేడు మనకు కనిస్తుంది.

'ఆధునికత' అంటే ఏమిటి? నేటి మానవుని పరిస్థితిని లక్షణాలనూ వ్యక్తం చెయ్యడానికి కాక, నేటి మానవునితో భావియుగాన్ని సూచించే వినూత్నమైన విలక్షణమైన ధోరణులు ఏవి వున్నాయో వాటినిమాత్రం ఇక్కడ 'ఆధునికత' క్రింద వ్యవహరించడం జరుగుతుంది. అందువలన యీ రచన ముఖ్యోద్దేశం 'నేటి మానవుని'లో రూపొందుతున్న 'భావిమానవుని' గుర్తించడమేనని వేరుగా చెప్పనక్కరలేదు.

ఈ యుగంలో ఆర్థిక—రాజకీయవ్యవస్థకున్న ప్రాధాన్యం మరే వ్యవస్థకూ లేదని చెప్పాను. అందువలననే గడచిన యుగాల చరిత్రను నేడు తిప్పి వ్రాస్తూ ఆయాకాలాల్లో ప్రాబల్యం వహించిన భిన్నమైన వ్యవస్థల నన్నింటినీ కేవలం ఆర్థిక—రాజకీయ వ్యవస్థమీద ఆధారపడినట్లే చిత్రించడం జరుగుతున్నది. ఉదాహరణకు: కార్ల్—మార్క్స్, రాహుల్ సాంకృత్యాయన్ ల రచనలు. సాహిత్యమూ, సంఘాచారమూ, సంస్కృతీ, మతమూ యిప్పుడే కాదు, పూర్వం కూడా ఆర్థిక—రాజకీయ వ్యవస్థకు లోబడినవేనన్న ప్రతిపాదన ఈ రచనల్లో కన్పిస్తుంది. ఇవి యీ యుగం తొడుక్కున్న రంగుటద్దాలు.

అయితే యీ యుగం మారుతున్నదా? ఎలా మారుతున్నది? రాబోయే యుగంయొక్క లక్షణాలు ఎలా వుంటాయి? ఈ ప్రశ్నలకు సమాధానాలు అన్వేషిద్దాం.

## 1. ధార్మిక మానవుడు

ధార్మిక మానవునిపై ఆధునిక ప్రభావం ముఖ్యంగా ఆత్మధర్మ ప్రత్యాఖ్యాన సమస్యగా (self-alination problem) కనిపిస్తున్నది. దీనినే "Identity crisis" అనికూడా అంటున్నారు. పూర్వయుగాలలో మతమో సంఘమో వ్యక్తికి నియతమైన ధర్మాన్ని స్పష్టంగా నిర్దేశించేది. దీనినే ఒకకాలంలో వర్ణాశ్రమధర్మముగా పేర్కొన్నారు. ఆ వైదికమతంనాటి పరిస్థితులు ఎప్పుడో మారినా సంఘవ్యవస్థలో వృత్తినిబట్టి, కుటుంబంలో స్థానాన్నిబట్టి, వ్యక్తివయోధర్మాన్నిబట్టి వ్యక్తికి 'నే నెవరు? నేనేం చెయ్యాలి?' అనే ప్రశ్నలకు సమాధానాలు సిద్ధంగానే ఉంటూవచ్చాయి. వాటికి సమాధానాలు ఆలోచించి ఎవరికివారు స్వయంగా వెతుక్కునే పరిస్థితి నిన్నమొన్నటిదాకా లేదు! నేడు ఆ ప్రశ్నలే చాలా గడ్డుప్రశ్నలుగా పరిణమించాయి. ఇది ఏకొద్దిమందికోకాక చాలామందికి జరుగుతున్నది. అందువల్లనే సమస్య తీవ్రమౌతున్నది పదిహేను—యిరవైఏళ్ళ మధ్య వయస్సులో యీ ప్రశ్న ప్రారంభం అవుతుంది. 'నే నెవరు?' అన్న ప్రశ్న విపులమై 'నేను గాంధీనా? నెహ్రూనా? స్టాలిన్నా? మావోనా? నాగేశ్వరరావునా? రామారావునా? నేను డాక్టరవుతానా? కలెక్టరవుతానా? రాజకీయనాయకుణ్ణౌతానా? గుమాస్తానా? కూలీనా? లేక నిరుద్యోగినా?' అన్న ప్రశ్న పరంపరలో దిక్కుతోచకుండాపోతున్నది వ్యక్తికి. మొదట ఒక ఆదర్శ వ్యక్తి మనస్సులో మెదులుతూ, క్రమంగా అది వృత్తికీ జీవనోపాధికీ సంబంధించిన ప్రశ్నగా తయారౌతున్నది. గ్రామం నుంచీ, హరిజనవాడనుంచీ చదువుకో, జీవనోపాధికో, నగరానికి వచ్చినవ్యక్తి, ఊహించని నూతనపరిస్థితుల్లో, ఎదురుచూడని అనుభవాలకూ, ఆకర్షణలకూ, గురౌతూ సందర్భానుసారంగా ప్రవర్తించవలసిరావటం ఒకటి. తను మనసా ఆలోచించి నిర్ణయించుకునే లోపుగానే తన చేతలూ మాటలూ ప్రవర్తనా రూపొందిపోతూవుండటం మరొకటి. అందులో తన యిష్టానికి, తనలోని 'తన'కు ఎటువంటి ప్రమేయమూ లేనివిధంగా తన బాహ్యప్రవర్తనా, అనుభవాలూ, జీవితమూ రూపొంది వ్యక్తి దిగ్భ్రాంతి చెందుతున్నాడు. ఇక్కడ జీవితంయొక్కవేగం ఉరవడి వ్యక్తిని లాగదీసుకుని ఎక్కడికో తీసుకుపోతున్నవి. కొంత కాలానికి తను నిజంగా ఆశించినదేమిటో, చేస్తున్నదీ, జరుగుతున్నదీ, దానికి ఎంత భిన్నంగా వున్నదో తెలిసిరావటం, వచ్చినా ఏమీ చెయ్యలేని పరిస్థితి; ప్రవాహానికి ఎదురీదలేని అశక్తత; ఇక వ్యక్తిత్వం నిలుపుకోవడం ఎక్కడ? తృప్తి, నైర్మల్యం, ఆనందం ఎట్లా వస్తాయి? ఇదే ఆత్మధర్మ ప్రత్యాఖ్యాన సమస్య.

ఈ సమస్య పురుషునిది ఒక్కడిదే కాదు. నేడు స్త్రీలు అధిక సంఖ్యలో పురుషులతోపాటు ఆఫీసుల్లో, ఫ్యాక్టరీలలో, సంస్థల్లో, ఉద్యోగంకోసం ప్రవేశిస్తున్నారు. వారికి యిది క్రొత్త. ఈ సమస్య వారినికూడా ఎదుర్కొంటున్నది. అంతే కాక స్త్రీ పురుషు లిద్దరూ ఒకచోట కలిసి ఉద్యోగం చేస్తూ వుండటం మరొకటి. తర్వాత ఏర్ హోస్టెస్, రిసెప్షనిస్టు, పర్సనల్ సెక్రటరీ, సినిమాతారవంటి ఉద్యోగాల్లో ఎంతవరకు వృత్తి ధర్మం ఎంతవరకు స్వధర్మం అని నిర్ణయించుకోవడం ఒక గడ్డు సమస్య. ఉదాహరణకు: ఒక స్త్రీ సినిమారంగంలో నటిగా ప్రవేశిస్తుంది. నటనలో పరాయివాడైన నటుణ్ని కౌగలించుకోవడం వరకూ నేడు ఆ వృత్తిలో అంగీకరించబడిన ధర్మం. అయితే నటనలో 'ముద్దు పెట్టుకోవడం' కూడా వృత్తి ధర్మంగా అంగీకరించవచ్చునా? లేదా? అనేది నేడు చర్చింపబడుతున్న ప్రశ్న. పోనీ పై దేశాలలో అదికూడా వృత్తి ధర్మం అయింది అని యిక్కడకూడా అంగీకరించవచ్చు ననుకున్నా, అటుపైన నేడు పాశ్చాత్యులు స్త్రీ పురుష సంయోగాన్నే 'నటనం' చేసేదాకా వెళుతున్నారు మనం అంత దూరం వెళ్తామా? వెళ్ళవచ్చునా? లేదా? అని ప్రశ్న. ఇది సమాజంచే సమష్టిగా నిర్ణయింబడవలసిన ప్రశ్న అనుకోవడం నేడు జరుగుతున్నది. కాని యధార్థానికి యిది వ్యక్తిగతంగా నటియైన వ్యక్తి స్వయంగా నిర్ణయించుకోవలసిన స్వధర్మం. తనలోని 'తనకి' ఏది అంగీకారమో ఏది కాదో తేల్చుకోవలసిన ధర్మం. సమాజం నిర్ణయించినంత మాత్రాన ముద్దు కాని కౌగలింతకాని స్వధర్మం కానేరదు. సినిమాలో నటించే వృత్తి స్వీకరించినవారికి పై చేష్టలు వృత్తిధర్మం అయినా స్వధర్మ విఘాతం కాకుండా ఉండటం ఆయా వ్యక్తియొక్క చిత్తవృత్తి మీదా మనఃప్రవృత్తి మీదా ఆధారపడింది. అందువల్ల సమాజంలో స్త్రీ పురుషుల సామాన్య ధర్మాన్నిబట్టి, ఒకానొక వృత్తి ధర్మాన్ని యిదమిత్థం అని నిర్ణయించడంగానీ, వృత్తిధర్మాన్ని బట్టి వ్యక్తి స్వధర్మాన్ని నిర్దేశించడంగాని కష్టసాధ్యాలౌతున్నవి. పూర్వం వ్యక్తి ధర్మానికీ వృత్తి ధర్మానికీ సామాజిక ధర్మానికీ పరస్పరం యిటువంటి సంఘర్షణ వచ్చేదికాదు వచ్చినా చాలా అరుదు. రాజభక్తుడైన కొడుకు రాజద్రోహియైన తండ్రిని చెరబట్టి తీసుకురావడం అటువంటిది. కాని నేటి జీవన వైవిధ్యంలో ఎక్కడికక్కడ ఎప్పటికప్పుడు పై సంఘర్షణలు రావడం, ఆలోచనకు అవకాశం లేకుండానే నిర్ణయాలు జరుగుతూ వుండడం యాంత్రికంగా సంభవిస్తూ, తద్వారా వ్యక్తి ఆత్మక్లేశానికి లోనవుతూ, పరిస్థితి ఆత్మధర్మ ప్రత్యాఖ్యానానికి దారితీస్తున్నది. స్వధర్మ నిర్ణయభారం నేడు వ్యక్తికి భరించరాని దౌతున్నది. అందరికీ సామాన్యమైన ధర్మం

అంటూ ఏదీ కనిపించదు. ఈ పరిస్థితిలో 'నే నెవరు? నా యిష్టమనేది ఏమైనా వున్నదా? నాకు భిన్నంగా యీ నా జీవితం సాగుతున్నది. నాకు తృప్తి, ఆనందం లేవు. నేను అర్థాన్ని గడించినా బ్రతుకు అర్థశూన్యంగానే వుంటున్నదే' అనే నిర్వేదం కలుగుతున్నది.

ఇలా ధార్మికమైన అవ్యవస్థ ప్రభావం, మధ్య వయస్కులు అర్థశూన్యమైన ఆసక్తి శూన్యమైన జీవితాన్ని గడపడంగానూ, చిన్నవాళ్లూ యువకులూ దౌర్జన్యాన్నీ విధ్వంసకాండనూ ఒక క్రీడలా భావించి, చీటికీ మాటికీ బీభత్సం చేస్తూ వుండటంలోనూ, వ్యక్తమవుతున్నది. "నా ధ్యేయం ఏమిటి?" అనే ప్రశ్నకు సమాధానం లభించక పోవటంతో యువతరంలో వ్యక్తి నిష్ఠమైన సృజనాత్మక శక్తి మార్గాంతరము లేక ఒక్క పెట్టున సామూహిక పీడనం (group-pressure) ద్వారా నిప్పురవ్వ తగిలిన పెట్రోలు టాంక్‌లాగా భగ్గుమంటున్నది. లేకపోతే నిస్పృహకు ఆత్మహత్యకు దారితీస్తున్నది పరీక్ష పోయిన విద్యార్థికి ఆ పరీక్ష తప్ప మరొక విలువ ఏదీ ప్రధానంగా కనిపించక, చుట్టూ వున్నవాళ్లు తననిచూచి నవ్వుతున్నారనే క్షణిక నిస్పృహ కారణంగా ఆత్మహత్య చేసుకుంటున్నాడంటే అర్థం ఏమిటి? చుట్టూ ఆవరించిన గందరగోళంలో, అవ్యవస్థలో, అతని వ్యక్తిత్వానికి పట్టుగొమ్మ అంటూ, ఒకటి లేకపోవడమే నన్న మాట. అలాంటి పట్టుగొమ్మ తల్లిదండ్రుల నుంచీ, ఉపాధ్యాయ వర్గంనుంచీ, సంఘ నాయకులనుంచీ లభించవలసి వున్నది. కాని లభించడంలేదు. కారణం వాళ్ళుకూడా ధార్మికమైన అవ్యవస్థలో తలమునకలౌతూ వుండటమే!

ఆధునికత ధార్మికమానవునిమీద వ్యక్తిగతంగా స్వధర్మ నిర్ణయం అనే బాధ్యతా భారం పడవేస్తున్నది. పూర్వమెన్నడూ సామాన్యునిమీద యీ భారం యిలా పడలేదు. ఏ కొందరు మేధావులో ధార్మికులో ఆయా కాలానుగుణంగా భారం వహించి ధర్మనిర్ణయం చేస్తే మిగతాజనం ఆ దారిలో నడిచారు. నిన్న నేటిదాకా గాంధీజం, మార్క్సిజం, ఆ కార్యమే నిర్వహించింది. కాని మారుతున్న సమాజంలో, ప్రారంభమవౌతున్న నూత్నయుగంలో యిప్పటికప్పుడే గాంధీజం, మార్క్సిజం, చాలకపోవడాన్ని మనం చూస్తున్నాము. క్రమంగా ధర్మ నిర్ణయం విషయంలో 'ఎవరికివారే యమునాతీరే' అనే పరిస్థితి ఏర్పడుతున్నది. ఒకరికోసం ఒకరు ధర్మ నిర్దేశం చెయ్యడం, ఒకరి జీవితానికి మరొకరు బాధ్యత వహించడం, అనేది లేకుండా పోతున్నది. ఒకవిధంగా యిది వ్యక్తి స్వాతంత్ర్యం పరాకాష్ఠ చెందే పరిస్థితి. తత్ఫలితంగా కలిగే దుఃఖమూ, ఆవేదనా, వ్యక్తిగతంగానూ సామాజికంగానూ ఎంతో మేర వుంటాయి. కాని యుగం మారుతూ ప్రస్ఫుటమవౌతున్న యీ ధోరణిని అరికట్టే మార్గంలేదు—అన్న కఠిన సత్యాన్ని గుర్తించి ప్రతి వ్యక్తి తన భారాన్ని వహించేందుకు సిద్ధం కావడమే కర్తవ్యం, లేకపోతే క్లేశం ఎలాగూ తప్పదు.

## 2. ఆర్థిక మానవుడు

ఆర్థిక మానవుని ప్రాబల్యం నేడు సర్వత్రా కన్పిస్తున్నది. అంటే జీవితంలో నేడు ధనేషణ ప్రధానంగా ఉంటున్నది. ఈ శతాబ్దిలో ఆర్థిక-రాజకీయ వ్యవస్థ మీద మార్క్సు ప్రభావం విస్తృతంగా ఉన్నది. మన దేశంలో స్వాతంత్ర్యం వచ్చేనాటా రాజకీయమానవునిమీద గాంధీజీ ప్రభావమే ఎక్కువగా ఉండేది. మార్క్సువాదం ప్రకారం, సంస్కృతీ, అభిరుచులూ, సమాజంలో ధనిక, దరిద్రవర్గాలలో కేవలం ఆర్థిక వ్యవస్థను బట్టి ఏర్పడుతవి. అంటే ధనిక వర్గంవారి సంస్కృతీ, అభిరుచులూ, వారి ఆధిక్యాన్నీ, అవకాశాలనూ, అధికారాన్నీ పరిరక్షించుకోవడానికి, ఏర్పడి, తదనుగుణంగా ఉంటున్నవే తప్ప, వాటికి స్వతహా ఉత్కృష్టతా, విలువా లేదనీ, ఉందనిలనటం మోసగించడమే నని ఒక వాదం. ఆ విధంగాచూస్తే మతం అనేది నిద్రపుచ్చడానికి ఒక మత్తుమందు మాత్రమే; ఉదారవాదం లేక మానవతాదృక్పథం (Liberalism) కూడా క్రిందివర్గాల ప్రతారణకోసమే! తీరికఉన్న వర్గాలవారికి వ్యక్తిగతంగా పథ్యమైన భావనాత్మక, సాంస్కృతిక, సాహిత్యక అభిరుచులన్నీ బలహీనతలుగా, సమాజసమష్టి శ్రేయోవిరుద్ధప్రవృత్తులుగా, లెక్కించటం జరిగింది. ఇటువంటి విమర్శ క్రిందివర్గం వారిలో ఆత్మవిశ్వాసాన్ని పురికొల్పటానికి (తాము అనాగరికులము, సంస్కార విహీనులము, తక్కువవారము అనే అల్పత్వ భావాన్ని పోగొట్టడానికి) ఉపయోగించింది. ధైర్యంగా సామాజిక విప్లవానికి నడుంకట్టడానికి లాభించింది. కాని యిలా జరగటంలో ఏర్పడిన ఫలితం మాత్రం విచిత్రంగా ఉన్నది. ఫలితమేమంటే ప్రతిమనిషిలోనూ అంటే సంస్కృతి వాసనలు ఉన్న పైవర్గం వారిలోకూడా, ధనమే సర్వోత్కృష్టమైన, సర్వప్రధానమైన విలువ, లక్ష్యం అనే విశ్వాసం ఏర్పడడం. అందువల్ల నేటి మానవుడు ఏ వర్గంలో, ఏ రంగంలో, ఏ స్థితిలో, ఏ ఉద్యోగంలో ఉన్నా అతనికి ధనేషణే ముఖ్యం అయిపోయింది. మతము: దాని సంస్థలు-ప్రచారము; సాహిత్యం: దాని రచనా, ప్రచురణా; కళ: నాట్యమూ, సినిమా; ప్రేమ: వివాహము; విద్య: వైద్యమువంటి రంగాల్లో హృదయోల్లాసము, మానసిక వికాసము, దైహిక సంక్షేమము, విజ్ఞానమూ, సేవా ప్రధాన సూత్రాలు కావలసిన సందర్భాల్లో—ఆయా సంస్థల్లో

వాటి కార్యభారం నిర్వహించే వ్యక్తుల్లో, ధనేషణే తప్ప నేడు మరేమీ కన్పించడంలేదు. పూర్వం యీ రంగాల్లో ధనస్పర్శ లేకపోలేదు. కాని అది ఉండవలసిన మోతాదులో దానిమేరకు అది ఉండేది. ఆ సంస్థ లేక ఆ శాఖయొక్క ధ్యేయానికీ కర్తవ్య నిర్వహణకూ భంగం కలిగించే విధంగా ఉండేదికాదు. నేడు ధనేషణ తర్వాతే ధ్యేయమూ కర్తవ్యమూ. అందుకే డబ్బు కొరతలేకుండా ఖర్చవుతున్నా అన్ని రంగాల్లోనూ, ఫలితం అసంతృప్తికరంగానే ఉంటున్నది.

పై జెప్పిన లక్షణం రాజకీయాల్లో మరి స్పష్టంగా కనిపిస్తూ రాజకీయాలను కలుషితం చేస్తున్నది. స్వాతంత్ర్యం రాకపూర్వం రాజకీయాలు దేశ సర్వతోముఖాభివృద్ధి లక్ష్యంగా నడచిన ఉద్యమం. ఆ సర్వతోముఖాభివృద్ధిలో ఆర్థికాభ్యుదయం ముఖ్యభాగమే అయినా, ఒకభాగం మాత్రమే. గాంధీ దృష్టిలో భారతదేశం అంతర్జాతీయ రాజకీయాల్లో అహింసా పద్ధతికి మార్గదర్శియై తన వైశిష్ట్యాన్ని నిరూపించుకోవాలన్న ధ్యేయం దేశాభ్యుదయంలో ఒకానొక భాగం. రవీంద్రుని దృష్టిలో భారత సంస్కృతి ఇతర దేశాలకు ఆధ్యాత్మిక సందేశాన్ని యివ్వగలగడం ఒక ధ్యేయం. ఇవన్నీ నేడు విస్మరింపబడినవి. ఆర్థికాభ్యుదయంకూడా నేడు సమష్టి సంక్షేమంగా కాకుండా రాజకీయవర్గాల ధనేషణగా మారి, చివరకు రాజకీయవాదుల ధనేషణగా దిగజారి పోయింది. వారి ననుగమిస్తూ అన్ని రంగాలలోని ప్రజలూ ధనేషణనే ప్రధాన ధ్యేయంగా పరిగణించటం జరుగుతున్నది.

ఈ పరిస్థితిలో ఆధునికత ఏవిధంగా ఉన్నది? విపరీతంగా పెరిగిన ధనేషణపట్ల యువతరంవారిలో కలుగుతున్న వైముఖ్యం జీవితాన్నిగూర్చి క్రొత్త అనుభూతి మార్గాలు అన్వేషించడంగా వ్యక్తమవుతున్నది. జెట్—సెట్, హిప్పీలు, బీటిల్స్ యితర దేశాల్లో యీ పరిణామాన్ని సూచిస్తున్నారు. ఇక్కడ కూడా ఇంద్రియ సుఖాన్వేషణ, విశృంఖలజీవితమూ క్రమంగా ధనేషణకంటే ప్రాధాన్యం వహించే సూచనలు కన్పిస్తున్నాయి. దేశంలో దారిద్ర్యం తీరకపోవడంవల్ల పై సూచనలు ప్రస్ఫుటం కావడానికి మరొక పది, ఇరవై ఏళ్లు పట్టవచ్చు. ధనేషణకు తరువాతి పరిణామం విశృంఖలమైన సుఖాన్వేషణం అనే మాట మాత్రం నిశ్చయం. ఇది రాబోయే యుగలక్షణం. ధనేషణ ప్రాబల్యం తగ్గిపోయేందుకు కారణం వ్యక్తిలో సహజంగా కలిగే వైముఖ్యమే కాదు. నేడు సామాజికంగా ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థలో చేస్తున్న మార్పు అంతకంటే ముఖ్య కారణం అవుతుంది. ఒక స్థాయికి మించిన రాబడిని పన్నుల రూపేణా ప్రభుత్వపరం చేసుకోవడం; ఆస్తిపాస్తుల విషయంలోనూ అలాగే చెయ్యడం; కనీస వేతనం, కుటుంబానికి పెన్షన్ ఇన్సూరెన్స్ ఏర్పాట్లతో ఎవరికిగాని జీవనభృతికి లోటు లేకుండా చెయ్యడం—ఈ మార్పులతోబాటు సంపాయించిన ఆస్తినీ, ధనాన్నీ, వారసులకు అందించే పరిస్థితి లేకపోవటంతో మనిషి తప్పనిసరిగా ధనేషణనుంచి మళ్లినవాడై లనుభవవైవిధ్యంకోసం క్రొత్త మార్గాలలో సుఖాన్వేషణ చెయ్యటం జరుగుతుంది. నేటి యువతరంవారిలో మద్యం సేవించడం, విలాస జీవనం గడపడం ఎక్కువ అవుతూ ఉన్నట్లు ఒక అంచనా. క్రమంగా యల్. యస్. డి. (L. S. D.), మార్‌జువానా (Marjuana) కూడా ఉపయోగానికి వస్తాయనటంలో సందేహంలేదు.

విద్యార్థి లోకంలో రాజకీయ సంచలనమూ, తిరుగుబాటూ, విప్లవమూ నేడు ప్రపంచ వ్యాప్తంగా కనిపిస్తూ ఉన్నది. మనదేశంలో ప్రథమంగా స్వాతంత్ర్యోద్యమంలో విద్యార్థులు రాజకీయాల్లో ప్రవేశించారు. తర్వాత సోషలిజం మార్క్సిజం వారిని ప్రభావితుల్ని చేస్తూ వచ్చింది. ఇటీవల వచ్చిన మార్పు విద్యార్థులు తమ అలజడిని విధ్వంసకకాండగా, దానికదే సార్థకం అనే ధోరణిలో సాగిస్తూవుండటం. ఇక్కడ ఏ 'యిజం' ప్రభావమూ, ఉద్యమప్రభావమూ నిర్దిష్టంగా లేదు. అమెరికాలో వియత్నాం యుద్ధం, ఫ్రాన్సులో విశ్వవిద్యాలయ వ్యవస్థలో మార్పులు అక్కడి విద్యార్థులు సాగించిన ఉద్యమాలకు కారణాలు. మనదేశంలో కారణాలనేవి ఎక్కడి కక్కడే కోకొల్లలు. అర్థంపర్థంలేని కోరికలూ, వ్యక్తులపట్ల విద్వేషాలూ, రాజకీయవాదుల కోసం చేసిపెట్టే అల్లర్లు వగైరాలుగా యీ కారణాలు కనిపిస్తాయేగాని అవి అన్నీ ఒక ఉద్యమ స్వరూపాన్ని నిర్ణయించే విధంగా లేవు. కాని విద్యార్థుల అలజడి వెనుకఉన్న ఒక సత్యాన్ని మాత్రం గుర్తించక తప్పదు. అదేమంటే యువత దేశంలోని ప్రస్తుత పరిస్థితులమీద, వ్యవస్థలమీద, జుగుప్స చెంది తిరుగుబాటు చేస్తున్నది. ఆ తిరుగుబాటుకి కర్తవ్యోన్ముఖమైన నిర్దిష్ట స్వరూపం లేకపోవచ్చుగాని 'మార్పు'ను వాంఛించే ప్రవృత్తి మాత్రం స్పష్టంగా ఉన్నది. మొదటిది: విశ్వ విద్యాలయ వ్యవస్థలో మార్పు—ఉన్నత విద్య ధ్యేయం శతాబ్దాల విజ్ఞానాన్ని అందజెయ్యడం మాత్రమేనా? నేటి సామాజిక విప్లవానికి విశ్వవిద్యాలయమే కేంద్రమూ సాధనమూ ఎందుకు కాగూడదు? అనే ప్రశ్న వస్తున్నది. "తత్త్వశాస్త్రమంటే విశ్వాన్ని అవలోకించి వర్ణించే శాస్త్రంగా యిన్నాళ్లూ ఉన్నది. ఇకనుంచీ అది లోకాన్ని మార్చే తారువారు చేసే సాధనంగా వృద్ధిపొందాలి" అనే భావాన్ని మార్క్స్ ఒకచోట వెలిబుచ్చాడు. నేటి విద్యార్థులు విశ్వ విద్యాలయ వ్యవస్థలో కూడా అటువంటి మార్పునే కోరుతున్నట్లు గోచరిస్తుంది. రెండవది: నాయకత్వంలో మార్పు. సోషలిజం—మార్క్సిజంమీద ఒక అర్ధ శతాబ్దంగా దేశం ఆశలు పెంచుకున్న తర్వాత, స్వాతంత్ర్యం వచ్చి యించుమించు పాతిక శతాబ్దం గడచిన తర్వాత, ఆశించిన మార్పు లేవీ రాకపోవడంతో నేటి యువతరానికి పెద్దవాళ్ళు అంటే నలభై—డెభ్భై ఏళ్ల వయస్సు గలవాళ్ల నాయకత్వంమీద నమ్మకం పోతున్నది. విప్లవ నాయకత్వం ముప్పైఏళ్లకు లోబడినవాళ్లే, అంటే విశ్వ విద్యాలయ విద్యార్థులే చేపట్టాలనే నమ్మకం కుదురుతున్నది. విప్లవానికి తగిన పౌరవ, ఉద్వేగం, చేవ ముప్పైఏళ్ల వయస్సు

తర్వాత తగ్గుముఖం పట్టి, వ్యక్తి ఎంత విప్లవకారుణ్ణని చెప్పుకుంటున్నా, మాటలు చెప్పడానికే తప్ప విప్లవానికి నాయకుడుగా పనికి రాడనే అభిప్రాయం నేడు కలుగుతున్నది. ఈ అభిప్రాయంలో ఎంత సబబు ఉన్నదో చెప్పటం కష్టమే, కానీ, యువ తరం మాత్రం యీ విశ్వాసాన్ని ఏర్పరచుకుంటున్నది. అందుకే "విద్యార్థుల శక్తి" (Student power) అనే దాన్ని ఒక్కదాన్నే సాంఘిక విప్లవ శక్తిగా వారు భావిస్తున్నారు. ఈవిధంగా పై తరంవాళ్లనిమీద అపనమ్మకం, నేటి వ్యవస్థలన్నిటిమీదా జుగుప్స, మార్పుకోసం తీవ్రమైన ఆకాంక్ష; ఆ మార్పు స్వరూపాన్ని నిర్వచించలేని అశక్తత—యివీ నేటి యువతరానికి చెందిన ఆధునిక రాజకీయ మానవుని లక్షణాలు. విశ్వాసమూపార్జన కంటే రాజకీయాలే పై చెయ్యి కావడం యిక్కడ ఆధునికత. ఈ పరిస్థితినే తెలుగు సాహిత్యరంగంలో దిగంబర కవిత్వం ప్రతిబింబిస్తున్నది.

అయితే యువతరంలో రాజకీయ మానవుని ప్రాబల్యమే తప్ప మరొక్కటి లేదనుకోవడం కూడా పొరపాటు. పూర్వమే చెప్పినట్లు ఇంద్రియ సుఖాన్వేషణ కూడా ఉన్నది. అవీ ఒక వైపూ, విప్లవాకాంక్ష మరొకవైపూ, సమంగా తూగుతూ ఉన్నాయని చెప్పాలి. అంటే వచ్చే యుగంలో ఆర్థిక మానవుని ప్రాబల్యం తగ్గి రాజకీయ మానవుడు శృంగార మానవుడు యించుమించు సమానమైన ప్రతిపత్తిని పొందుతూ సరికొత్తగా రూపం దిద్దుకుంటారనటంలో సందేహం లేదు.

### 3. శృంగార మానవుడు

భావనాత్మక సాహిత్యము ప్రతిపాదించిన "ప్రేమ" వ్యక్తినిష్ఠమే అయినా ప్రచారం మూలంగా దానికి వివాహ వ్యవస్థతో సంబంధం ఏర్పడి, వివాహానికి ప్రాతిపదికగా గ్రహింపబడింది. నేటి వ్యవహారంలో యీ 'ప్రేమ'కు నిర్వచనం, స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ అని మాత్రమే. అంతకంటే విశేషార్థం అన్వయించదు. ఈ "ప్రేమ" ఎంత అస్థిరమైనదో జీవితానుభవంలో తెలిసి వస్తున్నది. ప్రేమ స్థిరత్వానికి లేక అస్థిరత్వానికి వ్యక్తి బాధ్యత ఎంతవరకు? అనే ప్రశ్నకు ఫ్రాయిడ్ సిద్ధాంతం అన్వయించవల్ల బాధ్యత లేదు అనే సమాధానమే సిద్ధిస్తున్నది. ఇది ఆధునికత. ఈ శతాబ్దిలో, ఆర్థిక—రాజకీయ మానవుని విషయంలో మార్క్స్ ప్రభావంలాగే, సెక్స్ విషయంలో ఫ్రాయిడ్ ప్రభావం ఎక్కువగా ఉన్నది. చిన్నతనంలో పరిసరాలలోను తల్లిదండ్రులతోను ఒక వ్యక్తికి ఉన్న సంబంధాన్నిబట్టే ఆ వ్యక్తి తర్వాతి సెక్స్ ప్రవర్తన నిబద్ధమవుతున్నది, అనే విశ్వాసం ఫ్రాయిడ్‌నుంచీ వచ్చింది. అందువలన ఒక వ్యక్తి మనోధర్మం శైశవావస్థలోనే ఒక రకంగా తీర్చిదిద్దబడినప్పుడు ఆ వ్యక్తి పెద్దవాడైన తర్వాత అతని ప్రవర్తనకు ఎంతవరకు బాధ్యుడు? అంతేగాక సాంఘికమైన నియమాల ద్వారా, ఏర్పాట్లద్వారా, వ్యక్తి జీవితాన్ని కఠినంగా నిబద్ధం చేస్తే అందువల్ల కలిగే బాధా, వ్యక్తి వికాసానికి అవరోధమూ, సమర్థనీయమేనా? అనే మరొక ప్రశ్న ఉదయిస్తుంది. ఈ విధమైన దృక్పథం క్రమంగా, దానిమూలం ఫ్రాయిడ్ అని తెలిసినా తెలియకపోయినా, లోకంలో వ్యాప్తికి వచ్చింది. తెలుగు దేశంలో చలంవంటి భావనాత్మక అతివాద రచయితలు సెక్స్‌ని ఒక సహజమైన స్వచ్ఛందమైన సుఖానుభూతిగా చిత్రించే ప్రయత్నం చేశారు. దాన్ని ధనంతో, నైతిక నియమాలతో కుల మత భేదాలతో వావి వరుసలతో సామాజిక వ్యవస్థాబద్ధం చెయ్యడం న్యాయంకాదని చలం ప్రతిపాదించాడు. పాశ్చాత్య దేశాల్లో ఫ్రాయిడ్ ద్వారా కలిగిన ప్రభావమే తెలుగుదేశంలో చలంవంటి రచయితల ద్వారా వృద్ధి పొంది సెక్స్‌పట్ల ఒక ధారాళమైన దృక్పథం ఏర్పడింది. స్త్రీ విద్య, స్త్రీ జనోద్ధరణ, స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యంవంటి ఉద్యమాలు, స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీ పురుషులు కలిసి మెలిసి వ్యవహరించిన అవకాశాలూ పై దృక్పథానికి దోహదం చేశాయి. దేవదాసీ వ్యవస్థను రద్దు చేయడంతో వ్యభిచారం, నైతిక వ్యతిక్రమణ పోయినాయి అనుకోవడం ఒక భ్రమ. 1947 తర్వాత క్రమంగా ధనేషణ జీవితంలో ప్రాధాన్యం వహించడంతో, సెక్స్ కూడా ధనేషణకు సాధనంగా రూపొంది వ్యభిచారం వివిధ రూపాలలో విజృంభించింది అనడంలో అతిశయోక్తిలేదు. పోతే సెక్స్‌తో నైతిక వ్యతిక్రమణ ప్రతిదాన్నీ వ్యభిచారం అనడానికి వీల్లేదు. సెక్స్ జీవితంలో నేడు పూర్వపు ధార్మిక నియతి చాలవరకు శైథిల్యం పొందినదనే చెప్పాలి. ఒక వైపు వరకట్నంవంటి దోషాలు ధనేషణమూలంగా వివాహ వ్యవస్థను అంటిపెట్టుకుని మరింత పెరగటమే కాకుండా, తత్ఫలితంగా వివాహానికి నోచుకోక రక రకాలుగా జీవనోపాధి గడించుకునే ప్రయత్నం చేసే యువతుల సంఖ్యను పెంచాయి. అటువంటి స్త్రీల సెక్స్ జీవితాల్లో వారి వారి పరిస్థితులనుబట్టి అశాంతి, అరక్షణ, అవ్యవస్థ ఏర్పడింది. కేవలం గృహిణిగాకాక సమాజంలో విశిష్ట పాత్ర నిర్వహింపబూనుకునే ప్రతి స్త్రీకి ఏదో ఒక ధార్మిక సమస్య సేమ తప్పడంలేదు. ఇలా కలుగుతున్న క్లేశం పూర్వం వ్యవస్థాబద్ధం కావడంవల్ల స్త్రీ వ్యక్తిత్వానికి కలిగిన బాధకంటే తక్కువదేమీ కాదు. సెక్స్ సంబంధాల్లో అవ్యవస్థ స్త్రీకే ఎక్కువ బాధ కలిగిస్తున్నది. నేటి నవలలూ, కథలూ, యీ పరిస్థితిని ప్రతిబింబిస్తూ ఉన్నాయి.

ధనేషణ అంటే క్రమంగా ఇంద్రియసుఖాన్వేషణ ప్రాధాన్యం వహించే సమాజాన్ని గురించి ఇదివరకే ప్రస్తావించాను. ఆ సూచనలు ముఖ్యంగా నేటి సినిమాలలో కనిపిస్తున్నాయి. కళ జీవితాన్నీ, రాబోయే జీవితాన్నీ ప్రతిబింబిస్తుంది అనడంలో సందేహంలేదు. నేటి సినిమాలో సమస్య, కథ, సన్నివేశము ప్రాధాన్యం కోల్పోయి స్త్రీ పురుషులు సన్నిహితంగా వ్యవహరించే దృశ్యాలు, స్త్రీల అర్ధ నగ్న నాట్యాలు ప్రాముఖ్యం వహించాయి. ఖోస్లా కమిటీ నివేదిక ముద్దు పెట్టుకోవడాన్నీ, నగ్నతా దృశ్యా

లని అనుమతించింది. కేవలం సెక్స్‌ని అందించే పుస్తకాలమాట చెప్పనక్కరలేదు. ఇంద్రియ సుఖాన్వేషణ, అందులో సెక్స్ సుఖాన్వేషణ మరింత విశృంఖలత్వాన్ని పొందే సూచనలు ఎన్నో ఉన్నాయి. దీనికి కుటుంబ నియంత్రణ ప్రచారమూ, ఆ సాధనాల సరఫరా మరింత దోహదం చేస్తుంది. నేటి యువతరం వారు క్రమంగా (*Permissive Society*) విశృంఖల సమాజంవైపు పయనిస్తున్నారు అనడంలో సందేహంలేదు. ఇది అవాంఛనీయమని ఎవరు ఎలా బాధపడ్డా, మారుతున్న యుగ లక్షణమైన యీ ధోరణిని అరికట్టే మార్గం ఏదీ కనిపించదు!

ఒకవిధంగా చూస్తే సెక్స్ వ్యవహారాల్లో స్వేచ్ఛ మరింతగా సాగి విశృంఖలత వస్తే తప్ప మళ్లీ వైవాహిక వ్యవస్థ సహజంగా ధర్మబద్ధం కావడం జరగదేమో అని తోస్తుంది. మన దేశంలో స్త్రీ పురుషులు సామాన్య సాంఘిక వ్యవహారాల్లో—విద్యా సంస్థల్లో, ఆఫీసుల్లో, కర్మాగారాల్లో—కలుసుకుంటూ ఉన్నప్పటికీ, నేటికీ సెక్స్ తాలూకు "కుళ్లు" బుద్ధి (**Repression and jealousy resulting in scandal mongering**) క్షాళితంకాలేదు. స్త్రీ పురుషులు సహజంగా, అంటే వ్యక్తులుగా, స్నేహపూర్వకంగా కలుసుకునే క్లబ్బులుగాని సరదా సమావేశాలు (Socials) గాని మనకు లేవు. బస్సులో, సినిమాలో, అపరిచిత స్త్రీ అపరిచిత పురుషుని ప్రక్కన కూర్చోడానికి బయపడుతుంది. ఈ అసహజమైన "కుళ్లు" వదలడానికి సెక్స్‌లో మరింత విశృంఖలత ప్రబలి, సెక్స్ మొగం మొత్తితే తప్ప వేరుదారి లేదేమో! సెక్స్‌లోని అసహజమైన లీనత, ఆకర్షణ, అప్పటికిగాని పోదు. అలా సెక్స్ యొక్క సహజత్వాన్ని దర్శించిన మానవుడు, కనబడ్డ చీరకొంగు వెంటబడకుండా వివాహ వ్యవస్థ మీద గౌరవం పెంపొందించుకుంటాడు. ఇదంతా కేవలం ఒక అభిప్రాయంగాని వూహాగానం కాని కాదు. అమెరికాలో యువతరంవారిలో "హిప్పీ"లుగా వ్యవహరిస్తున్నవాళ్లు యీ రకమైన ప్రయోగాల్నే చేస్తూ ఉన్నారు. యూరప్‌లో కొన్ని విశ్వవిద్యాలయాలలో విద్యార్థి విద్యార్థినులు తాత్కాలికమైన వివాహబంధంవంటిది ఏర్పరచుకొని జంటలుగా లాడ్జిలో వుంటూ సంసారంచేస్తూ చక్కగా చదువుకుంటూ (అటువంటి ఏర్పాటు చదువుకు దోహదమట) నాలుగైదేళ్లు గడిపి తర్వాత యిష్టంవుంటే ఆ వివాహాన్ని ఖాయం చేసుకోవడం, లేకపోతే ఎవరిదారిన వాళ్లు వెళ్లడం చేస్తున్నారు. కొమార్తె వివాహాత్పూర్వమే గర్భవతియై ఇంటికి వస్తే ఆ అమ్మాయికి పురుడుపోసి ఆ మనుమసంతానాన్ని పోషించే బాధ్యత ఆమె తలిదండ్రులే సంతోషంగా వహిస్తున్నారు. ఈ ఆచారం ఇప్పుడు సాంఘికమైన ఆమోదాన్ని గూడా క్రమంగా పొందుతున్నది. ఇవన్నీ మనకు విపరీత ధోరణులుగా ఇప్పుడు తోచవచ్చు. కాని రేపు మన ధోరణులు కూడా ఇలాగే ఉంటాయేమో!

రాను రాను శ్రేయోరాజ్యము వ్యక్తి మంచి చెడ్డల భారాన్ని వహిస్తూ వచ్చేప్పటికి పై జెప్పిన స్వేచ్ఛాశృంగారమానవుని మూర్తి స్పష్టంగా బహిర్గతం అవుతుంది. కమ్యూనిస్టు దేశమైన హంగరీలో నేటి పరిస్థితిని గూర్చి 'సెక్స్ సమస్య'లు అనుపేర "హంగేరియన్ క్వార్టర్లీ" నుంచి ఒక వ్యాసాన్ని అనువదించి "భారతి" పత్రిక 1965 లో ప్రకటించింది. అందులో హంగరీ ప్రజల సెక్స్ జీవితంలో వచ్చిన మార్పునిగూర్చి యిలా ఉన్నది: "విచిత్ర మేమిటంటే జీవనోపాధి సమస్య తీరిపోతూ వచ్చినప్పటినుంచీ భార్యా భర్తలమధ్య విడాకులు ఎక్కువైనై. జీవితంలో మరో వ్యక్తిని తోడు నీడగా పొందలేక ఏకాంతంగా ఏకాకిగా కాలం గడపవలసి వచ్చేవారి సంఖ్య కూడా ఎక్కువైంది. ఇద్దరు వ్యక్తుల్ని బంధించిఉంచటంలో పూర్వం ఆర్థికమైన హేతువులు చూపే ప్రభావం యిప్పుడు నశించిపోయింది. కూడా గుడ్డకోసం విధిగా వివాహం చేసుకోవలసిన అవసరం ఏ అమ్మాయికీ నేడు లేదు. అవతలి వ్యక్తికి ఎంత డబ్బు ఉన్నది అనే దృష్టితో ప్రియుణ్ణిగాని, ప్రేయసినిగాని ఎన్నుకునే పరిస్థితి నేడు ఎవరికీ లేదు. ఇలా ఆర్థికమైన ఒత్తిడి లేకపోగానే, వ్యక్తి హృదయగతభావాలు ప్రాముఖ్యం వహిస్తున్నాయి." ఇలా పరిస్థితి మారినప్పుడు వ్యక్తికి స్వేచ్ఛ లభించినప్పుడు, సెక్స్ ప్రవర్తనకు సంబంధించిన ధర్మ ప్రమాణాలలో మార్పు తప్పనిసరి అవుతుంది. ఆ మార్పు సంకల్పించి తీసుకరాకపోతే వ్యక్తికీ సమాజానికీ ఆవేదన, క్లేశం తప్పదు. హంగరీలో అటువంటి ధార్మికమైన మార్పు విషయమై జరిగిన చర్చ పై వ్యాసంలో ఉన్నది. అందులో బైబర్ హుజార్ అనే మేధావి యిలా అన్నాడు: "ఈ నాటి సమాజాల్లో మానవ సంబంధాలు సంకీర్ణంగా అనంత వైవిధ్యంతో రూపొందాయి. ఆజ్ఞావచనం (**Ten commandments**) ఇరుకు గోడల్ని ఛేదిస్తూ జీవితం బహుముఖాల విస్తరిల్లింది. నీతులు చెప్పే ప్రశ్నోత్తరావళి కాదు నేడు కావలసింది. ప్రవర్తనకూ పరస్పర వైయక్తిక సంబంధాలకూ అన్వయించే ప్రధాన సూత్రాల సంఖ్యను పరిమితం చేసి వాటిని స్పష్టం చెయ్యటం అవసరం. వాటినిబట్టి వ్యక్తి—ఆ వ్యక్తి గుణదోషాల్ని పరిశీలించే సమాజమూ—ఆ యా పరిస్థితుల్లో ఆ వ్యక్తి ఆవిధంగా వ్యవహరించడం తప్పో ఒప్పో అనే నిర్ణయాన్ని స్వయంగా చేసుకునేందుకు వీలుగా ఆ సూత్రాలు అమరాలి. తద్ద్వారా భవిష్యత్తులో వ్యక్తి స్వయం నిర్ణయశక్తీ, బాధ్యతా, ఇతోధికంగా అభివృద్ధి చెందుతాయి." అంటే ధార్మిక వ్యవస్థయొక్క బాధ్యతాభారం సమాజంమీదకంటే వ్యక్తిమీదే క్రమంగా ఎక్కువ అవుతుంది అని సూచన. నూతన శృంగార మానవుని సమస్య అమెరికావంటి దేశాలలోనే గాక కమ్యూనిస్టుదేశాలలోను ప్రారంభమైందని గ్రాహ్యం. **ఇది మానవాళి ప్రవేశిస్తున్న క్రొత్త యుగానికి నాంది.**

నేటి తెలుగు సాహిత్యంలో శృంగార మానవునికి నూత్న ధార్మిక ప్రమాణాలను గూర్చి చర్చించే ముందుచూపు ఎంత వరకూ ఉన్నది? సెక్స్ వర్ణనలతో నిండిన నవలలూ, కథలూ ఒక వైపు వస్తూవున్నవి. అవి సెక్స్ విషయమై వ్యక్తిగతమైన ధర్మప్రమాణాల ఆవశ్యకతను సూచించటంలేదు. గోపీచంద్ వ్రాసిన "పిల్ల తెమ్మెర", "గడియపడిన తలుపులు", 'మెరుపుల మరకలు', 'యమపాశం' నవలల్లో కొంత ఆ ప్రయత్నం సాగింది. బుచ్చిబాబు నవల 'చివరకు మిగిలేది', అతని కథలూ చాలా మదికి వచ్చాయి. కాని వాటిలో వ్యక్తమవుతున్న నూతన ధర్మ ప్రమాణాలని ఎవరూ గుర్తించిన జాడ లేదు. గోపీచంద్ చిత్రించిన 'కోటేశ్వరమ్మ', 'శమంతక మణి', 'ఉషారాణి', బుచ్చిబాబు 'కోమలి', 'అమృతం', సెక్స్ విషయంలో క్రొత్తయుగపు వ్యక్తులు. ఇక్కడ వీరికీ చలం చిత్రించిన 'రాజేశ్వరి' (మైదానం) 'అరుణ' వంటి స్త్రీలకూ గల భేదాన్ని ముఖ్యంగా గమనించాలి. చలం పాత్రలు స్వేచ్ఛతప్ప వేరే ధర్మ నిర్ణయం ఎరుగని, భావనామయ ప్రపంచానికి చెందిన పాత్రలు. సమాజంలో ఇముడక అతీతంగా వెళ్లే పాత్రలు. గోపీచంద్, బుచ్చిబాబు పాత్రలు సమాజంలో ఇముడటానికి ప్రయత్నించేవి. నా నవల 'అసురసంధ్య' లోనూ క్రొత్త యుగపు పోకడలు, ధర్మనిర్ణయ సమస్యలు చర్చకు వచ్చాయి. సాహిత్యంతో పాటు కళలలో కూడా మార్పు తప్పదు. సుఖలోలత్వానికే రూపొందుతూవున్న నేటి కళలు (సినిమా, నృత్యమువంటివి) క్రమంగా ఒక విశేష మనస్స్థితిని ప్రతిపాదించేలాగా ముందుముందు తయారవుతాయి. **Psychedelic art** అనేది అమెరికాలో **L. S. D.** సేవించిన వాళ్లు సృష్టిస్తున్న కళకు పేరు. **Surrealism** లాగా వాస్తవికతను దాటి, దానికి అతీతమైన భావనా లోకాల్లో విహరిస్తూ, కళ మనస్సుయొక్క జాగ్రదవస్థకంటే దాని స్వప్నసమాధ్యవస్థల్ని ఎక్కువగా ప్రతిబింబిస్తూ ఉంటుంది. ఇది సాహిత్యంలో కళల్లో ఆధునికత.

## 4. ఆధ్యాత్మిక మానవుడు

ఏ యుగంలోనైనా నిజమైన ఆధ్యాత్మిక మానవుల సంఖ్య తక్కువగానే ఉంటుంది. అందరూ మోక్షాన్ని కోరాలి. అందరూ అందుకు ప్రయత్నం చెయ్యాలి అనేవి మత ప్రచార నినాదాలు. మతం వేరు. ఆధ్యాత్మికత వేరు. ధార్మిక మానవుడు, ఆర్థిక మానవుడు, శృంగార మానవుడు యుగలక్షణం దృష్ట్యా అలా భాసిస్తూనే, లోక వ్యవహారాల్లో పాత్ర నిర్వహిస్తూనే ఆధ్యా

త్మిక మానవుడుగా ఉండవచ్చు. సంఘంలో ఆధ్యాత్మికత ఏస్థాయిలో వున్నదని నిర్ణయించడం గాని అంచనా వెయ్యడంగాని కష్టం. మత ప్రచారకులూ, ధర్మబోధకులూ, సంప్రదాయజ్ఞులు, సన్యాసులూ పుష్కలంగానే కనిపిస్తూవుంటారు. వీరందరూ ఆధ్యాత్మిక మానవులని అనుకోవడం పొరపాటు. వీరిలో చాలమంది ధార్మిక, లేక ఆర్థిక, లేక శృంగార మానవులుగా ఉండవచ్చు. మానవ జీవితానికి ప్రయోజనమూ ప్రాతిపదికా నిర్ణయించడంలో మనస్తత్వ శాస్త్రంలో ఫ్రాయిడ్ తృతీయ పురుషార్థాన్నీ, అడ్లర్ ద్వితీయ పురుషార్థాన్నీ ఎంచుకున్నారు. నేటి మనస్తత్వ శాస్త్రజ్ఞులు పై రెండింటితోపాటు ప్రథమ పురుషార్థమైన ధర్మాన్ని కూడా ఎంచుకుంటున్నారు. వ్యక్తి స్వధర్మాన్ని గుర్తెరగటమే అతని మనస్తత్వానికి కీలకమైన విషయంగా భావిస్తున్నారు. అది ఎరక్కపోవటమే అతని క్లేశానికి కారణం అంటున్నారు. ఇది ఆధునికత. నేటి యుగంలో ధర్మ నిర్ణయ సమస్యకూ మానవుని మనశ్శాంతికీ గల కీలకమైన సంబంధాన్ని ఇది సూచిస్తున్నది. విక్టర్ ఫ్రాంక్ అనే మనస్తత్వ శాస్త్రజ్ఞుడు 'వ్యక్తికి స్వధర్మం తెలిసినప్పుడే జీవితం తనదిగా, కష్టమైనా,సుఖమైనా తృప్తినిస్తుంది' అంటున్నారు. ('We may define the existential vacuum as the frustration of the most basic motivational force of man — the will to meaning, in contrast to the Adlerian's will to power and Freudian's will to pleasure. People do not care so much for pleasure and avoidance of pain, they do care for meaning.... happiness must issue as a side-effect of meaning fulfillment.'- Vicktor E. Frankl-Encounter, November 1969) కానిస్వధర్మం నిర్ణయించుకోగలస్థితిని పొందినప్పటికీ మానవ జీవితంలో అర్థంకాని భాగం ఇంకా మిగిలే ఉంటుంది. తను చేసే కర్మలో తన ధర్మనిర్వహణతో, బాధ్యతతో, ప్రమేయం లేకుండా సంభవించే అనుభవాల్ని మనిషి ఎలా అన్వయం చేసుకోవాలి? వాటిని యాదృచ్ఛికమనీ, దైవికమనీ వ్యవహరిస్తూ వుంటాం. ఒక స్త్రీ తన కుమారుడు హఠాత్తుగా మరణించడంచూచి అంతులేని ఆవేదనకు గురియైంది. ఆమె పొందే బాధను ఏ ధర్మంతోనూ అన్వయించడానికి సాధ్యం కాదు. ఇక్కడ శాస్త్రజ్ఞుడు విక్టర్ ఒక సామ్యం చెప్పాడు. ఒకానొక కోతిని శాస్త్ర పరిశోధనలో మానవులకు కావలసిన రోగ నివారణౌషధం కనిపెట్టడంకోసం మాటిమాటికీ సూదితో పొడిచి రక్తంతీస్తూ ఉంటారు. ఆ కోతి అనుకుంటుంది "ఈ యాదృచ్ఛికమైన అకారణమైన బాధ ఏమిటి నాకు? ఇంకా ఎన్నిసార్లు అనుభవించాలో" అని. దానిబాధకూ మానవలోకంలో ఒకానొక ప్రయోజనానికీ సంబంధం ఉన్నదని దాని కెట్లా తెలియటం? ఎట్లా తెలియజెప్పటం? వీలు కాదన్న మాట! అలాగే పై చెప్పిన స్త్రీతో "అమ్మా నీవు పొందే ఆవేదనకు అర్థం, మానవుని మేధకూ అవగాహనకూ అందని ఏలోకంతో ఏ పరమార్థంతో ముడిపడి ఉన్నదో ఎవరు చెప్పగలరు?" అంటూ శాస్త్రజ్ఞుడు ఆమెతో సాంత్వనం పలికాడట. అలా చెప్పిన తర్వాత అతని ముగింపు వాక్యాలు యిలా ఉన్నాయి: ('Are you absolutely sure that it — the human world — is the last dimension, a terminal in the Cosmos as it were, that there is no dimension beyond the human world, a dimension in which the ultimate meaning of our human sufferings would be understandable? But then we too have no access to this higher dimension ... the question of course connot be answered either by doctor or scientist. It must be left open ... the answer can never be given intellectually but only existentially not in words but by our life, by our whole existencc.') యాదృచ్ఛికమూ, దైవికమూ అన్నదానికి అర్థం ఏమిటి? ఆ ప్రశ్నకు సమాధానం మాటల్లో, అనగా బుద్ధితో ఆలోచించి తేల్చేది కాదు. ఆ సమాధానం జీవించటంలో, ఎవరికి వారు తమ అస్తిత్వంనుంచి పొందవలసిందే. అలా పొందగలిగినవాడే ఆధ్యాత్మిక మానవుడు. ఇక్కడ గమనించవలసిన ముఖ్యాంశం—తత్త్వ జిజ్ఞాస చెయ్యడం, సాధన, "ఆధ్యాత్మికత"కాదు. తత్త్వమే తాను కావటం, అస్తిత్వ వైశిష్ట్యం ద్వారా సర్వ సందేహ నివృత్తి పొందటం "ఆధ్యాత్మికత". ఒక్కొక్క యుగలక్షణాన్ననుసరించి ధార్మిక, ఆర్థిక, రాజకీయ, శృంగార మానవత్వములలో ఏది ఒక్కొక్కసారి భాసించినా, మిగతా వాటిపై ప్రాబల్యం వహించినా, దాని పరిపూర్ణత, సాఫల్యం, చరమస్థాయి, ఆధ్యాత్మికత. ఉప్పు కప్పురంబు నొక్క పోలికనుండు.....పురుషులందు పుణ్య పురుషులు వేరయా అన్నట్లు ఆధ్యాత్మికమానవుడు యుగ లక్షణాన్నిబట్టి అందరిలాగానే వ్యవహరిస్తూ, అస్తిత్వ వైశిష్ట్యంవల్ల విశిష్టుడై వేరుగా ఉంటాడు.

# కుమారారామము

శ్రీ పోచిరాజు శేషగిరిరావు

## 1

అది చాళుక్యుల పాలనమ్మునను
వింధ్యాహార్య పాదమ్మునన్
కుదురై నిల్చిన పుణ్యభూమి — చదురుల్
ముక్కోటి యాంధ్రుల్ జగా
పదనౌ శైవము నిల్పినా రిచట,
భాస్వత్కాంతిందమ్ముగా
మదిలో నిల్చును చూచువారలకు
భీమస్వామి యావాసమై.

'వేదపురాణశాస్త్ర పదవీ సదవీయసియైన పెద్దము
త్తైదువ' భర్గురాణి దరహాసము చిందిన చోటు: భారతా
ఖ్యాది మహాపురాణ నిచయమ్ములు పుక్కిటబట్టి తత్త్వమున్
బ్రోది యొనర్చు వ్యాసముని పుంగవుఁ డిచ్చట పేద దేరెన!

విలసిత కాంతి రేఖయయి విశ్వజనీన రసజ్ఞ బంధువై
కల మధురమ్మునై రుచిర గానమునై శివచంద్రచంద్రికా
వలయితమై మహేశ్వరుని వాటికయై నవనందనమ్మునై
పొలుపులు మీఱు నీ తెలుఁగుభూమి చళుక్యుల భక్తిదీపమై.

పులు కడుగంగబడ్డ నును ముత్తెము వోలె మహేంద్రమందువన్
చుళుకిత సంపదాఢ్యమయి చూపఱకున్ నయనాభిరామమై
లలిత మనోజ్ఞమై ప్రకృతి లక్ష్మి కిరీటమునన్ దురాయియై
వెలుగులు దీయుఁ దెలుఁగు పృథివీస్థలి కెత్తిన కేతనమ్మనన్.

ఇది యొక చాళుక్యక్రతువు నియ్యది శిల్పకళా కలాపముల్
పొదివిన దేవభూమి హరువుల్ మురువుల్ హవణిల్లు నాట్యసం
పదలు వెలార్చు రమ్యమణి మందిరవాటము చారు సద్గుణా
స్పదము రసజ్ఞ శేఖరుల భావజగమ్ము శివాభిరామమున్.

పరమ శైవమ్ము విరిసి ప్రాభవము వడసె.
అదిగొ! చాళుక్య భీమేశు సదనవాటి
భారత గ్రంథ సంధాత పాదపద్మ
వాసితమ్మైన తెల్గు కైలాస మిద్ది.

గౌతమీవారి తడిసి ముంగారు పండు
తెల్గు మాగాణి పంటలు తేనెలూర్చు
రంగు బంగారు తీగెలు రాచతీవి
ఇక్షుఖండమ్ము లిట నుదయించెఁ దొలుత.

శ్యామలాదేవి చరణ సంసర్గమునను
పుడమి పులకించినట్టి దీ పుణ్యవాటి
అగ్నికాహుతియైన 'కామమ్మ' తల్లి
మహిమ కిరవైన తోట సామర్లకోట.

ప్రియతమాంధ్రికి ముత్యాలపేరు వోలె
గలగలల సాగి పోవు సాగరముకొమ్మ
ఏపురము ప్రోల నుండును కాపురముగ
'ఏల' కొనియాడఁ దరమె నదీలలామ!

లలిత విలాస లాలసము తో
తనువుల్, పులకించు మాధురీ
విలసిత దృక్కదంబములు, వేణికలన్
విరజాజి మొగ్గలున్,
పులకిత యామినీ రణిత
నూపుర నిస్వనముల్ దలిర్పఁగా
లలనలు పొల్చు రిప్పురి
కళా రుచిరస్మిత సుందరాస్యలై.

అమరావతీ శిల్ప కమనీయ కలనమ్ము
స్కందు నారావాన నంది గలదు
లేపాక్షి బసవన్న కేపారు తమ్ముండు
హనుమకొండను నంది కన్నగారు
ఆ మండపము కళాసేవాధి దేవత
త్రిపుర సుందరి నిల్చు దేవవాటి
ఉయ్యాల మండప మొయ్యారములు వోయె
యొక్కపక్క కొదిగెను నుజ్జ్వలముగ

నిర్మలమ్మైన కాసార నీరమందు
కలువ కన్నెలు కులికి తూగాడు పాడు
నారికేళ వనాళి విన్నాణ మొలుక
వీచు తెమ్మెరల్ స్వామికి వీజనముల.

ఇది కుమార చాళుక్య భీమేశ్వరేంద్ర
నిర్మితమ్మైన శంకరు ధర్మవాటి
నవనిధీశ్వరు మిత్ర బృందావనమ్ము
అణువణువు శైలబాలా పదాంకితమ్ము.

## 2

ఆ కవితా రసజ్ఞుఁడు* మహాంధ్ర కవిత్వము పట్టభద్రుఁడు
త్సేకముతోడ రెడ్డికుల శేఖరమయ్యనాఖ్యుఁడు వేమభూవిభుం-
డే, కదలింప, తా నివతళించిన శైవపదానురక్తితో
నీ కొమరారు వీట భజియింపఁడె భీమయ నీశ్వరేశ్వరున్!

ఆ కవిరాజు భీమయ పదాంబుజ రక్తుఁడు శైవకావ్య దీ
క్షాకలితాదరుండు రసచర్చల వాఙ్మయ వేత్తయై గుణ
శ్రీకముగా మథించి యరచేత సరస్వతి నిల్పి, కావ్యముల్
చేకొని వ్రాసియుండ డొకొ! శ్రీకరమైన కుమార వాటికన్!

అన్నయమంత్రి, మౌళికుసుమార్చిత శంకర పాదపద్ముఁడు,
ద్యన్నయశాస్త్ర కోవిదుఁ, డుదారమనస్వి సరస్వతీ సుసం
పన్న రసజ్ఞకేళి నిజబాంధవుఁడౌ కవిసార్వభౌముతో
నన్నియ విహారు వచ్చి నెఱపండె మహానటరాజ సేవలన్.

ఆ 'కవితా సనాథుఁడు' విహారము చేసినచోట సాహితీ
శ్రీకరమైన చర్చలు వరిష్ఠములై దయివారు నేఁటికిన్
ప్రాకట రక్తిమై సుకవి బాంధవు లెందఱొ నాఁడు వాటికిన్
జేకురినారు కావ్యసరసీరుహముల్ విరియింపఁ బెంపుమై.

## 3

జనశిలావళి కొక క్రొత్త జవము కూర్చి
ప్రాణముఁ బోయుచు రూపకల్పన మొనర్చి

---

* శ్రీనాథ మహాకవి

మాత్సలోకముల్ నిల్పె మనోజ్ఞ రీతి
శిల్పి యులికొస వేల్పు వసించె నేమొ!

శిలలు కరంగి దివ్యతమ జీవము నంది రసాత్మతన్ మహో
జ్జ్వల కమనీయ భావుకత పండిన శిల్ప కళా విధాత చే
తుల ఉలి సోకి, నాట్యరమ దోయిరిపట్టి వినమ్రమూర్తియై
నిలిచెనొ ఆలయాన రమణీ రమణీయ కళావిలాసతన్.

కేలితాకున చక్కిలిగింత వెట్టి
బాల నిటు పల్కరించె వరాల శిల్పి
నాట్యకత్తెల మివుం విన్నాణ మొలుక
విల్పినాడంట చాళుక్య శిల్పి వేల్పు.

ప్రాంచ చైత్యవకథా నిధానములు శుభ్రజ్యోత్స్న హేవాకముల్
పంచారామము లీ త్రిలింగ ధరణీ ప్రాగ్భాగమం దొప్పెడిన్
వంచారించిన రెడ్డిరాజుల కళా బాంధవ్య సంపోషణ
మ్మంచుల్ దాటెను దక్షవాటిక కుమారారామ మందాద్భుతిన్.

మండపముల్ కళాహృదయ మండనముల్ సుకవీంద్రమండలీ
మండితముల్ గిరీశ గుణ మంజులముల్ శివసుందరమ్ములున్
దండతరార్భటీ వివద చాలనముల్ గిరిజాసతీ మహో
ద్దండకథా ప్రహేళిక లుదార మహేశ్వర దృగ్విలాసముల్.

ఆ నటరాజు సంధ్యల మహానటన మ్మొనరించు వేళలన్
వీనుల విందు మందురు సువిస్తర శైవకళా కలధ్వనుల్
పూనిన భక్తిమై సుకవి పుంగవు లీ శ్రుతి వింటనేమొ! స
న్మానిత కావ్యముల్ రసికమాన్యములై రచియించి రింపునన్.

ఏ శిల్పి యెదలోన వివతళించెనొ శైవ
భావనాగరిమ రూపమ్ము దాల్చె
ఏ రాజు లిట పుల్కరించిరో నటరాజ
ధర్మధర్మన సుధా ధవళకాంతి

ఏలతావళి చిగురించెనో యారామునా
రారామ భీము సుపూజార్చనకుఁగ
ఏ వేదమూర్తు లీ హిమగిరీంద్ర కుమారి
తొలివేల్పు పలుకులఁ గొలిచినారో

నీ పదార్చన సేయని నేర్పుతీర్పు
త్వన్మహిమ కీర్తిసేయని తత్త్వమొకఁడు
నీ పదాంకితమ్మైన యా నేల గలదె!
భీమవర పురవాస! ఉమామహేశ!

ఒక పుష్ప మొక్కదళమును
నొక సజలార్ద్రాభిషేక మొనరిన భక్తిన్
సుకృతాత్ముఁ డెవఁ డొసంగడు
ప్రకటీకృత పరమవైభవోద్దీప్తిన్.



# ప్రాచీనయుగంలో భారతీయ భౌతికవాదం

శ్రీ కల్లూరి బసవేశ్వరరావు

ప్రకృతి నియతిబద్ధం, నియతిబద్ధమైన ప్రకృతినుండి ఉద్భవించిన మానవుడు జన్మతః హేతుశీలి. నిత్య సత్యాన్వేషణ అతని సహజ గుణం. స్వాతంత్ర్యేచ్ఛ అతని సహజ ధర్మం. స్వాతంత్ర్యేచ్ఛ ప్రేరేపింపగా అనవరత సత్యాన్వేషియైన మానవుడు అనాదినుండి తనను గురించీ, తన చుట్టూవున్న ప్రకృతిని గురించీ తెలుసుకొటానికి యత్నించాడు. తత్ఫలితంగా విజ్ఞానశాస్త్రాలు ఆవిర్భవించినాయి. సాంఘికవ్యవస్థలు నెలకొన్నాయి. తత్త్వశాస్త్రం ఉదయించింది. మానవనాగరికత పరిణామం చెందింది.

ఆదిమ మానవుడు 'జీవితమంటే ఏమిటి?' 'జనన మరణాల అంతరార్థ మేమిటి?' 'ప్రకృతి స్వరూప స్వభావాలేమిటి?' అన్న ప్రశ్నలు వేసుకొన్ననాడే తత్త్వశాస్త్రం ఆవిర్భవించింది. ఈ ప్రశ్నలకు ఆనాడు అతడు సరియైన సమాధానాలు చెప్పలేక పోయినాడు. ప్రతిదానికీ ఏదో కారణం వుండక తప్పదు అని అతని సహజహేతుశీలం హెచ్చరించింది. ఆ పరిస్థితుల్లో ప్రకృతి శక్తులను కారణాలుగా ఊహించినాడు. ఇంద్రుడు, వరుణుడు, అగ్నివంటి ప్రకృతి శక్తులను ఆరాధించినాడు. అయితే మానవుని జిజ్ఞాస, సత్యాన్వేషణ అంతటితో ఆగిపోలేదు. అతడు ప్రకృతి పరిశీలనాన్నీ, అధ్యయనాన్నీ కొనసాగించినాడు. భౌతిక ప్రకృతిలోని రహస్యాలను కనుగొన్నాడు. దాంతో ప్రకృతిశక్తుల దైవత్వం పటాపంచలయింది. దీనినిబట్టి ఒక్క విషయం తేలుతున్నది. మనిషి చుట్టూవున్న ప్రకృతిని అర్థం చేసుకోటానికి యత్నించటంవల్లనే విజ్ఞానమూ, తత్త్వశాస్త్రమూ ఆవిర్భవించినాయి.

కాగా భౌతికవాదమే నిజమైన తత్త్వశాస్త్రమని భావించవచ్చు. భౌతికవాదం ప్రకృతికి సంబంధించిన జ్ఞానాన్ని యథాతథంగా ప్రదర్శిస్తుంది. ప్రకృతియందలి అంశాలను పరిశీలించి, పరిశోధించినందువల్లనే అట్టి జ్ఞానం కలుగుతున్నది. భౌతికవాదం విషయ లంపటత్వం కాదు. ప్రపంచానికి మూలం పదార్థమని భౌతికవాదం ఉగ్గడిస్తుంది పదార్థముతప్ప అన్యమైనదేమీ లేదు. ప్రకృతిలో అంతర్గతమై వున్న నియమాలవల్ల పదార్థం బహురూపాల్లో గోచరిస్తూవుంటుంది. ఈ విషయాన్ని యం. యన్. రాయ్ ఈ క్రిందివిధంగా వివరించినారు:—

"Strictly speasing, philosophy is meterialism, and materialism is the only possible philosophy. For, it represents the knowledge of nature as it really exists — knowledge acquired through the contemplation, observation and investigation of the phenomena of nature itself ......................... It simply maintains that the origin of everything that really exists is matter, that there does not exist any thing but m tter, all other appearances being transformations of matter and the transformations are governed necessarily by laws inherent in Nature."

(See "Materialism." by M. N. Roy.)

ప్రకృతిగత విషయాలు ప్రకృతి కతీతమైన శక్తుల చేత నిర్ణయింపబడలేదు అటువంటి బాహ్యశక్తులు వున్నవను కొంటే భౌతికవాదం స్థానంలో విశ్వాసం ప్రవేశిస్తుంది. ప్రకృతికి అతీతమైనశక్తులను పరిశీలించటం సాధ్యంకాదు గదా? జగత్తులోని మార్పులకు ఈశ్వరుని సంకల్పవికల్పాలు కారణం అనుకొంటే పరిశోధన సాగదు. సత్యం తెలియదు. భౌతికవాదం ఓడిపోయి దైవత్వం విజృంభిస్తుంది.

ఆదిమమానవుడు ప్రకృతి ఒడిలోని బిడ్డ. మొదట్లో అతడు ప్రకృతి విరాడ్రూపాన్ని చూచి సంభ్రమాన్నీ భయాన్నీ పొందినా, క్రమేణా హేతుబుద్ధితో ఆలోచించటం సాగించినాడు. ప్రకృతిలో వస్తూవున్న అనంతమైన మార్పులకు కారణాలను అన్వేషించినాడు. ఈ అన్వేషణ ఫలితంగానే భౌతికవాదం మొలకెత్తింది. భౌతికవాదం ఈ అనంత విశ్వాన్ని యథార్థమని భావిస్తుంది. విశ్వం నియతిబద్ధం. విశ్వనియమాలు విశ్వాంతర్గత విషయాలే. విశ్వగమనాన్ని నిర్ణయించే విశ్వాతీతమైన

శక్తి ఏదీలేదు. విశ్వరహస్యాలను మానవుడు తెలిసికొనగలడు విశ్వంలోని క్రమాన్ని మంత్రతంత్రాలవల్ల, ప్రార్థనవల్ల యజ్ఞాలవల్ల మార్చలేము. విశ్వం తనంతటతానే మారుతున్నదిగాని ఏశక్తీ అందుకు కారణం కాదు మానవుడు విశ్వంలోని అంతర్భాగమే! భౌతికవాదానికి మనిషి ముఖ్యం. మనిషి స్వేచ్ఛకూ, సుఖానికీ, హితానికీ భౌతికవాదం మకుటం పెడుతుంది. మనిషిని కర్మకో, విశ్వాతీతమైన శక్తికో ముడివేసి అతని భావస్వేచ్ఛనూ, క్రియాశక్తినీ భౌతికవాదం హరించదు. అమెరికన్ ఎన్‌సైక్లోపేడియా భౌతికవాదాన్ని ఈ విధంగా నిర్వచిస్తోంది: —

Materialism is "the philosophical theory that everything which exists is ultimately material in nature or that whatever is real can be derived and explained in accordance with the laws of meterial phenomena."

భారతదేశం ఆధ్యాత్మికదేశం అనుకోవటం సత్యాన్ని పూర్తిగా గ్రహించకపోవటమే. ఈనాడు భౌతికసిద్ధాంతం ఎంత ప్రబలంగావుందో ప్రాచీనకాలంలోకూడ అంతనిశితంగానే వున్నది. భౌతికసిద్ధాంతం భారతీయ సమాలోచనంలో సువ్యాప్తమేగాని స్వల్పవిషయంకాదు. గౌతమబుద్ధునికిపూర్వం ప్రాచీనయుగంలో వర్ధిల్లిన భారతీయ భౌతికవాద పరిణామాన్నిగురించి స్థూలంగా వివరించటమే ఈ వ్యాసంయొక్క లక్ష్యం,

వైదికయుగానికి పూర్వం వున్న భారతీయ చింతనాన్ని గురించి తెలిసికోవానికి అధారాలు తక్కువ. మొహంజొదారో, హరప్పానగరాలలో విలసిల్లిన నాగరికతనుబట్టి నాటి భారతీయులు భౌతికసుఖాలకు విముఖులుకారని చెప్పవచ్చు వ్యవసాయం, వ్యాపారం వారి ప్రధాన వృత్తులు. రాగితో సాధనాలను తయారుచేయటంలో వారు నైపుణ్యాన్ని చూపించారు. వారు ఖగోళాన్నిగురించి తెలుసుకోటానికి యత్నించారని పరిశోధకుల తలంపు!

ప్రపంచ మతగ్రంథాలలో వేదాలు అతిప్రాచీనాలు. వేదాలు మంత్రములతో నిండివున్నవి. దేవతల స్తోత్రములు, అర్థవంతములూ అయిన వాక్యాలు మంత్రములు. వాటి సముదాయము లయిన సంహితలు నాలుగు. అవి ఋక్, సామ, యజుస్, అథర్వణ సంహితలు. యజ్ఞము మొదలయిన అనుష్ఠానాలను గురించి వివరించునవి బ్రాహ్మణములు. యజ్ఞానికి బ్రహ్మ శబ్దం వాడుతూ వుండిరి. కాన దానిని వివరించునవి బ్రాహ్మణములు. వానప్రస్థులకు అవసరమైన విషయాలను తెలిపేవి ఆరణ్యకములు. పైరెండునూ ప్రధానంగా కర్మకాండకు సంబంధించినవి. వేదాల అంతిమ భాగాలు ఉపనిషత్తులు.

దేవతలస్తుతులు వేదాల్లో ఉన్నాయి. పృథివి, అంతరిక్ష, ద్యులోకాల్లో దేవతలు వుండేవారని నాటివిశ్వాసం. ఇంద్ర, అగ్ని, సూర్య వాయుదేవతలు ప్రధానులు. వేదాల్లో ఏక దేవతారాధన, సర్వేశ్వరవాదం కూడ ప్రతిపాదింపబడినవి. 'వైదిక ఋషులు క్రమక్రమంగా బహుదేవతారాధన నుండి ఏకేశ్వరవాదానికి' 'ఈశ్వరుడే సర్వస్వం, జగత్తు అతని పరిణామం' అనే వాదానికి వచ్చిరనే పండితులు వున్నారు. దేహాత్మభేదం, పరలోకమందు విశ్వాసం కూడ వేదాలయందు కొన్నిచోట్ల కనపడుచున్నది. అయితే పునర్జన్మ సిద్ధాంతం ప్రతిపాదింప బడినట్లు చెప్పలేము.

పైన చెప్పినదాన్నిబట్టి వేదాలు కేవలం ఆధ్యాత్మికాలనుకోవటం సత్యదూరం. ఋగ్వేదంలో భౌతికవృష్టి, సుఖాలను అనుభవించాలనే తాపత్రయం కనపడుతున్నది. ఋగ్వేద కాలంనాటి భారతీయులు పశుపాలకులు, వ్యవసాయదారులు. వారు జీవితాన్ని సుఖమయం చేసుకోవాలని కోరుకున్నారు. దేవతలను తమకు అనంతసుఖాలను ప్రసాదించమని ప్రార్థించినారు. దేహాత్మభావాన్ని సమర్థించి, దేవతల అస్తిత్వాన్ని శంకించి 'పరమార్థం ఎవ్వరికీ తెలియదనే సందేహ వాదచ్ఛాయలు గోచరించే, వాక్యాలు వున్నాయి. ఋగ్వేదంలోని నాసదీయ సూక్తంలో 'విశ్వముయొక్క మూలమేది? సృష్టి ఎట్లు జరిగెను?' అను ప్రశ్నలకు సమాధానము యత్నింప బడినది.

'అప్పుడు సత్తులేదు. అసత్తు లేదు. అంతరిక్షము, దాని పరమగు వ్యోమము లేవు. ఎవరు అంతను ఆవరించెను? ఎక్కడ? ఎవనిచే రక్షింపబడి యుండెను?.........అప్పుడు ఆ ఒక్కటే వాయురహితమయ్యు స్వశక్తిచే శ్వసించుచుండెను. ............ఇట్లు ఏకమగు సత్తే విశ్వకారణమని, అదే నానా విధముల ఊహింపబడి పిలువబడునని, జగన్నియమనము చేయుచు, ప్రకృతియందు, మానవునియందు అంతర్వర్తి యగుచు అది యున్నదని వేదములలోని కొన్ని సూక్తము లనుచున్నవి' [చూడు: — 'దర్శనములు — మతములు' సంపాదకుడు: శ్రీ కె. సచ్చిదానందమూర్తి] ఋగ్వేదంలో 'ఋత'మను భావ మున్నది. ఋత మనగా భౌతికసంఘటనలయందలి నియతి అని అర్థం. ప్రకృతిలో ఒకనియమం, ఒకక్రమం, ఉన్నదని నాడు భారతీయులు గ్రహించినారు. ఋతము ఎవరిచేత సృష్టింప బడలేదు, అది స్వయంసిద్ధమైనదే. 'దేవతలను చూచినవాడెవ్వడు? ఆహుతులు ఎవరికీయవలయును? ఎందుకీయవలెను?' వంటి విమర్శలు ఋక్కులలో కనపడుతున్నాయి.

**వేదాలు అవిద్య లేదా అపరవిద్య అనీ, వాటివల్ల ఆత్మ లభింపదనీ**

ఉపనిషత్తులు అన్నాయి. పురోహితులు కప్పలవలె బెకబెక లాడుచుండురనీ, యజ్ఞాలు ఎందుకు చేయాలనీ, యింకా యితరముతైన సందేహాలూ వైదిక వాఙ్మయంలో కనపడు తున్నాయి.

వైదికయుగంలో వర్ణవ్యవస్థ యేర్పడినది. ఈ వ్యవస్థలో బ్రాహ్మణులది అగ్రస్థానం. బ్రాహ్మణులు పూజారులుగా, రాజపురోహితులుగా ఉన్నతస్థానంలో ఉన్నారు. క్షత్రియులు యుద్ధాన్ని చేసి రాజ్యాన్ని విస్తరింపచేశారు. ఆ సందర్భాల్లో 'రాజసూయం' 'అశ్వమేధం' వంటి యాగాలు చేయబడ్డాయి. సామాజిక జీవితంలో మత కర్మకాండకు ప్రాధాన్యం ఎక్కువయింది, యజ్ఞాలు చేయటం ఇతర పూజావిధులను ఆచరించటం పుణ్యకార్యంగా భావింపబడింది. వాటిని నిర్వహించే బ్రాహ్మణ పూజారులకు కానుకలు, దక్షిణలు బాగా ముట్టేవి. హిరణ్యదానం శ్రేష్ఠమైనదిగా భావింపబడింది. ఆయాసందర్భాలలో బ్రాహ్మణ పూజారులకు ఇవ్వవలసిన దక్షిణలు నిష్కర్షగా నిర్ణయింపబడినాయి. ఈ విషయాలు 'బ్రాహ్మణములు'అనే గ్రంథాల్లో వర్ణింపబడివున్నాయి. ఈ గ్రంథాల్లో వర్ణింపబడిన సామాజిక వ్యవస్థలో మానవత వున్నట్లు కనపడదు. సమాజవికాసానికి అవసరమైన ఉత్పత్తి కార్యక్రమాల్లో పాల్గొనే వర్గాలకు గౌరవం లేదు. బ్రాహ్మణ పూజారుల పెత్తనం ఎక్కువేమో ననిపిస్తున్నది. వేదాలనూ, వారి పెత్తనాన్నీ కాదన్నవారిని నాస్తికులుగా, పాషండులుగా చిత్రించారు. శంబుకవధ, వేనరాజ వధ ఈ విషయాన్ని రుజువుచెయ్యటంలేదా? బ్రాహ్మణవర్గ ఆధిపత్యాన్ని ఎదిరించినవారిలో క్షత్రియులు ముఖ్యులు. పరశురాముడు అనేకమంది క్షత్రియులను వధించటం క్షత్రియ ప్రతిఘటనకు నిదర్శనం. విశ్వామిత్రుడు వశిష్ఠునితో సంఘర్షించటం క్షత్రియుల ఉద్యమానికి సంకేతం. అవతారపురుషుడుగా కీర్తింపబడిన శ్రీరాముడు క్షత్రియనాయకుడు గదా?

ఉపనిషత్తుల్లో క్షత్రియ నాయకులపేర్లు కనపడు తున్నవి. నాటి తాత్త్వికచర్చల్లో రాజులు విశేషంగా పాల్గొన్నారు. వారిలో జనకుడు, కేకయరాజు, అశ్వపతి, కాశీరాజు ముఖ్యులు. యజ్ఞాలనుగురించీ, మతకర్మకాండనుగురించీ ఉపనిషత్తులు చర్చింపకపోవటం గమనార్హం. ఈ సందర్భంలో ఒక విషయాన్ని గుర్తుచేయటం అవసరం. 'కురుక్షేత్ర సంగ్రామంలో శక్తివంతమైన క్షత్రియజాతులన్నీ నాశనం చెందటం చేత క్షత్రియుల తిరుగుబాటు దెబ్బతిని తిరిగి బ్రాహ్మణవర్గం అధికారంలో వుంటానికి అవకాశం లభించింది. వేదమతం పునరుద్ధరింపబడింది. ధర్మరాజుచేసిన అశ్వమేధయాగం పాండవుల విజయచిహ్నం గాదు. బ్రాహ్మణవర్గ ఆధికారాన్ని అంగీకరించటం. ఈ యజ్ఞయాగాదుల ద్వారా సంఘంమీద బ్రాహ్మణ వర్ణానికి అధికారంవుందనీ, సంఘం సృష్టించిన వస్తువాహన పరికరాలు బహుమాన రూపేంలో బ్రాహ్మణవర్ణం పొందటానికి హక్కు వుందనీ తిరిగి రుజువుచేయబడ్డది. అంపశయ్యమీద వున్న భీష్ముడు యుధిష్ఠిరునకు గరపిన నీతులవల్ల ఈ విషయం ఇంకా స్పష్టపడుతున్నది. జయం పొందిన ధర్మరాజుకి భీష్ముడు ఈ విధంగా సలహాయిస్తాడు:— 'రాజ సద్ధర్మం దరిపించుకోవాలంటే బ్రాహ్మణులను పూజచేసి సన్మానిస్తూ వుండాలి. అశ్వమేధ యాగాలకంటె బ్రాహ్మణులకిచ్చే బహుమానాలు ఎక్కువ లాభప్రదమైనవి. వీటి ఫలితంగా క్షత్రియుడు స్వర్గపథం చేరుకుంటాడు. భూమిని బ్రాహ్మణులకు దానం చేయ్యాలి. ఇచ్చిన భూమిని తిరిగి తీసుకొన్నందువల్ల వచ్చేపాపం దేనివల్లనూ హరించదు. పొరపాటు పడి కూడ బ్రాహ్మణులను శిక్షించరాదు. వారు అందరికంటె పూజ్యులు, గొప్పవారు.' [చూడు :—'రాయ్ వ్యాసాలు'— మొదటిభాగం. రచయిత. శ్రీ రాధాకృష్ణమూర్తి.]

ఉపనిషత్తుల్లో అనేక ప్రధాన ప్రశ్నలకు సమాధానాలను అన్వేషించటం జరిగింది. 'జగత్తు ఎట్లు, ఎందుకు, దేనినుండి సృజింపబడినది? సుఖదుఃఖములు యేల కలుగుచున్నవి? శాశ్వతానందము నిచ్చునదేది? మరణానంతరము మానవునిలో మిగులునదేది? ఏమియు లేదా? జగదధిష్ఠానమగు తత్త్వమునకు మానవుని నిజతత్త్వమునకు గల సంబంధమేమి? మానవుడు అమర్త్యుడు కాగలడా? అయినచో అమృతత్వ మెట్టుల బడయనగును? ఈ దినముండి రేపు పోవు భోగదుల వలన ప్రయోజనమేమి? ఇవి ఉపనిషత్తులలో ఆలోచింపబడిన సమస్యలు.' [చూడు : 'దర్శనములు—మతములు' సంపాదకుడు. శ్రీ కె. సచ్చిదానందమూర్తి.] ఈ ప్రశ్నలకు సమాధానాలు ఆధ్యాత్మిక దృష్టితో యివ్వబడినాయి. జ్ఞానం పరా—ఉత్తమమనీ, అపరా—నీచమనీ రెండు విధాలుగా విభజింపబడింది. లౌకిక శాస్త్రాలూ, కళలూ అపరాజ్ఞానమే. బ్రహ్మజ్ఞానమే ఉత్తమజ్ఞానం. బ్రహ్మకు ఆత్మకూ అవినాభావ సంబంధ మున్నది. ఆత్మన్, బ్రహ్మన్ ఒకటేనని ఉపనిషత్తులు అంటున్నాయి. ఆత్మ అవినాశి. అది శరీరముతో పుట్టదు. శరీరముతో నశించదు. అజ్ఞానకృతమైన కర్మలవలన ఆత్మ జన్మలను గాంచును. అపుడు దానికి శరీరము ఆశ్రయము. సత్కార్యాచరణంవల్ల సుఖం, దుష్కార్యాచరణంవల్ల దుఃఖం కలుగుతున్నవి. మృతి నందినతర్వాత ఆత్మ శరీరాన్ని విడిచి మరియొక దేహాన్ని ఆశ్రయిస్తుంది. పూర్వజన్మ కర్మ ననుసరించి శరీరాన్ని గ్రహిస్తుంది. ఏకర్మచేస్తే ఆ కర్మకు ఫలాన్ని

పొందుతుంది. ప్రతిజీవి లక్ష్యం ముక్తిని పొందటం. ముక్తి అంటే పునర్జన్మ లేకుండా వుండటం. పలుతావుల్లో ఉపనిషత్తులు మోక్షకామి అనుసరించవలసిన విధి విధానాన్ని వివరిస్తున్నాయి.

ఉపనిషత్తుల్లో చూపబడ్డ 'బ్రహ్మ' కేవలం ఊహా ప్రపంచంతో తప్ప సిద్ధాంతరీత్యా వచ్చిన అభిప్రాయంకాదు. కర్మవాదం, పునర్జన్మ సిద్ధాంతం, మోక్షభావం, ఆత్మ పరమాత్మల ఏకత్వం హేతువాదులకు సంతృప్తి నివ్వలేదు. ఉపనిషత్తులను నిశితంగా పరిశీలిస్తే అప్పటి వేదమతంమీద కొంతవరకు అసంతృప్తి బయలుదేరిందనీ, మానవుడు ప్రకృతిని అర్థం చేసుకోటానికి ప్రయత్నించాడనీ తేలక మానదు. ఉదాహరణకు ఛాందోగ్య, బృహదారణ్యక ఉపనిషత్తుల్లో ఆకాశం, అగ్ని, వాయువు అనాది వస్తువులని వర్ణించబడ్డవి దీనివలన తక్కిన ఉపనిషత్తుల్లో 'పరమాత్మ ఒక్కడే అనాది' అన్న సిద్ధాంతం దెబ్బతిన్నది. 'ప్రకృతికి ఆది ఏది? ఆకాశం. అన్ని వస్తువులు అక్కడనుండి బయలుదేరి తిరిగి అక్కడకే చేరుకుంటున్నవి. కాబట్టి వాటన్నింటికీ ఆధారం ఆకాశం.' అని ఛాందోగ్య ఉపనిషత్తు చెప్తున్నది. కఠ ఉపనిషత్తులో యీ ప్రపంచ పరిణామానికి జడపదార్థం కారణ భూతంగా చూపబడినది. శ్వేతాశ్వతర ఉపనిషత్తులో అగ్ని ఒక్కటే అనాది వస్తువు, తక్కినవన్నీ అందులోనుంచి పుద్భవించినవని చెప్పబడినది. ఇక్కడ అగ్ని పరమాత్మతో పోల్చి చెప్పబడలేదు. కాబట్టి పరమాత్మకంటె మరొక మూలకారణం వుందని భావించబడ్డది. ఇందులోకూడ యీ ప్రపంచానికి జడపదార్థమే కారణభూతంగా చూపబడ్డది. శ్వేతాశ్వతర ఉపనిషత్తులో స్పష్టంగా భౌతిక వాదచ్ఛాయలు కనపడుతున్నవి. మైత్రీ ఉపనిషత్తులో చార్వాకదర్శనం యొక్క ప్రస్తావన వున్నది. స్వభావవాదం, యదృచ్ఛావాదం, నియతివాదం శ్వేతాశ్వతరోపనిషత్తునాటికే ఉన్నవని ఆ గ్రంథం చెప్పియున్నది. 'మనుష్యుడు అంటే ఏమున్నది? అతడు అన్నరసమయుడు' అని ఒకచోట తైత్తిరీయశ్రుతి అనినది. చచ్చినపిదప సంజ్ఞ లేక చైతన్యం ఉండదని బృహదారణ్యక మొకచోట ఉదాహరించినది.

ఉపనిషత్తుల్లో ఉదాహరించబడిన తాత్త్వికుల్లో ఉద్దాలకుడు ముఖ్యుడు. ఉద్దాలకుడు స్పష్టంగా భౌతిక వాద దృక్పథాన్ని ప్రతిపాదిస్తున్నాడు. ఆయన ముఖ్యంగా మూడు విషయాలను ఉగ్గడించినాడు. (1) ఏకత్వ భౌతికప్రకృతి (2) పదార్థానికి మూలమైన భూతాలు (3) అణువుల అస్తిత్వం. ప్రకృతి స్వభావానికి అనుగుణంగా జీవయాత్రను కొనసాగిస్తే సుఖం లభిస్తుందని ఉద్దాలకుడు బోధించినాడు.... ఉపనిషత్తుల్లో విరోచనుడనే మహర్షికూడ భౌతిక సిద్ధాంతాలను ప్రచారం చేసినాడు. ఉపనిషత్తుల్లో నిక్షిప్తమై వున్న విప్లవ సిద్ధాంతాలను గురించి యం. యన్. రాయ్ ఇలా వ్రాస్తున్నాడు:—

"The Upanishads record not only strands of rationalist, naturalist and agnostic thought, but also out-and-out atheism and materialism. At least one of the main eighteen books is entirely devoted to an exposition of ationalist and naturalist thinking and the most outspoken heretical views. It denies the existence of God and soul; it holds that nothing but matter exists, and that there is no other world beyond this world. Its thesis can be summarised as follows. "There is no incarnation, no God, no heaven no hell; all traditional religious literature is the work of conceited fools, nature, the originator, and time, the destroyer are the rulers of things, and take no account of virtue or vice in awarding happiness or misery to men; people deluded by flowery speeches cling to God's temples and priests when in reality there is no difference between Vishnu and a dog." (Swasanved Upanishad, Sutra II. See "Materialism" by M. N. Roy.)

## 2

ఉపనిషత్తులకూ గౌతమబుద్ధునికీ మధ్య వున్న కాలం భారతీయ చరిత్రలో మహత్తరఘట్టం. భౌతిక వాదానికి బలమైన పునాదులు ఆనాడు యేర్పడినాయి. నాటి రాజ్యాలలో మగధ, అవంతి, వత్స, కోసల ప్రసిద్ధములు. కొన్ని గణరాజ్యాలు కూడ వున్నాయి. కులవ్యవస్థ అమలులో వున్నది. ఆర్థిక విధానాలలో మార్పులు వచ్చినాయి. పట్టణాలు అభివృద్ధి చెందినవి. నూతన ఉత్పత్తి విధానాలు చేపట్టబడినాయి. ఉత్పత్తిదారులు శ్రేణులుగా యేర్పడి వర్తక వ్యాపారాలు కొనసాగించినారు. వ్యవసాయంతో పాటు, ఇతర వృత్తులూ, వర్తక వ్యాపారాలూ కొనసాగిన కాలమది. ఆ పరిస్థితుల్లో ఉపనిషత్తుల్లో ప్రతిపాదించబడిన ఆధ్యాత్మిక సిద్ధాంతాలు కొంతమంది ప్రజలకు సంతృప్తి నివ్వలేదు. జన్మచేత సమాజంలో స్థానాన్ని నిర్ణయించటం వారు అధర్మంగా పరిగణించారు. జీవితాన్ని దుఃఖమయంగా భావించే దృష్టి వారిని ఆకర్షింపలేదు. కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలు వారికి అర్థరహితాలుగా తోచినవి. ఉద్దాలకుడు బోధించిన భౌతికదృష్టి వికసించుటకు తగిన వాతావరణం యేర్పడినది. నూతనభావ ప్రవంతి బయలుదేరినది. బౌద్ధగ్రంథాల్లో ఆనాడు

62 వాదాలు విజృంభించినట్లు చెప్పబడింది. నాటి భావవిప్లవ వైతాళికులలో ఐదుగురు ముఖ్యులు. వారు:— (1) పూర్ణ కశ్యపుడు, (2) కాత్యాయనుడు, (3) అజితకంబళకేశి, (4) సంజయుడు, (5) గోశాలుడు.

పూర్ణకశ్యపుడు పాపపుణ్యాలను గురించి చర్చించినాడు. అతడు 'అక్రియావాది.' అనగా సత్కార్యాచరణంవల్ల పుణ్యమూ, దుష్కార్యాచరణంవల్ల పాపమూ సంప్రాప్తమౌతా యనే వాదాన్ని అతడు అంగీకరించడు. దానంవల్ల, సూనృత వ్రతంవల్ల పుణ్యం లభిస్తుందా? అని అతని సంశయం. ఏది సత్కార్యం? ఏది దుష్కార్యం? ఈ విషయాన్ని ఎవరు తేల్చాలి? ఎవరికివారే తేల్చుకోవాలని పూర్ణకశ్యపుడు భావించివుండ వచ్చును. అనగా పాపపుణ్యాలకు మనిషి అంతరాత్మ ప్రమాణం గాని, ఇతరుల అభిప్రాయాలు కావని అతని తలంపు కావచ్చు. అజితకంబళకేశి పూర్ణకాశ్యపుని భావాలతో ఏకీభవించినట్లు తోస్తున్నది. అజితుని దృష్టిలో పరలోకం లేదు. పరిపూర్ణత్వాన్ని పొందిన సన్యాసులు లేరు. మనిషి నాలుగు భూతాలతో నిర్మింపబడినాడు. అవి పృథ్వి, జలం, తేజస్సు, వాయువు. కాత్యాయనుడు ఈ నాలుగు భూతాలనేగాక ఇంకా మూడింటిని గూడ (సుఖం, దుఃఖం, ఆత్మ) అంగీకరిస్తాడు. శూన్యం నుండి ఏదీ ఉద్భవించదని అతని విశ్వాసం.

ఇక సంజయుడు సందేహవాది. ఆత్మజ్ఞానం అలభ్యమని అతని మతం. గోశాలుడు నాటి ఆలోచనాపరులలో ప్రముఖుడు. అతడు కర్మసిద్ధాంతాన్ని కాదన్నాడు. అతడు బుద్ధునికూ, మహావీరునకూ సమకాలికుడై వుండవచ్చును.

పూర్ణకశ్యపుడు, అజితకంబళకేశి, సంజయుడు, గోశాలుడు ప్రాచీనయుగంలో భావవిప్లవవిధాతలు. వారు హేతువాదానికి ప్రాముఖ్యం ఇచ్చినారు. ఇహలోకాన్ని యదార్థంగా భావించి, ఈ లోకాన్ని అర్థంచేసుకొనే శాస్త్రీయ దృష్టికి బీజాలు నాటినారు. భౌతికదృక్పథానికీ, మానవత్వానికీ పట్టం పెట్టి, ప్రాచీనయుగంలో లోకాయతధర్మం బహుళ ప్రచారం పొందటానికి అవసరమైన పునాదులను ఏర్పాటుచేసినారు.

ప్రాచీనయుగంలో విశేష ప్రచారాన్నిపొంది, తీవ్రమైన ఖండన మండనలకు గురియైన భౌతిక తత్త్వం లోకాయత వాదం. 'లోకేషు ఆయతః లోకాయతః' అనగా లోకులలో లేక ప్రజలలో ప్రచారమందున్న దృష్టియే లోకాయతం. లోకము మాత్రమే విషయముగాగల శాస్త్రం లోకాయతం. లోకదృష్టిని అనుసరించు దర్శనం లోకాయతం. ఇహలోకమునే ఆయతన ము... —ఆధారంగా— చేసికొన్న దర్శనం లోకాయతమని కొందరి నిర్ణయం. లోకయాత్ర ఈ దర్శనలక్ష్యం, ఇది అర్థకామాలను సాధిస్తుంది. ఇది సాధారణజనుల దర్శనం. భౌతికవాదం అని చెప్పబడింది.

ప్రకృతియే తుది సత్యమని మొదట ఋగ్వేదఋషి అయిన బృహస్పతి గుర్తించినాడు. లోకాయతాన్ని తొలుత బృహస్పతి ప్రపంచించినాడని కొందరు అంటున్నారు. లోకాయతాన్ని చార్వాక దర్శనమని కూడ అంటారు. చార్వాకుడనే ఆచార్యునిబట్టి ఈ పేరు యేర్పడినదేగా! చార్వాకుడు బృహస్పతి శిష్యుడట! ('బ్రతికినన్నాళ్లు సుఖంగా ఉండండి' అనే) రమణీయ తత్త్వాన్ని సుందరమైన మాటలలో (చారు వాక్) చెప్పినవాడు చార్వాకుడు. చార్వాకసిద్ధాంత మూలగ్రంథాలు ఇప్పుడు లభ్యములుగావు. చార్వాక సాహిత్యాన్ని కానరాదని దానిని ద్వేషించినవారు నాశనము చేసిరని జవాహర్లాల్ నెహ్రూ అభిప్రాయం. హైందవ, బౌద్ధ, జైన గ్రంథాలలో ఉదాహరింపబడిన విషయాలే ఈ సిద్ధాంతానికి ప్రధాన ఆధారాలు.

లోకాయతం అతి ప్రాచీన భారతీయ దర్శనం. ఒకప్పుడు దీనిని కొందరు పండితులు అధ్యయనంచేసి ప్రచారం చేసినారు. ఇంద్రియానుభవానికీ, హేతువాదానికీ ప్రాధాన్యం ఇచ్చినవారు దీనిని అధ్యయనం చేసినారు. అన్యులు దీనిని దూషించినారు. కౌటిల్యుడు అర్థశాస్త్రంలో లోకాయత దర్శనాన్ని పేర్కొన్నాడు. వాల్మీకి రామాయణంలో లోకాయత పండితుల ప్రస్తావన వున్నది. రామాయణంలోని జాబాలిఋషి భౌతికవాది. శ్రీరామునకు అతడొసంగిన ఉపదేశం చార్వాకమతానుసరణమే. హరివంశమున వేనరాజు ఈ సిద్ధాంతాన్ని అనుసరించినవాడే. పతంజలి చార్వాక సిద్ధాంతాన్ని బలపరచిన భాగురిని పేర్కొన్నాడు. శాంతి రక్షితుడు తత్త్వసంగ్రహంలో పేర్కొన్న పురందరుడు చార్వాక గణానికి చెందినవాడు. ప్రమదుడు ఒక బ్రాహ్మణుని పిలిపించుకొని బృహస్పతి సిద్ధాంతాలను చెప్పించుకొన్నాడని మహాభారతంలో వున్నది. బాణుని హర్షచరిత్రలో లోకాయత దర్శనం పేర్కొనబడినది. ప్రాచీన బౌద్ధ గ్రంథాలలో ఉదాహరింపబడిన లోకాయత దర్శనం అతి ప్రాచీన దర్శనమని చెప్పదగును. ఈ దర్శనం వేదప్రామాణ్యాన్ని అంగీకరించిన వారికీ, పరలోకంలో, పునర్జన్మలో, ఈశ్వరుని అస్తిత్వంలో నమ్మకం వున్నవారికీ రుచింపలేదు. కనుక వారు దీనిపై కత్తికట్టి, దీని అధ్యయనాన్ని వారించి వుంటారు. అయినప్పటికీ లోకాయత దర్శనం బహుళజనుల ఆదరాన్ని పొందినది.

సుఖానికి ప్రాముఖ్యం ఇచ్చే లోకాయత దర్శనానికీ, కాపాలిక మతానికీ సంబంధం కలదని కొందరు పండితులు

వ్రాసినారు. కాపాలికులు కేవలం భోగలాలసులు. వారు పంచ మకారాలను ఆరాధించినారు. వారు దార్శనికులుకారు. చార్వాకుని అనుయాయులు తాత్త్వికులు. వారిదర్శనం భారతీయ దర్శనాల్లో గణనీయమైనది. కనుక లోకాయతాన్ని చౌకబారు తాంత్రిక ఆచారాలతో పోల్చటం సత్యానికి విరుద్ధం.

చార్వాకులు వైదికకర్మలను తీవ్రంగా ఖండించినారు. 'స్వర్గాపవర్గములు, ఆత్మ, పరలోకములు లేవు. వర్ణాశ్రమాదుల క్రియలు ఫలములనీయవు. అగ్నిహోత్ర, సన్యాస, భస్మలేపనాదులు, బుద్ధి పౌరుషహీనులకు జీవికామాత్రములు. జ్యోతిష్టోమమున జంపబడిన పశువు స్వర్గమునకు పోవునట్లైన అందులో యజమాని తన తండ్రినేల చంపడు? మృతజీవులకు శ్రాద్ధం తృప్తినీయగల్గినచో ప్రయాణమై వెళ్ళువారికి పాథేయము తీసికొనిపోవలసిన అవసర మేమి కలదు?... ... ... ఈ దేహమును విడిచి జీవుడు పరలోకమున కేగినచో అతడు బంధుప్రేమ సమాకులుడై తిరిగి ఎందుకు రాడు? మృతులకు ప్రేతకార్యాదులన్నియూ బ్రాహ్మణులు తమ జీవనోపాయము నకై విధించుకొనిరి. వాటికి మరొక ప్రయోజనం లేదు.'

(మూడు : 'దర్శనములు—మతములు')

లోకాయతదర్శనం భౌతికవాదం. అది పారలౌకికతత్వాన్ని నిరాకరించినది. ఈ లోకాన్ని యథార్థమని విశ్వసించినది. లోకాయతదర్శనంలోని ప్రధానవిషయాలు మూడు. 1. జ్ఞాన తత్త్వం. 2. భౌతికదృక్పథం. 3. ధర్మస్వరూపం. ఈ మూడింటిని గురించి రేఖామాత్రంగా వివరిస్తాను.

(1) చార్వాకులతాత్త్వికవిధానం వారి జ్ఞానతత్త్వంపై ఆధారపడివున్నది. లోకాయతులు శబ్ద, వేద, సాదృశ్యప్రమాణాలను అంగీకరింపరు. ప్రత్యక్షప్రమాణాన్నే వారు గ్రహిస్తారు. ప్రత్యక్షం రెండురకాలు: బాహ్యము, ఆంతరము. ఇంద్రియ వ్యాపారం బాహ్యము. మానసిక వ్యాపారం ఆంతరము. ఇంద్రియానుభవంలేని మానసిక వ్యాపారం వుండదు. కనుక ఇంద్రియ సంబంధజ్ఞానమే సత్యాన్ని గుర్తించుటకు ముఖ్య సాధనం. ఇంద్రియగోచరమైనదే సత్యం. అగోచరమైనది సంశయానికి గురికావలసినదే. లోకాయతులు అనుమానప్రమాణాన్ని నిరాదరించారు. సత్యజ్ఞానానికి అనుమానము సాధనంకాదు. అనుమానానికి వ్యాప్తిజ్ఞానం ఆధారం. వ్యాప్తి యేవిధంగా సత్యజ్ఞాన మవుతుంది? దానిని ప్రత్యక్షముగా తెలిసికొనలేము. అనుమానముచేత తెలిసికోవచ్చుననుకొంటే అనవస్థాదోషం వచ్చిపడుతుంది. ప్రత్యక్షప్రమాణంవల్ల ఇంద్రియసన్నికర్షవిశేషవిషయాలు మాత్రం తెలిసికోగలం. భూత భవిష్యత్తులలోని విశేషవిషయాలన్నీ తెలియవు. వ్యాప్తి సామాన్యజ్ఞాన మనుకొన్నచో, యే విశేషవిషయాలమధ్య సంబంధమున్నదో అది ముందే తెలిసినచో ఇక అనుమాన మెందుకు? ఇంద్రియ సన్నికర్షణచేత రామునకు—కృష్ణునకూ సంబంధమున్నదని తెలియవచ్చును. ఈ ఒక్క విషయాన్ని చూచి ఒక్కదూకున తెలియనిదాన్ని ఎలా నిర్ణయిస్తాం? రాములందరూ—కృష్ణులందరూ సంబంధం కలిగి వుంటారని చెప్పగలమా? ఈ వ్యాప్తభావం చూడనిది గదా? దానికి సాక్ష్యంలేదు. ఇతరుల ప్రమాణం నమ్మదగినది కాదు. కారణము, వారి ప్రమాణం అనుమానంతో నిశ్చయింపబడి వుండవచ్చు. కావున వ్యాప్తిజ్ఞానం ప్రత్యక్షంవలన యేర్పడదు.

అయితే అనుమాన ప్రమాణాన్ని అంగీకరించక పోయినచో నిత్యజీవితం శంకానిలయ మవుతుంది. ఈ సంగతిని లోకాయతులు గుర్తించారు. 'లోక ప్రసిద్ధమైన అనుమానం చార్వాకులకు అంగీకారయోగ్యమే. కాని లౌకిక మార్గాన్ని అతిక్రమించే అనుమానాన్ని వారు నిషేధిస్తారు' అని పురందరుడు చెప్పినాడు. పరలోకం, కర్మ, పునర్జన్మ ఇత్యాది సిద్ధాంతాల ప్రతిపాదనకు అనుమానము పనికిరాదని దీని తాత్పర్యం. నిత్య జీవితంలో అనుమానం ఆమోదయోగ్యమే. అనుభవాతీత విషయాలను రుజావు చేయడానికి అది పనికిరాదు. అతీంద్రియ విషయాలు అగోచరాలు కనుక వ్యాప్తివున్నా నిషేధాలే. చార్వాకులు విశ్వస్థితికి కన్పించని అలౌకిక కారణాన్ని అంగీకరింపరు.

మతానికి పునాది ప్రకృతి కతీతమైనది. దానిని గ్రహించాలంటే అనుమానాన్ని అంగీకరించాలి. అందుకు లోకాయతులు వ్యతిరేకులు. అందుచేత వారు ఈశ్వరుని, ప్రకృతి కతీతమైన శక్తినీ అంగీకరింపరు. పైగా 'అప్రత్యక్షంకూడ వున్నదనుకొంటే దరిద్రుడు తన దారిద్ర్యాన్ని, దాసుడు తన కింకరత్వాన్ని విస్మరిస్తాడు. అమాయకుల్లో మతాంధత్వం ప్రబలుతుందని' చార్వాకులు భావించినట్లు మణిభద్రుడు వ్రాసినాడు.

(2) సమస్తవస్తువులు నాలుగు భూతాల సముదాయమనియూ ప్రపంచమునందుగల దానికంతకూ స్వభావం తప్ప వేరే కారణంలేదని లోకాయతుల మతం. చార్వాకులు నాలుగు భూతాలనే అంగీకరించారు. పృథ్వి. జలం. తేజస్సు. వాయువు. అవి నిత్యములు. ఆకాశం ఇతర భూతాలవలె కన్పించదు గనుక దానిని తృణీకరించారు. జడాజడ జగత్తు సర్వమూ ఈ నాలుగు భూతాలనుండి జనించినదే. కార్యమునకు కారణ మేమిటనే సంశయానికి చార్వాకులు ప్రతికార్యమూ తనంతతానుగానే జరుగుతుంది అని సమాధానం చెప్పారు. ముళ్ళకు నిశితత్వం, చెరకునకు తీపి, వేపకు చేదు—ఇవి అన్నియూ ప్రకృతిసిద్ధాలు. మయూరాల విచిత్రవర్ణం, కోకిలల కూజితం స్వభావంతప్ప

మరేమియూలేదు. స్వభావంవల్లనే జగత్తులోని వైచిత్ర్యం సిద్ధిస్తున్నది. 'కార్యకారణభావం నిశ్చయ'మని లోకాయతులు ఒప్పుకోనరు. కార్యానికి అనేక సాధకాలు వుండవచ్చును. ఇందేది కారణమో, కాదో చెప్పుట దుర్ఘటం. వస్తువుల ఉత్పత్తి అకస్మాత్తుగా జరుగుతుంది. దీనినే యదృచ్ఛావాద మనిరి. విశ్వము తన స్వభావంచేతనే సహజంగా సంభవిస్తున్నది. ప్రకృతికి అతీతమైనశక్తి ప్రధాన కారణమనుట తగదు.

దేహము వేరు, ఆత్మ వేరు అని చార్వాకులు తలంపరు. శరీరములేనిదే చైతన్యము లేదు శరీరమునందుమాత్రమే చైతన్యము వున్నది. చైతన్యం పదార్థంయొక్క సహజధర్మం మాత్రమే. ఏది వున్నప్పుడు మరొకటి వుంటుందో అది దాని ధర్మమని పిలువబడుతుంది ఉష్ణత, తేజస్సు అగ్ని ధర్మాలు. చైతన్యం దేహముయొక్క ధర్మం. దేహం లేనిచో చైతన్యం లేదు. చైతన్యం ఆత్మధర్మ మనుకొనటం పొరపాటు. ప్రతివ్యక్తి 'నేను నల్లగా వున్నాను— నేను లావుగా వున్నాను' అని అనుకొంటున్నాడు అనగా అతడు తన దేహమును కాదనుటలేదు. దేహాత్మల ఏకత్వం అనుభవైకవేద్యం. తాంబూలములోని వస్తువుల కలయికవల్ల ఎర్రరంగు ఏర్పడుతున్నది. కొన్ని ద్రవ్యముల కలయికవల్ల మధువు యేర్పడుతున్నది. ఆదేవిధంగా జడభూతముల కలయికవల్ల సహజంగా చైతన్యం ఉదయిస్తున్నది.

శ్రీ దక్షిణరంజనశాస్త్రి చార్వాక దర్శనమునుగురించి వెలువరించిన అభిప్రాయాలు గమనార్హాలు.

"All systems of philosophy in India maintain that the soul is totally distinct from the body. They never doubt that there is something in man different from the visible body. But according to the Lokayata system there is no soul apart from the body............

The systems of Indian philosophy generally recognise four sources of knowledge — perception, inference, authority and analogy. The Charvaka system rejects all these sources of knowledge except perception. All systems of Indian philosophy accept inference as a source of knowledge. It is only the Lokayata system which rejects inference and accepts perception as the sole means of knowlege. According to it there is no God, no fate, no world beyond, no final liberatation, no recompense for acts good or evil. All these negations are due to its rejection of inference as a source of knowledge" (See 'Charvaka philosophy" by Dakshina Ranjana Sastri)

(3) చార్వాకులు శరీరముకంటె ఆత్మను వేరుగా అంగీకరింపరు కనుక వారిదృష్టిలో ఆత్మజ్ఞానం, మోక్షము అనునవి అర్థరహితములు ఈశ్వరవాదుల దృష్టిలో మానవ జీవితానికి మోక్షం పరమ ధర్మం. మోక్షమంటే జీవాత్మ భౌతిక బంధాలనుండి విముక్తిని పొందటం. అనగా సుఖదుఃఖాలనుండీ, జనన మరణాలనుండీ బాధ పొందకుండా వుండటం. ఈ ధర్మాన్ని చార్వాకులు బోధింపలేదు. మనిషి సుఖదుఃఖరహితమైన స్థితిని అందుకోవటాన్ని వారు అయథార్థమందురు కొందరు ధనసంపాదనకై భగవంతుని కల్పనచేసి పుణ్యపాపములకు స్వర్గనరకములని పేరుపెట్టినారు. స్వర్గం లేదు నరకంలేదు. జీవితములో నున్నవి సుఖం, దుఃఖం మాత్రమే సుఖమే స్వర్గం దుఃఖమే నరకం. కాగా ప్రతి మనిషీ దుఃఖాన్ని తొలగించుకొని, సాధ్యమైనంత సుఖాన్ని పొందాలనుకోవటం ధర్మమార్గమే అవుతున్నది. ఆనంద సంపాదనమే మానవుని పరమార్థం. ఆనందం దుఃఖమిశ్రితమే. శుద్ధ ఆనందం దుర్లభమే యత్నించి సుఖాలను అనుభవిస్తూ బాధలను తగ్గించుకోవాలి బాధలున్నాయని సుఖాలను త్యజింపరాదు. ఎముకలున్నవని చేపలను తినటం మానవచ్చునా? ముళ్లువున్నవని గులాబీలను కోయకుండా వుండెదమా? జీవితాన్ని ధైర్యంతో ఎదుర్కొనటం అవసరం. జీవితం వాంఛనీయం. శరీరాన్ని శుష్కింపచేయకూడదు. శరీరం పోతే తిరిగిరాదు. బ్రతికినంతకాలం ఆనందంకోసం యత్నించటం జీవితధర్మమే. అప్పుచేసియైనను నెయ్యి త్రాగవచ్చును (ఋణం కృత్వా ఘృతం పిబేత్.)

అట్లని చార్వాకులు అధర్మవర్తనాన్ని ప్రచారం చేసినారని చెప్పలేము అప్పుచేయమన్నారే గాని, అప్పుతీర్చవద్దని చెప్పలేదు గదా? సుఖాన్ని పొందమన్నారే గాని, అవినీతిని ఆశ్రయించమని చెప్పలేదు గదా? పైగా ప్రజలను మోసగించిన దంభాచారులనూ, కపటపండితులనూ వారు తెగడినారు. చార్వాకులు సాంఘిక జీవనంలోని కట్టుబాట్లను ఆదరించినారు. రాజశాసనాలను మన్నించమని వారు ప్రబోధంచేశారంటే వారు సాంఘికనియమాలనూ, ధర్మాలనూ గౌరవించినారనే తాత్పర్యం. సామాజిక కార్యకలాపాలనదగిన వర్తక, వ్యాపారాలనూ, యితర ఉత్పత్తి కార్యక్రమాలనూ కొనసాగించి సుఖాన్ని పొందటమే చార్వాకులు కోరినది. వారు సంఘజీవితాన్ని కలుషితంచేసే వైయక్తికధర్మాన్ని ప్రబోధింపలేదు 'పారలౌకిక సుఖవాంఛలోనో, స్వర్గంపేరుతోనో లేక యితర భ్రమలతోనో జీవితాన్ని,

సమాజాన్ని రోసి, ఇహలోకసౌఖ్యాన్ని విడటం మూర్ఖత్వమనియూ, రాజశాసన మర్యాదలను ఉల్లంఘించక సుఖంగా బ్రతుక యత్నించటమే ధర్మమనియూ,' చార్వాకులు బోధించిరి

'టుచ్చి' మహాశయుడు (Tucci) చార్వాకుల సిద్ధాంతాలనుగురించి పరిశోధించి, వారు వెలార్చిన పది ప్రధాన సూత్రాలను క్రోడీకరించినాడు ఆ దశసూత్రాలను యిక్కడ పొందుపరుస్తున్నాను:—

1 పవిత్రసాహిత్యమనునది అసత్యముగనుక అనాదరించదగినది (Sacred Literature should be disregarded as being false)

2. దైవమునూ, ప్రకృతికి అతీతమైనదిగానీ లేదు. (There is no deity or supernatural)

3. శాశ్వతమైన ఆత్మలేదు మరణించినతర్వాత ఏమీ వుండదు (There is no immortal soul, nothing exists after death of the body.)

4. కర్మసిద్ధాంతం కేవలం భ్రమ. (Karma is inoperative, it is an illusion)

5 మహాభూతాలనుండియే అన్నియూ సిద్ధించినవి (All is derived from material elements or maha bhutas)

6 మహాభూతాలలో స్వభావసిద్ధమైన శక్తి వున్నది (Material elements have an immanent force or Svabhava)

7. చైతన్యం మహాభూతాలనుండి నిష్పన్నమవుతున్నది. (Intelligence is derived from these elements)

8 ప్రత్యక్షంద్వారానే నిజమైనజ్ఞానం లభిస్తున్నది. (Only direct perception gives true knowledge.)

9. మతనియమాలూ, పూజారివర్గమూ నిష్ప్రయోజనాలు. (Religious injunctions and the sacerdotal class are useless)

10. వీలైనంత ఎక్కువ ఆనందాన్ని పొందటమే జీవితం యొక్క ధర్మం (The aim of life is to get the maximum of pleasure)

'టుచ్చి' మహాశయుని వివరణవల్ల చార్వాక దర్శనం భౌతికవాదమనియూ, అది సనాతనవైదికధర్మాన్ని నిరసించినదనియూ స్పష్టమగుతున్నది.

## "త ద్వి జి జ్ఞా సి స్వ"

ప్రాచీన భౌతికవాదాన్నిగురించి వివరించే కొన్ని ముఖ్యమైన ఆంగ్లగ్రంథాలు:—

1. "Materialism" by M. N Roy
2. "History of Indian philosophy" by Dasgupta
3. "Lokayata" by Deviprasad Chattopadhyaya
4. "Pre-Buddhistic Indian Philosophy" by Dr. Barua
5. "Buddhistic Studies" by Dr. B. C Law
6. "Sketch of Indian Materialism" by Prof Tucci
7. "The Ajivikas" by Prof. Basham
8. "The Naturalistic Tradition in Indian Thought" by Dale Riepe
9. "Charvaka Philosophy" by Dakshina Ranjana Sastri
10. "Ancient Indian Athiestic Movements" by N. Bhattacharya

# చైతన్యభ్రాంతి

శ్రీ పరిగి రాధాకృష్ణ

## 1

కొత్తపడి అలంకరించుకొన్న ముఖం
కందిపోతుందన్నంత సుతారంగా
తీవ్రమైన తపస్సుచేసి పొందిన వరాన్ని
భద్రంగా కాపాడుకోవాలన్నంత తెలివిగా
చైత్ర మెలా అడుగుపెట్టిందో చూడు
చైతన్య సూత్రాన్నెంత చక్కగా చెప్పిందో చూడు.
అట్టహాసం లేదు
ఆర్భాటం లేదు
ఇవి లేక మార్పురాదని
వేదన ఆనందంగా మారదని
మనిషి గట్టిగా నమ్ముతాడు!
ఇవి వుంటే వచ్చిన మార్పెంత ?
గుప్పిట్లోకి చేరిం దెంత ?
అవివేకపు మనుగడకు
జీవితం ప్రతిబింబమైన ఈ దినం
భద్రత లేదని తెలిసి
దిక్కులు చూస్తున్న జనం !
మిన్నంటే ధ్వనులూ ప్రతిధ్వనులూ తప్ప
మితిమీరిన కోలాహలం తప్ప
మార్పెంతగా కనిపించక
మంగళధ్వానం వినిపించక
అపశ్రుతులు మాత్రం
వెక్కిళ్ళై
వేడి నిట్టూర్పులై
వరాల్ని పురితిప్పే కథలై
నవ్వుల్ని నులిమే బాధలై

కప్పివడేసరా!
కట్టిపెడితావా!!

## 2

నేడు
కంచే చేనుమేయుడమే శిలాక్షరం.
పంచేంద్రియానుభవమే పరమార్థం
ఆదర్శాలేవైనా అంబరానికే గొడుగులు
నీచమైన ఆలోచనలకి పరిశుద్ధి పూతలు.
ప్రమాణ వచనాలూ ప్రవచనాలూ ప్రహసనాలు
సామాజిక ఇతివృత్తానికి అతకని శీర్షికలు
విరగబడే జనాన్ని చూసి
చప్పట్లు చరుస్తున్నావు నీవేనా.
వీళ్ళ ఉద్దేశ్యం నీకు తెలీదు.
వీళ్ళెప్పుడు గుమిగూడేది
ఎప్పుడు విడిపోయేదీ నీవు చెప్పలేవు.
మనంలో ఈ పోటీ
సొంతాన్ని చెరపడానికి
సహజాన్ని కూలదోయడానికి
చిగుళ్ళని నరిపెయ్యడానికి
కోయిలను భయపెట్టడానికి.
అయినా ఇది సాగదు
అది వీళ్ళకి తెలియదు.

సంసారం ఎ చుట్టూ
ఘన్నఘోరాలు సమన్వయానికి
అద్భుతమైన అభినయం.
గీతం నవనీతం కాదు విపరీతం
ఉత్సాహం జలపాతంకాదు సుడిగుండం
సొంతానికి కట్టు తెలీదు.
ప్రతీకార భావం లేదు
స్వేటమే తెలుసు
లాభాయకంగా న్యేటమే తెలుసు
చెట్టునీ పిట్టనీ పుస్తె పిట్టని
పచ్చిక వేలాడే పంజరం

మనిషి నాకర్షించాలని చూస్తూంది.
అతనిపై యింకా నమ్మకం గలది.
అందుకే ఆశతో వుంది!

## 3

ఇక్కడ దయనీయమైన దృశ్యాలు
కట్టిన చేతులు కుట్టిన నోళ్ళు
పిరికితనం కురిసే కన్నీళ్ళు
మూగవేదనల మూలుగులు
వసంత మెరుగని ఎడారి బ్రతుకులు
అనంతకాలవాహినిలో
అసహాయుని కేకలూ కలలూ
ఎండుటాకులు గడ్డిపోచలు!
ఎవరినీ కరిగించని
పాపపుణ్యాల ప్రతిధ్వనులు
ఎదగని మనసులతో
లాగినకొద్దీ తెరలు
తెరిచినకొద్దీ అరలు
వెలుతురు చొరని ప్రాంతాలు
పీరింకే యిసుక ప్రదేశాలు
అట్టడుగు పొరల నడుమ
ఆది మానవుని అడుగు జాడలు
మాసిపోని బానిస భావాల గుర్తులు
పైకిమాత్రం బ్రతుకులో ఏవో నిగనిగలు
తళతళా మెరిసే గిల్టు నగలు
లోలోపల దహించివేసే దిగులు
రక్తనాళాల్లో నీళ్ళు
నీళ్ళకి లోకువైన నిప్పులు
కొత్తకోసం ఎదురుచూసి
కాయలుకాచిన కళ్ళు
పాతవాసనల మత్తులో
జోగుతున్న మానవత్వాలు
వర్తమానం యుగసంధి!
సంఘర్షణ బలపడింది.

## 4

జీవితం చైతన్య సహ్యత మెప్పుడు ?
పగటి కలల సంపుటం కానప్పుడు
వెగటుధోరణుల విన్యాసం లేనప్పుడు
అరచేతివై కుంఠా లూరించనప్పుడు
ఆత్మవంచన ఆఖరి శ్వాస వదిలినప్పుడు,
భేషజాలకు తిలోదకా లిచ్చినప్పుడు
అపుడే వర్తమానం వసంతం
అపుడే భవిష్యత్తు కాంతిగీతం.

తేరిపారచూడు తెలుస్తుంది
పాతవే కోరికలు నిర్వచనాలే కొత్తవి
పాతవే నిర్ణయాలు తొడుగులే కొత్తవి.
మనసు పాతదే ఆశలు కొత్తవి
చెట్టు పాతదే చిగుళ్ళు కొత్తవి
ఇది గ్రహించగలిగిన నాడే
శిశిర వేదననీ వసంత మధురిమనీ
సమభావంతో అనుభవించగలం
సమన్వయగీతాన్ని రచించగలం
పాతకొత్తలకి సేతువు నిర్మించగలం
కాలాన్ని సంభావించగలం!



# హృదయోల్లాసంలోని అలంకారాలు

శ్రీ " భాషాభిమాని "

ఏ కావ్యానికయినా శోభను కలిగించేవి గుణాలనీ, ఆ శోభను పెంపొందించేవి అలంకారాలనీ 'కావ్య శోభాయాః కర్తారో ధర్మా గుణాః తదతిశయ హేతవ స్త్వలంకారాః' అనే ఆలంకారికుల నిర్వచనం చెప్తుతూ ఉన్నది. కావ్యాల్లో గుణాలు ముఖ్యాలయినా—'ఈ పద్యంలో ఈ గుణం ఉన్నది' అని వ్యాఖ్యాతలు చెప్తేనే కాని తెలుసుకోవడం కష్టం. అలంకారాలు అంతకంటె సులభంగానే తెలుస్తాయి. అక్షరాలకు ఆవృత్తి వుంటే అనుప్రాసమనీ, పదాలు వెంట వెంటనే ఆవృత్తాలయితే యమకమనీ, పోలికవుంటే ఉపమలనీ, అభేదంగా ఉన్నట్లు వర్ణిస్తే రూపకమనీ, ఊహ వుంటే ఉత్ప్రేక్ష అని—యీ విధంగా స్థూలంగా గ్రహించవచ్చు. చమత్కారాన్ని కలిగించేవి అలంకారాలని లాక్షణికులు చెప్పారు. వ్యాఖ్యాతలు శ్లోకాలకూ, పద్యాలకూ వ్యాఖ్య చేసేటప్పుడు అలంకారాలనే చూపుతారు. అది ఒక ఆచారమయింది. ఆ అలంకారాన్ని పాఠకులు లక్షణంతో పద్యంలో సమన్వయించుకుని ఆనందిస్తారు. ఈవిధంగా సంస్కృత కావ్యాలలోనూ, తెలుగు ప్రబంధాలలోనూ అలంకారాలకు సముచిత స్థానం లభించినది. విపులంగా గాని, సంగ్రహంగా గాని వ్యాఖ్య వ్రాసేవారు వీటి ప్రాముఖ్యాన్ని గమనిస్తూనే ఉంటారు.

ఎన్నో దశాబ్దాలుగా ఎదురు చూస్తూవున్న శ్రీ తాపీ ధర్మారావుగారి విజయ విలాస వ్యాఖ్య—హృదయోల్లాస మనేది కొలదికాలంక్రిందట 1968 లో ముద్రితమయింది. అది ఒక మిత్రుని దగ్గర వుండగా—ఈ నడుమనే చూచే అవకాశం లభించింది. విజయ విలాసంపైనివున్న ఆసక్తి, శ్రీ ధర్మారావుగారి పరిశీలనయెడ గల గౌరవమూ ప్రోత్సహించగా ఆ గ్రంథాన్ని పూర్తిగా చదివాను. వ్యాఖ్యాత చూపిన అర్థ చమత్కృతి చాలా చోట్ల ఎంతో సముచితంగా కానవచ్చింది. హృదయోల్లాసం విపులమైన వ్యాఖ్యానం కావడంవల్ల పెద్ద పెద్ద ప్రబంధాల వ్యాఖ్యాతలవలెనే ఈ వ్యాఖ్యాత యించుమించుగా ప్రతీ పద్యం చివరా, అందులో ఉండే అలంకారాలను చెప్పారు. చాలాచోట్ల వ్యాఖ్యలో ఇవ్వబడిన అలంకారాలు మూలంలో సమన్వయించకుండా వున్నవి. వ్యాఖ్య వ్రాయడంలో కనబరచిన శ్రద్ధ అలంకార నిరూపణ విషయంలో చూపబడలేదని అనుకోవలసివస్తున్నది. సాహిత్యాభిమానులైన పాఠకులు ఆ విషయాన్ని గ్రహించవలెననే ఆశయంతో ఈ వ్యాసంలో సాధారణంగా ఉండే అలంకారాల లక్షణాలను చూపడమూ, హృదయోల్లాసంలోని అలంకారాలను కొన్నిటిని చర్చించడమూ జరిగినది.

అర్థాలంకారాలలో చాలా వాటికి ఉపమానోపమేయాలకు ఉండే పోలిక ప్రధానం. అందువల్లనే అలంకారాల్లో ఉపమ ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకున్నది. అప్పయ్య దీక్షితులవారు చిత్రమీమాంసలో ఈ విషయాన్నే

> "ఉపమైకా శైలూషీ
> సంప్రాప్తా చిత్ర భూమికా భేదాన్,
> రంజయతి కావ్యరంగే—'

అని నాట్యకర్త పోలికతో చక్కగా వివరించారు. ఉపమ, ఉత్ప్రేక్ష, ఉపమేయోపమ, రూపకం, సందేహం, భ్రాంతిమంతము, అతిశయోక్తి మొదలైనవన్నీ ఒక తెగకు చెందినవే! ఈ విషయాన్ని వ్యాఖ్యాత శ్రద్ధగా గమనించినట్లు లేదు.

## 1. ఉపమ—

సమానధర్మంగల ఉపమానోపమేయాలకు పోలికను వర్ణిస్తే, ఉపమాలంకారం అవుతుంది. ఇందు సామ్యవాచకాలైన 'పోలె, వలెన్, కైవడిన్' మొదలయిన పదాలు ఉంటాయి.

> ఉ. అంటిన ప్రేమ జాహ్నవికి
> నప్పుడ తోడ్కొని వచ్చి, యుల్లసా
> ల్లంటి నిజేశ్వరుం దనదు
> గబ్బిచనుంగవ జేర్చి, బాష్పముల్
> కంట దొరంగుచుండఁ దిరు
> గం దిరుగన్ గనుగొంచుఁ గ్రమ్మఱన్,
> జంటఁ దొలంగి సంజను దె
> సం జను జక్కవపెంటియో యనన్'

[ ఆశ్వా. 1 పద్య 179 ]

ఇక్కడ 'జక్కవపెంటియో యనన్' అన్నప్పుడు ఉత్ప్రేక్ష అవుతుందికాని ఉపమ కాదు. వ్యాఖ్యలో మాత్రం ఉపమాలంకారం ఉన్నదని చెప్పబడింది. (పు 283) జక్కవపెంటియుం బలెన్' అని వుంటే ఉపమ అవుతుంది. కాని, యిక్కడ కవి అలా వ్రాయలేదు. పై పద్యం ఉపమకు ఉదాహరణం కాదు.

## 2. ఉపమేయోపమ—

ఒక వస్తువు ఒకమారు ఉపమేయంగానూ, మరొకమారు ఉపమానంగానూ చెప్పబడినట్లయితే ఉపమేయోపమ అవుతుంది.

"హంసవలె చంద్రుడున్నాడు. చంద్రునివలె హంస ఉన్నది" అన్నది దీనికి ఉదాహృతి. మొదటి వాక్యంలో హంస ఉపమానం. చంద్రుడు ఉపమేయం. రెండవ వాక్యంలో హంస ఉపమేయం, చంద్రుడు ఉపమానం. ఈ రెండిటికి పరస్పరం పోలిక ఉన్నది. మూడవ వస్తువు ఏదీ వీటిని పోలినదిలేదని భావం. ఇలాటి వర్ణన వుంటేనే ఉపమేయోపమ అవుతుంది. కాని హృదయోల్లాసంలో ప్రథమాశ్వాసం 33 వ పద్యంలో

'అచ్యుతేంద్ర రఘునాథుఁడె శ్రీ రఘునాథుఁ డెన్నఁగన్'

అనేది ఉపమేయోపమగా (పుట626) చెప్పబడింది. ఇక్కడ శ్రీ రఘునాథత్వం అచ్యుతేంద్ర రఘునాథునిపైనే ఆరోపించబడి వున్నందున అపహ్నుతి కావచ్చునుగాని ఉపమేయోపమ కాదు. 'అచ్యుతేంద్ర రఘునాథునికి రఘునాథుడు సాటి. రఘునాథునికి అచ్యుతేంద్ర రఘునాథుడు సాటి' అని ఉన్నప్పుడే ఉపమేయోపమ ఒప్పుతుంది.

### 3. రూపకము

ఉపమానోపమేయాలకు అభేదం చెప్పినపుడు రూపకం ఒప్పుతుంది. 'ఈ రాజు సాక్షాత్తూ శివుడు' అన్నప్పుడు ఉపమేయమైన రాజుకూ, ఉపమానమైన శివునికీ భేదం లేనట్లు చెప్పబడింది. అందువల్ల ఇక్కడ రూపకాలంకారం ఉంటుంది. శ్రీ ధర్మారావుగారు

'క. ద్రోణాచార్యుల శిష్యుఁడు
బాణాసన నిపుణుఁ డరినృపాలక మకుటీ
శాణాగ్ర తేజితోగ్ర కృ
పాణాంచద్భుజుఁ డతండు ప్రభుమాత్రుండే!!'

(ఆశ్వా 3 పద్య 169)

అనే పద్యంలో రూపకాలంకారం భాసిస్తూ వున్నదని (పుట 624) వ్రాశారు. అర్జునుని వర్ణించే యీ పద్యంలో ఉపమేయమైన అర్జునుడు (అతండు అనే సర్వ నామం ద్వారా) మాత్రమే కానవస్తాడు. ఉపమానం కానరాదు. ఉపమానమే లేనప్పుడు ఉపమానోపమేయాలకు అభేద వర్ణన ఎలా కుదురుతుంది? అర్జునుని పరాక్రమాదులు ఉదాత్తంగా వర్ణించబడడంవల్ల ఇది ఉదాత్తం కావచ్చు. రూపకం కాదు.

### 4. ఉత్ప్రేక్ష—

ఉపమానంయొక్క ధర్మాలు ఉపమేయమందు ఉండడంవల్ల ఉపమేయాన్ని ఉపమానంగా వూహించడం ఉత్ప్రేక్ష. 'బాలచంద్రునివలె వక్రములై ఎర్రగాఉన్న మోదుగు పువ్వులు వసంత సమాగమము పొందిన వనస్థలుల నఖక్షతములో అన్నట్లు ప్రకాశిస్తున్నవి' అనేది ఉదాహరణం. ఇక్కడ నఖ క్షతముల వక్రత, ఎఱుపును ఉపమాన ధర్మములు. అవి ఉపమేయములైన పలాశ కుసుమములయందున్నూ ఉండడంవల్ల ఆ మోదుగు పువ్వులు నఖక్షతాలుగా వూహించబడినవి. హృదయోల్లాసంలో

'కెడల బలరామ కృష్ణులు, నడుమఁ దాను
భద్ర దంతావళము నెక్కి పాండవేయ
ముఖ్యుఁ డతి రాజసంబున మువ్వెలుంగు
పోలిక పొసంగ వచ్చెను బ్రోలికపుడు'

(ఆశ్వా 3 పద్య 178)

అనే పద్యంలో ఉత్ప్రేక్ష (పుట 629) ఉన్నదని చెప్పబడింది. ఇక్కడ బలరామ కృష్ణార్జునులకు మువ్వెలుంగుతో పోలిక ఉన్నది. అంతేకాని, 'వారు మువ్వెలుంగా ఏమి!' అని ఊహింపబడలేదు. ఇక్కడి అలంకారం ఉపమ. ఉత్ప్రేక్ష కాదు.

### 5. సందేహము

పోలికనుబట్టి 'అదా, యిదా?' అని సందేహం కలిగినప్పుడు సందేహాలంకార మవుతుంది. ఒక అందకత్తె ముఖాన్ని వర్ణిస్తున్నప్పుడు "ఇది పద్మమో లేక చంద్రుడో నిర్ణయించలేకున్నాము" అని చెప్పితే సందేహాలంకారానికి ఉదాహరణం కాగలదు. సామ్యం లేకుండా ఇది ఉండదు.

హృదయోల్లాసం 231 వ పుటలో—(తొలి ఆశ్వాసం 141 పద్యం ఎత్తుగీతిలో)

"మొదల నే గంగతటి నున్నయదియు లేపొ
మాయయో కాక యిది యంచు......"

అని సందేహం తోస్తున్నందున కాబోలు సందేహాలంకారమని వ్రాయబడింది. ఇక్కడి సందేహం వాస్తవికమైనది. పోలికను బట్టి కలిగినదికాదు. ఇది సందేహాలంకారానికి ఉదాహరణ కాజాలదు. ఈవిధంగానే 3 0 వ పుటలోని 'జాంపవరా, నొకయెల మావిక్రింద మరుఁడో యనఁగా నరుఁడుండె నయ్యెడన్' అనే ఉత్ప్రేక్షోదాహరణం కావలసినదాన్ని సందేహాలంకారానికి ఉదాహరించడమూ సముచితంకాదు. ఇట్లే 434 వ పేజీలోని

'తొలకరి మెఱుపో యిది యని
తొలకరి దొరబిడ వెఱఁగుతోడం జూడన్'

అనే ఉదాహరణం కూడా ఉత్ప్రేక్షకు సంబంధించినదే కాని, వ్యాఖ్యలో ఉన్నట్లు సందేహాలంకారానికి సంబంధించినది కాదు.

### 6. వ్యతిరేకము

ఉపమానంకంటె ఉపమేయం ఆధిక్యం కల్గి వున్నట్లుగాని న్యూనత కలిగి ఉన్నట్లుగాని వర్ణిస్తే వ్యతిరేకమవుతుంది. "సత్పురుషులు శైలములవలె ఉన్నతులు. కాని వాటివలె కఠినులు కారు. కోమల స్వభావులు" అనేది దీనికి ఉదాహరణం. ఇచట పర్వతాలకంటె సత్పురుషులు గొప్పవారని ఆధిక్యం చెప్పబడింది. హృదయోల్లాసంలో

'రా కొమరు నెఱులు నీలపు
రాకొమరు విరాకరించు రాకాచంద్రున్'

రా కొట్టు మొగము, కెంజిగు
రాకుఁగని పరాకు సేయు వౌర పదంబుల్" ]
(ఆశ్వా 1 పద్య 130)

అనే పద్యంలో వ్యతిరేకాలంకార మని (పుట 213) చెప్ప బడింది. ఇందులో ఉన్నది ఉపమకాని వ్యతిరేకం కాదు. 'నిరాకరించు' రాకొట్టు, పరాకుసేయు' అనేవి ఉపమా వాచకాలు. ఇలాంటి పదాలు పోలికనే తెలియజేస్తాయని దండి మహాకవి కావ్యాదర్శంలో వెల్లడించాడు ఇక్కడ ఉపమానోపమేయాలకు వ్యత్యాసం చెప్ప బడలేదు.

ఈ విధంగానే 360 వ పుటలో ఉన్న 'పంకే జాతములన్ డిసంతు లడుచున్' (ఆశ్వా 2 పద్య 16 లో) కూడా ఉపమాలం కారమే కాని, వ్యాఖ్యాత (పుట 362) చెప్పినట్లు వ్యతిరేకాలంకారం కాదు.

## 7. అతిశయోక్తి

కవియొక్క ప్రౌఢోక్తిని అనుసరించి భేదమునందు లభేద మునుగాని, అభేదమునందు భేదమునుగాని, సంబంధమందు అసంబం ధాన్నిగాని అసంబంధంలో సంబంధాన్నిగాని కార్యకారణ భావంలో పౌర్వాపర్య విపర్యయాన్నిగాని వర్ణిస్తే అతిశయోక్తి లవుతుంది. మొత్తం మీద—తక్కువగా ఉన్నదాన్ని ఎక్కువగా చెప్పడం అతిశయోక్తిగా చెప్పబడుతున్నది.

"ఒడలుప్పొంగు నొయారిఁ జూడ, బవరా
లొద్దన్ మెలంగన్ గరుం
ల్పొడుచున్, ముద్దులగుమ్మ గంధకుసుమం
బుల్ చేత కందిచ్చున
ప్పుడు వ్యాపారము లన్నియున్ మఱచు, న
ప్పూఁబోడి రాకుండినన్
గడెసే పొక్క మహాయుగంబు కరణిన్
గన్పట్టు రాచూలికిన్."
(ఆశ్వా 2. పద్య. 149)

అనే పద్యంలో అతిశయోక్తి అలంకారమున్నదని శ్రీ ధర్మారావు గారు వ్రాశారు ఇందులో స్వభావ వర్ణనయే కానవస్తుంది అతిశయోక్తికి లవకాశం లేదు 'గడియ కాలం మహాయుగంవలె కనబడుతున్నది' లన్నప్పుడు ఉపమాలంకారం కావచ్చు.

## 8. సమాసోక్తి

కవి వర్ణించిన ప్రస్తుత వృత్తాంతంవల్ల అప్రస్తుత మైన మరొక వృత్తాంతం గమ్యమానమైతే సమాసోక్తి. 'రక్తుడైన చంద్రుడు ఐంద్రీముఖమును చుంబించుచున్నాడు' అన్నది ఉదాహరణం. ఎర్రగాఉన్న చంద్రుడు తూర్పున ఉదయించు చున్నాడని ప్రస్తుతార్థం. దీనివల్ల చంద్రుడనే నాయకుడు ఐంద్రియను వాయిక ముఖమును ముద్దుగొనుచున్నాడనే అప్రస్తుత వృత్తాంతం తోస్తున్నది.

'కలిగెఁ బో యీ యింతి కులుకు గుబ్బలు జూడ' అనే (ఆశ్వా 2 పద్య. 111) పద్యంలో సమాసోక్తి ఉన్నదని (పుట 445) చెప్పబడింది. ఇందులో గమ్యమానమయే అప్రస్తుత వృత్తాంతం ఏదీ లేదు. ఇక్కడ సమాసోక్తికి ప్రసక్తియే లేదు.

## 9. పర్యాయోక్తము

చెప్పదలచిన దానిని సూటిగా చెప్పకుండా మరోవిధంగా చెప్పినప్పుడుగాని, ఏదో నెపంమూలంగా ఇష్టకార్యాన్ని నెరవేర్చుకొన్నట్లు చెప్పినప్పుడు కాని పర్యాయోక్తమవుతుంది దీన్నే పర్యాయోక్తి అంటున్నారు. 'రాహువు భార్య మాంగళ్యాన్ని అపహరించిన మహనీయునికి నమస్కారం' అనేది ఉదాహరణ. ఇందులో చెప్పబడిన విషయాన్నిబట్టి ఆ మహనీయుడు విష్ణువని తెలుస్తున్నది. అతనికి నమస్కారమని చెప్పడం కవి ఆశయం. దాన్నే తిప్పి చెప్పాడు హృదయోల్లాసకారులు—

'చూడమె దేవతా సతుల
శోభన కాంతి విలాస వైఖరుల్
చూడమె నాగ కన్యకల
లోక మనోహర రూప సంపదల్
చూడమె మర్త్య కామినుల
సోయగముం దమకంబు పెల్లుతి
పోఁగ దీనివంటి యొఱ
పైన విలాసినిఁ జూడ మెందులన్'

అనే పద్యంలో పర్యాయోక్తి అని (పుట 437) చెప్పడం వింతగా ఉన్నది ఇక్కడ గమ్యాన్ని వేరె రీతిని చెప్పడంగాని, నెపంమూలంగా ఇష్ట కార్యాన్ని నెరవేర్చుకోవడంగాని లేదు ఈవిధంగానే 'మకర కేతనుఁగూర్చి' (ఆశ్వా 2. పద్య 32) కూడా వ్యాఖ్యాత పర్యాయోక్తిని చెప్పడం సరికాదు.

## 10. ఆక్షేపము

మొదట ఒక విషయం చెప్పి—ఆలోచించినమీదట దానికి ప్రతిషేధంగా చెప్పినట్లయితే ఆక్షేపాలంకారము 'ఓ చంద్రుడా! నిన్నొకసారి చూస్తు పో—అక్కర లేదులే! ప్రియురాలి ముఖం ఉన్నది—చాలును' అని ఉదాహృతి. హృదయోల్లాసంలో—

'వేయుఁగన్నులు వలయుఁబో వీరి జూడ
నని కవుల్ దంపులు చెల్ప వినుత చేయఁ
గాదు, పదివేల కన్నులు గావలెనని
చూచుచుండె సహస్రవిలోచనుండు"
[ఆశ్వా 3 పద్య. 108 ]

అనే పద్యంలో ఆక్షేపాలంకారమున్నదని పుట 590 చెప్పబడింది. తాను చెప్పినదాన్ని తానే కాదంటూ చెప్పినప్పుడే ఆక్షేపం లవు తుంది. ఇక్కడ వేయి కన్నులు కావాలని చెప్పినవారు కవులు. 'కాదు—పదివేల కన్నులు కావా'లని చెప్పినవాడు ఇంద్రుడు ఇక్కడ వ్యక్తిభేదం ఉన్నందున ఆక్షేపం కావాలదు.

## 11. విరోధాభాసము

మొదట విరోధం ఉన్నట్లు తోచి—తర్వాత ఆలోచించగా ఆ విరోధం లేనట్లు వర్ణిస్తే విరోధాభాసాలంకారం 'ఆ రాజు అమిత్రులను జయించి తేజస్సుచే మిత్రుని జయించెను' అనేది ఉదాహరణ. అమిత్రులను జయించినవాడు (శత్రువులను జయించినవాడు) మిత్రుని జయించినాడనడం విరుద్ధంగానే కనబడుతుంది. కాని—ఆలోచించి మిత్రుడంటే సూర్యుడని అర్థం గ్రహిస్తే విరోధం ఉండదు. ఈ అలంకారాలలో శ్లేష కానవస్తూ ఉంటుంది. ఈ అలంకారం

'అంగనల పొందు రోసి సన్యాసి యగుట
గిద యువిత మెందు, నా నవ మదనమూర్తి
యంగనామణిఁ గోరి సన్యాసి యయ్యె'
(ఆశ్వా. 2 పద్య 8)

అనే సీస పద్యపు ఎత్తి గీతి భాగంలో ఉన్నట్లు వ్యాఖ్యాత వ్రాశారు. ఇక్కడ విరోధాభాసంతోపాటు చిత్రాలంకారమున్నూ ఉన్నదన్నారు. ఈ రెండున్నూ పరస్పర విరుద్ధాలయిన అలంకారాలు. ఒకచోట ఉండవు. ఇందులో చిత్రాలంకారం ఉన్న మాట వాస్తవమే! విరోధాభాస మాత్రం లేదు ఇక్కడి సన్యాసి పదానికి శ్లేషమూలకంగా అర్థాంతరం కుదరదు.

## 12. అసంగతి

కారణం ఉన్నచోట కాకుండా వేరొకచోట కార్యం జరిగితే అసంగతి. ఒకచోట చెయ్యవలసినదాన్ని మరొకచోట చేసినా, ఒకటి చెయ్యవలసి తద్విరుద్ధంగా ఇంకొకటి చేసినా కూడా అసంగతి అవుతుంది 'ఖలుడు ఒకడి చెవిని కొరికితే మరొకడికి అపాయం కలుగుతుంది' అనేది దీనికి ఉదాహరణ. హృదయోల్లాసకారులు —

'నిద్దంపు మేలి సొమ్ములు
దిద్దిన కస్తూరి బొట్టు దినవల్లులునై
ప్రొద్దొక సింగారముతో
ముద్దియ చనుచేర మిగుల మోహాతురుఁడై'
(ఆశ్వా. 2 పద్య 144)

అనే పద్యంలో అసంగతి అలంకారం ఉన్న దంటున్నారు. (పుట 468) అసంగతి లక్షణం దీనికి కుదరదని అలంకారాల సంగతి తెలియనివారు కూడా సులభంగా గ్రహించవచ్చు వ్యాఖ్యాతారులు ఇందులో అసంగతి వున్నదని ఎందుకన్నారో దురూహంగా ఉన్నది.

## 13. వ్యాజనింద

ఒకరి నిందవల్ల ఇంకొకరి నింద వ్యక్తమైనప్పుడు వ్యాజనిందాలంకారం. 'ఓయీ! బ్రహ్మ! మునుపు నీ శిరస్సులలో ఒక్కదానిని మాత్రమే ఛేదించిన శివుడే నిందించదగినవాడు' అని దీనికి ఉదాహృతి. పై లక్షణం ఇలా ఉండగా హృదయోల్లాసంలో

'చక్కని వారిలో మిగులఁ
జక్కని వాఁడవుగాన నీ వలెన్
జక్కనివారిఁ జంద్రుని వ
సంతునిఁ గూరుచుకొంటి, వందవౌః
జక్కెర వింటిరాజ! యొక
సక్కెమదేమని కూర్చుకొంటి వ
మ్మక్క! యరూపకంబయిన
యా యెల తెమ్మెర నాలిబూతమున్'
(ఆశ్వా. 3 పద్య 45)

అనే పద్యంలో వ్యాజనింద ఉన్నదని (పుట 552) చెప్పబడింది ఇక్కడ మన్మథుని నింద వాచ్యంగా ఉన్నది. దానివల్ల మలయానిల నింద వాచ్యంగా ఉండకుండా వ్యక్తమై ఉన్నప్పుడే వ్యాజనింద అవుతుంది ఇక్కడ 'అరూపకంబయిన... నాలి బూతమున్' అని నింద వాచ్యంగానే ఉన్నది. అందువల ఇక్కడ వ్యాజనిందకు ప్రసక్తి లేదు.

## 15. పరికరము

విశేషణం అభిప్రాయ గర్భితంగా ఉన్నప్పుడు పరికరాలంకారం అవుతుంది. 'చంద్రశేఖరుడైన శివుడు మా తాపాన్ని పోగొట్టుగాక' అని ఉదాహరణం శివుడు తాపాన్ని హరించగల్గుటకు ఆయన తలపైని చంద్రుడు ఉండడం కారణమని అభిప్రాయం. ఇక్కడ శివుని విశేషణమైన 'చంద్రశేఖరుడు' అనేది అభిప్రాయ గర్భితం!

విజయ విలాసం 2 వ ఆశ్వాసంలోని 85వ పద్యమైన

'అప్పుడు సామి తాఁ దలచి
నంతనె వచ్చెనటంచు విస్మయం
బుప్పతిలంగ వేడ్క దళు
కొత్తఁగఁ గన్నుల హర్ష బాష్పముల్
చిప్పిల జక్కి పాదసర
సీజములం బ్రణమిల్లి తద్రుచుల్
రెప్పల నప్పళించుచును
లేవకఁ యుండఁగ సంభ్రమంబునన్'

అనే దానిలో పరికరాలంకారం ఉన్నదన్నారు (పుట 424) వ్యాఖ్యాత ఇక్కడ ఏ విశేష్యంయొక్క ఏ విశేషణం సాభిప్రాయమై ఉన్నదో— పరికరలక్షణం ఎలా సరిపోతుందో తెలియపంలేదు ఇక్కడ ఆ అలంకారానికి ప్రసక్తేలేదు చాలాచోట్ల ప్రసక్తి లేకపోయినా ఈ అలంకారం ఉన్నట్లు వ్యాఖ్యాత వ్రాశారు కూడా.

## 15. పరికరాంకురము

విశేష్యం అభిప్రాయగర్భితంగా ఉంటే పరికరాంకురాలంకారం అవుతుంది 'ఓ రాజా! నీ గుణాలను వర్ణించడానికి శేషుడున్నూ, వ్రాయడానికి కార్తవీర్యార్జునుడున్నూ, చూడడానికి ఇంద్రుడున్నూ సమర్థులు. నావంటివాడు శక్తుడుకాడు' అనేది ఉదాహరణ. ఇక్కడ విశేష్యాలైనవి ఆదిశేష —హైహయార్జున—

ఇంద్రులు' వారిని చెప్పే పదాలు సాభిప్రాయాలు. శేషుడికి వెయ్యి తల లుండడంవల్ల వర్ణింప సమర్థుడనీ, కార్తవీర్యార్జునుడికి వెయ్యి చేతు లుండడంవల్ల అతడు వ్రాయడానికి తగిన వాడనీ, ఇంద్రుడు సహస్రనేత్రుడైనందువల్ల చూడ సమర్థుడనీ భావం. హృదయోల్లాసంలో—

'పను డచటికి నిపుడింపెన
యు 'న దుఃఖం పంచభి స్పహ యనంగాముర్
విని యుందురె కద' యేటికి
మనమున నుమ్మలికఁ జెంద మదవతులారా!'
(ఆశ్వా. 2 ప. 64)

అనే పద్యంలో పరికరాంకురం ఉన్నట్లు (పుట 408) చెప్పబడింది. ఇందులో పరికరాంకుర లక్షణం ఎలా పడుతుందో బోధపడలేదు. ఇందులోని విశేష్యమేదో, అది యెలా సాభిప్రాయమయిందో తెలియదు ఈ విధంగానే 419 పుటలోని "అలకలు నీలములు" అనే పద్యంలోనూ వ్యాఖ్యాత చూపిన పరికరాంకురం గోచరించ లేదు ఇలాగున చాలాచోట్ల ఈ అలంకారం కుదరడంలేదు.

## 16. క్రమము

మొదట కొన్ని పదాలను వరసగా చెప్పి, ఆ తర్వాత ఆ క్రమాన్నే అనుసరించి పదాంతరాలను చెప్పి సమన్వయం చూపిస్తే క్రమాలంకారం. దీన్నే యథాసంఖ్యమని కూడా అంటారు 'ఆ రాజా—శత్రువును, మిత్రుని, విపత్తును జయించి, రంజించి, భంజించెను' అన్నది ఉదాహృతి శత్రువును జయించి, మిత్రుని రంజించి, విపత్తును భంజించెనని అన్వయం. ఈ అలంకారం ఈ పద్ధతిలోనే ఉండాలి.

'కరము సాఁచి నవాంబు కలశ మీఁ విడివడ్డ
కుంకుమాంకపు ముద్దుఁ జంక మెఱపు,
వసలు దేఁబోఁగాళ్లఁ బెనఁగు నంచ నడల్ప'
జూచుఁ జంకెన వాఁడి చూపు బెళుకు,
పూరెమ్మ వంచుచో జారు పయ్యంట దాఁ
గిలి మూఁతలాడు గుబ్బల బెడంగు
'పెఁటి కాయో పండొ పోయిన పని' యన్న
చిలుక మాటకు నవ్వు సొలపుఁ దేట
మఱియు మఱియును జూడనే మనసువాఱి,
వారి కుసుమ ఫలంబులు దేరఁబనఁచుఁ
దొలుతటివి చాలవని యా వధూలలామ
వే మసఁగవచ్చు విచ్చు నేమ మింక?'
(ఆశ్వా 2 పద్య. 141)

అనే పద్యంలో క్రమాలంకారం ఉన్నదంటూ (పుట 466) హృదయోల్లాసకారులు వ్రాశారు. పయి పద్యంలో సీసం పాదాలు నాలుగింటిలోని విషయాలకూ క్రమాన్వయం చూపించే పదాలు ఎత్తి గీతి రెండో పాదంలో 'వారి—కుసుమ—ఫలంబులు' మూడే వాడబడ్డాయి అవి సీసంలోని 1, 2, 4 పాదాలకే సమన్వయిస్తాయి. మూడవ పాదం సంగతి విడువబడింది క్రమాన్ని కవి పాటించినట్లులేదు వ్యాఖ్యాతమాత్రం కవి పాటించని క్రమాన్ని—క్రమమనే భ్రాంతితో క్రమాలంకారమని చెప్పినట్లున్నది.

ఈవిధంగా లక్షణ సమన్వయం కుదరని అలంకారాలు—అర్థాలంకారాలు చాలా ఉన్నవి. మచ్చుకు కొన్ని మాత్రం చూపబడినవి ఈ రీతిగానే కొన్ని శబ్దాలంకారాలూ ఉన్నవి. కొన్నిచోట్ల అనుప్రాసాలకు బదులు యమకాలని చెప్పబడినవి యమకానుప్రాసాల వ్యత్యాసం తెలుసుకోవడం కొంత శ్రమ మూలకమే' అవి కాక స్పష్టంగా కానవస్తున్న వాటిని వ్యాఖ్యాతలు తప్పుగా వ్రాశారని చెప్పవలసి వస్తున్నది. మచ్చుకు రెండు—

### (1) అంత్యానుప్రాసము

అన్ని పాదాల చివరా ఒకే అనుప్రాసం ఉంటే అంత్యాను ప్రాసం అవుతుంది

'గబ్బి మరుఁడన వెట్టుక
గొబ్బునఁ జైఁబడును; సిపుఁ, గూపని వార్తన్
సబ్బిన గర్వం చెక్కడఁ
దబ్బిబ్బౌ కాక పూర్వ తటు బిబ్బోకా!'
(ఆశ్వా 2 పద్య 191)

అనే (పద్యంలో 505 పుట) అంత్యానుప్రాసం ఉందన్నారు వ్యాఖ్యాత ఇక్కడ అది లేదు ఇలాగే 623వ పుటలోనూ, 654 వ పుటలోనూ కూడా ఆ యా పద్యాల వ్యాఖ్యలో అంత్యానుప్రాసాలున్నవని చెప్పడం సరికాదు.

### (2) ముక్తపదగ్రస్తము

విడిచిన పదాన్ని వెంటనే గ్రహించి శబ్ద చమత్కృతిని చూపిస్తూ చెప్పినట్లయితే ముక్తపదగ్రస్త మవుతుంది. ఉదాహరణగా—

'సుదతీనూతన మదనా
మదనా గతురంగపూర్ణ మణిమయ సదనా
సదనామయ గజరదనా
రదనాగేంద్రనిభ కీర్తి రస నరసింహా!'

అనే మూర్తి కవి నరస భూపాలీయోదాహరణాన్ని గ్రహించవచ్చును. ఇక్కడ తొలి పాదం చివరి 'మదనా' అనేదే ద్వితీయ పాదాదిలో మళ్లీ గ్రహించబడింది అలాగే రెండవ పాదం చివరి 'సదనా' అనేది తృతీయపాదం మొదట తీసుకోబడింది మూడవ పాదం చివరి 'రదనా' అనేది ఎత్తుగడ పాదాదిని ప్రకటించబడింది హృదయోల్లాసకారులు —

'నెఱకొప్పు కొనగోర నిమిరినయంతనే
తలకు లే ముద్దుఁ జెక్కిలి చెమర్పఁ,
తళుకు లే ముద్దు జెక్కులి నొక్కినంతనే
వలి గుబ్బ ఎదుఁ గవ పులకరించె

> వలి గుబ్బ చనుఁగవ నలిమినయంతనే
> సతనాభి నీవి బంధంబు ప్రిదితె
> వతనాభి నీవి బంధము నంటునంతనే
> తను వెల్లఁ బరవశత్వము వహించె
> నవలఁ జెప్పెడిదేమి? యా నవరసికుఁడు
> తావి చెంగావి చక్కెర మోవిగ్రోలి
> కుసుమశరు కేళి నేమేమి గురుతు లిడెనొ
> బాల యెఱుఁగదు సౌఖ్యాబ్ధిఁ దేలి యపుడు'
> (ఆశ్వా 3 పద్య 222)

అనే పద్యంలో ముక్త పదగ్రస్తం (పుట 665) ఉన్న దన్నారు. సీసం నాలుగు పాదాల్లోనూ అది వుందని వారి అభిప్రాయమై వుండవచ్చును. ఇందులో మొదటి పాదం చివర 'చెక్కిలి చెమర్చె' అని ఉన్నది ద్వితీయపాదం మొదట మళ్లీ 'చెక్కిలి చెమర్చె' అని వచ్చినపుడే ముక్తపదగ్రస్త మవుతుంది. ఇందులో ఆ రీతిని లేదు రెండవ పాదం చివరి 'చనుఁగవ పులకరించె' అనేది మూడవపాదం మొదట రావాలి అలా లేదు. తృతీయ పాదం చివరి 'నీవిబంధంబు ప్రిదిలె' అనేది వెంటనే తిరిగి రావాలి. అదీ లేదు ఒకవేళ ప్రతిపాదంలోనూ రెండవ సగ భాగాన్నె మొత్తంగా గ్రహించినట్లనుకున్నా—ద్వితీయ పాద ప్రథమభాగం 'తళుకు లే ముద్దుఁ జెక్కిలి చెమర్చినంతనే' అని వుంటేనేకాని లక్షణం సరిపోదు. ఈవిధంగానే తక్కిన పాదాలున్నూ ఈ పద్యంలో ముక్త పదగ్రస్త మున్నదనుకోవడం భ్రాంతి మూలకం ఇక్కడ గృహీత ముక్త రీతి ఉండడంవల్ల అర్థాలంకారమైన ఏకావళి కావచ్చును ముక్తపదగ్రస్తం మాత్రం కాదు.

ఈవిధంగా వ్యాఖ్యాత ఆ యా పద్యాల్లో లేని అలంకారాలను ఉన్నట్లు చూపడమే కాకుండా—ఎంతో స్పష్టంగా కానవస్తూ ఉన్న అలంకారాలను చెప్పకుండా కొన్నిచోట్ల జారవిడిచాడు.

> 'మగవానిని మగవాడును
> మగువను మగువయును వలచు, మతి యేమక న
> న్నగరపు రాజకుమారుల
> జిగి బిగి సోయగము చెలుల సింగారమ్ముల్'
> (ఆశ్వా 1 పద్య 77)

అనే పద్యంలో స్పష్టంగా కావ్యార్థాపత్తి వున్నది దానిముందుపద్యంలో కూడా ఈ అలంకారం ఉన్నది. అక్కడ వ్యాఖ్యలో చెప్పి, యిక్కడ క్రమాన్ని మాత్రం చెప్పి అర్థాపత్తిని ఎందుకు మానివేశారో?

'నిను గీతి సాహితీ మో
హనవాణులు చెవులు పట్టి యాడింపంగాఁ
గనియుండి 'కాముకుఁడుగా'
వని పల్కిన వాకు నచ్చికొనె నృపాలా!'

(ఆశ్వా. 1 పద్య 155)

అనే పద్యంలో ఛేకోక్తి ఉన్నది లోకోక్తి అర్థాంతర గర్భితమై ఉన్నట్లయితే ఛేకోక్తి అవుతుంది ఇక్కడున్న 'చెవులు పట్టి యాడింపంగా' అనే లోకోక్తి అర్థాంతర గర్భితమై ఉన్నది ఇందులో అర్థాంతరం ఉన్నట్లు వ్యాఖ్యాతరే చెప్పారు కూడా పై అలంకారం మాత్రం వ్యాఖ్యలో లేదు.

రెండవ ఆశ్వాసం 48 వ పద్యం సీసం. అందులోని నాల్గు పాదాలలోను

'తన కులస్వామి తండ్రిని సుధాంబుధిఁ బోలఁ
బాలి బుగ్గల మించు లీలఁగనుటఁ,
దన పితామహుని బృందారకాధిపుఁ బోలు
రెప్పవేయక చూచు రీతిఁ గనుట
తన వంశకర్త నుత్సల బాంధవునిఁ బోలఁ
గరము లర్మిలిఁ జాచి గారవుటుట
తన తాత యనుఁగుఁ దమ్ముని నుపేంద్రునిఁ బోలు
నల్ల నల్ల దప్పటడుగు లిడుట'

అని ఉపమాలంకారం (మాలోపమ) స్పష్టంగా కానవస్తూవుండగా వ్యాఖ్యాత ఇందలి అలంకారాలను చెప్తున్నప్పుడు 'శ్లేష, క్రమాలంకారము, స్వభావోక్తి' అన్నారుగాని అన్నిటికన్న ఎక్కువ స్పష్టంగా కొట్టవచ్చినట్లు కానవస్తున్న ఉపమాలంకారాన్ని చెప్పనే లేదు. ఇట్టి వింకా ఎన్నో ఉన్నాయి.

విజయ విలాస వ్యాఖ్య హృదయోల్లాసంలో అలంకార నిరూపణ పై విధంగా కొనసాగింది వ్యాఖ్యాత పద్యంలోని అలంకారాన్ని తెలుపదలచినప్పుడు, ఆ యా అలంకారాల లక్షణాలను మొదట బాగా అవగాహన చేసుకుని, ఆ లక్షణం ప్రకారం అలంకారాలను చెప్పాలి. ఆ విషయంలో హృదయోల్లాసకారులు తగిన శ్రద్ధ చూపలేదనీ, "ఈ అలంకారం ఇక్కడ ఉండకపోతుందా?" అని అనుకొని వాటిని తెలియజేశారనీ అనుకోవలసి వస్తున్నది.

విపుల వ్యాఖ్యతో కూడిన యీ ప్రబంధం త్వరలోనే పునర్ముద్రణ పొందగలదని నా భావన ద్వితీయ ముద్రణలో వ్యాఖ్యాత—శ్రద్ధతో గమనించి అలంకారాలను చెప్పగలరని ఆశి స్తున్నాను.

# సత్రలతి!

శ్రీ "మహానగ్న"

లైల్లి !
ఎందుకో కాని ఈ వేళ
ఈ నిర్నిద్ర నిద్రా తమః ప్రాంగణంలో
ఏపనీ చెయ్యకపోవడమనే
కష్టతరకార్యాన్ని, నెత్తినవేసుకున్న వేళ
ఈ వేళ
ఎందుకో గాని
నీ గురించి ఎవో ఆలోచనలు
నీ గురించి ఎవో అన్పించడాలు......

ఊహలూ ఊహలూ అందంగా ఉంటాయనీ
వాటిని మించిన ఆనందం లేదనీ
అనగా విన్నప్పుడు
నిజమే ననుకున్నాను గాని
అంతకుమించిన నీలోని సౌందర్యాన్నీ
నీ అనుభవంలోని ఆనందాన్నీ
అర్థం చేసుకోలేకపోయాను
నన్ను మన్నించు—
అందుకు నేమ విచారించను ఈ వేళ—
నీ మృదుపాదమంజీర
నిశ్శబ్దనిస్వనా లెగసి
నా ఎడద తాకేవేళ——

తన ఉనికి నిర్దుష్టం చేసుకుందుకు
నవజీవగళంనుంచి
నాడులు కదిలేలా కేకలు విన్పించినప్పుడు
నువ్వా జీవిచెంత జేరి
ఆ బరువుకనులు తెరువనీకుండా చేసి,
అతనిచుట్టూ నర్తించి
ఏవేవో స్వనించి
ఎంతగా ఏడిపిస్తావు?
'అమ్మ! అమ్మదిగోరా!' అని

ప్రాజ్ఞులనుకోబడేవారంతా కల్సి
ఒక మూర్తిని ఆ జీవికి చూపినప్పుడు
‘త్రరజగ’త్తని తెల్పి
ఎవరి కెవరూ ఏవిగాకారచి ఉపన్యసించి

‘ఈ భౌతికవాదుల కఠినమైన
నీ దివ్యమూర్తిత్వానికి
ఈమె అమ్మా?’ అన్పించి
ఆ లేతఅధరాంపై హసనమై
ఈ లోకాన్ని పరిహసిస్తావు నువ్వు.

కారాగారం కదిలినపుడు
ఆ తెలిసీతెలియనితనపు లాలిత్య స్వాన్తం చేసుకు
నాకు తెల్సు
అప్పుడే నువ్వు పూర్తిగా ఉదయిస్తావు
అసలు మనిషికి స్పష్టంగా అనిపిస్తావు —
నువ్వు కదిలి అతనిని కదిపి
ఆలోచనవైపోతావు
జిజ్ఞాసై నిలుస్తావు —

ఏగాలి వీచినా — ఏపూవు పూచినా
ఎందుకో స్పందించి—ఏపాటలో పాడి
వెలికి చెప్పలేని ఏ వేదనానందంలోనో
ఉక్కిరిబిక్కిరయ్యే యవ్వనంలో
ఆకాశపునీలిమా—అంబుధిలో ఆవేశం
సెలయేటిలో చైతన్యం
వెన్నెలలో వెచ్చదనం
వెలదుల చిఱుదరహాసనం
తనకోసమే నన్పింపజేసి
అందమైన సూర్యోదయాలూ
సూర్యాస్తమయాలూ
అన్నీ తనవే నన్పింపచేసి
తనే ననిపింపజేసి
అతనిలోని చేతనవై
సోయగాలుపోతావు నువ్వు.

అప్పుడే కదూ!
ఎన్నెన్నో నవ్వులనీ ఎన్నెన్నో పువ్వులనీ
మమతల నీ మరులనీ
పరుగుని పండువెన్నెలనీ

అల్లరినీ—అల్లిబిల్లినీ
అందంగా అలంకరించుకుంటావు నువ్వు
అవతలిదశలో అతడి శాశ్వతానుబంధంకోసం
ముచ్చటగా ముస్తాబవుతావు నువ్వు.

నిన్న—
నీలాల నింగి నందుకోడానికన్నట్లు
రొమ్ములు విరుచుకు తిరిగిన వ్యక్తిత్వం
ఈనాడు ఏదో పోగొట్టుకున్నట్లు
అవనీన్యస్తదృక్కులతో
వంగివంగి నడుస్తున్నప్పుడు
ఎవరికివారే హేలగా
తమ ఆశాంచలాలవైపు
రెక్కలార్చుకు పోతున్నప్పుడు
నిరాశగా—
తన పక్ష రాహిత్యాన్ని తల్చుకుని
తనకి తనే కుమిలిపోతున్నప్పుడు
మొన్న—
తన మెడచుట్టూ చేతులు పెనవేసి
నవ్వి—నవ్వించిన కన్యాత్వం
ఈనాడు—
నక్కుతూ నసుగుతూన్న
మామ్మగా మారినప్పుడు
నిన్న—
తనకై చేతులు చాచిన బిడ్డలు
ఈనాడు—
తను చేతులు చాచినా చేరరానప్పుడు
కరుణామయా!
నువ్వొక్కతెవే
ఆ సర్వపరిత్యక్తుణ్ణి పరిరంభించి
కునుకువై—కులుకువై
ఏదో కొంత ఊరట కల్గించి
ఆ ఏకాంతజీవి దుర్భరవార్ధక్యానికో
సార్థక్యం చేకూరుస్తావు—

సర్వవ్యాపీ !
కవి శిల్పుల భావనవై
కమనీయ రూపాల నందుకుంటావు నువ్వు
ప్రతి మనిషి ఎడదనీ
ఎప్పుడో చుంబించి
నీ హసనాలతో స్పందింపచేస్తావు—

గెలుపునీ ఓటమినీ
సుఖాన్నీ దుఃఖాన్నీ
మమతలనీ ద్వేషాల్నీ
ఒక్క సూత్రాన బంధించి
సదా గళాల కీలించి
సదా ఎడదల చిగురించి
సదా అంతస్సుల కికురించి
అశ్రువై –హసనమై –అందగిస్తావు నువ్వు—
ఏ దివ్యగాంధర్వాలనో
వినిపిస్తావు నువ్వు –'

---

# తెలుగు నాటకములలో హేతువాదము

**శ్రీ రామమోహనరాయ్**

తెలుగు నాటక రంగానికి నూరేళ్ళు నిండుతున్నా మన జాతి గర్వించదగిన ఉత్తమ నాటకాలు చాల కొద్దిగానే వచ్చాయి. నాటక రచనకూ, ప్రదర్శనకూ మధ్య నేడున్న పెద్ద అఖాతం ఎప్పుడు పూడుతుందో తెలియకుండా ఉన్నది. కన్యాశుల్కము, ప్రతాపరుద్రీయమువంటి నాటకాలు, రచనలో ఎంత గొప్పవైనా తెలుగుదేశపు పల్లెటూళ్ళలో పూర్తిగా ప్రదర్శనకు నోచుకోలేదంటే, ప్రేక్షకుల అభిరుచి నాటకాలలోని సంగీతం వైపుకూ, నాట్యం వైపుకూ, ఆహార్యంవైపుకే మొగ్గు చూపిస్తున్నట్టుగా ఉన్నది. ప్రాచీన జానపద కళారూపాలైన తోలుబొమ్మలాటలూ, వీధి భాగవతాలూ, బుర్రకథలూ, హరికథలూ వెనుకబడుతున్నాయి. ఇంకా మిగిలిఉంటే నామమాత్రంగా 'మ్యూజియం పీసెస్'గానూ, వాటినే నమ్ముకొని జీవనోపాధిని వెతుక్కుంటున్న వృత్తి కళాకారుల వేరుల్లోనూ కొనవూపిరి తీసుకుంటున్నాయి. ఆంధ్ర నాటక రంగాని కింత వెలుగు కాటకమేమి? సాహితీ స్రష్టలెందరికో పుట్టినిల్లయిన మన భూమిలో మంచి నాటకాలెందుకు రాలేదని ఆలోచించవలసి ఉన్నది. మేధావులైన కవులలో వ్యాపించివున్న నిస్పృహ వారిని ప్రదర్శనయోగ్యమూ, జీవితమంత రసవత్తరమైనదీఅయిన నాటకాన్ని వ్రాయటానికి ఉన్ముఖులను చేయటం లేదేమో! కాని మన భాషలోను మేధావులు కొందరు ఆలోచనాత్మకమైన హేతువాద దృక్పథంతో పూర్వపు యితిహాసాలను చారిత్రక గాథలనూ పరిశీలించి కొన్ని మంచి నాటకాలను, నాటికలను వ్రాశారు.* వీటిలో ఇతిహాసాలను హేతువాద దృక్పథంలో పరిశీలించి త్రిపురనేని రామస్వామిచౌదరిగారు వ్రాసిన కురుక్షేత్ర సంగ్రామము, శంబుకవధ, ఖూనీ; ఆమంచర్ల గోపాలరావుగారు వ్రాసిన హిరణ్యకశిపుడు; జి. వి. కృష్ణారావుగారు వ్రాసిన భిక్షాపాత్ర, యాదవ ప్రళయం, దానధార మొదలైనవి ఉన్నాయి. రామాయణాన్ని తన దృక్పథంలో అర్థం చేసికొని ప్రాచీన కాలంనుండి వస్తున్న విశ్వాసాలను తల్లక్రిందులుచేస్తూ ముద్దుకృష్ణగారి 'అశోకం' వచ్చింది. స్త్రీల అధోగతికి జాలిపడుతూ, పాతివ్రత్యభావాన్ని వ్యతిరేకించి పూర్వపు పతివ్రతల జీవితాలను దుయ్యబడుతూ చలంగారు ఎన్నో రూపకాలను వ్రాశారు. వారి రచనలలో భానుమతి, పురూరవ మొదలైనవి విశిష్టమైనవి. పురాణ గాథలలోని నలుడు, కుచేలుడు, సత్యవంతుడు మొదలైన ఉత్తమ పాత్రలను, ఉత్తమమైనవిగా యెంచటానికి వీలేదని వారి జీవితాలలోని సర్వా సత్యాలను బయటపెడుతూ కూడ కొన్ని నాటికలు వ్రాశారు. ఇంక చారిత్రక గాథలనాధారంగా చేసికొని హేతువాద దృష్టిని ప్రవేశపెట్టిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి రాజరాజు; వేలూరి చంద్రశేఖరంగారి కాంచనమాల; బుచ్చిబాబుగారి తిష్యరక్షిత మొదలైనవి ఉన్నాయి. బొబ్బిలియుద్ధం, పలనాటియుద్ధం మొదలయిన వీరగాథల నాధారం జేసికొని తార్కికంగా ఆలోచించిన వారున్నారుగాని వీరిలో పెక్కుమంది మానవత్వాన్ని ప్రాతిపదికగా జేసికొన్నవారుకారు. ఏదోఒక పక్షం వహించినవారే. గోపీచంద్‌గారి పలనాటి యుద్ధము నాటకంలో తాత్త్విక చింతన చోటు చేసుకొన్నది.

ఐతే పైన పేర్కొన్న నాటకాలన్నీ ప్రజలలోకి ఎక్కనవికావు. ఆలోచనాపరులు వాటిని చదివి, స్వబుద్ధి నుపయోగించి నిజానిజాలను తెలుసుకోవటమూ, మళ్లీ పూర్వపు ఇతిహాసాలను తిరుగవెయ్యటమూ, యీ నాటకాలలో ప్రతిపాదించబడిన విషయాలకు నిజంగా ఆ యా యితిహాసాలలో ఆధారాలున్నదీ, లేనిదీ వెతకటమూ, అట్లాగే చారిత్రక గాథలలోని నిగ్గును తేల్చుకొని, చరిత్ర పరిణామాన్ని అరసి, నిజంగా ఎవరిని అభిమానించాలో తేల్చుకోవటమూ అనేవి యీ నాటకాలవలన ప్రయోజనాలు. ఈనాటకాలవలన సాహిత్యం ఎంతైనా పుష్టిని చేకూర్చుకుంటుంది. ప్రదర్శనలో యివి మిగిలిన నాటకాలకంటె వెనుకనే ఉండవచ్చు. వీనిలోని కొన్ని ప్రదర్శింపబడి కొంతవరకు విజయవంతమైనా, ప్రధానంగా యివి పఠనయోగ్యమైన నాటకాలు. కాని పఠన యోగ్యత కూడ నాటకానికి తక్కువైనదేమీ కాదే! నాట్య శాస్త్రకర్త భరతముని

'క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యం చ యద్భవేత్
సర్వ శాస్త్రార్థ సంపన్నం సర్వ శిల్ప ప్రవర్తకమ్''

నాటకంవలన శ్రవ్యత్వాన్ని అనుషంగికంగానైనా అంగీకరించాడు. కాళిదాసాది కవులు మాత్రం నాట్యాన్ని చాక్షుషక్రతువని ప్రశంసిస్తూ నాటకం విషయంలో కవిత్వాన్ని ప్రదర్శనకంటె అధికంగా మన్నించినందువలన వారి నాటకాలు విలువ నేమీ కోల్పోలేదు.

ఇతిహాసాలలోని కథలను తమ నాటకాల కనుగుణంగా మార్చుకుంటూరావటం సంస్కృత నాటక కర్తల కాలంనుండీ వస్తున్నదే. తెలియవచ్చినంతలో భాస మహాకవి రామాయణ భారతాల నెన్నోవిధాలుగా నాటకానుగుణ్యంగాను, తన భావాల కను

---

* నాటకము, నాటిక అనే శబ్దాలు రూపక సామాన్య వాచకాలుగా యీ వ్యాసంలో ఉపయోగించటం జరిగింది.

గుణంగానూ మార్చుకొన్నాడు రామాయణ రచనలలో యజ్ఞ ఫల నాటకం భాసునిదిగా అనుమానాస్పదమైనా, అభిషేక, ప్రతిమా నాటకాలలో రామాయణ కథను మార్చి, నూతన కల్పనలు చెయ్యటానికి భాస మహాకవి సాహసించాడు ప్రతిమా నాటకం లోని ప్రతిమాగృహ కల్పనమనేది రామాయణంలో లేదు అంతే గాక రావణుడు సన్యాసి వేషంతో వచ్చి సీత నపహరించటమూ, రాముడు తన తండ్రి శ్రాద్ధమును నిర్వహించటానికి రావణుని ఆదేశంతోనే ఆశ్రమాన్ని వదలివెళ్లటమూ, లక్ష్మణు డంతకు ముందే ముని జనులవద్దకు వెళ్లటమూ రామాయణంలో లేని కల్పనలు ఇంకా వల్కలములను ధరించిన సీతా రాములకు, తాము ఆరణ్యమున కేగవలయునని అప్పుడే తెలియటమూ, జనస్థానము లోనే రాముడు పట్టాభిషేకము చేసుకోవటమూ అనేవి రామా యణాన్ని మార్చి నాటకకర్త కల్పించినవి ఈ కల్పనములవలన కైక, సీత పాత్రలను గురించి రామాయణ కథ కల్పించే కొన్ని అనుమానాలను భాసుడు తన వూహాల కనుగుణంగా, ఆ యా పాత్రలకు కళంకం అంటకుండ రక్షిస్తూ వాటిని పునర్నిర్మించగలిగాడు.

భారతగాథను భాస మహాకవి యింకా మార్పులకు గురి చేశాడు 'మధ్యమ వ్యాయోగం'లోని కథంతా గూడ భారతములో లేదు. బకాసుర సంహారమువంటి భారత కథా ఘట్టాలను దృష్టిలో ఉంచుకొని— ఘటోత్కచుడు, హిడింబ, భీముడు— యీ మూడు పాత్రలను భారతమునుండి తీసుకొని భాసు డీ వ్యాయోగం వ్రాసినట్లు కనిపిస్తున్నది బ్రాహ్మణ బాలకులలో మధ్యముని ఘటోత్కచునినుండి కాపాడటానికి కుంతీ సుత మధ్యముడైన భీముడు ఘటోత్కచుని ఎదిరించటం యిందులోని కథ భాసుని కల్పనా సామర్థ్యానికి యీ వ్యాయోగం చక్కని నిదర్శనము. 'దూత ఘటోత్కచము'లోని యితివృత్తము కూడ భారతములో లేదు. అభిమన్యుని మరణ వార్త విని గాంధారీ ధృతరాష్ట్రులు ఎంతో శోకిస్తారు అర్జునుని పరాక్రమాన్ని తలచుకొని ధృతరాష్ట్రుడు భీతిని జెందుతాడు. దుస్సల తన భర్త సైంధవునికి మరణం తప్పదని తలచి సహగమనానికి సిద్ధమవుతుంది. దుర్యోధన, దుశ్శాసన, శకునులు అభిమన్యుని చంపిన విజయోత్సాహంతో అక్కడికి వస్తారు కర్ణుణ్ణి యిక్కడ ప్రవేశపెట్టకపోవటం భాసుడు పాటించిన గొప్ప ఔచిత్యం. అప్పు డాకాశ మార్గాన ఘటోత్కచుడు వచ్చి శ్రీ కృష్ణుని సందేశాన్ని వినిపిస్తాడు. దుర్యోధనుడు మండిపడి "దూతవు కాబట్టి బ్రతికిపోయా"వని ఘటోత్కచుని దూలనాడుతాడు. ఘటోత్కచుడు రోషంతో తాను దూతను గానని తెల్చి "మీరు రాక్షసుల కన్నను మహాక్రూరులు" అని నిందించి యుద్ధానికి సిద్ధమవుతాడు ధృతరాష్ట్రుని మాట విని శాంతించి తిరిగి వెళ్లిపోతాడు. దీనిలో ధృతరాష్ట్ర ఘటోత్కచులను చక్కగా వారి స్వభావాల కనుగుణంగా చిత్రించి భారత కథలో కొత్త ఘట్టాన్ని జొప్పించాడు కవి. 'కర్ణభారము' అనే దానిలో గూడ భారత కథకు భిన్నమైన కల్పన లున్నాయి. 'శల్య సారథ్యము' అనే జాతీయాన్ని కవి కల్లగా మార్చేశాడు దీనిలో శల్యుడు కర్ణుని దీనమైన వృత్తాంతాన్ని సానుభూతితో వింటాడు అంతే గాక ఇంద్రునికి కవచకుండలాల్ని యివ్వబోతే శల్యుడు వారిస్తాడు గూడ! కర్ణుడు ఏది యివ్వబోయినా బ్రాహ్మణవేషంలో ఉన్న ఇంద్రుడు తృప్తిపడకపోతే కర్ణుడే తనకు తానుగా కవచ కుండలా లిస్తానని పలుకుతాడు. ఇంద్రుడు కూడ సంశయించి సమస్త దేవతలచేత నిశ్చయింపబడటంచేతనే ఆ దానాన్ని స్వీకరించాడట—ఏ పాత్రకూ కళంకం కలుగకుండ—అత్యద్భుత శిల్ప విన్యాసాన్ని ప్రదర్శిస్తూ రచించటం భాస మహాకవికే చెల్లింది. "పంచ రాత్రము"లోని యితివృత్తమూ భారతములో కనుపించదు దుర్యోధను డొక యజ్ఞము చేసి ముగించి, పెద్దల ఆశీస్సులను కోరతాడు. ద్రోణు డాశీర్వదింపబోయేటప్పుడు దుర్యోధనుడు తమ గురువు నేదేని కోరుకొమ్మంటాడు ద్రోణుడు మొదట సంకోచించి, పిమ్మట అజ్ఞాతవాసములో వున్న పాండవులకు అర్ధరాజ్యమును పంచి యిమ్మంటాడు అందు కిష్టపడని దుర్యోధనుడు శకునితో ఆలోచించి "పంచరాత్రము"లలో తిరిగివస్తే అర్ధ రాజ్య మిస్తానని వాగ్దానం చేస్తాడు భీష్ముడు రహస్యంగా ప్రోత్సహిస్తే, ద్రోణు డీ షరతు కంగీకరిస్తాడు. పంచరాత్రముల లోనే ఉత్తర గోగ్రహణము జరగటం యుధిష్ఠిరుడు విరటుని కొలువులోనుండి బయటికి రావటంచేత దుర్యోధనుడు అర్ధరాజ్యాన్ని యిచ్చివేస్తాడు ఈ కథ కిక పర్యవసానాన్ని భాస మహాకవి ఎలా వూహించాడో చెప్పటము కష్టము. ఈ నాటకంలో అభిమన్యుడు బృహన్నలకు బందీగా చిక్కుతాడు అప్పుడు భీముడు అభిమన్యుడితో సంభాషించే సన్నివేశం అనల్ప శిల్పకౌశలాన్ని వెల్లడిస్తున్నది. 'ఊరు భంగము'లో దుర్యోధనుని పశ్చాత్తాపాన్ని వర్ణించాడు కవి. ఇది భారతంకంటె భిన్నమైనది నాటక లక్షణాల ననుసరింపకుండ తన స్వతంత్ర మార్గాన్ని యేర్పరచుకోవటంలోను భాసుని విప్లవాత్మక దృష్టి వెల్లడవుతున్నది ఆయన ఇతిహాసాలను మార్చినది ఔచితీపరిపోషణకు, రసోచితమైన నాటకీయతకేగాని యితిహాసాల పట్ల గౌరవము లేకకాదు.

కవికుల గురువు కాళిదాసు 'అభిజ్ఞాన శాకున్తలమ్' నాటకంలో ఉన్న దూర్వాసశాప వృత్తాంతము, కశ్యపాశ్రమంలో శకుంతలా దుష్యంతుల పునస్సమాగమము మొదలైనవి భారత కథలోని దుష్యంతోపాఖ్యానములో లేవు. "నాటకేషు శకున్తలా" అని ప్రసిద్ధిని పొందటానికి యీ కల్పనలు తోడ్పడ్డాయి గాని అడ్డు రాలేదు రసపరిపుష్టి కీ కల్పనలెంతైనా దోహదం చేశాయి

భారత కథా వస్తుకములైన నాటకాలలో వేణీ సంహారము పేర్కొనదగినది భట్ట నారాయణకవి యీ నాటకంలో ద్రౌపది అరణ్యవాసకాలములోను, ఆ తరువాత కూడ దుశ్శాసనుని రుధిరముతో తడిపేదాక జుట్టును ముడివేసుకోకుండ ఉండటమనేది భారత కథకు భిన్నంగానే కల్పించాడు ఇది భారతములోనే ఉన్న దేమోనని సామాన్యులకు భ్రాంతి కలిగేలాగ కవి యీ మార్పును ప్రవేశ పెట్టాడు.

రామ కథ యితివృత్తంగా గల నాటకాలలో కుందమాల విశిష్టమైనది. దిఙ్నాగకవి యీ నాటకంలో రామ కథలో లేక పోయినా కేవలము నాటకీయత కోసం విదూషక పాత్రను ప్రవేశ పెట్టాడు. ప్రధానమైన మల్లెపువ్వుల దండ (కుందమాల) ప్రసక్తి రామాయణ కథలో లేనేలేదు శక్తిభద్రునిచే రచింప బడిన 'ఆశ్చర్య చూడామణి' నాటకంలో రామాయణంలో లేని చూడామణి వృత్తాంతము ప్రముఖ స్థానము వహించినది భవ భూతి కవి విరచితమైన 'ఉత్తర రామచరితమ్'లో సీతారాముల చిత్రపట సందర్శన ఘట్టము రామాయణములో లేకపోయినా రామచరితమును సంక్షిప్త పరచి, నాటకానుగుణంగా మార్చుటకై కవి కల్పించినదే. మురారికవి రచించిన అనర్ఘ రాఘవము'లో పరశురామ గర్వభంగము మిథిలానగరములో జరిగినట్లుగా వర్ణింప బడినది కాని వాల్మీకి రామాయణములో యిది మిథిలనుండి రామ లక్ష్మణులు, వారి బంధువులు తరలి వస్తున్నప్పుడు జరిగినట్లుగా ఉన్నది. రాజశేఖర కవి రచితమైన 'బాలరామాయణము'లో రావణుడు సీతా స్వయంవరానికి వచ్చి విల్లును స్పృశించి గూడ, అంతలోనే మనస్సు మార్చుకొని తిరిగి పోవుట రామాయణ కథకు భిన్నముగా వర్ణితమైనది. ఈవిధంగా ప్రసిద్ధ సంస్కృత నాటకాలన్నింటిలోనూ యితిహాసాల ననుసరించినట్లే వాటినుండి స్వతంత్రించి మార్పులను పవేశ పెట్టటం కూడ జరిగింది

ఈ శతాబ్దారంభంలో తెలుగు నాటక కర్తలు యితిహాసాలను, సంస్కృత నాటకాలను క్షుణ్ణంగా పరిశీలించి వస్తు స్వీకరణలో తామెందుకు నూతన మార్గాల నవలంబించకూడదని యెంచి నూతన మార్గాల నేర్పరచారు సంస్కృత నాటక కర్తలు యితిహాసాలను భక్తి విశ్వాసాలతో చదివి నాటకాలను వ్రాస్తే, వీరు సత్యాన్వేషణతోనూ, శాస్త్ర విజ్ఞాన దృక్పథంతోను ఇతిహాసాలను చదివి, హేతుబద్ధంగా సత్యాన్ని తేల్చుకొని నాటక రచనకు పూనుకొన్నారు. పురాణాలలోని కథలు విశ్వాసయోగ్యాలుగా కనిపించకపోయేసరికి వీరు, ఆ పురాణాలలోని రాక్షసులలోని మంచితనాన్ని, ప్రతినాయకులలోని ఔన్నత్యాన్ని, స్త్రీలకు జరిగిన అన్యాయాలను, ఆర్యఋషుల లేఖినులు కొన్ని వర్గాలను అణగద్రొక్కటానికి వ్రాసిన వర్ణాశ్రమ ధర్మాల లోటుపాట్లను పరిశీలించి వ్యుత్పన్నులై తమకున్న ప్రతిభతో నాటక రచనకు పూనుకొన్నారు ఐతే ఆధునిక తెలుగు నాటకము పూర్తిగా సంస్కృతము లోనుండి వూడిపడినది కాదు సంస్కృత, ఆంగ్ల నాటకాల ప్రభావమేగాక యింకా ధార్వాడ నాటక సమాజాలూ, మొదలైన వాటి ప్రభావం కూడ మన నాటకాలపై ఉన్నది.

తొలి తరంలో ప్రముఖులైన ధర్మవరము, కోలాచలమువారల దృష్టి కొంతవరకు విషాదాంత నాటకాలవైపు, పాశ్చాత్య పద్ధతిలో సుదీర్ఘమైన స్వగతాలరచన వైపు మొగ్గినంతగా యితివృత్తంలో స్వాతంత్ర్యాన్ని తీసుకోవాలన్న కాంక్షపై మొగ్గు చూపలేదు. వీరేశలింగంపంతులుగారూ, చిలకమర్తివారలలో హేతువాద భావనలు పుష్కలంగా ఉన్నప్పటికీ, వీరేశలింగంగారి బహు కార్యవ్యగ్రత శిల్పసుందరమైన గొప్ప నాటక రచనలోనే విశిష్టంగా నిలువలేకపోయింది.చిలకమర్తివారి గయోపాఖ్యానంలోనూ ప్రజాసామాన్యాన్ని ఆకర్షించేందుకు వాకోవాక్య సంభాషణరీతి లోను ధారాళమైన పద్య రచనలోనూ, శ్రీకృష్ణుడూ, అర్జునుడూ పరస్పరమూ ఆరోపించుకొనే సందర్భంలో ఉక్తి చాతుర్యములోనూ రాణించినంతగా హేతువాదంలో రాణించలేదు. కాని 'గయోపాఖ్యానము' వ్యాస భారతములోను, కవిత్రయ భారతము లోను లేని కథ పానుగంటివారి నాటకాలు భక్తి భావ శబలితాలైనంతగా హేతువాదముద్ర పడినవికావు. కాని సాక్షి వ్యాసాలలో వారి హేతువాద దృష్టి పుష్కలంగానే వెల్లడవుతున్నది. మహా భారత నాటక చక్రము వ్రాసిన తిరుపతి వేంకట కవుల పద్య రచనాశక్తి ప్రేక్షక హృదయాలను ఆకట్టుకొన్నది. వారిలో స్వల్పంగా హేతువాదదృష్టి దుర్యోధనుడు తొడలు విరిగిపడి ఉన్నప్పుడు కృష్ణుని ఆక్షేపించి పలికిన పలుకులలో తొంగి చూస్తున్నది. తిరుపతి వేంకట కవుల శిష్యుడైన శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిని హేతువాదయుగములో ప్రారంభకులుగా యెంచవచ్చు. విశ్వనాథ సత్యనారాయణగారు 'హేతువాద యుగము' అనే శ్రవ్య నాటికలో (భారతిలో ప్రచురితమైనది) త్రిపురనేని వారిని హేతువాదయుగానికి ప్రారంభకులుగా యెన్నిక చేశారు త్రిపురనేనివారు భారత కథను వివరించుచు కురుక్షేత్ర సంగ్రామము రామాయణములోని శంబుకుని సంహరించుటను గూర్చి 'శంబుక వధ', భాగవత కథలోని వేనరాజు మరణమును గూర్చి 'ఖూనీ' అనే నాటకాలను వ్రాశారు. వీరి తర్వాత మరి కొంద రీ హేతువాదయుగాన్ని తమ నాటకాలతో మన సాహిత్యాన్నలంకరించారు

కౌరవ పక్షానిదే న్యాయమని నిరూపించటానికి త్రిపురనేనివారు 'కురుక్షేత్ర సంగ్రామము' వ్రాశారు. వా రీ నాటకాన్ని తమ యవ్వన దశలో వ్రాశారు. శిల్పంపైనా సన్నివేశ కల్పనపైనా వీరు తగినంత దృష్టిని పెట్టినట్లులేదు. తిరుపతి కవుల శిష్యులైన వీరు పద్యములను మాత్రం ధారాశుద్ధి ఉట్టిపడేటట్లు వ్రాశారు "పరేంగిత జ్ఞాన భాసమానభావా! సహదేవా! నిర్నిద్ర రౌద్ర రస తృణీకృత భీమా! భీమా!" వంటి సుదీర్ఘమైన సంబోధనలు అచ్చంగా గురువుగారి శైలినుండి వూడిపడ్డవే. గురువుల నెదిరించి పాండవులది ధర్మపక్షం కాదని వాదించారు వీరు. చెళ్లపిళ్లవారికి వీరి నాటకాన్ని వినిపించి "మా చేసిన లోపమున. నీవు పూరించినావు" అనిపించుకొన్న తర్వాతే ముద్రింపించారు. వీరు శాంతిప్రియులు. కావుననే యీ నాటకం మొదట

"ఆవు బెద్దులు రెండు పోరాడుచుండ
నడుమనున్న లేగలకాళ్లు నలుగునట్లు
పుడమికై కురుపాండవుల్ పోర నున్న
నోరులు చచ్చెద రిటునటు తిరగలేక"

అని మానవతావాద దృక్పథంతో యుద్ధాన్ని ద్వేషించారు. వీ రీ నాటకములో ఆసాంతమూ గూడ రాజ్యపరిపాలనాధికారము కనిష్ఠ కుటుంబములో ఉండుట ధర్మముకాదనీ, కురువంశమున పూర్వ మెప్పుడూ కనిష్ఠ కుటుంబికులు రాజ్యం చేయలేదనీ, పాండవుల కర్ధరాజ్యము పంచి యిచ్చినది భీష్ముడు, ధృత

రాష్ట్రుడూ దయతో చేసినదేగాని ధర్మపక్షంగా చేసినది కాదనీ, ఆ హక్కును గూడ పాండవులు జూదములో వోడిపోయి, పదమూడేండ్లు రాజ్యపదభ్రష్టులగుటచేత 'కాలదోషము' పట్టి, వారు తమ హక్కును కోల్పోయారనీ వీరు వాదించారు. కృష్ణుని కుటిల రాజనీతి భారత ఘోర యుద్ధానికి కారణమైందని వీరి తలంపు. ధర్మరాజు ఐదూళ్లడిగినది నిష్కల్మషముగా కాదనీ, ఐదూళ్లలో మాకంది, వారణావతములు ద్రోణాచార్యుని యధీనములోను, కుశస్థలి కర్ణుని స్వాధీనములోను ఉండుటచేత వాని నిచ్చుటకు కౌరవులకు హక్కులేదనీ, ఇక వృకస్థలి హస్తిపట్టణమునకు దాపున ఉండటంచేత దాన్ని యిస్తే కౌరవులకు పక్కలో బల్లెమవుతుందనీ తెలిసి ధర్మరాజీ కోరికను బయటపెట్టి కౌరవులను వంచింపజూచాడని తాము నమ్మిన సత్యాన్ని నిర్భయంగా లోకానికి వెల్లడించారు. వీరీ నాటకంలో విదురుని కుటిల రాజనీతిజ్ఞునిగా, ఎత్తుకు పై యెత్తులు వేసి కౌరవుల యింటినుండి పాండవులకు రహస్యాల్ని చేరవేసిన ద్రోహిగా చిత్రించారు భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు పాండవ పక్షపాతులని భారత కథనే అనుసరించారు. రాయబార సమయంలో కృష్ణుని విశ్వరూప సందర్శనం అనే అంశాన్ని యీ నాటకంలో లేకుండ చేశారు. కృష్ణుని కుటిల రాజనీతిజ్ఞునిగ యెంచే వీరు విశ్వరూప సందర్శనాన్ని యెలా నమ్మగలుగుతారు?

పెండ్యాలవారి భారత విమర్శన కాలానికీ, వేదము వెంకటాచలముగారి భారత విమర్శకూ, భాసుని భారత రూపకము లచ్చుపడటానికి పూర్వమే వీరు నాటకరూపంగా యీ వాదాన్ని చేశారంటే విస్మయం కలుగుతుంది. వీరి హేతువాద శక్తి కెదురు నిలిచి సాహిత్యరూపంలో జవాబు చెప్పినవారు లేరనటం అతిశయోక్తి కాదు.

ఉత్తర రామాయణ కథలో శ్రీరాముడు శంబుకుడను శూద్ర తపస్విని వధించును. శూద్రుడు తపము చేయటం వర్ణాశ్రమ ధర్మాలకు విరుద్ధము కాబట్టి తాను వధించుట తప్పదని శ్రీరాముడు శంబుకునితో వాదిస్తాడు. ఈ కథను కవిరాజు ఆర్య ద్రావిడ కలహముగా నెంచి తమ హేతువాదదృష్టిని ప్రసరింపచేశారు. ఆర్యులలో మొదట బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను మూడే వర్ణాలున్నాయి. వానరులను యింకా తమ చేతిలో వోడిపోయిన లంకావాసులను, మిగిలిన అనార్య జాతులను లొంగదీసుకొని, వారిని శూద్రులని పేరుపెట్టి నీచముగా చూడ జొచ్చినారు. శంబుకు డీ విధముగా ఆర్యేతరుడు. ఈతనిని శూద్రుడని తలంచి, ఆర్యేతరులు తపముచేస్తే, ఆ రాజ్యములో బ్రాహ్మణుల కాపదలు వాటిల్లుతాయని శ్రీరామునకు నూరిపోసి శంబుకుని వధింపచేసినా రార్యపండితులు. నాలుగంకముల యీ నాటకము శిల్పదృష్టితో చూచినప్పటికీ మేలైనది. ప్రథమాంకములో కిష్కింధాపుర యువరాజైన అంగదుడు అయోధ్యా పట్టణానికి వచ్చి రామరాజ్యములోని పరిస్థితులను చూచి అసంతృప్తుడవుతాడు. అనార్యులను శ్రీరాముని పాలన ఎన్నో యిడుములకు గురిచేసిందని తెలుసుకుంటాడు. సీతను విడిచిపెట్టినందుకు శంబుకుడు పొందిన అసంతృప్తిని అర్థముచేసికొంటాడు. ఆర్య ఋషులు కల్మషమతులై తమ శత్రువుల్ని అణచటానికి పక్షపాతబుద్ధితో ధర్మాల్ని నిర్ణయించారని శంబుకుడు

"చోరత్వమును జేయు శూద్రుని కవయవ
విచ్ఛేదనము శాస్త్ర విహితమంట!
ఆ దోషమునె విప్రు డాచరించిన యంత
మందలింపులె ధర్మమార్గమంట!
బ్రాహ్మణీ స్నేహ సంపర్కమ్ముగల శూద్రు
నగ్ని కర్పించుట న్యాయమంట!
శూద్ర వనిత మరుల్ సొక్కిన విప్రుండు
సంతాపపడుటయే చాలునంట!
ఇవియె మన ధర్మ శాస్త్రము లిందునందు
నివియె చుమ్మి నిష్పక్ష పాతైక బుద్ధి
మనకుగాఁ జెప్పి పెట్టిన మహితములగు
గ్రంథరాజముల్ వానర రాజపుత్ర!"

యని పలికిన పలుకులు కవిరాజు హృదయమునందలి భావములనే ధ్వనించినవి. వసిష్ఠాదులు కుట్రపన్ని ఒక బ్రాహ్మణ బాలకుని మూర్ఛాగ్రస్తుని చేసి, అతడు మరణించినట్లు నమ్మించి ఆతని మరణానికి శూద్రుని తపమే కారణమని శ్రీరామునిచేత నమ్మించి, ఆ శూద్రుని వధింపుమని వేడుకొంటారు. రాముడు చేసేదిలేక శంబుకుని పరీక్షించి నిర్ణయానికి రావాలనుకొంటాడు. శంబుకుడు "నా మరణము ద్రావిడ సంఘమునందు నూతన జీవము కల్పింపదనియా నీ నమ్మకము? ఆత్మాభిమానముగల ప్రతి జాతికిని క్రూర దండనమున స్వాతంత్ర్య రక్షణ శక్తిని బుట్టించును" అని అంగదునితో చెప్పి మరణించటానికే సిద్ధపడతాడు. ఈ మాటలు కవి భావాలే ననటానికి ఏమాత్రమూ సందేహం అక్కరలేదు.

శ్రీరాముడు శంబుకుని "నీవు శూద్రుడవు గావా" అని ప్రశ్నిస్తే "మేము శూద్రశబ్ద వాచ్యుల మెట్లగుదుము? ఆ శబ్దమును మా మెడ కేల యంటగట్టెదరు? మేము ద్రావిడులము" అని బదులు చెప్పును. శంబుకుడు "వేద ప్రామాణ్యము నంగీకరింతునేగాని స్వార్థపరులైన ఆర్య ఋషులు వ్రాసిన స్మృతుల నంగీకరింప"నని స్పష్టముగా చెప్పేస్తాడు. శ్రీరాముడు శంబుకునికి అభయమిచ్చి గూడ వసిష్ఠుని తిరస్కరింపలేక, శంబుక వధకు సన్నద్ధమవుతాడు. అప్పుడొక బ్రహ్మచారి "మా బాబయ్యగారిని చంపవల"దని ప్రాధేయపడితే "పిల్లవాని మాటలతో నేమ"ని వసిష్ఠుడు త్రోసిపుచ్చుతాడు. శ్రీరాముడు "దేశికేంద్రా! అబము సుబ మెరుగని కసుగందు. ఏమియుఁ జేయకు"డనెను. ఈ సన్నివేశము నాటకానికంతటికీ ఆయువు పట్టు.

ఈ నాటకాన్ని రచించిన చాలకాలంవరకు దీనిని కేవలము బ్రాహ్మణ వ్యతిరేకోద్యమ ప్రచారం క్రింద జమకట్టి నిర్లక్ష్యం చేయుటం జరిగింది. కొంద రసూయతోను, మాత్సర్యంతోను నాటకాన్ని కవిని గూడ దుయ్యబట్టటం జరిగింది. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు త్రిపురనేని వారిని సవరిస్తూ

మరొకమాట చెప్పారు. శ్రీరాముడు శంబుకుని వధించటం తప్పే కాని శంబుక వధకు ప్రోత్సహించినది నారదుడుగాని వసిష్ఠుడు కాదని, వాల్మీకి రామాయణంనుండి ఆధారం చూపిస్తూ నారదుడు బ్రాహ్మణుడు కాదుగదా యని తర్కించారు. ప్రోత్సహించిందెవరైనా శంబుకవధ అన్యాయమని బ్రహ్మయ్యశాస్త్రిగారివంటి సనాతనులు సైతం అంగీకరించారంటే కవిరాజుగారి హేతువాద శక్తికి మరొక నివాళి యెందుకు?

భాగవతములోని వేనరాజు కథ నాధారముగ గొని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'వేనరాజు' అను నాటకాన్ని రచించారు. దానిని వ్రాతప్రతిగా ఉండగానే చదివి త్రిపురనేనివారు వేనరాజునకు తీరని అన్యాయము జరిగినదని ఆందోళనజెంది, ఆర్య ఋషులందరును గలసి వేనరాజును 'ఖూనీ' చేసిరని దృఢముగ నమ్మి 'ఖూనీ' అనే నాటకాన్ని రచించారు వీరి నాటకాన్ని రచించేముందు సంస్కృత భాగవతాన్నీ ఆంధ్ర భాగవతాన్నీ జాగరూకతతో చదివారు వేనుని కథ భాగవత చతుర్థ స్కంధములో ఉన్నది. భాగవతము వేనుని దుర్మార్గమును గూర్చి చెప్పుచు నాతడు "బాలురను పశుప్రకరంబును బోలె వరికట్టి చంపె" ననుచున్నది. దీనిని త్రిపురనేనివారు విశ్వసింపలేదు. అంత దుర్మార్గుడైతే చిన్నతనమునుండీ ఆతనిని గమనించిన ఋషులు లాతడినే ఎందుకు పట్టాభిషిక్తుని చేశారని చిక్కు ప్రశ్నను లేవదీశారు. అంతేగాక వేనుడు రాజైనప్పుడు "సమస్త తస్కరులు సర్పభీతిచే దలంగు మూషికములకైవడి గహనములందు నడగి' రని చెప్పినది భాగవతము. ఈవిధంగా చేసిన రాజు దుర్మార్గు డెందుకౌతాడు. చోరులను దండించటం రాజు కర్తవ్యం కాదా యేమిటి? భాగవతము ప్రకారము వేనుఁడు పాషండుడు, నాస్తికుడు—పాషండు డనగా వేద బాహ్యుడనే గదా అర్థము. వేద బాహ్యుడైనంతమాత్రాన అతనిని చంపుట అధర్మమని కవిరాజుగారు తలంచారు. వేనుడు దేవుని నమ్మని నాస్తికడైతే

"హరిహర హిరణ్యగర్భ
స్వరధీశ్వర వహ్ని శమన జలధిపతి మరు
న్నరవాహన శశిభూ రవి
సురముఖ్యులు నృప శరీర సూచకు లగుటన్
పరికించి నను భజింపుఁడు
ధరణీశుఁడు సర్వ దేవతామయుఁడగు మ
త్సర ముడుగుడు నా కంటెను
బురుషుఁడు మరి యెవ్వ డగ్రపూజార్హుఁడిలన్'

అనే భాగవత పద్యాలే యిందుకు విరుద్ధంగా నిలుస్తాయి. ఆర్య ఋషులు రాజును "నా విష్ణుః పృథివీపతిః" యని ఎంచినవారే గదా! భాగవతములో చెప్పిన వేనునిగూర్చిన గుణగణాలను విశ్వనాథవారు తారుమారు చేశారు. వేనుడు వివాహ వ్యవస్థకే వ్యతిరేకి అనీ, "ఏక గర్భ జనితులైన స్త్రీ పురుషులు వివాహమాడినచో నాస్తి విషయమున భేదమే రాదు కదా" అని వాదించిన క్రూరాత్ముడనీ, తన చెల్లెలు పృథువుసౌందర్యమునే కాముకునివలె వర్ణించిన పిశాచమనీ, తన తండ్రిని తల్లిని బంధించి చెర నుంచ ప్రయత్నించిన పాపి అనీ ఏమేమో కల్పించారు. ఎందుకనో దయతలచి వేనుడు గొప్ప సంగీత శాస్త్రవేత్త అనీ, అతని వీణానాదము విని ఆతని మిత్రుడు గౌతముడు కరగిపోయి వేనుని తప్పిదము'లను క్షమించాలని కూడ అనుకున్నట్లు కల్పించారు. "ముడికిరాని కేశములు శిరస్సున నుండరాదు. వానినుండి యోగశక్తి మనకు తెలియకుండ బోవును' అని వాదించునంతటి ఆర్షమత విశ్వాసి యీ గౌతముడు ఆస్తికమతములోని సత్యా సత్యములను తేల్చుకొనదలచిన వేనుఁడు గౌతముని దృష్టిలో పాపాత్ముడు, అవశ్యం వధింపదగినవాడు

'ఖూనీ' నాటకములో వేనరాజు హేతువాది. తన తల్లి యైన సునీథాదేవిని గౌరవించి ఆదరించి ఆమె యిచ్ఛానుసారముగా నడచుకొనినవాడు ఆమె కూడ అతనిని అర్థము చేసికొని తోడ్పడిన రాజమాత. గౌతముడు యజ్ఞములందు విశ్వాసమున్న ఆర్య ఋషియేకాని వేనుని మిత్రుడు కాడు యజ్ఞములన్నీ ఉన్నత లోకముల ప్రాప్తికొరకనీ, యజ్ఞపశువును బలి యిచ్చినందువలన దానికి కూడ మోక్షము కలుగుతుందనీ వాదిస్తాడు. అప్పుడు వేనుఁడు గౌతముని శిష్యుడైన శునశ్శేపుని ఉద్దేశించి "మీ కులపతియు, గురువునైన యీ వృద్ధ గౌతముఁడు నిన్ను యజ్ఞపశువుంగా జేసి, యీ యజ్ఞమును ముగించినచో లోక మెంత సంతసిల్లును?... దీనికి నీవేల యొడంబడవు' అని తార్కికంగా ప్రశ్నిస్తాడు.

"వర్ణ ధర్మము కూలిపోయెను
వేద ధర్మము కాలిపోయెను
రాజధర్మము వ్రీలిపోయెను
రాజు రైతును నొక్కటే నట!
కాని కాలము వచ్చె నేటికి
గర్మ మిట్టులు బండిపోయెను
బ్రాహ్మణుండును నవర వర్ణుఁడు
ప్రాతపట్టములేరి తమ్ముడా"

అని శునశ్శేపుడు వేనుని సేనాపతి ధృష్టవర్మతో చెప్పిన మాటలనుబట్టి వేనుని పరిపాలన ఎట్టిదో మన మూహించుకోవచ్చు. వేనుడు తనపై పృథువూ ధృష్టవర్మ కుట్రపన్నుచున్నారని తెలిసి విరక్తుడవుతాడు. పృథువును విశ్వనాథవారు తమ నాటకములో కొంతదూరము చెల్లెలుగాను, తర్వాత తమ్మునిగాను చెప్పారు. భాగవతము పృథువు వేనుని 'తనూజు' డనుచున్నది. త్రిపురనేనివారు పృథువు వేనుని కుమారుడనియే జెప్పినారు. వేనుడు విరక్తుడైన పిమ్మట తన తల్లితో "ఈ ప్రపంచమున నా పని పూర్తియైనది...ఈ ప్రపంచములో నేజేయుం దగినదియులేదు. ఏ బుద్ధుడో యీ పాప పంకిలమగు లోకము నుద్ధరింపవలయునుగాని సామాన్య మానవులకు సాధ్యము కాదు'' అని చెప్తాడు. ఇక్కడ త్రిపురనేనివారు బుద్ధుని ప్రసక్తి తీసికొని, రావటం అనవసరం. వేనుని చంపిన తరువాత ధృష్టవర్మ తెలివి తెచ్చుకొని, పశ్చాత్తాపపడతాడు. ఆర్య ఋషులు పృథుమహారాజును ప్రేరేచి ధృష్టవర్మను కూడ చంపిస్తారు.

విశ్వనాధవారు ఆర్షమతం పట్ల విశ్వాసం గలవారు. కవి రాజు మానవతావాదేగాని ప్రత్యేకంగా ఒక మతాన్ని అభిమానించిన వారుకారు. ప్రపంచ జనాభాలో అధికులు బౌద్ధులనీ, మతము లేని వారెందరో ఉన్నారనీ, ఎన్నో కోట్లమంది చెట్లు చేమలను పూజించేవారున్నారని, వారందరు ఆర్షమతంపట్ల విశ్వాసం గలిగిన వారు కారుగదా? వారందరికీ సద్గతులు కలుగవనీ, వారందరూ చంపబడవలసిన వారని యెంచటం అన్యాయమనీ భావించి, వేన రాజు ఖూనీ చేయబడెనని యెంచి 'ఖూనీ' నాటకాన్ని వ్రాశారు వేనరాజు, ఖూనీ నాటకాలలోని వాదాలను విజ్ఞులు హేతుబద్ధముగా ఆలోచించి వాస్తవాన్ని తెలుసుకోవచ్చు. త్రిపురనేనివారి నాటకాలకు వారే వ్రాసుకొన్న కొన్ని పీఠికలను తప్పక చదవాలి. వారి హేతువాద దృక్పథం ఆ పీఠికలలో మరింత చక్కగా తెలుస్తుంది

రామాయణ గాధను కేవలమూ భక్తి విశ్వాసాలతోగాక ఆలోచనతో చదివి హేతుబద్ధంగా తర్కించి ప్రజలలో పాతుకు పోయిన మూఢవిశ్వాసాలను, గుడ్డి భక్తినీ కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించటానికి శ్రీ ముద్దుకృష్ణ 'అశోకం' అనే నాటకము వ్రాశారు రామాయణాన్ని కేవలం పూజా పదార్ధంగా యెంచి, చదవటం కూడ అవసరం కాదని దేవుడి గదిలో పెట్టి, విగ్రహంతో పాటు దానికీ ఒక నమస్కారం పడవేసి మోక్షానికి ఒక మెట్టుగా భావించే మెదడు ప్రయోజనంలేని భక్తులు ఈ నాటకాన్ని చదవద్దని సింహావలోకనం అనే చివరి మాటలలో వ్రాశారు ''వాల్మీకి మహాకవే, ఆయన కళా సంపత్తి ఉత్తమమైనదే. కాని అంతమాత్రాన రామాయణాన్ని విమర్శించడం తగాదా కాదు. ఆ కాలానికి ఉత్తమంగా కనుపించిన ఆశయాలను కథలో చొప్పించి, ఆ కథలోని వ్యక్తుల జీవితాలు ఆదర్శప్రాయంగా ఒప్పించటంలో వాల్మీకికి యెంత హక్కో ఏ కవికయినా అంత హక్కూ ఉన్నది'' అని వివరిస్తూ, 'కవి నిరంకుశు'డని విస్మరించవద్దంటారు. హేతువాదానికి తావిచ్చి వాల్మీకి రామాయణంలోని కొన్ని సందర్భాలనుబట్టి నిష్పాక్షికంగా యోచిస్తే రావణుడు ఈనాటికీ అందరూ అనుకుంటూవున్నట్లు దుర్మార్గుడూ రాక్షసుడూ కాడు, సరేగదా చాలా పెద్ద మనిషిగా కూడా కనబడతాడు అంటారు. చదువరులకు వెంటనే "అయితే పరదారను సీతను ఎందుకు అపహరించవలెను'' అనే ప్రశ్న తలెత్తుతుంది ఈ ప్రశ్నను రచయితే తీసుకొని వాల్మీకి రామాయణము సుందర కాండ 70 వ సర్గ 5 శ్లోకము

"స్వధర్మో రక్షసాం భీరు సర్వదైవ న సంశయ
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమధ్య వా"

అనే రావణుని మాటలనే ఉదాహరించి పరదారల నెత్తుక పోవటము రక్షసులకు స్వధర్మము అని చెప్పారు. ఆ కాలానికి ఆ జాతికి అది ధర్మము అని వివరించారు. రావణుడు కాముకుడు కాదంటారు. రాక్షసుడంటే రక్షస్—రక్షించేవారు అని ఇందుకు

"రక్షామ ఇతి యైరుక్తం రాక్షసా స్తే భవంతువః
యక్షామ ఇతి యైరుక్తం యక్షా ఏవ భవంతువః"

అని ప్రమాణం చూపారు. రావణ శబ్దాన్ని 'రాక్షస కులాన్నంతా' రావంతో నింపినవాడు కాబట్టి రావణుడనే పేరొచ్చిందని తలంచారు. సురులు అంటే తాగుడు అవలంబించినవారని, అసురులు అంటే తాగనివారనీ భావించారు. రాముడు శంబుకుని సంహరించటం వీరికి కూడ అన్యాయంగానే తోచింది. ఎవరూ దూషింప నక్కర లేకుండానే వాల్మీకి రామాయణంలోని కొన్ని శ్లోకాలు చదివితే రాముడి మాటలూ సీత పలికిన పలుకులూ వారి నాదర్శమూర్తులుగ గౌరవించటానికి వీల్లేకుండ ఉన్నవని వీరు సోపపత్తికంగా వివరించారు రామాయణ గాధను ఏమాత్రమూ ద్వేషించకుండానే సత్యాన్వేషణతో శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు 'రామాయణ విశేషములు' అనే గ్రంధం వ్రాశారు.

సీత రావణునితో స్నేహంగా మాట్లాడటాన్ని స్వయం వరానికి ముందే రావణుడు తన ప్రేమను ప్రకటిస్తే సీత "అర్థం చేసుకున్నాను'' అనటంవలనను, పంచవటి ఆశ్రమంలో రావణుడు సీతారాముల ఆతిధ్యాన్ని పొందినట్లు వర్ణించడం వలన రాముడు సీతతో "సీతా నీకు జీవితంలో ప్రేమే ప్రధానమైతే భౌతిక జీవితం అనుభవించడంలో అద్వితీయుడూ, తన సమస్తం అర్పించి నిన్నే సర్వస్వంగా యెంచుకొనే రావణుడే నీకు తగినవాడు......'' అని అనటంవలనను అగ్ని పరీక్ష తర్వాత రాముడు "సీతా! రావణుడు సజీవుడే అయివుంటే ఈ అగ్నిని తన కన్నీటితోనైనా ఆర్పేవాడు .. బతికివున్నట్టయితే . .ఈ అగ్ని పరీక్షకు కూడ చాల బాధ పడేవాడు'' అంటే, సీత కూడ "అవును, చాలా బాధ పడేవాడు" అంటుంది. ఇతర రామాయణాలకంటె రావణుని పాత్రను ముద్దుకృష్ణగారెక్కువ సానుభూతితో వర్ణించటాన్ని రామభక్తులైన చదువరులు తమ కాళ్లక్రింద భూమి తొలుచుకుపోతాన్నట్టుగా భావించి దరిదాపు యీ నాటకాన్ని వెలివేశారు. కర్మభూమియైన యీ దేశంలో ఎందరు మేధావులు ప్రయత్నించినా రామభక్తిని సడలింపలేకపోవచ్చు. అది వేరేమాట. కాని రావ కథను గూర్చి నూతన పద్ధతిలో ఆలోచింపజేయటంచేత, హేతువాద బుద్ధి గలిగిన చదువరు లీ నాటకాన్ని చదువుతూనే ఉన్నారు.

రావణునేగాక యింకా యితరులైన రాక్షసుల గురించి కూడ పురాణాలలోను, ఇతిహాసాలలోను చెప్పిన విషయాలను ప్రజ లపార్ధం చేసుకొంటున్నారని కలతజెంది వాస్తవాన్ని వెల్లడించబూనుకొన్నారు. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు తమ 'మాలపల్లి' నవలలో హిరణ్యకశిపుని వాస్తవస్వరూపాన్నిగూర్చి 'తక్కెళ్ళ జగ్గడ' నే పాత్ర ముఖాన ''ప్రహ్లాద కథ చాలాభాగం కల్పితం. ఈసృష్టిలో పశుబలమనీ ఆత్మబలమనీ రెండు శక్తులు లేవు. ఉన్నది ఒకటే శక్తి. ధనికులు బీదలను మోసగించడానికి పండితులకు డబ్బిచ్చి ఆత్మశక్తిని సృష్టించారు. హిరణ్యకశిపుని వంటి పౌరుషశాలిని నే నెక్కడా చూడలేదు. అతని ధర్మ నిష్ఠ అనుపమేయం. "బహుధా భాజితోప్యేవం ననమేయం తు కస్యచిత్'' నన్ను వేయి చీలికలుగా చీల్చినా నే నెవడికీ నమస్కరించనని ఎదురు రొమ్మూ పొట్టా చీల్చిన తర్వాత తొడలమీద

బొర్లా పడవేసుకుంటే యొగసి వెల్లకిలబడి తల ప్రక్కను తిప్పాడు. ఇట్టి దృఢవ్రతుడు నభూతో న భవిష్యతి' అని చెప్పించారు.

హిరణ్యకశిపుని గూర్చిన నిజం యీ విధంగా ఉంటుందని నిరూపించటానికి ఆమంచర్ల గోపాలరావుగారు 'హిరణ్యకశిపుడు' అనే నాటకం వ్రాశారు. వీరీ నాటకంలో మతం పేరిట జరిగిన ఘోరాలను గూర్చి తెలిపి, అసలు మతం అనే భావాన్నే గర్హించారు. తమ ముందుమాటలో "సంఘం మతం పేరుతో మానవుని పీడించడం మనం ఎరగనిది కాదు గత శతాబ్దానికి ముందు వరకూ మతం పేరుతో మనవారు సహగమనాలు చేయించారు. ముక్కు పచ్చలారని పసిపిల్లలను ముసలివాండ్లకు కట్టి ఆ ముదుసలులు మరణించగానే, మతం పేరుతో ఆ పసికూనలను ముదుసలి భర్తల శవాలతోపాటు నిలువున, సజీవంగానే మనవారు దహనం చేసెడివారు మతం మానవునకు వెర్రి కల్పించలేక పోయినట్లైతే మన దేశ చరిత్ర, ప్రపంచచరిత్రయే మరో రూపం దాల్చిఉండేది" అని వీరు భావించారు. తమ నాటక సంకల్పాన్ని వివరిస్తూ "పురాణము లందలి సర్వ ఇతిహాసాలలోను భావం ఒక్కటే. ఆ దేముడో లేక దేవతో మతాన్ని నమ్మినవారికి సర్వైశ్వర్యాలనూ సంప్రాప్తింపజేస్తుంది. మత ప్రతిపక్షులకు హతం, వినాశం మాత్రం నిశ్చయం హిరణ్యకశిపు వధ కూడ ఇటువంటి కోవకు చెందినదే." అన్నారు అందుకే హిరణ్యకశిపుని కథ వాయు, కూర్మ, పద్మ పురాణాలలో వేర్వేరు విధంగా ఉండటాన్నిగూర్చి వివరించి, అస్సలు కథ వేరే ఉందని స్వతంత్రంగా ఆలోచించి నిర్మించారు

ఆరు సంవత్సరములు తపము చేసిన తరువాత హిరణ్యకశిపుడు మృత్యువును జయింప గలిగిన శక్తిని సంపాదిస్తాడు. తన గురువైన శుక్రాచార్యునితో "ప్రథమమున లోకమున వర్తిల్లుచున్న మతాచారముల నిర్మూల మొనరింతును" అని పలుకును. ఇది విని శుక్రాచార్యుడు దిగ్భ్రమచెందగా, మత మనేది లేకున్న లోకమున యింత కష్టము, పాపము, వంచనము, హింస మొదలగు ఘోరారిష్టముల ఉనికియేయుండదని వివరిస్తాడు మతవిధ్వంసనము దైవ ద్రోహమని గురువు హెచ్చరింపగా "దైవమే లేనపుడు మానవుడు దైవద్రోహి యగుటెట్లు?" అని అడ్డు ప్రశ్న వేస్తాడు. శుక్రాచార్య డాగ్రహముతో అక్కడినుండి వెళ్లిపోతాడు. తరువాత శుక్రాచార్యుడు మంత్రి, సేనాపతి, పురోహితు లందరితో కుట్రచేసి, ఆ కుట్రలో ప్రహ్లాదుని కూడ చేర్చుకొని "నీ తండ్రిని దైవమే చంపు"నని ఆతడిని వంచిస్తాడు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని తన సిద్ధాంతములను నచ్చజెప్ప ప్రయత్నించునప్పుడు వానిని నమ్మలేని ప్రహ్లాదుడు దైవభక్తి నాధారంగా జేసికొని వాదిస్తాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో హేళనగా "అయిన దేవు డెక్కడ నున్నాడు?"" అంటాడు.

ప్రహ్లాదుడు— ఎల్లెడల.

హిరణ్య కశిపుడు— (నవ్వుచు) ఈ స్తంభమున?

అని ప్రహ్లాదుని వంక చూస్తూంటే హంతకుడు వెనుక నుండి లంఘించి బాకుతో డొక్కలో పొడిచి పలాయితుడవుతాడు. ప్రహ్లాదునికి నరసింహరూపము కంటబడుతుంది. ప్రహ్లాదుడు భ్రమపడి తన తండ్రిని దైవమే సంహరించాడనుకొని "దేవుని స్మరించి నరక కూపమునుండి తప్పించుకొనుడు" అని తండ్రిని ప్రాధేయ పడతాడు. కాని హిరణ్యకశిపుడు మాత్రము తన చావునకు విచారింపక "నే చచ్చినను విప్లవ మొక్కసారి అగ్నిపర్వతము ఎతె బద్దలు కాకమానదు దాని ప్రచండాగ్నిజ్వాలల నొకనాడు దైవ మత గురువులు బుగ్గియై పోవుదురు" అని పలికి మరణిస్తాడు. నాటకకర్త తన భావాల నివిధంగా యిక్కడ వెల్లడించారు ఈనాటకాన్ని గోపాల రావుగారు "చారువాకాది సర్వ విప్లవ కారులకు" అంకితం చేయటం ఒక విశేషం చార్వాక మెంతో ప్రాచీన విప్లవం. మహాభారత కాలమునాటికే యిది ప్రచారంలో ఉన్నట్లు భారతములోనే సాక్ష్య మున్నది. చార్వాకుల తత్త్వశాస్త్రమును గూర్చి, "నాస్తిక దర్శనములు" అనే వ్యాసములో (1921 దుర్మతి—సంవత్సరాది సంచిక) వేలూరి శివరామ శాస్త్రిగారు విపులంగా వివరించారు. గ్రంథాలను ప్రమాణంగా తీసుకోవటానికి ప్రాచీనమైన చార్వాకుల గ్రంధాలు లభించకున్నా వారి వాద మెంతో ప్రాచీన మైనదే ననటానికి సందేహం అక్కరలేదు

ఆమంచర్ల గోపాలరావుగారు 'విశ్వంతర' నాటకంలో బౌద్ధ మతానికి సంబందించిన ఇతివృత్తాన్ని తీసుకొని మానవతావాదానికే తమ భావాలను మళ్లించారు. "నాటకానికి మామూలుగా కవీ, నటుడూ, ప్రేక్షకుడూ ఈ ముగ్గురూ ప్రత్యేకించి మూడు అంగాలు. 'విశ్వంతర'లో ఈ ముగ్గురూ ఏకమవుతారు. ఇది కొత్త సిద్ధాంతం కథలోనూ, పాత్ర పోషణలోనూ, శిల్పంలోనూ సరికొత్త నాటకం విశ్వంతర"అని నీలంరాజు శేషయ్యగారు పేర్కొన్నారు. క్రీ. శ 200 ప్రాంతంలో మొలకెత్తిన వజ్రయానం బౌద్ధమత పతనావస్థ కేవిధంగా దారి తీసినదీ యీ నాటకంలో వర్ణింప బడింది వజ్రయాన సంప్రదాయం, మంత్రాలు, తంత్రాలు, ధారణులు, ముద్రలు, మండపాలు అన్నింటినీ కలగలుపుకొని, హిందూదేవతలను తమ దేవతలకు బానిసలను చేసుకొనే వరకు వచ్చి క్రీ. శ. 7 వ శతాబ్దంనుండి బౌద్ధమత పతనానికి కారణమయింది. గోపాలరావుగారీ నాటకంలో ప్రకటించిన బౌద్ధమత విజ్ఞానము, సత్యాన్వేషణ కెంతైనా దోహదం చేస్తుంది.

నరసింహావతార మనేది భూటకమని దాన్ని నమ్మక గుడిపాటి వెంకటచలంగారు 1940 ప్రాంతాలలో ఒక నాటిక వ్రాసి, మళ్లీ యిటీవల దాన్ని చదువుకొని, అసంతృప్తి పడి తానికదను కొంత సవరించి వ్రాసిన నాటికనూ కలిపి యిటీవలనే ప్రకటించారు. (చూ: యుముడిముందు చలం). ప్రహ్లాదుని భక్తిని చలంగా రప్పుడూ యిప్పుడూ యీసడిస్తూనే ఉన్నారు. చలంగారి హేతువాద దృష్టికి విశ్వాసం తోడుకావటంతో వారి మార్గం ప్రత్యేకమైనదిగా మిగిలిపోయింది హేతువాద భావనతో నాటకాలను వ్రాసినవా రాయన నాదర్శంగా తీసుకోలేదు. లోకంలోని ప్రజలు ఉత్తములుగా ఆరాధించే కుచేలుడు, సత్యవంతుడు, నలుడు, హరిశ్చంద్రుడు మొదలైన పురాణ

పాత్రల నన్నింటినీ తనకోణంనుండి పరిశీలించి దుయ్యబట్టారు. చలంగారికి స్త్రీలంటే ఎంత గౌరవమో పతివ్రతలంటే అంత అసహ్యం. అందుకే వారు సావిత్రి, దమయంతి, సుమతి, తులసి మొదలైన పతివ్రతలందరినీ తమరచనలలో అపహాస్యంపాలు చేశారు. పాతివ్రత్యం అనే భావంకంటె పురుషుణ్ణి ఆనందింపజేసే వేశ్యలు మేలని వారు వాదిస్తూవచ్చారు. లోకంతో వారికి రాజీ కుదరలేదు. చలంగారు స్త్రీల నెంత గౌరవించారో తెలుసుకోటానికి వారి నాటికలలో భానుమతి, పురూరవ అనే వాటిని చదివితే తెలుస్తుంది.

ద్రౌపదికి జరిగిన తీవ్రమైన అపచారానికి భానుమతీదేవి సానుభూతి కనబరుస్తుంది. ధర్మరాజు ద్రౌపదిని జూదంలో వోడిపోయినప్పుడు ద్రౌపది భానుమతీదేవి మందిరంలోనే ఉంటుంది 'ప్రాతిగామి' ద్రౌపదిని తీసుకుపోవటానికి వస్తే భానుమతీదేవి కళ్లెర్రజేసి వాడిని వెళ్లగొడుతుంది. దుశ్శాసనుడు వచ్చి అన్నగారి ఆజ్ఞను తెలియజేసి ద్రౌపదిని బలాత్కారంగా తీసుకుపోబోతే భానుమతి పరుషంగా దుశ్శాసనుణ్ణి తూలనాడుతుంది కాని ఆమె నిస్సహాయమై తన అంతఃపురంలో మిగిలిపోతుంది. ఆమె ద్రౌపదితో "పెద్ద భావగారితో ఏ స్త్రీ అయినా ఎలా కాపురం జేస్తుంది? ఆయనకున్న వ్యసనాలు జూదమూ, ధర్మం మీది ఆసక్తీ" అంటుంది ఇది ఎంతో ఆలోచించి అన్నమాట. దుర్యోధనుని అభిమానాన్ని, కోపాన్ని, పట్టుదలనూ, ప్రేమనూ అన్నింటినీ అర్థం చేసికొని ఆయన అర్ధాంగి యనిపించుకున్నది భానుమతి. చలంగారి నాటికలలో యిది ఉత్కృష్టమైనది

పురూరవ నాటకం చలంగారి ప్రణయ తత్త్వాన్ని తెలియజేసే కళాఖండం. ఊర్వశి పాత్రకు వారు చేకూర్చిన ఔన్నత్యం ఆంధ్రసాహిత్యంలోని స్త్రీ పాత్రలకే మకుటాయమానం. రవీంద్రుని ఊర్వశి భావననూ, కృష్ణశాస్త్రిగారి ఊర్వశి సృష్టికి ప్రతిద్వంద్వి చలంగారి ఊర్వశి. వెన్నెలా, సెలయేరూ, గాలీ, పంచ భూతాల పవిత్రతా ఊర్వశిలో రూపు దిద్దుకొన్నాయి. మొదట వెనుక ముందాడినా ఊర్వశి ప్రణయాన్ని అర్థంచేసికొన్న పురూరవ చక్రవర్తి సమస్తమూ త్యజించటానికి సిద్ధమవుతాడు. కాని అతడెప్పుడు మళ్లీ యీ లౌకిక ప్రపంచం 'నాది' యనే భ్రమతో పడతాడో అప్పుడే ఊర్వశి దూరమైపోతుంది. చలంగారి సత్య సౌందర్యాన్వేషణ యీ నాటకంలో కనిపిస్తుంది. 'మ్యూజింగ్స్' మూడవభాగంలో "సత్యమనేది ఉండనీ ఉండకపోనీ, నేను ఏ నాటికి ఏది సత్య మనుకున్నానో దాన్ని అనుష్ఠించకుండ నిలువలేను. ఏది సత్యం? ఏది ధర్మం? అని యోచించకుండానూ నా మనస్సును కట్టుకోలేను" అని వ్రాశారు. "నేను నమ్మినవాటినే వ్రాశాను. వ్రాసినవాటినే ఆచరించాను." అని చెప్పుకోగలిగిన కొద్దిమంది రచయితలలో ఆయ నొకరు. ఈ నాటకంలో ఊర్వశి, పురూరవునితో "చూడు, నేనుకాక నీకేమన్నా ముఖ్యమై, నానించి ఆలోచించావా, చాలా దురదృష్టవంతుడివి" అంటుంది. పురూరవుని స్థితి ఎలా ఉన్నదో రచయిత వివరిస్తూ "మామూలు మోహావేశులకి అలవాటయిన అతని మనస్సు, ఆమె విశృంఖల తన్మయత్వాన్ని అనుమానిస్తుంది. వెరపునీ వంకర్లనీ కామాన్ని అవసరాల్ని ఎరగని ప్రేమ అతనికి అర్థం కావడం లేదం"టారు. పురూరవుడు ఊర్వశి ప్రణయాన్నందుకోలేకపోతాడు. చివరకు ఊర్వశి "నీతో కలసి సుఖించిన ఊర్వశినే తలచుకో! నన్నందుకో గలిగేవరకు నేను వెడతాను" అని చెప్పి వెళ్లిపోతుంది తెలుగు భాషకు చలం సమర్పించిన వెలలేని కానుక పురూరవ నాటకమనటం అతిశయోక్తి కాదు.

త్రిపురనేనివారి హేతువాద ప్రభావంతో ఆలోచనారీతిని పెంపొందించుకొని శ్రీ జి వి. కృష్ణారావు 'భిక్షాపాత్ర', 'యాదవ ప్రళయం', 'దాన ధా[illegible]' మొదలైన నాటికలు వ్రాశారు. మహాభారత కథానంతరం జరిగిన యాదవ ప్రళయానికి కారణం ముసలం పుట్టటంకాదనీ నిజమైన కారణం యదువృష్ణి భోజాంధక సాత్వతులలో అంతఃకలహాలు పుట్టి, త్రాగుబోతులై కొట్టుకు చచ్చిపోయారని వీరు భావించారు. కృష్ణుడు భారత యుద్ధంలో ప్రదర్శించిన రాజనీతి బెడిసికొట్టి యాదవులలో అంతఃకలహాలకు కారణమయిందని వీరు నిరూపించటానికి ప్రయత్నించారు. ఈ నాటికలో కృతవర్మ "కృష్ణుడు కూడా ఎన్ని అన్యాయాలు చేసినా జాతికి మేలు చేశాడు. అద్వితీయ మేధావి. తత్త్వవేత్త. ఘటనా ఘటన సమర్థుడు" అని శతధన్వునివద్ద తన స్థితిని తలచుకొని వాపోతాడు. బలభద్రుడు బలరాముడు కృష్ణుని రాజనీతిని గర్హించి దూర దూరంగా ఉండటం మొదలు పెడతారు. కృష్ణుడు యాదవ రాజ్యంలో ప్రవేశ పెట్టించిన త్రాగుడు నిషేధనమనేది తిరుగుబాటుకొక ప్రధాన కారణమవుతుంది వారి శత్రువులైన నిషాదులు జాగ్రత్తగా పన్నాగాలు పన్ని తుంగ గడ్డిని విషమయంచేసి, సుగ్రీవ శైబ్య, వలాహక, మేఘపుష్పాలు అనే కృష్ణుని గుర్రాలను మాయం చేసి, వంటకాలలో పురుగులు పడేటట్లుచేసి, గాలిని, తియ్యగా మార్చి, క్రమంగా యాదవ వంశాలలో అంతఃకలహాలు పుట్టించి విజయం సాధించారే తప్ప కృష్ణు డవతార పురుషు డనటం అబద్ధమనీ, కృష్ణుడు లీలామానుష శక్తులు గలవాడనటం బూటకమనీ, అవతారం చాలించటం పురాణాలు కల్పించిన అబద్ధాలేనని వీరు భావించారు. యాదవ ప్రళయం తప్పదని తెలిసి గూడ దాన్ని ఎదుర్కోలేక, నిస్పృహతోచేసిన ప్రయత్నా లన్నీ వమ్మైపోయాయి..... రాజుల కిరీటాలతో బంతులాడాను. తిమ్మని బమ్మని, బమ్మని తిమ్మని చేశాను. ఆనాటకమంతా ఎందు కాడాను? ఏమి జరిగింది?" అని కృష్ణుడు తనను తాను ప్రశ్నించుకుంటాడు. యాదవ ప్రళయానికి నిజమైన కారణాలను భారత, భాగవత గ్రంథాలనుండీ హేతుబద్ధంగా ఆలోచించి, అత్యద్భుతమైన శిల్ప విన్యాసాన్ని ప్రదర్శించిన యీ నాటిక ఉత్తమమైనదిగా భావింపవచ్చు.

భీమేశ్వర పురాణంలో వ్యాసుడు కాశిని విడిచిపెట్టి వెళ్లడాన్ని గూర్చి చెప్పే కథలోని సత్యా సత్యాలను విచారించి 'భిక్షాపాత్ర' అనే పేరుతో అత్యద్భుతమైన రూప కల్పన చేశారు

భిక్ష దొరకక వ్యాసుడు తన శిష్యులతో కలసి ఆకలితో మల మలమాడిపోతూ, తన అష్టాదశ పురాణాల ప్రయోజనం గురించీ వేద విభాగం చేసిన జ్ఞానముయొక్క ప్రయోజనాన్ని గూర్చీ బాగా ఆలోచించి తాను వ్రాసిన గ్రంథాలవలన లోకానికి తీరని అపచారం జరుగుతుందని భావించి, ఎంతో బాధపడి "నా వీణా వాదంలో శ్రుతి తంతువులనే లగించలేదు" అని శోకించి ఒక్క అశ్రుకణాన్ని భిక్షాపాత్రలో రాలుస్తాడు. "ఈ నిర్భాగ్య మానవ లోకాన్ని కష్టాలపాలు చేశాను. ఈ మానవులకు చాతుర్వర్ణ్యం విధించాను. బీదలకు ద్రోహం చేసే కర్మ సిద్ధాంతమూ, అవ తార వాదము బోధించి దాస్యం అంగీకరింప జేశాను. నాగేత ఈ కర్మ భూమిలో ఎంతకాలముంటుందో అంత వరకూ నివృత్తి లేకుండా చేశాను. ఈ సంఘమే మారిపోకుండ ఆశాసించాను. ఆ భిక్షాపాత్రతో ఆ కష్ట జీవుల్ని జీవించ మన్నాను. మహాపరాధం చేశాను" అని ఎంతగానో పశ్చాత్తాప పడతాడు. పురాణాలు వెదజల్లిన విజ్ఞానాన్ని రచయిత యీ విధంగా తిరస్కరించారు. త్రిపురనేనివారి హృదయాన్ని చక్కగా అర్థంచేసుకొని మరొక మెట్టు పైకిపోయి, కడు చక్కని నాటక శిల్పాన్ని, సంభాషణలలో గుండెల్ని కది లించే శక్తినీ, ఆయా పురాణాలలోని శ్లోకాలను తగుసందర్భా లలో చక్కగా ఉటంకించుకొంటూ వీరు తమ నాటకలలో హేతు వాదాన్ని స్థాపించారు.

సర్వ సద్గుణ సంపన్నుడైన రాక్షసరాజు బలి వామనునకు దానమియ్యటమూ, దానిలోని ఆంతర్యమూ విశదం చేస్తూ వీరు 'ధానధార' అనే నాటిక వ్రాశారు. బలిచక్రవర్తి భార్య వింధ్యావళికి దుస్వప్నం కలుగగా, ఆమె "ఎవరో వామనమూర్తి వచ్చి తన భర్త నధఃపాతాళానికి త్రొక్కివేస్తుండటం చూచా నని చెప్పుచున్నంతలో శుక్రాచార్యులవారి ప్రోత్సాహంతో సేనాపతి విప్రచిత్తి వచ్చి సైన్యమంతా తన అధీనంలో ఒక్కరోజు ఉంచా లని కోరుతాడు. అందుకు బలి సమ్మతిస్తాడు గూడ. శుక్రా చార్యులు వచ్చి బలితో "రేపొక రోజు వాగ్దానం చేసి కూడ, నీ దానం మానివేయమంటున్నాను" అని ఆదేశిస్తాడు. కాని బలి వినయంగానే తన గుర్వాదేశాన్ని తిరస్కరిస్తాడు వామ నుని కుట్రను తెలిసి గూడ దానమిచ్చిన బలి తన సేనాపతి విప్రచిత్తితో "విశ్వాభ్యుదయాంకూరానికి ఈ దానధారతో దోహద మిస్తున్నాము" అని అంటాడు. బలిని రచయిత విశ్వాభ్యు దయాన్ని కోరిన ఉత్తమ ప్రకృతునిగ తీర్చిదిద్దారు. శ్రీరంగం శ్రీనివాసరావుగారు బలిని రాక్షసులలోని ధర్మమూర్తిగాను ఇంద్రుని దేవతలలో దుష్టునిగాను నిరూపిస్తూ 'బలి' అనే రేడియో నాటికను వ్రాశారు. పాపం పుణ్యం, స్వర్గం నరకం— వీటి అర్థాలను ప్రశ్నిస్తూ శ్రీ శ్రీ అవి వేర్వేరుగా లేవని తలం చారు. "పాపంలోనే పుణ్యం ఉంటుందనటానికి నిదర్శనం పాతాళ లోకంలో బలి చక్రవర్తి వుండటమే" — బలి నరకానికి నెట్ట బడినా "పాతాళ లోకపు పాపాత్ములను, పతితాత్ములను, అనాధ జీవులను, అశాంత భావులను వదలిపెట్టి స్వర్గానికి రాగలిగి కూడ" రాడట. శ్రీశ్రీగారి నాటికలలో హేతువాద పద్ధతిలో వచ్చిన విశిష్టమైన నాటిక యిది.

'ధమ్మిల్లం' అనే నాటికలో జి. వి. కృష్ణారావుగారు నత్కీ రుడనే కవిపట్ల శివుడు ఘోరమైన అపచారమే చేశాడని భావించి నత్కీరుని తప్పేమీలేదని హేతుబద్ధంగా నిరూపించారు. శివుడు యోగిరూపంలో వచ్చి "పార్వతీధమ్మిల్లబంధం సహజగంధం" అని వాదిస్తే "ఇప్పటి వివాదాంశం మానవ ప్రకృతి కాని దైవ ప్రకృతికాదు. మానవలోకంలో కేశాలు సహజ గంధాలు అవునా కాదా అన్నదే ముఖ్యం. కైలాసంలో పార్వతి కేశాలు ఎలా ఉన్నవో ముఖ్యంకాదు" అని నత్కీరుడు జవాబు చెప్తాడు. ఇంతన్యాయ మైన వాదానికి కినిసి శంకరుడు శపించటమేమి న్యాయమో ఆలోచించమని రచయిత మనవి చేశారు. నిజమైన క్షమాన్ని గుర్తించని పాండ్యరాజుదే అక్రమమని తేల్చారు. నత్కీరుడు శాపగ్రస్తుడై పాండ్యనగరంనుండి తరలిపోతూ వుంటే "నిజ మైన జ్యోతిర్లింగం" వెళ్లిపోతున్నది అని చక్కగా నాటికను ముగించారు.

చారిత్రకగాథల నాధారంగా సాహిత్యాన్ని సృష్టించినప్పు డొక్కొక్కసారి చరిత్రకారులు ఆ గాథలయొక్క నిజానిజాలను చారి త్రక పరిశోధనలతో తారుమారు చేస్తారు ఐతేనేం రసవత్తర మైన సాహిత్య సృష్టి జరిగిన తరువాత చారిత్రక సత్యాలు మారినా యీ రచనలలోని విలువ మాసిపోదు రాజ రాజనరేం ద్రుడు, చిత్రాంగి, సారంగధరుల మధ్య జరిగినదని నమ్మి శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'రాజరాజు' నాటకం వ్రాశారు. వీనినే ధర్మవరమువారు, చలంగారూ మొదలయిన ఎందరో వ్రాసినా ఆగాధ క్రొత్త క్రొత్త రూపాల్ని ధరించింది. కాని చరిత్ర కారులు రాజరాజనరేంద్రునకు రత్నాంగి, చిత్రాంగి అనే భార్యలే లేరనీ, సారంగధరుడు రాజరాజుకుమారుడేకాడని సాక్ష్యాధారాలతో రుజువు చేశారు. పాశ్చాత్యుల ట్రాజడీల మోజులో పడి ధర్మవరమువారు 'విషాదసారంగధర' వ్రాశారు. దానిని హేతువాదప్రధానమైన నాటకంగా యెంచనక్కరలేదు. చలంగారి చిత్రాంగి కూడ వారి సిద్ధాంతాలతో రూపొం దించిందేగాని హేతువాద బద్ధమైనది కాదు. శ్రీపాదవారి 'రాజ రాజు' నాటకం పూర్తిగా హేతువాదంతో వ్రాసినది కాక పోయినా చిత్రాంగి పట్ల వారి సానుభూతిమాత్రం హేతుబద్ధం గానే నడిచింది సారంగధరుడు కూడ మానవుడేననీ, అతడిలో మానసిక స్థైర్యం ఉన్నట్లే ఏదో ఒకక్షణంలో అతడి మనస్సు కొంతవరకు అధర్మంవైపుకు మొగ్గవచ్చుననీ, అట్లా మొగ్గి తన మనస్సును ధర్మం వైపుకు మళ్లించు కోగలిగాడనీ వీరు కల్పించారు సంభాషణలు పట్టుగా నడిపించడంలో శ్రీపాద వారిది అందెవేసిన చేయి. రాజరాజు లోని కామమూ, సారంగధరునిలోని అనుచితమైన త్యాగమూ చిత్రాంగికి తీరని అన్యాయం చేశాయని రచయిత భావించారు. నన్నయ్య పాత్రను చిత్రించటంలో శ్రీపాదవా రసాధారణ మైన ప్రజ్ఞనీ నాటకంలో కనబరచారు. అందుకైనా యీ నాటకం రసజ్ఞులెల్లరూ చదవాలి.

చారిత్రక గాథలలో చిత్రాంగి కథవంటిదే తిష్య రక్షిత కథ. కాంచనమాల నాటకంలో వేలూరి చంద్రశేఖ రముగారు, తిష్యరక్షిత నాటికలో బుచ్చిబాబుగారు, తిష్య రక్షితను సానుభూతితో అర్థంచేసికొని, ఆమెకు కళంకాన్ని ఆపాదిస్తున్న కట్టుకథలను అబద్ధం చేయటానికి ప్రయత్నిం చారు. నాటకానికుండవలసిన అన్ని హంగులూ, వేలూరి వారి నాటకంలోనూ, తిష్యరక్షిత హృదయావేదన బుచ్చి బాబుగారి నాటికలోను చక్కగా వెల్లడి అయినాయి అశోకుని కుమారుడైన కుణాలుని ప్రేమించిన తిష్యరక్షిత అశోకునికే భార్యకావటమూ, అశోకుడు కుణాలుని శిక్షించటమూ చిత్రాంగి కథలో లాగే ఉంటాయి. చరిత్రకారు లీ కథను వాస్తవమని ధ్రువపరచటం లేదు.

కులీనయైన స్త్రీమాత్రమే నాయిక కావాలని భావించే కాలంలో శూద్రకమహాకవి మృచ్ఛకటిక నాటకంలో వేశ్యను నాయిగా నిల్పి ఒక విప్లవాత్మకమైన పద్ధతికి అంకుర్పారణ చేశాడు. ఇందులోని వసంతసేన వేశ్యయైనా చారుదత్తుని ప్రేమించి, అతడి కోసం తపించిన శీలవతి. ఆధునిక కాలంలో గురజాడ అప్పారావుగారు కన్యాశుల్కములోను, కాళ్లకూరి నారా యణరావుగారు 'చింతామణి' నాటకంలోను వేశ్యలనే ప్రధాన పాత్రలుగా జేసికొని నాటకాలు రచించారు. మధురవాణి, చింతా మణు లిద్దరూ శీలవతు లేమీ కారు. చింతామణి వేశ్యావృత్తి పట్ల విముఖురాలై కృష్ణభక్తురాలుగా మారిపోతే, మధుర వాణి కూడ వేశ్యావృత్తిని నిరసించి, సౌజన్యారా విచ్చిన 'భగ వద్గీత' చేతబడుతుంది. మధురవాణి గురజాడవారి మొట్ట మొదటి కన్యాశుల్కంలో లేకపోవడం గమనార్హం. మధుర వాణి హృదయమున్న వేశ్య. కనుకనే కరటకశాస్త్రుల తార్పుడు బుద్ధి నసహ్యించుకొని "చిత్రగుప్తుడికి లంచం యివ్వాలిరా? అతడి దగ్గరికి మధురవాణిని పంపి చేసిన పాపాలు అన్నీ తుడిచి పెట్టించటానికి వీలుండదు కాబోలు" అని చివాట్లు పెట్టుంది. కరటకశాస్త్రులన్నట్లు ఆమె వల్లోపడ్డ ప్రాణి మరి తప్పించుకు పోలేడు. ఆ వలకున్న పటుత్వం యే ఉక్కు గొలుసులకూవుండదు.

వేశ్యకు కూడ హృదయముంటుందని నిరూపించిన వారిలో సుప్రసిద్ధ నాటికా రచయిత పాకాల వేంకట రాజమన్నారుగా రొకరు. వారి నాటికలలో 'నిష్ఫలం' 'ఏం మగవాళ్లు' అనేవి హేతువాదభావనతో వ్రాసినవి. నిష్ఫలం నాటికలో చిత్రరేఖ అనే వేశ్య తన ప్రియుడైన జమీందారు రంగారావు కోసం తన ఆస్తినంతా త్యాగం చేస్తుంది. రంగారావు భార్య సీత య్యమ్మ చిత్రరేఖ యింటికి వచ్చి ఆమె నవమానిస్తుంది చిత్రరేఖ నింకా ఆ వృత్తిలోనే ఉండి తన భర్త కోసం డబ్బు సంపాదించ మనగానే చిత్రరేఖ రోషంతో "ఏమిటి మీ గొప్ప దనం? మీ పాతివ్రత్యం వేరే గతి లేక స్వాతంత్ర్యం లేక, ధర్మ మని, విధియని, మీరు భర్తల మీద భక్తివిశ్వాసం కనబర స్తున్నారు. మాబోటి వాళ్లకు ఆ సంకెళ్లు లేవు. మాది స్వచ్ఛంద వృత్తి. ఈ కృత్రిమబంధాలు లేవు బలవంతపు పాతివ్రత్యం మీది. నాది స్వతంత్రమైనది" అని మండిపడుతుంది. కాని సీతయ్యమ్మ లోకమందరూ అన్నట్లే "ఏమిటి ఉపన్యాసం! సాని ముండకు పాతివ్రత్యం! నేతి బీరకాయ!" అనేస్తుంది. వీరి మాటల లోని సత్యాసత్యాలను చదువరులు చక్కగా అర్థం చేసికొని రాజమన్నారుగారి నాటికా రచనా నైపుణ్యాన్ని మెచ్చగలరు 'ఏం మగవాళ్లు' నాటికలో వేశ్యను పెళ్లి చేసికొని తన ఇంటికి తీసుకొని వస్తాడు వేణు. వేశ్యల్ని అసహ్యించుకొనే వేణు తండ్రి, బాబాయి, వేణు భార్యయైన వేశ్య కనకాన్ని చూచి చొరవ చేసి అవమానించబోతారు. మానసికంగా పతితయైన ఆ ఇంటి యిల్లాలు సుందరమ్మ కూడ వేశ్య అనగానే చులకనగా మాట్లా డుతుంది. ఆ యింట్లో కనకం చనువును అపార్థం చేసికొని వేణు ఆమెను అనుమానించగానే కనకం అతడికి బుద్ధి వచ్చేలా జవాబు చెప్పి "ఛీ! ఏం మగవాళ్లు" అని విరక్తితో మంగళ సూత్రం తన చేత్తోనే తెంపి పారేస్తుంది. ఈనాటికారచనలో రాజమన్నారుగారి శిల్పవిన్యాసం పరాకాష్ఠ నందుకున్నది.

ఇరవైయో శతాబ్దపు ప్రారంభంనుండి యీ హేతువాద నాటకాలు కన్పిస్తున్నాయి. వందల సంవత్సరాల పారతంత్ర్యంలో మగ్గిన జాతి, ఆంగ్లవిద్యాప్రభావంతో యీ హేతువాదాన్ని అలవరచుకొన్నది యీ శతాబ్దంలోనే. ఆలోచనాపరులు పురాణా లను నూతన దృక్పథంతో పరిశీలించటం మొదలుపెట్టారు. స్వార్థపరులైన కొందరు మిగిలిన ప్రజలను తమ ఆధిపత్యం క్రింద ఉంచుకోవటానికి స్వర్గమూ—నరకమూ, వర్ణ వ్యవస్థను, పురుషుని ఆధిక్యాన్ని దైవప్రీత్యర్థం యజ్ఞాలనూ, బలులను, మొక్కుబడులూ మొదలైన వాటిని సృష్టించారని తలంచారు. క్రమంగా భగవంతుడి పేరిట జరిగే అనేకమైన అన్యాయా లను చూచి మత వ్యవస్థనూ, దేవుడనే భావాన్ని నిరసించు కోవటం ప్రారంభించారు. సంఘంలో పాతుకుపోయిన మూఢ విశ్వాసాలను కూకటివ్రేళ్లతో పెకల్చటానికి తమ రచనల ద్వారా తోడ్పడ్డారు. వీరిలో కొందరు స్త్రీల దుస్థితిని చూచి జాలిపడి ప్రత్యేకంగా వారిపై సమాజ దృష్టిని మళ్లించటానికి, వారి స్థితిని మెరుగుపరచటానికి యత్నించారు. ఆనాటి, కాల పరిస్థితులను బట్టి వారి రచనలు ప్రచండ వేగంతోనూ, పరశు ధాటిగానూ వెలువడ్డాయి. వారి రచనలలో కొన్ని అవాంఛనీయ మైన అవ్యవస్థను తెచ్చి పెట్టాయి. ఈనాడు ఆ ఉద్రేకాలు చాలవరకు చల్లబడుతున్నాయి. స్థిమితంగా ఈనాటి చదువరులు క్రమంగా ఏది విశ్వాసం, ఏది హేతుబద్ధమని నిలకడగా, ఆలోచింపగలుగుతున్నారు. శిల్పం విషయంలో చెప్పుకోదగినంత పరిణతిని సాధింపకపోయినా, నేటి సాంఘిక నాటకాలు కొంతకు కొంత హేతుబద్ధంగా వెలువడటానికి పైన పేర్కొనిన హేతు వాద నాటకాలు తోడ్పడినాయి.

తెలుగులో ఉత్తమ నాటకాలు వెలువడలేదని ఆరాట పడేవారు పై రచనలను జాగ్రత్తగా చదివితే, అవి ప్రదర్శనలో పెద్ద విజయవంతమయ్యే నాటకాలుగా తోచకపోయినా, మెద డును కదలించి ఎన్నో విషయాలను తెలియజెప్పి నాటకా లివ్వ గలిగిన శ్రవణ సుభగత్వాన్నీ, విజ్ఞానాన్నీ యిస్తున్నాయి.

# రాగమ్మ

## శ్రీమతి ఆర్. వసుంధర

'ఇంటి తలుపు బార్లా తీసుందేమిటా? అమ్మా, బాబూ పన్లోకెళ్లలేదేంటి' అనుకుంది రాగమ్మ రోడ్డుమీదనుండి తమ పూరింటివేపు చూసి. కోమటామె యిచ్చిన చద్దన్నం గిన్నె చిన్న పులుసుగిన్నె ఒకదానిమీద వొకటి పెట్టుకొని ఎడమ అరిచేతిలో భుజం మీదుగా ఎత్తి పట్టుకుని అప్పుడే యిళ్ల పనులు ముగించుకొని తిరిగొస్తోంది పదిహేనేళ్ల రాగమ్మ.

సినిమా హాలుకు ఎదురుగా రోడ్డుకు ఆవలివేపున గజం లోతు పల్లంలో తీరూ తెన్నూ లేకుండా వీలునుబట్టి తలకో ప్రక్కకు ముఖంపెట్టి చిక్కురొక్కురుగా కట్టబడ్డ పూరిళ్లలో ముందుగా రోడ్డు దగ్గరగా వున్నది రాగమ్మ యిల్లు. డబ్బు యిబ్బందులవలన రెండేళ్లనుండీ వరి గడ్డి కప్పించనందున కప్పు పాతబడి నల్లబడి కొంత కొంత ఎగిరిపోయి అక్కడక్కడా తాటాకులు కన్పిస్తున్నాయి. దాదాపుగా అన్ని యిళ్లూ ఆ స్థితిలోనే ఉన్నాయి. ఆ యిండ్లకు వెనుకవైపున యిరవై గజాల దూరంలో వూరి మురుగంతా చేరుతుంది. వాటికీ వూరికీ మధ్యనున్న కాస్త ఖాళీ స్థలమూ, చీకటిపడ్డ తర్వాత వూరివారికి కక్కసు దొడ్డిగా ఉపయోగపడుతుంది. ఇదివరలో వూరి నడిబొడ్డులో పారిన మలిదేవి చోటు మార్చుకుంటూ దక్షిణంగా జరిగి జరిగి ఆ స్థలాన్ని వూరివారి ఉపయోగానికిచ్చింది. ఆ చోటు పెద్ద రెడ్డిగారి స్వంతం అయింది. ఆయన దాతృత్వాన వాళ్లు అక్కడ పూరిళ్లు వేసుకున్నారు. స్థలాన్ని మెరక చెయ్యడానికి రెడ్డిగారు పూనుకోలేదు. వాళ్లకు చేసుకునే స్తోమత లేదు. పంచాయితీ వాళ్లు ఏడాది కోమారు మూడు రూపాయిలు పన్ను కట్టించుకోవడం మినహాగా వాళ్ల జోలి పట్టించుకోరు. వాళ్లందరూ రెడ్డిగారి ఆశ్రితజనంలోనివాళ్లు. వారి వదాన్యతకు కృతజ్ఞులై వుండి ఎప్పుడో ఒకసారి ఎలక్షన్లు వచ్చినప్పుడు వారి అభ్యర్థికి వోటు వెయ్యడం మినహాగా మరేమీ చెయ్యలేని చిన్న మనుష్యులు.

నిజంగా రెడ్డిగారు చాలా మంచివారు. వాళ్లకి అత్యవసరమైనప్పుడు తక్కువ వడ్డీకి అప్పు యిస్తారు. వూళ్లోని మిగతా పెద్దల్లాగా సమయం దొరికిందే చాలని ఇరవై రూపాయిల వడ్డీతో వాళ్లకి వూపిరి సలుపనివ్వని వురి వెయ్యరు. కూలి నాలి చెయ్యగలవాళ్లకు వారి చేలలోనే పని యిస్తారు. ఈమధ్యనే ఎవరెవరు యిళ్లు వేసుకున్న స్థలాల్ని వాళ్లే అతి చవకలో అంకణం ముప్ఫై రూపాయిల లెక్కన స్వంతం చేసుకోవచ్చునని చెప్పారు. ఇంకో పదేళ్లపాటు అల్లానే గడిపితే చట్టం ప్రకారంగా డబ్బు కట్టకుండానే స్థలం వాళ్లకే చెందిపోతుందని రెడ్డిగారంటే కిట్టనివాళ్లు సలహా యిచ్చినా వినక, ఏ కార్యానికో కూడబెట్టుకున్నది కాస్తో కూస్తో మూలధనం గలవాళ్లు నలుగురైదుగురు దస్తావేజులు వ్రాయించేసుకున్నారు. అలాంటి స్వంత దార్లలో రాగమ్మ తల్లి సుబ్బమ్మ ఒకతె. రాగమ్మ పెళ్లికని చేర్చిన రెండొందలూ కాక అప్పు చేసిన వందతో కలిపి మూడొందలకు యిల్లు నాదనిపించుకున్నది. దానితో చేతనున్న డబ్బు పోవటమేకాక అప్పొకటి మీద పడ్డది. ఇల్లు స్వంతం చేసుకున్నందుకు మరో ఫలితంగా రోజుకు రెండు మూడు తగాదాలు పెట్టుకోవలసి వస్తున్నది. వాళ్ల తాలూకు మురుగునీరూ బూడిదా కసువూ తమ స్థలంలోనికి వచ్చాయని యిరుగు పొరుగులతోను, రాత్రి సినిమా వదిలినప్పుడు హాలుకు ఎదురుగా రోడ్డు కివలగా సరిగ్గా సుబ్బమ్మ యింటిపైగా అత్యవసరంగా కాలకృత్యాలు తీర్చుకోవలసి వచ్చిన పిన్నలు పెద్దలతోనూ వున్నట్లుండి యుద్ధం ప్రారంభమవుతుంది సుబ్బమ్మకు. పెద్దగా అరచుకోవడాలూ, తిట్టుకోవడాలూ అయ్యాక యింట్లోకి వచ్చిన సుబ్బమ్మకి మొగుడిమీదా, కూతురిమీదా తగనికోపం వస్తుంది. వాళ్లిద్దరూ యీ పోట్లాటలలో కలుగజేసుకోరు. సుబ్బమ్మకు తోడుగా మాట్లాడరు. ఇంటి మంచి చెడ్డలు వాళ్లకెందుకు కాబట్టవో సుబ్బమ్మకు అర్థంకాదు. గుడ్డోడి సంగతి ఒదిలేసినా చేతికందొచ్చిన పిల్లకీ నిర్లక్ష్యం ఉండటం సుబ్బమ్మకు గిట్టదు. 'బాబూ కూతురూ నాలిముచ్చులు. కర్మకొద్దీ దొరికారు' అంటూ తలబాదుకొంటుంది కసిపట్టలేక. అమ్మ కోపాలు తాపాలూ రాగమ్మ లెక్క చెయ్యదు నవ్వుకుంటూ తన పని తాను చేసుకుంటుంది. రాగమ్మ కళ్లు పెద్దగా గుండ్రంగా మెరుస్తుంటాయి. ముక్కు సన్నగా చిన్నగా వుంటుంది. పెదాలు నాజూగ్గా ఒంపు తిరిగి చక్కటి పలువరుసమీద ఉల్లాసంగా నవ్వుతుంటాయి. రాగమ్మ చామనచాయలో వయసూ నవ్వూ కూడబలుక్కొని ఏర్పాటు చేసిన నిగారింపు వున్నది. ఆ పిల్ల పేదరికాన్ని పట్టిచ్చే భాగాలు పాచిపనివలన కాస్త మొరటుదేరిన చేతులూ, వెడల్పుగా పెద్దగా వుండే పాదాలూను. రాగమ్మ పని చేస్తున్న యింటి కోమటామె తన కూతురివి, వెలిసిపోయి పాత బడినవి, పావడాలూ ఓణీలు రాగమ్మకిచ్చి, ఆ పిల్ల ఒంటిమీద చూశాక 'యింత చక్కటి గుడ్డలు ఎందుకిచ్చానా' అని బాధపడ్డ సందర్భాలున్నాయి. జీవం ఆనందం తొణికిసలాడే రాగమ్మ అడివి పువ్వు. ఆకుగాని పచ్చదనం లేశంగాని లేని మోడులాంటి చెట్టుకు పూసే పువ్వు.

ఎడంచేతిలోవున్న గిన్నెలు జారకుండా వాటిమీద కుడిచెయ్యి బరువుపెట్టి పరుగులాంటి నడకతో రోడ్డుక్రింది పల్లంలోకి దిగి యింట్లోకి వెళ్లింది రాగమ్మ. అనుకున్నట్లుగానే అమ్మా బాబూ యిద్దరూ యింట్లోనే ఉన్నారు. తడిక వారగా చాపమీద యిద్దరు ఆడవాళ్లు కూర్చొని వున్నారు. కాస్తవతల

కుక్కి అయిన నులకమంచంమీద ఇరవైఏళ్ల అబ్బాయి కూర్చున్నాడు. ఆడవాళ్లలో ఒకామె ఉత్తరపు వీధిలో కొత్తగా మిద్దె యిల్లు కట్టుకున్న కాంతమ్మ అని గుర్తించింది రాగమ్మ. రెండోఆమె రంగు అద్దిన రేకును కట్టుకుని కుచ్చెళ్లు ఎగదోపుకున్నది. గ్లాస్కోమల్లురైక కొత్తది వలచగా, తెల్లగా నాజూగ్గా వున్నది. మోకాళ్లు ఎత్తిపెట్టుకుని చుట్టూ చేతులు తేలిగ్గా బిగించి హుందాగా కూర్చున్నది ఆవిడ. ఇంట్లోకి వచ్చిన రాగమ్మని పరిశీలనగా చూసింది.

మంచంమీద కూర్చున్న అబ్బాయి పీలగా చామ నలపులో వున్నాడు. బాగా చమురు పూసిన పలచటి జుట్టు మొహమ్మీదికి దారాల్లాగా వేళ్లాడుతున్నది. వరుసగానే వున్నా కాస్త పొడుగ్గావున్న పళ్లవలన నవ్వకపోయినా నవ్వుతున్నట్లు కనిపిస్తాడు. ఈ అబ్బాయీ రాగమ్మని పరిశీలించి చూశాడు. 'శానా బాగుందే సినిమా ఏక్టరులాగా' అనుకుని తల పంకించుకున్నాడు.

'కాసిని నీళ్లు పొయిలో ఏసి కోమిటి రత్తయ్య దగ్గిరికెళ్లి బేడ కాపీపొడి పట్టుక రా. డబ్బులు మల్లీ యిత్తానని సెప్పు. అట్టాగే రాజమ్మ దగ్గర నవటాకు పాలు బోయించకరా' అని కూతురికి చెప్పింది సుబ్బమ్మ.

కాఫీలయ్యాక 'పిల్ల మరీ అబ్బనాకారంగా వుంది' అన్నది రేకు కట్టుకున్నావిడ కాంతమ్మతో. 'పోషణ సరిలేకనే, శేషమ్మా' అన్నది కాంతమ్మ. అందరూ వెళ్లడానికి లేచారు. వాళ్లేమంటారోనని ఆశగా ఆత్రంగా చూస్తూంది సుబ్బమ్మ. 'ఇంటికి బోయి మా అన్న దమ్ములతో మాటాడి ఏ మాటా తెలుపుతాము' అన్నది రేకు కట్టుకున్న శేషమ్మ. 'పర్లేదు....మాట్టాడు' అన్నాడు అబ్బాయి. శేషమ్మ కొడుకుని కొరకొరా చూసింది. అది లెక్క జెయ్యకుండా చమురుతో తళతళ్లాడుతున్న జుట్టును మొహమ్మీదనుండీ వెనక్కిపోయేట్లు తల ఎగరేసి 'పర్లేదు..... మాట్టాడు' అన్నాడు అబ్బాయి.

వాళ్లని చూస్తుంటే రాగమ్మకి నవ్వు ఆగలేదు. తడికవతలికి వెళ్లిపోయింది.

శేషమ్మ లేచి నవ్వు తెచ్చిపెట్టుకుంటూ 'మా శంకరానికి పిల్ల నచ్చిందమ్మోవ్' అన్నది.

* * *

శేషమ్మకు శంకరం ఒక్కడే సంతానం. నెల్లూరినుండీ అంకమ్మ తిరుణాళ్లకని యీ పల్లెటూరికి తెలిసిన వాళ్లింటికి వచ్చింది కొడుకుతో సహా. వారూ వీరూ చెప్పగా పనిలో పనిగా రాగమ్మను చూసింది. వాళ్ల యిల్లూ తీరూ ఏదీ ఆమెకు నచ్చలేదు. మరీ తూగని సంబంధం అనుకుంది. ఆ పేదరికం చూచి ఏవగించుకున్నది. కాని శంకరం పట్టుపట్టాడు. పెళ్లిరోజంతా శేషమ్మ మొహం మాడ్చుకునే వున్నది.

తీరా పెళ్లి జరుగుతున్నప్పుడు యింకో విషయం బయటకొచ్చింది. రాగమ్మ బాబు గుడ్డోడు రోజూ సాయంత్రాలూ నలుగురూ పోగయ్యే పోలీసు స్టేషను ముందరి వేపచెట్టు దగ్గర పంచెగుడ్డ క్రింద పరచుకుని కూర్చుని తత్వాలు పాడుతూ సిగ్గు లేకుండా....అడుక్కుంటాడట! శేషమ్మకి ఒంటినిండా తేళ్లూ జెర్రులూ ప్రాకినై. ఉక్రోషంతో శోకాలు పెడుతూ పెద్దగా అరిచింది. ఆమెకంటే పెద్దగానే అరిచింది సుబ్బమ్మ మొగుడిమీద. 'నే జెప్తే సెవి నేసుకోకపోతివి. సిగ్గుమాలినోడా. నలుగురూ పూస్తుండారు సూడు. ఇగ పిల్లగతి ఏమైపోతాది' అంటూ ఏడిచింది. గుడ్డోడు రవణయ్య దిగాలబడిపోయాడు. తన మూలాన కూతురి పెళ్లికి యిబ్బంది కలుగుతుందని అనుకోలేదు. 'దేవుడు సిన్న సూపు జూసి యిట్టాగయిపొయ్యాను గాని ముందంతా లచ్చవంగా నేత పని జేసుకోని కట్టం సెయ్యలా నేను! రెక్కలు దాసుకున్నానా? ఏపీ సెయ్యలేని అప్రయోజకుణ్ణయిపొయ్యానే అని దీనికి తలపడ్డాను' అంటూ గుడ్ల నీరెట్టుకున్నాడు. రాగమ్మ లేచివచ్చి బాబును కావలించుకుంది. 'నాకీ పెళ్లొద్దులే అయ్యా' అని బావురుమన్నది. నలుగురూ కలగజేసుకుని 'యిదివరల్లో వాళ్లూ బాగా బతికినోళ్లే'నని నచ్చజెప్పి పెళ్లి అయిందనిపించారు.

చిన్న ట్రంకు పెట్టెలో రెండు సాదాచీరెలూ, నటభై రూపాయిలకో పట్టుచీరె పెట్టుకుని బయల్దేరబోతున్న రాగమ్మని చాటుకు పిల్చుకుపోయి ఎవరికీ తెలియకుండా యాభై రూపాయిలు చేతిలో పెట్టాడు రవణయ్య. 'అవమ్మాయ్, నేను పనికిమాలినోణ్ణయిపొయ్యాను. మీ అందరికీ బరువు సేటయ్యాను. మొగోడూ ఆడదీ గూడా మీ యమ్మే అయ్యి అన్నీ సూసుకుంది.........నాసేతనయ్యింది యింతేనమ్మా. పెట్టుడగు నెట్టుకో' అన్నాడు. రాగమ్మకి ఏడు పొచ్చింది. 'బాబూ, నువ్వు శానా మంచోడివి' అన్నది ఏడుస్తూ. రవణయ్యకి సంతోషం కలిగింది. సన్నగా వుండి ఎముకలు పొడుచుకొస్తున్నట్లున్న కూతురి భుజం చుట్టూ చేతులేసి దగ్గరికి లాక్కుని తడుముతూ 'అవమ్మాయ్, నాకు సేతనయ్యింది నేను సేస్తుంటాను. నీకేవన్నా కావాలంటే సెప్పంపు' అని ఓదార్చాడు.

* * *

'మంచి సవంధం' అని సుబ్బమ్మ మురిసిపోయిందిగాని రాగమ్మకి అత్తగారింట్లో సుఖం కనబడలేదు. మనసులో ఏవిటో గుబులుగా భయంగా ఉంటోంది. శేషమ్మ సూటీ పోటీమాటలు ఎత్తిపొడుపులూ రాగమ్మని తికమక జేసేస్తున్నాయి. 'కూలోళ్లు, అడుక్కునేవాళ్లు, బురదగుంటలో వుండేవాళ్లు' అంటూ యిరుగు పొరుగులతో చెప్పి ఎద్దేవా చేసేది. రాగమ్మ తిరుగు మాట్లాడలేకపోయింది. ఎందుకు వీళ్లు అట్లా హీనం చేస్తున్నారో తెలియలేదు. తమ వూళ్లో ఉన్నప్పుడు పొయ్యిలోకి పుల్లా కంపా ఏరుకోడానికి తన యీడు పిల్లలతో కలిసి కాసవతల బ్రిడ్జి దగ్గరకువెళ్తే అక్కడ పచ్చటి చేలూ దూరాన్న వెండిలాగా మెరిసిపోతూ పారే మలిదేవి, పెద్దరెడ్డిగారి కొబ్బరితోటా చుట్టూ ఎంతో

దంగా ఉండేవి! ఈ నెల్లూళ్లో ఏముంది, యీ పక్కీల్లా, ఆ పక్కీల్లా! అనుకున్నది 'మా బాబు ఎంత మంచోడో యీళ్ల కేం తెల్సు. కళ్లు బాగున్నప్పుడు వన్నె వన్నెల సీరలు ఎన్ని నేసాడు. రెక్కలు ముక్కలు సేసుకున్నాడు గుడ్డోడై పొయ్యాడు. అయితే ఏం? రోజూ కోవటికొట్లోనో హోటల్లోనో ఏదో ఒక తీపి మిఠాయి తెచ్చిపెట్టేవాడు. అడక్క తింటుండారా అని అమ్మ నానా తిట్లూ తిట్టేది. ఎవరికి లెక్క. మా బాబూ నేను ఒకటి' అని తనకు తానే సర్దిచెప్పుకున్నది. కాని రాగమ్మలోని చైతన్యం గుండెల్లో ముడుచుకుపోయింది. ఏపుగా పెరుగుతున్న మొక్కను పీకి కంకర నేలలో పెట్టినట్లైంది.

తిరువెంగడం బ్రతికున్నన్నాళ్లూ ఆ యింట్లో బాగా జరిగింది నాలుగువేల పెట్టుబడిమీద నూలు తెచ్చి రకరకాల అంచులతో రంగుల చీరెలూ చారల చీరెలూ— ఆ రోజు మోజునుబట్టి నేయించి అమ్మేవాడు రోజుకు పదీ పదిహేను మగ్గాలవరకూ పని చేయించేవాడు. పెద్ద ఖాతాలు గట్టిగా పెట్టుకున్నాడు. కూలిపోనూ మగ్గానికి సరకును బట్టి అయిదునుండీ పదివరకూ గిట్టేది అరెకరం మాగాణిలో పూరింటితో మొదలుపెట్టిన వ్యాపారస్థుడు పదేళ్ల కాలంలో అయిదెకరాల మాగాణి, మిద్దె యిల్లూ సంపాదించాడు చదువు మీద శ్రద్ధలేక ఆరోక్లాసు చదువుతూ చాలించిన శంకరం సినిమాలూ షికార్లతో కాలం గడుపుతుండగానే తండ్రి దగ్గర పని నేర్చుకోక మునుపే ఒకనాటి రాత్రి చీకటి పడ్డాక చేట్లోనుండీ వస్తున్న తిరువెంగడానికి చెడ్డ తేలు కుట్టి ఆసుపత్రికి పోయేదోవలోనే చావు వచ్చింది. .. రాబడి తగ్గిపోయింది ఖర్చులు తగ్గలేదు. శేషమ్మది భారీ చెయ్యి పిండి వంట చేసినప్పుడు గంపనిండా చెయ్యాల్సిందే. పలకరించను వచ్చినవాళ్లకీ యిరుగు పొరుగులకీ తలా కాస్త పంచాల్సిందే. లేకుంటే ఆమెకు తోచదు. 'మీకేమమ్మా, కూర్చుని తినగలవాళ్లు' 'నీ చేతి వంటేవంట' అని వాళ్లూ వీళ్లూ అంటూంటే సంతోషంతో పొంగిపోతుంటుంది. చూస్తూండగానే వచ్చేపోయే చుట్టాలతో లన్నీ అత్యవసరమనిపించే అనేకమైన ఖర్చులతో యీ ఏడెనిమిదేళ్లల్లో నాలు గెకరాలు అమ్ముడు పోయింది. మిగిలిన ఎకరం మాగాణి తనఖా క్రిందకు పోయింది. పెళ్లికోసం యింటిమీద మూడు వందలు అప్పు తెచ్చారు. అయినా పులుసూ, చారూ అంటూ, పట్టుకెళ్లడానికి చిన్న చిన్న గిన్నెల్తో రోజూ ఒచ్చే వాళ్లున్నారు. గంపలో యిడ్లీలు అమ్మే సీతమ్మ రోజూ ప్రొద్దున్నే రావలసిందే. కాఫీ లేకపోతే రోజు గడవదు. ....

'రాగాం, పిండి రుబ్బెయ్యవే.... అన్నంలోకి నాలుగు గారెలు కాలుస్తాను' 'నా బిడ్డకి నీళ్లు మసిలిపోవాలే ... ఇంకా రెండు కట్టెలు పెట్టి బాగా కాయి.....' 'ఇవాళ కోవూరు చుట్టాలు వొస్తామన్నారు. పైనుండే పెద్ద దబరాలు దించి శుభ్రంగా తోమి పెట్టు . కాసిని శనగపప్పు ఉడకేసి బెల్లంవేసి పోళీలు కాలుస్తాను......' ఈ పురమాయింపులు యిళ్ల పనులు చేసిన రాగమ్మకు క్రొత్తాకాదు; కష్టమూ కాదు. కాని ఎందుకో అక్కడికీ యిక్కడికీ తేడా వున్నది. రాగమ్మకు బెంగ పట్టుకున్నది ఇల్లు దాటి నాల్గు గడుగులు వేస్తే కళ్లనిండుగా కన్పించే చేలూ, తోటలూ, అమ్మ కోపాలూ, బాబు ముద్దూ— అన్నీ గుండెల్లో నిండిపోయి ఏ పని చేసినా వుల్లాసంగా వుండేది. అన్నిటికీ పూరికే నవ్వొచ్చేది. .. యిక్కడ అట్లాగ కాదు. బ్రతుకు బ్రతికినట్లు కాకుండా దానంతటదే నీరసంగా గడిచి పోతున్నట్లుంటుంది.

శంకరయ్య తన అవసరాలకు మించిన మిగతా విషయాలన్నీ నిశ్చింతగా తల్లిమీద ఒదిలేస్తాడు. 'నువ్వేదైనా పని చూసుకోకపోతే జరగదురా' అని శేషమ్మ కొడుకుతో అప్పుడప్పుడు చెప్తూనే వున్నది. 'సూస్తావున్నా..... సూస్తావున్నా' అంటాడు శంకరయ్య.

రోజూ వచ్చి చిన్న గిన్నెతో కూర పట్టుకెళ్లే తులిశప్ప ఒకనాడు నీ కోడల్ని నాతోపాటు కూలిపనికి పంపరాదూ' అన్నది. శేషమ్మ కళ్ల నీళ్లు పెట్టుకుంది. 'నవ్వండమ్మా, నవ్వండి. మీ యిచ్చ వచ్చినట్లు నవ్వండి. తెలియకపోయి యీ సంబంధం కట్టుకొచ్చాము.. కూలి పనికీ రమ్మంటావు. ఇళ్ల పనికీ పొమ్మంటావు' అన్నది. తులిశప్పని చూస్తేనే రాగమ్మకి భయం. మాట మామూలుగా మాట్లాడుతూందో ఎద్దేవా చేస్తుందో కనుక్కోనివ్వకుండా మాట్లాడుతుంది.

ఒకనాడు రాత్రి శంకరయ్య సినిమా కెళ్లాలని తొందరగా అన్నం తింటూవుండగా శేషమ్మ పని మాట కదలేసింది. 'అయిస్కూల్లో జవాను పని కాళీ వుందంట గాని ఎడ్మాస్టర్లోళ్లకి యింట్లో పనికి మనిషి కావాలంట జవాను యింటో ఆడమనిషి ఆరికి పని చెయ్యాలంట' అన్నాడు.

'ఎంతిస్తారు జీతం?' అనడిగింది శేషమ్మ ఆత్రంగా:
'వంద' అన్నాడు శంకరం అన్నం గబ గబా నమిలేస్తూ.

శేషమ్మ కాసేపు మాటా పలుకూ లేకుండా వుండి 'ఆ పనికీ యీ పనికీ ఒంకేమి టంటా .....' అన్నది. మళ్లీ 'యీ పనన్నా దొరికితే కాస్త గట్టెక్కినట్టు' అన్నది రాగమ్మ వైపు చూస్తూ. రాగమ్మ మాట్లాడలేదు. 'ఏవన్నా అవనీ, నాకేం' అనుకుంది. శంకరయ్య సినిమా కెళ్లాడు. ఆ ఉద్యోగం మాట వాయిదా పడిపోయింది.

* * *

ఇంతలో రాగమ్మ గర్భవతి అయింది. మనవడు పుట్టబోతున్నాడని శేషమ్మ చాలా హడావుడి చేసింది. అందరితోనూ ఆ విషయమే మాట్లాడేది. రాగమ్మకి మాత్రం ప్రత్యేకంగా ఏమీ అనిపించలేదు. నల్లగా సన్నగా ఎలుక పిల్లలా వున్న కొడుకుని చూసినప్పుడూ ఏమీ అనిపించలేదు. వాడికి సినిమా నాగేశ్వరరావని పేరు పెట్టాడు శంకరయ్య. వాడికి ఆకలయినా చలేసినా కళ్లు గట్టిగా మూసుకుని మొహమంతా సొట్టలూ మిట్టలూచేసి నోరంతా తెరిచి వోపికకొద్దీ అరవటమూ, నల్లటి

చిన్న నోటితో పాలకోసం ఆత్రంగా తడుముకోవటమూ చూసి 'పిచ్చెదవా, నీకేం తెలవదు' అంటూ నవ్వుకుంటూ గుండెల కదుముకున్నది రాగమ్మ. మూడోనెల పడ్డాక వాడు కడుపు నిండి ఆడుకుంటున్న సమయాల్లో తల్లి కనపడగానే గుర్తుపట్టి ఆనందంతో దవడలు నొక్కుకుపోయేట్లుగా చేతనయినంతగానూ తెరిచి, కాళ్ళూ, చేతులూ గాలిలో మరింత జోరుగా ఆడిం చేసి కళ్లతోనూ ఒళ్లంతటితోనూ నవ్వినప్పుడు 'నాగేశూ ఏందిరా అంత నవ్వు' అంటూ వాడిని ముద్దుల్తో ముంచేసి వాడితో కలిసి నవ్వింది.

సుబ్బమ్మ వచ్చి మనవణ్ణి చూసి రంగు రంగుల వాయిల్ చొక్కాలు నాలుగు, పౌడరు డబ్బా, సబ్బు బిళ్లా, కస్తూరి మాత్రలూ, పది రూపాయిలూ యిచ్చివెళ్లింది

రాగమ్మకి కాన్పు అయి కొడుకు పుట్టేసరికి అప్పు భూతంలా ఎదురైంది. ఇల్లు అమ్మేయ్యాల్సిన పరిస్థితి వచ్చింది.

'ఆ బళ్లో జవాను పని మళ్లీ కాళీ ఒచ్చింది. ఎవడో సాకలాడికిస్తే అడి పెళ్లాం యింటో పని సరిగ్గా సెయ్యకుండా అమ్మగార్నే ఎదిరిచ్చి మాట్లాడి, ఆడూ గండాగొండీగావుంటే తీసి పారేశారంట' అన్నాడు శంకరయ్య ఒకనాడు.

'అయ్యో పాపం. మరి సాకలోళ్లకి యిట్టాటి పనులకి ఒళ్లొంగిసస్తదా. అదీ గాకుండా అట్లాటోళ్లకి అయ్యవార్లకి మనకి మల్లేనే ఇల్లు శుభ్రం, ఒల్లు సుబ్రం పని సుబ్రం ఉండాలి. ఎట్టాగైనా ఆ పనిలో చేరేట్టు చూడరా నాయినా' అన్నది శేషమ్మ.

మరునాడు మధ్యాహ్నం హైస్కూలు వాచ్‌మేనూ శంక రయ్యా వచ్చి రాగమ్మను హెడ్మాస్టరుగారింటికి తీసుకెళ్లారు.

'..... పని శుభ్రంగా ఉండాలి మీ ఎడ్డి మడ్డి పనులు మాకు పనికిరావు. ఒళ్లు దగ్గర పెట్టుకొని పని చెయ్యాలి రెండు పూటలా యిల్లు అద్దంలాగా తుడవాలి. మా యింట్లో వాడేది మామూలు చీపురు కాదు. పట్నంలో అమ్మే కుంచెలు.. వారానికోసారి యిల్లు కడిగి బిందెలూ కళాయిలూ తోమాలి దొంగతనం అన్నమాట వినపడకూడదు ....' హెడ్మాస్టరుగారి భార్య కఠినంగా హెచ్చరికలుచేస్తోంది

ఆమె కట్టుకున్న లేత ఆకుపచ్చ జరి అంచు వెంకట గిరి చీరెనూ ఆమె మాట్లాడుతున్న తీరునూ చూస్తూ నిల్చుంది రాగమ్మ. శంకరయ్య దారప్పోగుల్లాంటి జుట్టును మొహమ్మీద నుండి పక్కకి పోయేట్లు తల ఎగరేసి 'పని బాగా సేస్దది లెండి' అన్నాడు. ఆమె సందేహంగా యిద్దరివేపూ చూసి 'సరే రేపు తెల్లారుజామున్నే ఒచ్చెయ్యి' అని చెప్పింది.

అన్నం లేదు. జీతం మూడు రూపాయిలు—బళ్లో యిచ్చే వందా కాకుండా.

* * *

నాగేశు పుష్టిగల పిల్లవాడు కాలేదు ఎప్పుడూ జలుబో జ్వరమో విరేచనాలో ఉంటూనే వుండేవి. శేషమ్మ అమ్మలక్క లందరి సలహాలతోనూ కస్తూరిమాత్రలూ సొంటిమాత్రలూ వాడుతూనే ఉంది. రెండు రూపాయిలకు గ్రైప్‌వాటర్ అనే పళ్ల రసం సీసా కూడా తెచ్చి వాడింది ఎవరో చెప్పగా. అయినా వాడికి ఒకటి తగ్గితే ఒకటిగా ఏదో ఒక నలత ఉంటూనే వుంది. 'ఏవిటో, మారకం గాదు. వాళ్లమ్మపాలు' అన్నది శేషమ్మ విసుగు పుట్టి.

ఒకసారి జలుబూ విరేచనాలూ రెండింటిలోనూ జ్వరం ఫెళ్ళున కాస్తూ పిల్లవాడు తల్లక్రిందులయిపోతుంటే రాగమ్మ పనినుంచి తొందరగా వచ్చి వాడిని వూరి కాచివర వున్న ధర్మాసు పత్రికి తీసుకెళ్లింది రెండు గంటలసేపు నిలబడ్డాక డాక్టరు చూసి ఇంజక్షను రాసిచ్చాడు. అది వేయవలసిన నర్సు ముఖంలో చిటచిటలతో, 'ముందుగానే రాకూడదూ' అంటూ రుస రుసలతో సూదిలో మందు తెచ్చింది. 'పిల్లాడి కాళ్ళూ, నడుమూ కదల కుండా గట్టిగా పట్టుకో' అన్నది ఆవిణ్ణీ సూదినీ చూసి అర్థంకాక తల్లిని కరుచుకుపోయాడు నాగేశు. రాగమ్మకి గుండె దడదడ లాడింది నాగేశు వీపుని ఒక చేత్తోనూ, కాళ్లను ఒక చేత్తోనూ గట్టిగా కదలకుండా పట్టుకుంది నర్సు సూదిని ఒక్క వూపుతో లోనికి గుచ్చింది అది లోపలికిపోయి ఫట్‌మని విరిగింది 'పిల్లాణ్ణి కదలనివ్వద్దంటే మొద్దుమాదిరి నిల్చున్నావు' అంటూ తిడుతూ బయటికి కన్పిస్తున్న కొసని పట్టుకుని సూదిని బయటకు లాగింది నర్సు ఇంకో సూది తెచ్చి దానితో మందు ఎక్కించింది నాగేశు గిలగిల్లాడిపోయాడు. రాగమ్మకు ఒళ్లంతా చెమటలు పోసినై. కొడుకుని గట్టిగా కావిలించుకొని ధర్మాసుపత్రిలోనుంచి బయట బడింది మళ్లీ ఆ చాయలకు వెళ్లడానికి ధైర్యం చాలలేదు.

నాగేశుకి ఒంట్లో బాగా లేనప్పుడు రాగమ్మ పనికెళ్తుంటే ఏడ్చేవాడు. మరీ ఏడ్చినప్పుడు చంక నేసుకు తనతోటే తీసు కెళ్లేది. వాడిని ముందు వరండాలో ఒక ప్రక్కగా విడిచిపెట్టి తన పని చేసుకునేది. ముక్కులోనుండి నోట్లోకి చీమిడి కారు తుంటే నోట్లో నాలుగు వేళ్లు వేసుకుని ఒళ్లంతా చొంగ కార్చుకుంటూ ఓ ప్రక్కగా గోడవారగా కూర్చొని పెద్దకళ్లతో బయటకీ లోపలికీ తిరిగే పిల్లల్నీ పెద్దల్నీ చూస్తూ కూర్చునే వాడు మధ్యమధ్యన రాగమ్మ వచ్చి తన చీరకొంగుతో వాడి ముక్కు తుడిచి, మొహమ్మీద పడే దూది లాంటి ప్రాణంలేని జుట్టును పైకి సర్ది ముద్దు పెట్టుకునేది. తల్లిని చూడగానే వాడి మొహంనిండా సంతోషం పాకిపోయేది. రాగమ్మ అటు వెళ్లగానే యథాప్రకారం వచ్చేపోయే వాళ్లను చూస్తూ కూర్చునే వాడు. సన్నగా నల్లగా వున్న ఆ చీమిడి ముక్కు పిల్లవాడిని చూడగానే అమ్మగారికి చీకాకు వచ్చేది. 'ఈ జలుబులూ విరేచ నాలూ జ్వరాలూ వుండే పిల్లవాడిని పిల్లలుండే యింట్లోకి తెచ్చి ముందర పెడితే ఎలాగే, రాగాం. ఏం, కాసేపు యింట్లో వుండ లేడంటనా?' అని కేక లేసేది ఒక్కోసారి.

ఆ ఏడాది నాలుగుసార్లు పెద్ద తుఫాన్లు వచ్చినై. మంచి కోతల సమయంలో వచ్చిన గాలి వాన పంటల్ని చాలావరకు నాశనం చేసింది. ఆకాశం రెండు నెలలపాటు మూసుకుపోయే

వున్నది. సూర్యుడు బలహీనంగా కాంతి లేకుండా కాసేపు కన బడి మాయమై పోయేవాడు. నాగేశు యీ రెండు నెలలూ నలతగానే వుండి మరీ చిక్కిపోయాడు. రాగమ్మ మనసుకు మబ్బు కమ్మేసినట్లయి ఏవిటో మూగ బాధగా వుండిపోయింది.

'ప్రపంచానికే ప్రళయకాలం వచ్చినట్లుంది. మనుషులు మంచీ చెడ్డా మర్చిపోయి డబ్బు మోజులో పడిపోయారు. కాక పోతే యీ తుఫాను లేమిటి సూర్యుడే కనబడకపోతుంటేనూ' అనుకుంటున్నారు ముసలివాళ్ళూ, పాతకాలపు వాళ్ళూను.

ఇటువంటి సమయంలోనే వూళ్ళో అక్కడక్కడా పిల్ల లకు చెడ్డ జ్వరాలు తగులుతున్నాయని తెలిసింది. నెలగడిచే సరికి పిల్లలుండే వాళ్ళందరికీ మాట్లాడుకోవడానికి అదే ముఖ్య విషయమై పోయింది. హెడ్మాష్టరుగారి మూడేళ్ల కూతురికీ తొమ్మిదేళ్ల కొడుక్కూ ఆ జ్వరం రాకుండా ఉండడానికి ముందు గానే ఏదో మందు వేయించారు. 'నీవు కూడా వేయించరాదూ జబ్బు రాకుండా వుంటుంది' అని రాగమ్మకి సలహా యిచ్చింది అమ్మ గారు. రాగమ్మ యింటికొచ్చి చెప్పింది అది డబ్బు ఖర్చుతో కూడుకున్న పని.

'ఏం మందులో. పూర్వకాలంలో యిట్టాటివన్నీ వేసి పిల్లల్ని పెద్ద జేశావా? ఆ మందులన్నీ కలిసి అసలే అబ్బనాకారపు వాడికి ఉడుకు జేస్తయి' అన్నది శేషమ్మ.

'సూద్దాంలే' అన్నాడు శంకరయ్య.

అక్కడో పిల్లాడు పోయాడనీ యిక్కడో పిల్లకు కాళ్ళు పడిపోయాయనీ వార్తలు విన్న రాగమ్మ శంకరయ్యని మళ్లీ హెచ్చ రించింది

'మేం అయ్యన్నీ లెక్క లేసుకున్నాం. తడవకు అయిదు రూపాయిల లెక్కన మూడు తడవల మందుకీ పదేసి రూపాయి లౌతాయి. అంతకంటే జెరం తగిల్తే మందుకి తక్కవవుతది. వాస్ మేనూ, సీవరూ అందరూ అట్టనే అంటుండారు. ఇప్పుడు డబ్బు గూడా సేతిలో లేదు' అన్నాడు.

నెల తిరిగే సరికి నాగేశుకి ముమ్మరంగా జబుబు చేసింది. రెండు రోజులు జ్వరం తగిలింది. కాళ్లు చచ్చుబడి పోయాయి.

'అయ్యో దేవుడా యిదేం కాలమో. యీ కొత్త రోగా లేమిటో మేం ఎరగం యిట్టాటివి. ఈ అక్కుపచ్చి పిల్లాడికి యిదొకటి పెట్టాడమ్మా దేవుడూ?' అంటూ అందరికీ చెప్పుకొని శోకాలు పెట్టింది శేషమ్మ.

శంకరయ్యకు అసలా విషయమే పట్టలేదు.

బాగా తిరిగి ఆడుకుంటున్న పిల్లవాడు కదల లేకుండా మంచం మీదనే వుండి పోవటం రాగమ్మకు కష్టంగా వున్నది. మంచం మీద పడుకుని పీక్కుపోయిన మొహంలోంచీ మరీ పెద్దగా కనబడే కళ్లతో అందర్నీ పూరికే చూస్తూ పడుకునేవాడు తల్లిని చూడగానే వాడి మొహంనిండా నవ్వు విరిసేది. రాగమ్మ కూడా నవ్వేది. 'ఒరే నాగేశూ, నీకు బాగయినాక నాతోపాటు అమ్మగారిం టికి తీసుకెల్తా లేరా' అని చెప్పేది. జబ్బు చేసినప్పటి నుండీ వాడంటే రాగమ్మకు మరీ ప్రాణమై పోయింది.

నెల్లాళ్లకి యిరవై మైళ్లలో వుండే పల్లెనుండి శేషమ్మ అక్క పిల్లవాడిని చూడటానికి వచ్చింది. పది రోజులుండి గుడ్డలు కుట్టించుకుని కావలసిన సరుకులన్నీ కొనుక్కొని సినిమాలన్నీ చూసి తిరిగివెళ్తూ 'మా వూళ్లో ఆయుర్వేద వైద్దుగు డున్నాడు. శానామంది సచ్చురోగాలాళ్ళు ఆయన దెగ్గిరికి పోతండారు. వీడిని గూడా తీసకపోయి సూపిద్దాం' అన్నది.

ఇరవై రూపాయిలు చేత బట్టుకొని మనవణ్ని ఎత్తు కొని బయల్దేరింది శేషమ్మ. వాడు వెళ్తుంటే రాగమ్మకి చెప్ప లేని దిగులు వేసింది 'నేనూ ఒస్తా' నన్నది

'ఇంటో ఎవ్వరూ లేకుండానా? ఎడ్మాష్టరు అయ్యవా రింటో పని మానెట్టా? అంతగా అయితే మళ్లీ ఒద్దువుగాని' అన్నది శేషమ్మ.

నాగేశు వెళ్లినప్పట్నుండీ కాలూ చెయ్యీ ఆడక మతి పోయినదాన్లా వుండిపోయింది రాగమ్మ. ఇంట్లో కూడొండ తున్నా, అయ్యవారింట్లో పని జేస్తున్నా 'వాడేం జేత్తన్నాడో. ఎట్టా గున్నాడో. నే లేనని బెంగపడ్డాడేవో' అనుకునేది.

పది రోజులు తిరక్కుండానే ఆ వూరినుండి నాగేశు పోయాడనీ వెంటనే రమ్మనీ కబురొచ్చింది రాగమ్మ ఆవురావు రంటూ ఏడ్చింది కడుపులో ఏడుపు పొర్లుపొర్లుగా వస్తుంటే కుళ్లి కుళ్లి ఏడ్చింది. శంకరయ్య అప్పటికప్పుడు రెండు రోజులు శలవడిగి వచ్చాడు. బస్సులో కూడా ఏడుస్తూనే వుంది రాగమ్మ. నోట మాట మాత్రం రాలేదు. పచ్చి మంచి నీళ్లు గూడా ముట్టలేదు. పిల్లవాడు కనబడగానే కట్టెలాగా నిగుడుకుపోయిన వాడిని గుడ్డలతోటే ఎత్తుకుని గుండెల కదుముకుంది శోకం పొంగు తగ్గుతూవుండగా 'వాసన గొడతన్నాడు. తరవాత పని కానియ్యా'లని బలవంతాన రాగమ్మ దగ్గర్నుండీ పిల్లవాణ్ణి లాక్కున్నారు మీద గుడ్డ లేకుండా చేసి టవలులో చుట్టు కుని శంకరయ్య భుజాన వేసుకున్నాడు మొగవాళ్లంతా వెళ్లి పోయారు. తెలివి లేకుండా బిళ్ల బీటుగా పడిపోయింది రాగమ్మ ...

* * *

ఇంటి కొచ్చాక రాగమ్మకి బ్రతుకంతా అయోమయం అయిపోయినట్లయింది. 'అమ్మా బాబూ దగ్గిరుంటే బాగుండు' ననిపించింది. ఎవరివీాదో చెప్పరాని కసి పుట్టుకొచ్చింది. బల హీనంగా చూసే వాడికళ్ళూ రోగంతో వాడిపోయిన ఒళ్ళూ కళ్లముందున్నట్లే వుండేవి. దూదిలాగా మెత్తగా ప్రాణంలేకుండా వుండే వాడి జుట్టు చేత్తో లాకినట్లే వుండేది 'వాడు ఎవరి కేవపకారం జేశాడు? ఎవురికి బరువయ్యాడు? కాళ్ళు లేక పోతేనేం, నా కడుపులో పెట్టుకు కాపాడుకునేదాన్ని. భగవంతు డికి నాయం లేదు' అనుకున్నది.

శంకరం పనిలో చేరగానే 'అది నాలుగు రోజులు రాకపోయినా పర్లేదు. అమ్మగారు నిన్ను రమ్మన్నారు' అంటూ శేషమ్మని

హెడ్మాష్టరుగారింటికి తీసుకెళ్ళాడు. 'నాలుగు రోజులే కదా' అని మనసు గట్టి జేసుకుని విధిలేక బయల్దేరింది శేషమ్మ. శుభ్రంగా గులాబీపువ్వులా వున్న చలవరేకు కట్టుకుని నున్నగా తల దువ్వి కొప్పు పెట్టుకుని తెలిసిన వాళ్ళింటికి వెళ్ళినట్లు వెళ్ళింది. అమ్మగారితో కబుర్లు చెబుతూ నిదానంగా పని చేసుకుని ఆలస్యంగా యింటి కొచ్చింది. చాటంత మొహంతో 'అమ్మగారు బలే మంచిది. ఎంత బాగా మాట్లాడుతుంది!' అంటూ ఒక గిన్నెడు పులుసూ మజ్జిగా తెచ్చింది. నాలుగు రోజులయ్యాక 'చచ్చు రోగం వచ్చినవాడు పోయిందే వాడికి హాయి. వూరికే కూచుంటే మరీ దుఃఖం. రాగాంని పనిలోకి రమ్మను రేపట్నుంచీ' అన్నది అమ్మగారు అంటూ ఆవిడిచ్చిపంపిన పాత చీర తెచ్చింది. పెద్ద ఎర్ర చుక్కలుండే గులాబీరంగు వాయిల్ చీర. ఆమె ఆ చీర కట్టుకు తిరుగుతుంటే ఆ రంగుల్ని కన్నార్పకుండా చూస్తా వుండేవాడు నాగేశు అన్న సంగతి గుర్తు కొచ్చింది రాగమ్మకి. అప్పుడు ఆమె నాగేశుని చీదరించుకున్నది. ఇప్పుడు వాడు పోయాక ఉదారంగా చీర యిచ్చి పంపింది. 'ఎవరుక్కావాలి. ఎదవసీర' అనుకున్నది. 'నే నింగ ఆ పన్లోకి పోను' అన్నది.

శేషమ్మకి చాలాకోపం వచ్చింది. లోకంలో మనకేనా కష్టం వొచ్చింది? ఏం అంత అబ్బురం!' అంటూ విసుక్కుంది.

ఇంకో పది రోజులకు పదిసార్లు రాగాంని రమ్మని చెప్పి పంపాక అమ్మగారికి కోపం వచ్చింది.

'ఏదో ఒక వంక పెట్టుకుని ఇంట్లో పనిఎగ్గొట్టి వుద్యోగం మిగిలించుకుందా మనుకున్నారా? ఈ శేషమ్మ మాకు పనికిరాదు. ఎంతసేపూ లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ యీడ్చుకుంటూ పనిజేస్తుంది. పైగా కూరలు కావాలి. అన్నం కావాలి గుడ్డలు కావాలి. అన్నిటిమీదా ఆశే. రాగాం ఒస్తే ఒచ్చినట్లు. లేకపోతే నీ వుద్యోగం పోయినట్లే' అని ఖండితంగా చెప్పింది శంకరంతో.

నాగేశు పోయాడని వార్త తెలిసి సుబ్బమ్మ వచ్చింది. తల్లిని చూడగానే రాగమ్మకి ఒక్కసారిగా దుఃఖం కట్టలు తెంచుకుంది. తల్లిని కావిలించుకుని ఒకటే ఏడుపు.

'బగమంతుడికి యింత పెపంచంలోనూ వాడే బరువయ్యాడే. బగమంతుడికి నాయం లేదు. వాడు లేకుండా నేనెట్టా బతికేది? నేనూ చచ్చిపోతానే' అంటూ బావురు మన్నది.

సుబ్బమ్మ కూతురి తలా వీపూ నిమురుతూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. 'సాల్లే వూరుకో. ఇంత పెపంచకంలో కట్టం లేనోళ్ళున్నారా? అందరూ బతకటంలా? కడుపుతీపి ఆ నిమిసాని కట్టం అనిపిస్తది. బగమంతుడిని తప్పుపట్టేవాళ్ళమా మనం?' అంటూ గట్టిగా కేకలేసింది.

'నోరు లేదు గాని వాడికుండే బెమత ఎంతదని? మనిసి కనబడగానే ఎంత సంబరం బడిపొయ్యేవాడు? ఎర్రినాయన! ఏ అద్దంరెత్తిరి మెలకూ ఒచ్చినా అప్పుడు నా కడుపులోకి దూరి సీరకొంగు మొగాన కప్పుకుని నిద్రబొయ్యేవాడు. ఎక్కడున్నాడో. ఏం జేత్తున్నాడో' అన్నీ వైనవైనాలుగా తలచుకు తల్లితో చెప్పుకున్నాక రాగమ్మకు గుండెల్లో బరువు కాస్త తెరిపి యిచ్చినట్లయింది.

'ఇప్పుడు మంచి రోజులు గాదు సుక్కోదు రంటుండారు. మూడోనెల్లో మీ యిద్దర్నీ యింటికి తీసుకెళ్లి గుడ్డలు పెడ తాను. అందాకా ధైర్యంగా వుండు. నీ బాబు నువ్వెట్టుండావో నని మరీ బెంగెట్టుకున్నాడు' అని చెప్పి వూరి కెళ్లిపోయింది సుబ్బమ్మ

వుద్యోగం పోయేసరికి అప్పులవాళ్లు బాకీలు తీర్చమని తొందర పెట్టారు. విధిలేక యిల్లు అమ్మి అప్పులు తీర్చి తులి శప్ప యింటిదగ్గరగా ఒక అద్దెయింట్లోకి మారారు చిన్న పూరిల్లు అద్దె నెలకి ఆరు రూపాయలు. సొంతయిల్లు పోయినందుకు శేషమ్మ కడుపు తరుక్కుపోయినట్లుగా ఏడిచింది. అప్పట్నుండీ సగంప్రాణం పోయిన దానిలా వుండిపోయింది.

'ఎంతటి సంసారం ఎంతట్లోకి దిగజారి పోయింది! కోడలు కాలు మోపినప్పట్నుండీ అంతా ముదనష్టం అయిపోయింది. శివా లయంలో నవగ్రహాలకు శాంతిచెయ్యించాలి' అన్నదిగానిచేయించలేదు.

శేషమ్మకి డబ్బుకి కటకట అయిపోయింది. ఏవిూలేనివాళ్లని ఎవరూ అప్పు లివ్వడం లేదు. ఇంట్లో గింజ గూడా లేని రోజు వచ్చింది. "ఏరా శంకరం, యీ పూటకి యింటో గింజ లేదు! ఏం జేసేదిరా' అంటూ తలపట్టు క్కూచుంది శేషమ్మ.

'ఏదన్నా పని కాళీ పడద్దని సూస్తా వున్నా అందాకా ఎట్టనో' అన్నాడు శంకరయ్య

శంకరయ్య ఉద్యోగం పోయినప్పటి నుండీ శేషమ్మ కోడలితో మాట్లాడటం మానేసింది. నాగేశు పోయినప్పటినుండి అత్త మొహం చూడాలని బుద్ధి పుట్టలేదు రాగమ్మకు ఇప్పుడు ఏవిూ చెయ్యలేని పరిస్థితిలో ఎదురెదురుగా కూర్చుండిపోయిన తల్లీ కొడుకుల్ని చూస్తే రాగమ్మకి నవ్వుతోబాటు జాలి కలిగింది.

ఉన్నట్లుండ ఒక రోజున చలికాలపు చీకట్లు పలచబడి పోయాయి. మాఘమాసంలోనే వసంతం ప్రవేశించింది ముదిరి వాడిపోయిన మురికి ఆకుల్తో ముసలిదాన్లా కనబడుతున్న వేపచెట్టు అక్కడక్కడా సన్నటి చిగురుటాకులు వేసింది ఒడిలి పలచబడి పోయిన సన్నజాజి పొద లేతాకు పచ్చకొనలువేసి కాంతి పుంజా కొంటోంది. సాయంత్రాలు సంజెచీకట్లు ఒక్కసారిగా గుబు గుకు రాకుండా నిదానంగా అదంగా ఆకాశంనుంచీ దిగుతున్నాయి. సూర్యుడు కాస్త తెల్లబడేప్పటికే పగలంతా చీకటి గుయా రంలా వుండే పూరిల్లు లేత వెలుగుతో నిండిపోతోంది. మనుషుల మనస్సుల్లోని చీకట్లు తొలగి ఆశా ఉత్సాహమూ నిండినట్లయి తేలిగ్గా వూపిరి పీలుస్తున్నారు

తులిశప్ప తన కట్టలోని కూలీలందర్నీ కేకేసుకుంటూ పోతోంది వీధిలో 'తైవయింది. రండమ్మోవ్' అంటూ. రాగమ్మ లేచి వీధి మొగలో అందరూ పోగవుతున్న చోటికి వెళ్లింది.

'నేంగూడా ఒస్తాను యియ్యాల' అన్నది తులిశప్పతో.

తులిశప్ప నవ్వి 'అట్టనే, రా అన్నంబెట్టి రూపాయన్నర కూలి' అన్నది.

రామిరెడ్డిగారి తూర్పు పొలానికి ఆరుగురితో కలిపి పంపింది రాగమ్మని. 'రవణమ్మా, రంగయ్యా వీూరు కాస్త ఆ రాగమ్మని సూసుకోండి. అలవాటు లేదు. నలుగుర్తోపాటుగా ఎక్కి రాలేదేమో నాలుగు రోజులు. సర్దుకు పోండి' అని చెప్పి వప్పగించింది.

అందరితో కలిసి వూరి బయట పొలాల మధ్యన నడు స్తున్న రాగమ్మకి వూపిరి పీల్చుకున్నట్లయింది

'ఈ పెపంచంలో మంచినిబెట్టిన బగమంతుడే సెడ్డనీ బెట్టాడు. సెడ్డని బెట్టిన బగమంతుడే మంచినీ బెట్టాడు ఆయన నాయం మనకేం దెల్సు పెట్టింది అనుబగించటమే మనొంతు' అనుకుంది యిరవై యేళ్లు నిండని రాగమ్మ.

# తెలుగు కవిత్వంలో నవ్యత

శ్రీ నూతలపాటి గంగాధరం

నవ్యత అనేది ఏకవి కాకవికి, ఏ యుగాని కాయుగానికి తెచ్చిపోయే, మారిపోయే విచిత్రమైన గుణం నాటికైనా నేటికైనా, రేపటికైనా కవిత్వానికి అపరిహరణీయమైన వస్తువు—నవ్యత నాటి కవి తన కాలానికి అనుగుణమైన నవ్యతను తన కావ్యంలో సాధించాడు నేటి కవిగూడ తనవెనుకటి వారికంటే ఎంతో కొంత కొత్తను ప్రవేశ పెడుతూనే ఉన్నాడు రేపటి కవి అయినా అంతే నవ్యత కవిత్వానికి ప్రధానమైన గుణమైతే కావచ్చుకాని, ప్రధానమైన లక్ష్యం మాత్రం కాదు.

ఒక క్రియలో, ఒక వస్తువులో దాని స్వభావాల్లో తన వెనుకటి వారికంటె కొంత భిన్నంగా, సమకాలీన సమాజాభిరుచికి అనుకూలంగా ఎంతో కొంత మార్పును తీసుకొని రావడాన్ని నవ్యత అంటున్నాము. కవిత్వంలో ఈ నవత్వం అనేక రకాలుగా ఉంటుంది. వస్తువులోనూ, ఊహలోనూ ఛందస్సులోనూ, శిల్పంలోనూ, భాషలోనూ యుగయుగానికి ఒక్కొక్క రకమైన కొత్తదనం ప్రవేశ పెట్టబడుతోంది కానీ, ఇవన్నీ ఒకదాన్ని అనుసరించి మరొకటి ఉంటాయి. వస్తువు మారిందంటే ఊహ మారుతుంది. ఊహ మారితే ఛందస్సు మారుతుంది. ఛందస్సుతో పాటు శిల్పమూ, శిల్పంతో పాటు భాషా ఒకదాని వెంట ఒకటి మారి తీరవలసిందే.

ఈ రకమైన మార్పు నేటి సాహిత్యంలోనే కాదు ప్రాచీన సాహిత్యంలోనూ జరిగింది ఆంధ్ర సారస్వత ప్రారంభయుగంలోనే ఈ మార్పును స్పష్టంగా గ్రహించవచ్చు. నాటి మార్గ కవిత, దేశికవిత అన్న విభజనే దీన్ని మనకు ఋజువు చేస్తుంది మార్గ, దేశి—ఒకదానికంటె మరొకటి భిన్నమైనది. వస్తువూ ఊహా, ఛందస్సు, శిల్పమూ, భాషా ఒకదానికంటె మరొకదానిలో పూర్తిగా వ్యతిరేకమైనవి. నాటి కవుల్లో శివకవులు దేశి తెగకు చెందినవాళ్ళు, నన్నయ మొదలైన కవులు మార్గ పద్ధతికి చెందినవాళ్ళు. నాటి కవుల్లో శివ కవులది ప్రత్యేకమైన మార్గం. పూర్తిగా ప్రయోగమార్గం వాళ్ళది. ఆపాద మస్తకం నవ్యతలో నిలబడ్డవాళ్ళు. ఇంతెందుకు? ఆనాటి కవులకు సంబంధించినంతవరకు నవ్యత ప్రతి ఒక్కరిలోనూ ఉంది. భారతకవుల్లోనే చూద్దాం. నన్నయ్యకు తిక్కన్న పూర్తిగా నవ్యుడు. తిక్కనకు ఎర్రాప్రెగ్గడ కొత్తవాడు ఈ కొత్తదనం కాలాన్నిబట్టి కాదు. వాళ్ళ కవితాగుణంలోనే ఉంది. నన్నయ్యది పురాణ ధోరణి. కథను చెప్పడంలో ఎంతో ప్రసన్నతను చూపించాడు ఆనాటికది నవ్యత తిక్కనది నాటక పద్ధతి. పాత్రల మనస్తత్వాలను సజీవ శిల్పాలుగా తీర్చి దిద్దాడు. ఎర్రనది కావ్య పద్ధతి. కావ్యాన్ని వర్ణన ప్రధానంగా నడిపించడం అతని ప్రత్యేకత. ఆనాటి కది నవ్యత కవిత్రయం సంస్కృతాన్ని అనువదించింది. శ్రీనాధుడు అనువదించాడు. పోతన గూడా. కానీ వీళ్ళ అనువాద పద్ధతిని పరిశీలిస్తే ఒకరికంటె మరొకరికి ఎంతో దూరం ఉంది. ఎందుకు చెబుతున్నానంటే అనువాదంలో కూడా మనవాళ్ళు ఒకరికంటె మరొకరు ఎంతో కొత్తను ప్రదర్శించారు. పోనీ ఒక్క ప్రబంధ యుగంలోని వాళ్లనే తీసుకుందాం పెద్దనకు పింగళి సూరన ఎంత నవ్యుడు? వీరిద్దరి మధ్య వేద పండితునికీ, ఆధునిక పండితునికీ ఉన్నంత తేడా ఉంది.

ఆది యుగంలో నన్నయ, మధ్య యుగంలో శ్రీనాధుడు, ఆధునిక యుగంలో రాయప్రోలు ఒక వరుసలోని వాళ్ళు. అలాగే శ్రీశ్రీ అన్నట్లు తిక్కన, వేమన, గురజాడ ఒక వరుసలోనివాళ్ళు. శ్రీశ్రీ మాటల్లోనే చెప్పాలంటే నన్నయ గ్రూప్‌ది పాడే కవిత, తిక్కన గ్రూప్‌ది మాట్లాడే కవిత నాటి పోతన నేటి భావ కవులకు దగ్గర బంధువు. వేమన అభ్యుదయ కవులకు ఆత్మీయుడు. ఒక ప్రక్క కవిత్వమూ, దాని సంప్రదాయాలూ, విలువలూ మారిపోయి వెనక దానితో పోలికలే లేని కొత్తదనం ముంచుకు వస్తున్నా, మరొక ప్రక్క ఇలాంటి సామ్యం కవుల్లో యుగ యుగానికి వెన్నంటి వస్తూనే ఉంటుంది. ఎందుకంటే వాళ్ళు వ్రాస్తున్నది కవిత్వం కాబట్టి.

ఏమైనా కవికి నవ్యత ప్రాణ వాయువు లాంటిది. తనకు తెలియకుండానే ఈ గుణాన్ని అవలంబిస్తూ ఉండడం నిజమైన, సహజమైన కవికి ఉగ్గులో పెట్టిన విద్య ఈ నవ్యత--సంప్రదాయత పరిణామంవల్ల ఉద్భవించినది ఒకటి అన్య సంప్రదాయం నుంచి సంక్రమించినది మరొకటి. నవ్యతలో ఈ రెండు పద్ధతులు ప్రబలంగా కనబడు తున్నవి. మొదటి పద్ధతికి చెందిన కవిత్వం— తుమ్మలదీ, జాషువాదీ, మరొకరిదీ. రెండవ పద్ధతికి చెందిన కవిత్వం—శ్రీశ్రీ దీ, మరొకరిదీ మొదటి పద్ధతికి చెందిన దాన్ని గురించి ఎవరికీ ఎలాంటి పేచీ లేదు. కానీ, రెండవ పద్ధతికి చెందిన నవ్యతలో కొంత తకరారుంది. ఎందుకంటే అన్య సంప్రదాయం నుంచి సంక్రమిస్తున్నది కాబట్టి. అన్య సంప్రదాయం, స్వీయ సంప్రదాయాన్ని తప్పక వ్యతిరేకిస్తుంది.



క్రమేణ హేతువుగా ప్రజల ఆత్మీయతకు దూరమయ్యే ప్రమాదం ఉంది. పూర్వం అయితే ఏదో ఒక రాజు మెప్పుతో సరిపెట్టుకో వచ్చు. వర్తమాన కాలంలో ప్రజలకు దూరమైన కవితకు మన్నిక లేదు కాబట్టి అన్య సంప్రదాయం నుంచి సంక్రమించిన నవ్యత మాత్రం కవి స్వీయ జాతీయ సంప్రదాయాల ముద్ర కొంతకుకొంత పడినప్పుడే రాణిస్తుంది. త్వరలో ప్రజా దరణకు పాత్ర మవుతుంది. లేకుంటే దాని ప్రయోజనం అంతంత మాత్రంగానే ఉంటుంది.

అన్యసంప్రదాయం నుంచి సంక్రమించిన నవ్యత రెండు రకాలుగా ఉంటుంది. ముందు సమాజంలోకి ప్రవేశించి, ఆపైన సాహిత్యంలోకి సంక్రమించడం ఒకరకం ముందు సాహిత్యంలో అడుగుపెట్టి ఆపైన సమాజంలోకి ప్రవేశించడం మరొక రకం. మొదటి రకానికి చెందినది ప్రారంభంలోనే ప్రజా హృద యాల్ని ఆకట్టుకొంటుంది. రెండవ రకానికి చెందినదాని ప్రభావం ప్రజల మీద నెమ్మదిగా ప్రారంభమవుతుంది. ఏది ఏమైనా సాహిత్యం యొక్క మూలమూ, ఫలమూ సమాజం నుంచి సమాజం కోసం నిర్దేశింపబడినవే.

నవ్యత కోసం నాటినుంచి నేటివరకు జరిగిన ప్రయో గాలలో నాటి సాహిత్యానికి నేటి సాహిత్యానికి సంప్రదాయా లలోగానీ, ప్రయోజనాలలో గానీ పోలికే లేనంతగా మార్పు వచ్చేసింది. ఈ మార్పులో కూడా సమాజానికీ, సాహిత్యానికీ ఉన్న సంబంధం నాడుగానీ, నేడుగానీ తెగిపోకుండా ఉండడం గమనింపదగింది.

నాటి సమాజం వేరు, నేటి సమాజం వేరు. నాటి సాహిత్య సంప్రదాయాలు వేరు, నేటి సాహిత్య సంప్రదాయాలు వేరు. నాటి సమాజం ప్రాచ్య సంస్కృతికి పట్టుగొమ్మ. నేటి సమాజం పాశ్చాత్య సంస్కృతికి ప్రతిబింబం. అలాగే నాటి సాహిత్యం గీర్వాణ సాహిత్యప్రేరితము. నేటి సాహిత్యం ఆంగ్ల సాహిత్య ప్రభావితము. నాడు పద్యానిది ప్రభుత్వం. నేడు గద్యానికి ప్రచారం. నాటి సాహిత్య ప్రయోజనం సద్య: పరనిర్వృతి. నేటి సాహిత్యప్రయోజనం సమాజశ్రేయస్సు. నాటి కవికి ప్రమాణాలు తత్పూర్వకావ్యాలూ, అలంకారశాస్త్రాలూను. నేటి కవికి ప్రమాణం సమకాలీన సమాజం. నాడు సాహిత్యంలో ఒక పరిణామం గానీ, ఒక ఉద్యమంకానీ వచ్చిందంటే అది దాదాపు అయిదు వంద లేండ్లకు పైగా ప్రభుత్వం చెలాయించేది. నేడు సాహి త్యంలో ఒక ఉద్యమం వచ్చిందంటే దాని ఆయు:ప్రమాణం పాతికేండ్లకే బ్రహ్మప్రళయ మైపోతోంది. అయితే ఆనాడు ఒక కొత్త పరిణామం ప్రచారంలోకి రావడానికి చాలాకాలం పట్టేది. ఉదాహరణకు ప్రబంధ ప్రక్రియనే తీసుకుందాం. 14 వ శతాబ్దంలో ఎర్రాప్రెగ్గడ వేసిన ప్రబంధ బీజం (ఇంకా వెనక్కికూడా నెట్టుకోవచ్చు నన్నెచోడుని ఆధారంగా) అల్లసాని పెద్దన నాటికి ఒక సంపూర్ణ స్వరూపాన్ని దాల్చింది. అంటే అది బాగా ప్రచారంలోకి రావాలంటే దాదాపు రెండూ రెండున్నర (నాలుగున్నర కూడా) శతాబ్దాలు పట్టిందన్నమాట. నేడో, రెండూ రెండున్నర సంవత్సరాలే చాలు. కాదూ కూడ దంటే మరొక సంవత్సరం కలుపుకోవచ్చునంతే!

నాడు కావ్యపరిమాణం 18 పర్వాలైతే నేడు పద్దెనిమిది పేజీలే కాదు పద్దెనిమిది పాదాలు కూడా లేదంటున్నారు. ఒక నాడు రామాయణ, భారతాలను కావ్యాలుగా గ్రహించాము. కాల క్రమేణా ప్రబంధాన్ని కావ్యంగా స్వీకరించాము. అంటే ఆది యుగంలో కొన్నివేల పద్యాలు కలిసి కావ్యమైతే, మధ్యయుగంలో ఆ పద్యాలే వదుల సంఖ్యలోకి దిగాయి. నేడు పద్యాలూ అక్కర లేదు. ఇతివృత్తమూ అక్కరలేదు. భావశిల్ప సంపదతో కూడ కొన్న కొన్ని పంక్తులే కావ్యమైపోతున్నాయి. కొన్ని పంక్తులైతే అందరూ కవులైపోవచ్చును గదా— అంటే— అదే వీలులేకుండా పోతోంది. ఆ కొన్ని పంక్తులు కవిత్వ కళారహస్యం ఎరిగిన వాడు మాత్రమే వ్రాయగలుగుతున్నాడు. అలాంటి కవిత్వ కళారహస్యం ఇమిడి ఉన్న పంక్తులనే కావ్యంగా స్వీకరిస్తు న్నారు. అందరు వ్రాసిన అన్ని వాక్యాలూ కావ్యమైపోవు. సంజీవ దేవ్ చెప్పినట్టు వాక్యం త్రిప్పి రాస్తే కావ్యం అవుతుంది. అలా త్రిప్పి రాయగలవాడు ఒక్క కవి మాత్రమే! రమణీయార్థంతో కూడిన శబ్దమూ, రసాత్మకమైన వాక్యమూ ఎవడు వ్రాసినా కావ్యమవుతుంది. అలా వ్రాసినవాడూ కవి అవుతాడు. ఒకొక్కప్పుడు మామూలు రాజకీయ నాయకు లెంతమంది కలిసినా సాధించలేని పని మహాత్ముడైన వాడొక్కడే సాధించ గలడు. ఎన్ని వేల పద్యాలతో కూడిన గ్రంథమైనా ఒక్కొక్క ప్పుడు పాఠకుని పట్ల అది నిష్ప్రయోజనమే అవుతుంది. ఒకప్పుడు ఒక వాక్యమే పాఠకునిలో పరిణామం సాధించి పైపైకి నడిపించగలదు.

నవ్యత అంటే నాటి కవిత్వానికి చెందిన నవ్యత ఒక జాతికి చెందినదీ, నేటి కవిత్వానికి చెందిన నవ్యత మరొక జాతికి చెందినది. నేటి కవిత్వానికి చెందిన నవ్యత ఎక్కడి నుంచి, ఎవరి నుంచి ప్రారంభమైన దనేదే ప్రశ్న. ఎక్కడి నుంచి ప్రారంభమైనదనే దానికి జవాబు చెప్పడం సులభ మేమో కానీ, ఎవరి నుంచి ప్రారంభమైన దనే దానికి జవాబు చెప్పడం మాత్రం కొంత సమస్యే. నేటి తెలుగు కవిత్వంలో నిజమైన నవ్యత ఆంగ్లభాషా సంపర్కంతోనే ప్రారంభమైన దనేది అందరూ అంగీకరించిన సత్యమే. ఎవరి నుంచి ప్రారంభ మైన దనే ప్రశ్నకు కొంత పరిశీలన అవసరం.

ఆంగ్లభాషా ప్రభావం తిరుపతి వేంకట కవులతోనే ప్రారంభ మైనా, వారు దాని కతీతంగానే ఉండిపోయారు. వారి కవిత్వం ప్రాచీన సాహిత్యానికి భరత వాక్యమనీ, ఆధునిక సాహిత్యానికి నాంది అని ఒక నానుడి పుట్టినా, భరత వాక్యమైతే పలికా రేమో కానీ, నాంది మాత్రం వారిలో అంతగా లేదనే చెప్పాలి. కానీ, ఏనాటికైనా చెప్పుకోదగిన ఒక పని మాత్రం వాళ్ళు చేశారు. అవధానాల తిరునాళ్ళతో తెలుగు కవిత్వం మీద కవి పండితులకే కాదు, సామాన్య పామర జనానికి కూడా వెర్రి పుట్టించారంటే పైమాట ఏమీ కాదు. కవిత్వం విషయంలో

వాళ్ళేదైనా నవ్యత చూపించారంటె ఏదో ప్రాచీనతకు సంబంధించిన నవ్యత మాత్రమే అవుతుంది. నిజానికి తిరుపతి వేంకట కవుల యుగాన్ని నాటకయుగంగా పరిగణించడంలోనే నవ్యత దృష్ట్యా వారికేదైనా న్యాయం చేకూర్చిన వార మవుతామేమో.

తిరుపతి వేంకట కవుల మీద కంటె గూడా ఆంగ్ల భాషా ప్రభావం కందుకూరి వీరేశలింగం పంతులుగారి మీద బలంగా కనిపిస్తుంది కానీ, ఆయన ఇంగ్లీషు సాహిత్య పరిజ్ఞానాన్ని కవిత్వంలో నవ్యతను సాధించడానికి వినియోగించలేకపోయారు. ఆయన దృష్టి అంతా సంఘ సంస్కరణ మీదనే. ఆయన లక్ష్యం సాహిత్యం కాదు. ఆయన లక్ష్యానికి సాహిత్యం ఆయుధం మాత్రమే సారస్వతంలో ఏ ప్రక్రియను చేపట్టినా సంఘ సంస్కరణ దృష్టితోనే చేపట్టాడు. సమాజపరంగా ఇంత నవ్యతను పకటించిన వ్యక్తి కవిత్వ విషయంలో చూచుకుంటే మరీ ఛాందసంగా, చండశాసనంగా వ్యవహరించాడేమో ననిపిస్తుంది, ఆయన వాసిన కావ్యాలు చూస్తే. కానీ, ఇది ఆయన భరించవలసిన నేరంకాదు—లక్ష్యం ఇదికాదు కాబట్టి. కందుకూరి వీరేశలింగం పంతులు యుగానికి సారస్వతపరంగా ఒక పేరు పెట్టాలంటే వ్యాసాలయుగమని పెట్టవలసి వస్తుందేమో ఎందుచేతనంటే కందుకూరి సంస్కరణాభిలాషకు సంబంధించిన వ్యాస పరంపరను గుప్పిస్తే, ఇతరులైన కవి పండితులు ముఖ్యంగా గిడుగు, వేదం, కొక్కొండ మొదలైనవారు భాషకు చెందిన వాదోపవాదాలతో నాటి సాహిత్యాన్నంతా వ్యాసమయం చేసేశారు. ఈ విధమైన యుగ నామ నిర్దేశాన్ని అంగీకరించని వాళ్ళు కందుకూరి యుగాన్ని ప్రహసనయుగమని యైనా అంగీకరించి తీరవలసిందే. అంతేకాని కవితా యుగంగా పరిగణించడానికి వీల్లేదు

కందుకూరి పిమ్మట ఈ మార్గ గమనంలో మనల్ని అటు అడుగు పెట్టనీయకుండా అడ్డుకునే హిమాలయోత్తుంగశిఖరం గురజాడ అప్పారావుగారు. కవిత్వం విషయంలో ఈయన తన వెనుకటి తరాన్నుంచి అన్ని విధాలా విడిపోయి పూర్తిగా నవ్యతలో నిలబడ్డాడు. వస్తువులోనూ, ఊహలోనూ, భాషలోనూ, ఛందస్సులోనూ, శిల్పంలోనూ గట్టి వాస్తవికతకు గురిపెట్టాడు వస్తువులోనూ, ఊహలోనూ ఈయనమీద వర్డ్సువర్త్ ప్రభావం ఉందని కవి విమర్శకు లంటున్నారుకానీ, నా కలా తోచడం లేదు. ఒక సమయం వస్తువులో (ఖండకావ్యాలవరకు మాత్రమే) అయితే కావచ్చునేమో కానీ, ఊహా శాలిత్వంలో మాత్రం మన వేమన ప్రభావం గాఢంగా కనిపిస్తోంది. సమకాలీన సమాజం లోని మురికినీ, మూఢ నమ్మకాలనీ విమర్శించడమూ, ఆ విమర్శలో సునిశితమైన హాస్యాన్ని గుప్పించడమూ ఇవి నూటికి నూరు పాళ్ళు వేమన వారసత్వాన్ని అంగీకరించేవే వస్తువులో కూడా చాలా పోలికలున్నాయి. ఇందుకు ఇరువురినుంచి కొన్ని ఉదాహరణ లివ్వడం ఇక్కడ అసమంజసం కాదనుకుంటాను.

'రాతి బొమ్మకేల రంగైన వలువలు?
గుళ్ళు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుడు?'

అని వేమన విగ్రహారాధనను ఖండిస్తే—

'మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయి రప్పల
కన్న కనిష్టం!'

అని గురజాడ పై వేమన భావాన్నే ధ్రువపరుస్తాడు.

'గుహలలోన జొచ్చి గురువుల వెదుకంగ
క్రూర మృగ మొకండు తారసిలిన
ముక్తి మార్గ మదియె ముందుగా జూపురా'

అని వేమన—

'దేవు డెకడొ దాగెనంటూ
కొండ కోనల వెతుకులాడే వేలా?'

అని గురజాడ

'మాల మేలు గుణము మంచిది కలి న
మాలకూడు గుడుచు మనుజుకంటె
గుణమె మేలుకాని కులమేమి మేలురా?'

అని వేమన గుణానికి కిరీటం పెడితే—

'మలిన దేహుల మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణ ధర్మ మ
ధర్మ ధర్మంబే,
మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ, రెండె కులములు
మంచి యన్నది, మాలయైతే
మాలనే, అగుదున్'

అని గురజాడ కూడా మరికొంత ముందుకువచ్చి గట్టిపరుస్తున్నాడు

ఈ ఉదాహరణలు చాలనుకుంటాను, గురజాడ వస్తువు కూడా వేమన వారసత్వాన్ని కొంతకు కొంత అంగీకరిస్తున్న దనటానికి

'అయితే గురజాడ నవ్యత అంతా పాతను తిప్పి వ్రాయడం లోనే ఉన్నదా?' అనే ప్రశ్న ఎదురు కావచ్చు పాతను తన సమకాలీన పరిస్థితుల కనుకూలంగా మలుచుకోవడంలో కూడా నవ్యత లేదని ఎవరూ అనలేరు పైగా గురజాడే అన్నాడు తన కవిత్వం 'కొత్త పాతల మేలు కలయిక' అని ఆంగ్ల భాషా ప్రభావం గురజాడమీద ఎక్కడ ఉందంటే—కవిత్వాన్ని వాస్తవికతవైపు మళ్ళించడంలోనూ, వర్ణనను అనుభవానికి దగ్గరగా తీసుకొని రావడంలోనూ, కవిత్వాన్ని ప్రజల బాగోగులకు వినియోగించడంలోనూ ఉంది. పోతే గురజాడ భాషను గురించి ప్రత్యేకంగా వివరించవలసిన అవసరమే ఉండదనుకుంటాను. గిడుగువారు భాషలో గురజాడకు కాలిజాడ చూపితే గురజాడ

దాన్ని రాజమార్గంగా తీర్చిదిద్దడంలో గిడుగువారికి కుడిభుజమై నిలిచాడు ఛందస్సు విషయంలో చూస్తే ముత్యాలసరం ఆయనకు ముద్దు ముద్దుగా అమరింది జానపద సాహిత్యంనుంచి ఆ ఛందస్సును స్వీకరించాడన్న మాటేకాని, నిజానికి దాన్ని తన స్వంతం చేసుకున్నాడు, వేమన్న ఆటవెలది ఛందస్సును లాగా ఆ ఛందస్సు అతనికీ, అతని భావాలకీ ఒదిగి దాస్యం చేసింది అతని శిల్పం స్వచ్ఛందమైనది అది ఏ ప్రభావానికీ లొంగేది కాదు

కవిత్వాన్ని మెడలువంచి వాస్తవికతలోకి లాక్కురావడం, అనుభవాలను ఆలోచనలతో పలికించడం, సామాన్య ప్రజా నీకానికి కవిత్వం స్వప్నం కాదనీ తమ కష్ట సుఖాలను, బాగోగులను వినిపించే నిత్యావసర వస్తువని చాటడం, కృత్రిమ భాషా ఛందస్సులవల్ల కవిత్వానికి కృతకత్వం తప్పదనీ, అమ్మ ఒడిలో నేర్చిన అచ్చమైన భాషలో, పాటలో అంత మధురమైన కవిత్వం చెప్పవచ్చుననీ చెప్పడమే కాకుండా చెప్పి ఒప్పించడం—ఇవీ ఆయన పరమ లక్ష్యాలు.

విదేశీయమైన ఒక ఇజానికిగానీ, దేశీయమైన ఒక వాదానికి గానీ కట్టుబడి ఆయన కవిత్వం చెప్పలేదు కొత్త తెన్నులు తొక్కడంలో ఆంగ్ల భాషాజ్ఞానం సహాయపడినా, ఆయన తొక్కిన కొత్త మార్గాలన్నింటిలో దేశీయమైన ముద్రలున్నాయి. ఆయన ఏదో ఒక ప్రభావానికి లొంగిపోయే పెళుసైన మానసిక స్థితి కలిగినవాడు మాత్రంకాదు అన్నింటిలోనూ లోతుకు వెళ్ళి మథించగా చివరకు తేలిన నిగ్గులోని మేలిమిని మాత్రమే స్వీకరించాడు అందుచేత అన్ని విషయాలలో ఆయన ఆశయం విశాలమైన పరిధిలో విహరించింది వాస్తవికత ఏకైక వాదంగా, ఆధునికత అఖండ లక్ష్యంగా, సామాన్యుడే సర్వస్వంగా—ఆయన కవిత్వ లక్షణాలన్నీ సాగిపోయాయి ఆయన గొంతులో జాతీయోద్యమ కవిత పలికింది, ఆత్మాశ్రయ కవిత వినిపించింది వాస్తవికతా వాదం వెలువడింది వీటన్నింటికి మానవతావాదం జీవనాడిగా శ్రుతి చేసింది వాస్తవిక కవితనే నేడు అభ్యుదయ కవిత అంటున్నారు అభ్యుదయ కవిత అనడం కన్నా [illegible] అభ్యుదయత్వం అనేది ఏ కవిత్వానికైనా ఆధునికత లాగా సామాన్యమైన విశేషణం దాన్ని ప్రత్యేకంగా ఒక రకానికి చెందిన కవితా విభాగానికి నిర్దేశించడం సమంజసంగా లేదని నా అభిప్రాయం దీన్నే హేతువాద కవిత అని గూడా అంటున్నారు మొదట దీనికా పేరు పెట్టింది విశ్వనాథ సత్యనారాయణగారు వాస్తవిక కవిత అనడంలోనే హేతువాదం కూడా అందులో అంతర్భూతమవుతుంది గురజాడలోని ఈ మార్గాలన్నింటినీ తర్వాతి వారు ఏ కీలు కా కీలు విడగొట్టి తలా ఒకటి స్వీకరించి ఆ మార్గంలో ముందుకు సాగిపోయారు కానీ తిలక్ దగ్గరికి రాగానే ఈ మార్గాలన్నీ మళ్ళీ ఏకం కావడం గమనార్హం.

ఏది ఏమైనా గురజాడ తన కాలానికి ఎవరికీ సాధ్యం కానంత పెద్ద అంగ కవిత్వంలో వేశాడు ఆయన ప్రభావం తరువాతి తరానికి ఇంతో అంతో అందరి మీదా ప్రతిఫలించింది ఆధునిక కవితాయుగానికి గురజాడను ఏకైక యుగకర్తగా కవి విమర్శకలోకం అంగీకరించింది

కవిత్వంలో గురజాడ అభూతమైన మైలురాయిని ఎలా నాటాడో, నాటక సాహిత్యాన్ని కూడా తన కన్యాశుల్కంతో ఒక పెద్ద మలుపు త్రిప్పాడు కవిత్వంలో వాస్తవికమైన నవ్యతకు గురిపెట్టిన మనిషి— నాటక ప్రక్రియను చేపట్టాడంటే, అందులో ఎంతో సంబంధ సామ్యాలున్నాయి నాటకమే ఒక పెద్ద వాస్తవికత అంత గట్టి వాస్తవికతను ప్రతిబింబించేది, ప్రజానీకాని కంత సన్నిహితమైనదీ నాటకం వంటి ప్రక్రియ మరొకటి సాహిత్యరంగంలోనే లేదేమో అసలు గురజాడ నాటకం వ్రాయడానికి కారణం - తిరుపతి వేంకట కవుల యుగం నాటక యుగం అనుకున్నాము కదా! గురజాడ కూడా ఆ నాటకయుగంలోని వాడే! తిరుపతి వేంకట కవులు, చిలకమర్తి, పానుగంటి మొదలైన హేమాహేమీల నాటకాలు ప్రజల్ని వెర్రిగా ఊపివేస్తుండడం గమనించిన గురజాడ—అదే తన ఆశయ సాధనకు బలమైన ఆయుధమని భావించాడు వాటి చేత ప్రేరితుడై గురజాడ ఆ ప్రక్రియను తన సహజమైన సామాజిక ధోరణికి మలచుకున్నాడు

రూసో మొదలైన ప్రముఖులు విదేశీయంగా, రాజారామమోహనరాయ్ దేశీయంగా, కందుకూరి ప్రాంతీయంగా ఒక ఉద్యమానికి ప్రవక్తలైనారు ప్రతివాడూ నాడుకు జీవనాడి వంటి వాడనీ, ప్రతి వ్యక్తికీ ప్రతి జాతికీ స్వేచ్ఛా వికాసాలు ఉండాలనీ ఈ ఉద్యమ ఆశయం ఆ ఆశయం అసీమమైనది. మానవుడనేవా డెక్కడున్నా మావాడే అనేది దీని విశిష్టత దీన్ని మానవోద్యమం అన్నారు ఈ ఉద్యమం నాటి నుండి నేటి దాకా ఏకప్రవాహంగా ప్రవహించలేదు దీనిలో మూడు విభాగా లున్నాయి రాజా రామమోహనరాయ్ నుంచి గాంధీ మహాత్ముని వరకు ఒకరకమైనది. గాంధీ మహాత్ముని [illegible] సాహిత్యంలో [illegible] మరొక రకమైనది మార్క్స్ ప్రవేశించినప్పటి నుంచి వేరొక రకమైనది రాజా రామమోహనరాయ్ మానవోద్యమం ప్రధానంగా సంఘ సంస్కరణకు సంబంధించినది గాంధీ మానవోద్యమం ప్రధానంగా, ఆధ్యాత్మికమైనది మార్క్స్ మానవోద్యమం భౌతిక వాదానికి చెందినది తెనుగు కవిత్వంలో రామమోహనరాయ్ మానవోద్యమాన్ని గురజాడ ప్రవేశపెట్టాడు కందుకూరి కార్యరూపంలోనే పెట్టాడు గాంధీ మానవోద్యమాన్ని తుమ్మల, జాషువా మొదలైన వాళ్లు తెనుగు కవిత్వంలో ప్రవేశ పెడితే, మార్క్సీయ మానవోద్యమాన్ని శ్రీశ్రీ ప్రవేశపెట్టాడు.

దాదాపు అదే సమయంలోనే దేశంలో హైందవ జాతీయోద్యమం తలయెత్తింది. దీనికి దయానంద, వివేకానంద, ర

మాన్య తిలక్‌లు వెన్నుపూసలుగా నిలిచారు దేశ చరిత్రలోనూ జాతి చరిత్రలోనూ పూర్వ వైభవాన్ని ఉగ్గడించి జాతిని మేల్కొల్పడం దీని ప్రధాన ఆశయం నా దేశం, నా జాతి అనే అభిమానం, ఆత్మ విశ్వాసం దీనికి ఆయువు పట్టులు కృష్ణశాస్త్రి అన్నట్టుగా 'కవికి ఆత్మీయానుభవం కలిగించినంత ఆవేశమూ, వేడీ ఈ జాతీయోద్యమం కలిగించింది! అందుచేతనే ఇది ఆత్మాశ్రయ కవిత్వంతో చెట్టాపట్టాలు వేసుకుని 'నువ్వా? నేనా?' అన్నంత తీవ్రంగా, వేగంగా వెలువడింది నా జాతి, నా దేశం అన్న వాటిలోని 'నా' తీసివేసి 'మన' చేర్చి ఆంధ్రదేశంలో గురజాడ జాతీయోద్యమాని కొక విస్తృత పరిధిని నెలకొల్పాడు. కానీ ఈ ఉద్యమానికి గురజాడ వేసిన సార్వకాలికమైన ముద్రను ఆయనకే వదలిపెట్టి ఆంధ్రదేశంలో ఈ ఉద్యమవారసులైన రాయప్రోలు, విశ్వనాథ, జాషువా, తుమ్మల మొదలైనవారు తమ ధోరణిలో తాము సాగిపోయారు వీరు భారతదేశ వైభవాన్నే కాదు, తెలుగు దేశ వైభవాన్ని గురించి కూడా పుష్కలమైన కవిత్వం వ్రాశారు రెండవ తెగకు చెందిన కవిత్వానికి రాష్ట్రోద్యమ కవిత్వమనే పేరు కూడా ప్రచారంలోకి వచ్చింది.

ఆ పిమ్మట తెనుగు కవిత్వంలో అడుగు పెట్టినవి, ఆత్మాశ్రయ, అభ్యుదయ కవిత్వాలు ఇవి అడుగు పెట్టాయంటే అలా ఇలా కాదు ఒకటి నిట్టూర్పు నెత్తావుల తుఫానుల్ని రేపుకుంటూ వస్తే, మరొకటి నిప్పుల్ని చిమ్ముకుంటూ ప్రళయంలా వచ్చిపడింది ఇవి రెండూ స్వప్నమూ, వాస్తవికతలాంటివి

ఉత్తమ కావ్య రచనకి కొంత కాల్పనికావేశం, కొంత సాంస్కృతికత (classicism), మరికొంత వాస్తవికత—ఇవి మూడూ సరియైన పాళ్లలో ఉండాలంటారు కృష్ణశాస్త్రిగారు ఆత్మాశ్రయ కవిత్వంలో ఇవి మూడూ సరియైనపాళ్ళలో ఉన్నాయా అనే ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేరు. కాల్పనికావేశంమాత్రం ఆత్మాశ్రయ కవుల సొత్తు తక్కినవి రెండూ ఉన్నాయే సాంస్కృతికత, వాస్తవికత అవి గురజాడ సొత్తేమొ ఆత్మపరమైన కావ్యంలో గూడా ప్రయోజనం ఉందంటారు కృష్ణశాస్త్రిగారు వారి మాటలే వినండి 'ఉత్తమమైన ఆత్మ పరకావ్యంలో ఉన్నంత కవిత్వ లావణ్యము మరొక కావ్యంలో ఉండదు ఊపినచోట అది ఊపినంత మరొకటి ఊపదు అంతేకాక అది పఠించినవారి మనస్సు క్షాళితమై, పదునై, పక్వమవుతుందనుకుంటాను అది ప్రయోజనమే' విన్నారు కదా అంత విలువైన మాటల్లో తప్పుందనికానీ, గొప్ప ఉందనికానీ చెప్పటం నాకు తగిందికాదు కాబట్టి ముందుకు వెళ్ళిపోవడం మంచిది.

ఆత్మాశ్రయ (Subjective) కవిత్వానికి ఎన్నో పేర్లున్నాయి అందులో కాల్పనిక (Romantic) కవిత్వమూ, భావ (Lyric) కవిత్వమూ అన్న పేర్లు ప్రసిద్ధమైనవి ఇంకా గేయ కవిత్వం (ఇది కృష్ణశాస్త్రిగారే అన్నమాట) అనీ, ప్రణయ కవిత్వమనీ ఎన్నోపేర్లు ఈ భావ కవిత్వోద్యమానికి ఎన్ని పేర్లయితే ఉన్నాయో, ఈ ఉద్యమం చాటున అన్ని రకాల కవిత్వాలూ వెలిశాయి ఈ పేర్లన్నీ ఈ కవిత్వంలోని రకాలను సూచిస్తాయా అంటే అదే లేదంటున్నాను. ప్రణయ కవిత్వమూ, ఎలిజీ కవిత్వమూ, వైష్ణవపరమైన భక్తి శృంగారకవిత్వమూ, 'జానపదుల జంట, కవిత్వమూ ఇలాంటివి ఇంకా ఎన్నో వచ్చాయి. జాతీయోద్యమ కవిత్వంలో కూడా కృష్ణశాస్త్రి ఆత్మపరమైన అంశ ఉందంటున్నారు ప్రణయ కవిత్వమూ, ఎలిజీ కవిత్వమూ ఇంగ్లీషు సాహిత్యంనుంచి వచ్చిపడింది వైష్ణవ భక్తి శృంగార కవిత్వం వంగ భాషనుంచి ఊడిపడింది ఇంక మనదని చెప్పుకోదగింది జానపదులకు సంబంధించిన ఎంకిపాటలూ, బంగారిమామ పాటలూ; కిన్నెరసాని పాటలు కూడా ఈ కోవకు చెందినవే! ఇది నిసర్గ సుందరమైన కవిత పాశ్చాత్య ప్రభావంతో కొట్టుకొని పోతున్న సమయంలో ఆ వాసన లేపీ అంటకుండా మన తెలుగులో వెలువడిన కవిత అందులోని భాషా, భావమూ అంతా మనసొత్తే. కాదు కాదు. మన జానపదుల సొత్తు పై తరగతికి చెందిన కవిత్వాలు ఇతర భాషలనుంచి వస్తేమాత్రం ఆ అనుభవాలు మనకు లేవంటారా? మార్గం చూపింది మరొకరైనా అందులోని భావాలూ, అనుభవాలు అన్నీ మనవే! ప్రణయ కవిత్వమూ, వైష్ణవ పరమైన కవిత్వమూ వీళ్ళే వ్రాసినారని గట్టిగా చెప్పలేము ఈనాడు కవిత్వంలో అడుగుపెట్టే ప్రతిఒక్కరూ వీటితోనే శ్రీకారం చుట్టారు. కృష్ణశాస్త్రి కవిత్వం మాత్రం 'ప్రణయ సంపుటీ 'కరుణం' కృష్ణశాస్త్రి పిమ్మట ప్రణయ కవిత్వంలో 'వేదనా సత్య ప్రణయ శాస్త్రి'కి ప్రథమపీఠం ఎలిజీ కవిత్వం వ్రాసినవారిలో మాత్రం నాయని, విశ్వనాథ గట్టి కవిత్వమే వ్రాశారు. ఈ కవిత్వాలన్నింటిలోనూ మనకు ప్రధానంగా ప్రతిభాసించేది కవియొక్క ఆత్మీయత, ఆత్మానుభూతీ మాత్రమే. అందువల్ల ఈ రకమైన కవిత్వాల నన్నింటినీ ఒడిసి పట్టుకుని ఏకాశ్రయంగా వెలుగొందేది 'ఆత్మాశ్రయం' అన్న పద మొక్కటే ఇది హేతువుగా తక్కిన పేర్లకన్నా వీటినన్నింటిని 'ఆత్మాశ్రయ కవిత్వం' అని పిలవడంలోనే సార్థకంగా ఉంటుందని నా మనవి.

కాల్పనిక కవిత్వమన్నా, భావ కవిత్వమన్నా, ఆత్మాశ్రయ కవిత్వమన్నా, మరొకటన్నా మన దృష్టి ప్రణయ కవిత్వంవైపుకే వెళుతుంది తక్కిన కవిత్వాలన్నింటినీ గాలికి వదిలేస్తాం. ఈ దృష్టిమాంద్యం మనకు కృష్ణశాస్త్రి మూలంగా సంక్రమించినట్టు తోస్తుంది ఆత్మాశ్రయ కవిత్వం వ్రాసినవాళ్లలో కృష్ణశాస్త్రి ఉవ్వెత్తుగా లేచి నిలబడ్డాడు ఆత్మాశ్రయ కవిత్వం అనగానే మనం కృష్ణశాస్త్రిని ఉదాహరణంగా పేర్కొంటున్నాము. ఆయన కవిత్వాన్ని అంచనా కడితే, ఆయన రాసిందంతా ఇంతవరకి అనుకున్నట్టు 'ప్రణయ సంపుటీకరుణ' కవిత్వమే. అతన్ని వదలి అటూ, ఇటూ చూడటం మనకి కష్టమూ అయిష్టమూ అయిపోయె ఈ సోమరితనం వల్లనే ఆత్మాశ్రయ కవిత్వమంటే ప్రణయ కవిత్వ మొక్కటే అనుకుని నీళ్ళు నములుతూ కూర్చున్నాము.

కృష్ణశాస్త్రి అంత ప్రతిభావంతుడు ఈ కవిత్వాన్ని చేపట్టడం మూలంగానే ఇంతదూరం నడచి వచ్చినా, ఇంకా మనం అతని కవిత్వమంటే తేనెలోపడ్డ ఈగల్లా గిలగిలా తన్నుకుంటున్నాము కృష్ణశాస్త్రిలో నవ్యత అంతా ఒక్క భావంలోనే, శిల్పంలోనే! ఛందస్సూ, భాషా పాతవే అవి పాతవే అయినా అతని కవిత్వంలో జిగి, బిగి, భావంలోని వేడీ, వేగమూ వాటిని కొత్తవిగా భాసింపజేసి వూరుకునాయి ఎన్నో లోతుల్ని త్రవ్వి చూపించే వూహలూ, మరెన్నో రహస్యాల్ని విదిలించే శబ్దచిత్రాలూ ఆయన కవిత్వానికి బరువునూ, నాజూకునూ తెచ్చిపెట్టాయి వర్డ్స్‌వర్త్‌లోని ప్రకృతిభావమూ, కీట్సులోని విరహభావమూ, రవీంద్రునిలోని భక్తిభావమూ కృష్ణశాస్త్రిలో సమపాళ్ళలో మూర్తీభవించాయంటారు అందుచేతనే ఈయన కవిత్వం ఎంతటి వాళ్ళకైనా వెర్రెత్తించేసింది, మరీ ముఖ్యంగా ఆనాటి యువకులకైతే కైపే!

ప్రణయ కవులకూ, ప్రబంధ కవులకూ ఒక సామ్యం ఉంది ఇరువురికీ పరమాణువునుంచి పరమాత్మదాకా స్త్రీయే వీళ్ళవర్ణన వస్తువు ఈ వర్ణనలో మళ్ళీ భేదం ఉంది ప్రబంధ కవులు స్త్రీని బట్టలు ఒలిచి అంగాంగం ఆపరేషన్‌చేసి చూపించారు ప్రణయ కవులు స్త్రీని అలౌకిక ప్రణయ దేవతగా, అదృష్ట భావ సౌందర్యమూర్తిగా వర్ణించారు ఈ రెండింటినీ అవాస్తవికత తన కబంధ హస్తాలతో బంధించివేసింది ప్రబంధ కవుల స్త్రీ వర్ణన రతి వృత్తగతమైనది ప్రణయ కవుల్లో అది మరీ వ్యక్తియొక్క స్వీయమూ, ఆత్మీయమూ అయిపోయింది

మన సారస్వతంలో చరిత్రాత్మకమైన మార్పును తెచ్చిన గౌరవం మూడు ఉద్యమాలకే దక్కింది—భావపరంగా అభ్యుదయ కవిత్వోద్యమానికీ, భాషాపరంగా వ్యావహారిక భాషోద్యమానికీ, ఛంద పరంగా వచన కవిత్వోద్యమానికీ వ్యావహారికభాష, అభ్యుదయ కవితలను ఉద్యమాలుగా అంగీకరించడంలో ఎవరికీ ఎలాంటి పేచీలేదు. కానీ, వచన కవితనుమాత్రం ఉద్యమంగా అంగీకరించడంలో పేచీ పెడుతున్నారు భాషాపరంగా వ్యావహారికాన్ని ఉద్యమంగా అంగీకరిస్తూ, ఛంద పరంగా వచన కవితను ఉద్యమంకాదని ఎందుకంటున్నారో నాకైతే అర్థం కాలేదు రెండూ భావాన్ని అందించే పాత్రలే కదా! పోనీ వ్యావహారిక భాష స్వీయమూ, వచన ఛందస్సు పరకీయమూ అంటారా? ఆ మాటకు వస్తే మన ఉద్యమాలన్నీ స్వీయములైనట్టేనా? ఎవరేమన్నా, వ్యావహారిక భాషా, వచన ఛందస్సూ తెలుగు సాహిత్యానికి పట్టిన మంచి అదృష్టాలని చెప్పాలనిపిస్తుంది భావ విప్లవానికి సంబంధించినంతవరకు దాని ప్రక్కనే మరో విప్లవం తయారుగా కాచుకుని ఉంటుంది ఇది ఏనాటికైనా నిజం ఏనాటికైనా సురక్షితమైన ఒక అంతిమావస్థకు చేరుకోవటమనేది జరగదు అలా అనుకుంటే అది మన పొరబాటే అవుతుంది కానీ, భావ వాహికలైన భాషా, ఛందస్సుల విషయంలో ఒక అభిప్రాయానికి రావడం వల్ల పొరబాటు జరుగదనుకుంటాను భాషలోనూ, ఛందస్సులోనూ ఇప్పుడు మన మొక సురక్షిత స్థానానికి చేరుకున్నట్టే భావించవచ్చు. భాషా విషయంలో వ్యావహారిక భాషకంటె మరొకటి తేలేము. మార్పులేవైనా సంభవిస్తే దాని పరిధిలోనే జరగవలసిందే కాదూ కూడదంటే మళ్ళీ వెనక్కి తిరిగి కృత్రిమత్వానికి స్వాగతం పలుకవలసిందే మళ్ళీ మానవుడు కృత్రిమత్వంలోకి తప్పుటడుగు వేస్తాడని నేను భావించలేను ఎందుకంటే ఆ స్థితి నెప్పుడో దాటి మనిషి చాలా దూరం వచ్చేశాడు గనుక ఛందస్సు విషయంలో కూడా వచన కవిత అలాంటిదే దిగంబర కవిత వచ్చింది కదా అనవచ్చు దిగంబర కవితను వచన కవిత కాదంటే అది కేవలం దబాయింపు మాత్రమే అవుతుంది దిగంబర కవులు చాలా దబాయింపులు నేర్చి ఉన్నారు వానిలో ఇదొకటి. అసలు దిగంబర కవితే దబాయింపు కవిత దాని తత్త్వంలోనే దబాయింపుతనం ఉంది.

— — —

మన సాహిత్య సంప్రదాయాలనూ, విలువలనూ తారుమారు చేయగల గౌరవం అభ్యుదయ కవిత్వోద్యమానికి (గ్రహణ సౌలభ్యం కోసం 'అభ్యుదయ కవిత్వ మనే పేరుతోనే ఆ ఉద్యమ కవిత్వాన్ని పేర్కొనక తప్పడంలేదు) దక్కింది ఈ ఉద్యమ ప్రవక్త—శ్రీశ్రీ శ్రీశ్రీ మొదట విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభావాలతో పద్యాలు వ్రాసినవాడే చివరి కా పద్ధతులు ముఖం మొత్తి కొత్త తెన్నుల కోసం అర్రులు సాచాడు మరో ప్రపంచాన్ని సృష్టించాడు అప్పటినుంచి శ్రీశ్రీ కవిత్వంలో ఏదో ఒక కొత్తదనంకోసం గాలం వేస్తూనే వస్తున్నాడు కలం పట్టాడంటే తెనుగు కవిత్వంలోకి ఏదో ఒక కొత్తదనం ప్రవేశించిం దన్నమాటే ఏదో ఒక కొత్తదనం తోస్తేగాని కలం పట్టడు

మహాప్రస్థానంలో శ్రీశ్రీ ఎంత కొత్తను ఊహించినా బూర్జువావాదుల్ని అదరగొట్టడానికి ఎంత మార్క్సిజాన్ని తీసుకొని వచ్చినా మన సంప్రదాయాన్ని పూర్తిగా కొట్టి పారెయ్యలేదు. శ్రీశ్రీ చెప్పిన పద్ధతి, చూపిన మార్గం ఆనాటి మనకు పూర్తిగా కొత్త అయినా ఆయన చూపుకుంటూపోయిన సంప్రదాయపు కొండ గుర్తుల మూలంగా ఆయన కవిత్వంలోని అలజడి అన్వేషణల మూలతత్త్వాన్ని త్వరగా గ్రహించగలిగాము ఇందుకు తోడు శ్రీశ్రీలోని అఖండమైన భావుకత వ్యతిరేకుల్ని గూడా తలలూపించగలిగింది శ్రీశ్రీ లో మరొక రహస్యం కూడా ఉంది. సంప్రదాయంలో సారవంతమైనదాన్ని అవసరమైనంతవరకు గ్రహించడమే కాదు, ఆ సంప్రదాయాన్ని తరచుగా తిరగేసి చూపడంలో గూడా ఆయన క్రాంతదర్శిత్వం అమోఘంగా ప్రకాశించింది మహాప్రస్థానమంటే సాంప్రదాయికార్థం—మరణించడమని కానీ, ఆ పదాన్నే—మళ్ళీ వెనక్కి తిరక్కుండా ముందుకు నడవడం—అనే అర్థంలో ప్రయోగించాడు 'మరో లోక'మంటే స్వర్గమని సాంప్రదాయికార్థం. కానీ శ్రీశ్రీ సమసమాజాన్ని మరో ప్రపంచమంటాడు తాజ్‌మహల్‌ను మనం అమరప్రేమకూ, అలౌకిక సౌందర్యానికి చిహ్నంగా భావిస్తాం. శ్రీశ్రీ శ్రామికుల స్వేదానికీ,

కాలీల ఆత్మార్పణకూ ప్రతీకగా భావిస్తాడు మచ్చుకి మాత్రమే ఇవి ఆయన ఊహలన్నీ ఈ పద్ధతిలోనే ఉంటాయి

మార్క్సుతోపాటు ఫ్రాయిడ్, టి ఎస్ ఇలియట్ కూడా తెలుగు కవిత్వంలోకి ప్రవేశించారు. మార్క్సిజాన్ని శ్రీ శ్రీ తీసుకువస్తే, ఫ్రాయిడ్ని పఠాభి, నారాయణబాబు, (శిష్ట్లా కూడానా?) తీసుకువచ్చారు టి. ఎస్ ఇలియట్ శిల్ప పద్ధతిని ఆరుద్ర, బైరాగి మొదలైనవాళ్లు ప్రవేశపెట్టారు మార్క్సు మనలో ఒకడై పోయాడు కానీ, ఫ్రాయిడ్‌గానీ, ఇలియట్‌కానీ అలా కాలేక పోయారు దూర దూరంగానే ఉండిపోయారు. దీనికి కారణం—శ్రీ శ్రీ మార్క్సులోని సారాన్ని తీసుకువచ్చి తెలుగు కవిత్వంలో కలిపితే, వీళ్లేం చేశారంటే—ఏకంగా తెలుగు కవిత్వాన్నే తీసుకుని మూల వ్యక్తుల దగ్గరకు వెళ్లారు ఈ కారణంగా వీళ్లు మనకు దూరమైపోయారు.

శ్రీ శ్రీయే మార్క్సిజంలాగా సర్రియలిజం, సింబాలిజం మొదలైన వాటిని తెలుగు కవిత్వంలోకి తీసుకవచ్చాడు కానీ అవి ఏవీ మార్క్సిజంలాగా మొగ్గనుంచి పూవు పిందె, పండుగా పరిణామం చెందలేకపోయాయి. శ్రీ శ్రీ మార్క్సిజం కవిత్వం భావ కవిత్వోద్యమంనాటి కృష్ణశాస్త్రి కవిత్వంలాగా యువలోకాన్ని మహా గట్టిగా ఆవేశించింది ఎంతోమందిని కవులుగా చేసింది ఎంతోమంది కవులను తనవైపు తిప్పుకుంది ఆ తర్వాత శ్రీ శ్రీ ఎన్ని పాశ్చాత్య పద్ధతులకు ఎగబాకినా అవన్నీ శ్రీ శ్రీ మార్కు 'కొంటెకోణంగాలు' గానే మిగిలిపోయాయి

శ్రీ శ్రీ తర్వాత నవ్యతకోసం తెలుగు కవిత్వంలో అంతగా ప్రాకులాడిన వారిలో ముందు ఆరుద్రను పేర్కొనవచ్చు. ఎవరో అన్నట్టుగా ఆరుద్ర బ్రతుకంతా ప్రయోగాలతోనే గడిచిపోయింది శ్రీశ్రీ మహాప్రస్థానంలో ఒక పద్ధతికి చెందిన కవిత్వానికి గట్టి పునాదితో రమ్యసౌధాన్ని నిర్మించుకున్న పిమ్మటే ఆడవలసిన ఆటలూ, చేయవలసిన కసరత్తులూ అన్నీ చేశాడు ఆరుద్ర అలా కాదు ప్రయోగాల పేరుతో ఎన్నో ప్రక్రియల్ని చేపట్టాడు పట్టిన ప్రక్రియల నన్నింటినీ మధ్యలోనే వదిలేశాడు దేనిలోనూ లోతులు చూడాలనుకోలేదు చూపించనూలేదు ఆయన చూపించిందల్లా రుచిమాత్రమే విశ్వనాథపట్ల ఆర్ ఎస్ సుదర్శనంగారన్నట్లు ఈయనపట్ల గూడా అనాలని బుద్ధేస్తోంది ఏమిటంటే—ప్రయోగమే ఆరుద్రలోని బలమూ, బలహీనమూ రెండూ. ఇప్పు డిప్పుడూ మరీ వచ్చి సంప్రదాయవాదంలోకి జారిపోయిన వ్యక్తిలా కనిపిస్తున్నాడు

శ్రీ శ్రీ ఎన్ని కొంటె కోణంగాలు చేసినా, ఏనాటికైనా 'ఇది మన ఆస్తి' అని చెప్పుకొని గర్వించదగిన రెండు కొత్త ప్రక్రియలు మనకి అందించాడు భావ పరంగా అభ్యుదయ కవిత ఒకటి ఛంద పరంగా వచన కవిత మరొకటి ఈ రెండింటికి మనం ఆయనకి ఎప్పుడూ కృతజ్ఞత తెలుపవలసిఉంది.

మన కవిత్వంలో వచన ఛందస్సుకి శ్రీ శ్రీ బీజంవేస్తే (బీజం వేసింది శిష్ట్లా అంటారు కానీ, శ్రీ శ్రీనుంచే దాన్ని మొదటగా మనం గుర్తించాము) కుందుర్తి, తిలక్‌లు దాన్ని పెంచి పోషించి వృక్షం చేశారు. కుందుర్తి తాను వ్రాయడమే కాకుండా చాలామంది యువకులచేత వచన కవిత వ్రాయించే ప్రయత్నం చేశారు వచన ఛందస్సులో కథా కావ్యాలు రావాలని గట్టి కృషి చేస్తున్నారు ఆయన ప్రోత్సాహంతోనే యువకులు కొంద రా ప్రయత్నం చేస్తున్నారు వారిలో శీలా వీర్రాజు మంచి భావుకుడుగా కనిపిస్తున్నాడు కుందుర్తి స్వయంగా 'ఆశ' అనే మంచి వచన కవితా నాటకాన్ని వ్రాశాడు

శ్రీ శ్రీ తర్వాత తన కవిత్వంతో యువతరాన్ని అంతగా ప్రభావితం చేసిన వారిలో తిలక్ ప్రథముడు ఇదివరకే చెప్పుకున్నట్టు గురజాడలాగానే ఇతని కవిత్వంలో అనేకమైన పోకడలు మనకు కనిపిస్తాయి కృష్ణశాస్త్రిలోని లోతులూ, శ్రీ శ్రీ లోని ఎత్తులూ ఇతని కవిత్వంలో చోటు చేసుకుని కవితా శిల్పాన్ని మరో మెట్టు పైకి తీసుకుని వెళ్లాయి

శ్రీ శ్రీనీ, కుందుర్తినీ, తిలక్‌నీ వచన కవితా కవిత్రయంగా ఉపమించవచ్చు శ్రీ శ్రీ వచన కవితకు ఆదికవి అని మళ్లీ చెప్ప నవసరంలేదు. పోతే, తిక్కనలోని తెనుగు నుడికారమూ నాటకీయతా కుందుర్తిలో మరో రూపంలో ప్రతిబింబించాయి. ఎర్రనలోని ప్రబంధమార్గం తిలక్‌లో ఆధునికమైన అనుభూతి వాదంగా రూపొందింది.

తిలక్ తర్వాత వచ్చే కవిత్వాన్ని గురించి వ్రాయడమంటే ఒక రకంగా భవిష్యత్తు తెనుగు కవిత్వాన్ని అంచనా కట్టడమే అవుతుందని నా అభిప్రాయం తిలక్ తర్వాతి వారంటే నా తరంవారు. నా తరం వారంటే భవిష్యత్తు తెనుగు కవిత్వంలో మరో యుగానికి నాంది పలుకుతున్నవాళ్ళు సాహిత్యంలో కొత్త విలువలకోసం అన్వేషణ సలుపుతున్నవాళ్లు వాళ్లని గురించి అప్పుడే ఏం వ్రాయను? కానీ, వ్రాయాలి

నేటి యువతరంలో ప్రధానంగా మనకు కనిపించేది—పై ఇజాలవిూదా, సిద్ధాంతాలవిూదా గాఢమైన తిరస్కారం. ఈ తిరస్కారభావం తిలక్‌లోనే ప్రారంభమైంది శ్రీ శ్రీ యుగానికి తిలక్ భరతవాక్యం పలికాడేమో అనిపిస్తుంది ఇజాల ప్రభావంతో విమర్శకులైన కొంతమంది సాహిత్యపరులు తిలక్‌లోని ఈ మార్పుకు ఒక సిద్ధాంత లక్ష్యంలేని కవిగా అతన్ని తప్పు పట్టుతున్నారు ఈ తప్పు తిలక్‌ది కాదు కాలం తెచ్చిన మార్పే ఇది ఇందుకు ఎవర్ని నిందించీ లాభంలేదు.

ఇజాల ఇన్‌ఫ్లుయన్సు ఉచ్చుల్లో ఇరుక్కుని నేటి మనిషి తన్ను తాను మరచిపోతున్నాడేమోననే కలవరం, తన వ్యక్తిత్వాన్ని తాను కోల్పోతున్నాడేమో ననే వ్యాకులం నేటి యువతలో బాగా ప్రబలిపోయింది ఈ కలవరపాటూ, వ్యాకులపాటే నేటి యువతరం కవిత్వంలో నిరాశా నిస్పృహలరూపంలో బయటపడుతోంది. ఈ ఆందోళననుంచి వెలువడిందే దిగంబర కవిత కూడా.

దిగంబర కవుల్లో విలక్షణమైన కొత్తదనం ఉంది ఆ కొత్తదనం వీళ్ల నూటిపోటి 'ఘాటు' దూషణలలో కలిసిపోతోంది వీళ్లలో అద్భుతమైన ఆవేశం ఉంది అది ఆగ్రహంతో కలిసి పాలలో విషబిందువే అయిపోయింది వీళ్లలో బలమైన భావుకత ఉంది ఆ భావుకత వీళ్ల సాముహికతవల్ల పలచబడిపోతోంది కానీ వీళ్లలో కొందరు ఈ ఉద్యమానికి సంబంధంలేని కవితలు కొన్ని అప్పుడప్పుడూ పత్రికలలో వ్రాస్తున్నారు వాటిలో పై సుగుణాలన్నీ ప్రతిబింబించి వీళ్ల అద్భుతమైన ప్రతిభను చాటుతున్నాయి ఏది ఏమైనా నేటి కవిత్వంలో దిగంబర కవిత ఒక భాగం

ఇన్ని ఉద్యమాలూ, ఇజాలూ దాటి వచ్చేసినా కవిత్వానికి కొంత ఆత్మీయత, ఆత్మపరత ఉండాలని కృష్ణశాస్త్రి ఎప్పుడో అన్నమాటల్ని ఇప్పుడు ఇక్కడనుంచి ఆలోచించుకోవలసి వస్తోంది. కవిత్వానికి ఈ ఆత్మీయత, ఆత్మపరత దూరమవడం శ్రీశ్రీతో ప్రారంభమైంది మళ్లీ శ్రీశ్రీలో ఇది కొంతకు కొంత ఉందేమో అనిపిస్తుంది ఆ తర్వాతివారిలోనే ఇది పూర్తిగా దూరమయినట్టు తెలుస్తుంది ఈ ఉపద్రవం ఇజాల ప్రభావంవల్ల వచ్చిపడిందే 'కవికి సమష్టి ప్రజా జగత్తు దూర దూరాలనుంచి 'మరో ప్రపంచం'లాగే కనబడుతుంది గానీ, సన్నిహితమైన ఆప్తానుభూతిలాగ పలకరించడంలేదేమో' అన్న రహస్యాన్ని నేటి యువతరం పసికట్టింది 'పాక్షికత్వం పట్టని నా కళ్లమీద కూడా ఏదో మంచు తెరలాంటిది కప్పేసింది చలిఉంపుడుకత్తె' అంటాడు ఒక యువకవి—చలిని ఇజానికి సంకేతంగా గ్రహించి, ఇజాలను ఉంపుడుకత్తె వ్యామోహంతో పోలుస్తూ.

ఇంత స్పష్టంగా నేటి యువతరం ఇజాలనూ, సిద్ధాంత వాదాలనూ వ్యతిరేకిస్తుంటే—కొంతమందేమో ఆ ఇజాల సిద్ధాంతాలతోనే వాళ్ల కవిత్వాన్ని కొలిచే ప్రయత్నం చేస్తున్నారు ఇన్నాళ్ళు ఆధునిక సాహిత్యాన్ని ప్రాచీన అలంకార శాస్త్రాల కొలతలతో తూచేవాళ్లని తూలనాడుతూ వచ్చాము ఇప్పుడిప్పుడూ ఇజాల సిద్ధాంతాలతో కవిత్వాన్ని కొలవడానికి అలవాటు పడిపోయి, నేటి యువతరం కవిత్వాన్ని కూడా ఒక సిద్ధాంతానికి లొంగకపోతే మరొక పాశ్చాత్య సిద్ధాంతాన్ని వెతికి తెచ్చి దానితో తమ పాండిత్యం కొంత కలిపి, ఆ కొలతల పరిధిలోకి తలలు వంచని నేటి కవిత్వాన్ని అసహజంగా, బలవంతంగా కొలుస్తూన్న వాళ్లని కూడా అలాగే నిషేధించాలనిపిస్తోంది ఇంక కొన్ని రోజులపోతే నిషేధించవలసి కూడా వస్తుంది

స్వాతంత్ర్యానంతరం తెనుగు సాహిత్యాకాశంలో రవీంద్రుని వంటి ప్రతిభావంతుడు ఒకడు కూడా ఉదయించకపోయాడే— అని కొందరు వాపోతుంటారు అలా ఉదయించకపోవడానికి కారణం— ఈ ఇజాల గుంజాటనే అని భావించడంలో తప్పులేదు ఈలోపమే నేటి యువతరంచేత ఇజాలను తృణీకరింపజేసింది ఇజాల తెరలను చింపుకొని బయటబడ నేటి యువతరం కవులు తమదైన సొంత గొంతుకలు ఇప్పుడిప్పుడే విప్పు (తడుము)కొంటున్నారు ఆ సొంత గొంతుకలో, ఒక్కొక్కరిలో ఒక్కొక్క విలక్షణత ఉంది ఆ విలక్షణతలో స్వచ్ఛందత ఉంది ఆ స్వచ్ఛందతలో బలమైన ఆర్తి ఉంది ఇన్ని సుగుణాలున్నా నేటి యువతరంలోని నిరాశా, కలవరపాటూ వాటి నన్నింటినీ మరుగుపరిచేస్తోంది ఆ నిరాశా, కలవరపాటూ విడిపోయిననాడు రవీంద్రునివంటి ప్రతిభావంతుడేకాదు అంతకన్నా గొప్ప కవి ఉద్భవించవచ్చు ఇంతకన్నా కొత్త కవితనూ, గొప్ప కవితనూ అందించవచ్చు ఆరోజు ఎంతో దూరంలో లేదనిపిస్తోంది, నేటి పరిస్థితిని బట్టిచూస్తే

# చలం

శ్రీ నిఖిలేశ్వర్

తరతరాలుగా అవిచ్ఛిన్నంగా
శిరల్లో పారుతున్న బృహన్నల రక్తాన్ని
గోదావరి—గంగా జలాలతో పూజించే దేశంలో
నీలి నోట్ల లెక్కలు తప్ప
మనుషులుగా జీవించే చేవలేదు.
జరి చీరల వెనుక
జరీ కండువాల నపుంసకత్వాన్ని దాచి
నిర్మానుష్యమైన వీధుల్లో
నీతిని నిద్రపోతున్న రాళ్లపై కప్పి
ఉపదేశించే హక్కు పవిత్రతకు లేదు
ప్రాణంలేని నీతికంటే అవినీతే నయం.

సూర్యుని వెలుగులో నిద్రనటించే గబ్బిలాలకు
సహజ వాంఛలోని కొత్త వెలుగులు తెలియవు,
వసాళానికి కారం దట్టించి
బొజ్జలు నింపే తిండిపోతులకు
కామం—కావరం పారుతాయి
బుడగలతో నిలిచే మురికి కాల్వల్లోకి.

అంతరంగాన్ని రాత్రిదేవునికి అమ్మి
కొండల కోనపై భయాన్ని నిలిపి
అంతరాత్మను విస్మరించిన
నకిలీ మనుష్యుల వ్యవస్థలో
గొరిగించిన తలవెంట్రుకలే ప్రమాణాలు

నిర్మలమైన ఉదయాలు
సృష్టి రహస్యంతో గాలే మరిచు,
మంటల మర్మేంద్రియాలతో
ప్రకృతికి ప్రతిరూపంగా పుట్టిన 'స్త్రీని'
ఈ లోకులు చేసిన అవినీతి బురదలోంచి
అంటిన మురికితో లేవనెత్తి
హృదయం కార్చిన రక్తాశ్రువులతో కడిగి
తుఫానులా వీచి
రక్త కిరణాలతో జీవించే తిరుగుబాటు
గర్భాలాలకు కరెంట్‌షాక్ తగిలించి
నిశ్చల నీరవ సానువుల్లో
వ్యక్తిగత విముక్తి తపనలో తప్పిపోయింది.



# తారకాపచయము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఆద్యతనాంధ్ర వాఙ్మయంలో, పందొమ్మిదవ శతాబ్దిని రచితములైన ప్రౌఢ ప్రబంధములలో తారకాపచయము ప్రత్యేక విశిష్టత గలది ఈనాటి వాఙ్మయచరిత్రలలో ప్రబంధ యుగ మంటే— కృష్ణరాయ, దక్షిణాంధ్రయుగములనీ, కంకంటి పాపరాజును, కూచిమంచి తిమ్మకవినీ మినహాయించినట్లయితే— తక్కిన ఉత్తరాంధ్ర వాఙ్మయమంతా క్షీణ ప్రబంధ యుగమనీ పరిగణితమైనది ఇది పందొమ్మిదవ శతాబ్దినాటి సాహిత్య చరిత్రను సరిగ్గా తెలిసికోనందువల్ల యేర్పడిన యువ్యవస్థ ఈ శతాబ్దిలో ప్రాచీన కవులతో సమానస్కంధులైన గోపీనాథ వెంకట కవి, ఓగిరాల జగన్నాథకవి, అభినవ పండితరాయ మాడభూషి వెంకటాచార్యుడు, అభినవాంధ్ర కవితాపితామహుడు మండపాక పార్వతీశ్వరశాస్త్రి మొదలైనవారి సమగ్ర చరిత్రలుగాని, కవితా విమర్శలుగాని తెలిసికొన్న యెడల నిది యక్షీణ యుగమని నిశ్చిత మగును. ఈ మహాకవుల కోవకు చెందినవాడే—తారకాపచయ కృతికర్త ఇవటూరి సూర్యప్రకాశకవి

సూర్యప్రకాశకవి తారకాపచయ మిప్పటికి [1]అరవై యేండ్ల క్రిందట ముద్రితమైనప్పటికీ, యింతవరకు సూర్యాలోకన పడయనే లేదు దీనిని గూర్చి లోకమునకు వెల్లడింపవలసిన విషయములు చాలగానుండుటచే, నీ వ్యాస మూలముగా కొన్నింటిని మాత్రమే తెలుపుచున్నాను

## ఇవటూరివారు వంశచరిత్ర

తారకాపచయమున ఆశ్వాసాంత గద్య యిట్లున్నది· "ఇది శ్రీ పరమేశ్వర కృపాసాదిత కవితా వైభవ శ్రీమదివటూరి సోమ నాథ శాస్త్రి తనూభవ సూర్యప్రకాశ నామధేయ ప్రణీతంబగు తారకాపచయంబునందు ప్రథమాశ్వాసము".

ఇవటూరివారు తెలుగు దేశమున వీరమాహేశ్వరు లని ప్రసిద్ధి కెక్కిన ఆరాధ్య సంప్రదాయమువారు వీరిలో, కాశీనాథుని— శివలెంక— మల్లంపల్లి— ముదిగొండ — ఇవటూరి కుటుంబములవారు ఆంధ్రదేశమున చరిత్రాత్మకమైన యశస్సు గలవారు ఈ కుటుంబముల సమగ్ర చరిత్ర లింతవరకును ప్రకటితములు కాలేదు ప్రకటితములు కాకపోవుటయే కాదు — పరిశోధన కూడ ప్రారంభము కాలేదని చెప్పవచ్చును.

ప్రస్తుతము ఇవటూరి వారి వంశ చరిత్ర తెలిపెదను మొదట వీరి యింటి పేరు కరస్థలము వారు. [2]ఈ వంశీయులలో ప్రథములైన సోమనాథయ్యగారు,[3] ఆరాధ్య సంప్రదాయ ప్రవర్తకులలో తృతీయులైన మల్లికార్జున పండితారాధ్యుల వారి వలన శివదీక్షను పొంది కరస్థలమున (చేతియందు) శివలింగమును పూజించెడివారు [4] కాబట్టియే వారికి కరస్థలమువారని పేరు వచ్చినది ఈ సోమనాథయ్యగారు పండితారాధ్యుని కుమారులైన కేదర దేశికుని శిష్యులై ఇవటూరు[5] అను గ్రామమున నివసించు నాటి నుండియు ఇవటూరి వారైనారు.

ఈ ఇవటూరి వంశీయు లందరూ ప్రసిద్ధులైన తెలుగు కవుల కందరకు గురువులు వీరశైవ మతము కన్నడాంధ్ర దేశముల నాచంద్రార్కముగా ప్రచారము చేసిన పాల్కురికి సోమనాథుని కవితా గురువు పై సోమనాథయ్య గారి కుమారుడు విశ్వనాథయ్యగారు. సోమనాథుడు తన యనుభవసారమున "విభుకర స్థలంబు విశ్వేశు" అని, బసవ పురాణమున ప్రతి ఆశ్వాసాంతమున

"చర లింగ ఘన కరస్థలి విశ్వనాథ  
వరకృపాంచిత కవిత్వస్ఫూర్తి బేర్చి  
చను బసవ పురాణమను కథయందు  
ననుపమంబుగ నాశ్వాస మయ్యె"

పండితారాధ్య చరిత్రలో "సూరీశ్వరుండు లోకైకారాధ్య పద విహారుండు విశ్వనాథప్పయ్యవారు" అని సోమనాథుడు పేర్కొన్న, గురువు పై విశ్వనాథుడే

కాలక్రమమున నీ వంశీయులలో ప్రముఖుడు సోమశేఖరుడను సోమనాథయ్య ఈతడు క్రీ శ 1450 ప్రాంతమున నున్న బమ్మెర పోతనామాత్యుని గురువు వీరభద్ర విజయమున "శ్రీ మన్మహా మాహేశ్వరారాధ్య శ్రీ మదివటూరి సోమనాథ దేశిక లబ్ధ కవితా విభవుడ"నని వ్రాసికొన్నాడు. విశ్వకవి యని యీనాడు పేరందిన వేమనకు గురువు

---

1. క్రీ శ 1910 లో అమలాపురమున శ్రీ పేరి వెంకటేశము గారి శ్రీ శర్వాణిముద్రాక్షరశాలలో గ్రంథకర్త చేతనే ముద్రితమైనది
2. భారతి ఏప్రియలు 1966 'పండితారాధ్య చరిత్ర' అను వ్యాసము పుట 16
3. వీరు క్రీ శ. 1215 ప్రాంతములో నుండిరి (చూ. ఎఱుక సానమ్మ శాసనము తెలింగాణా శాసనములు)
4. ఈనాటికిని ఆరాధ్య సంప్రదాయమున నిదే సంప్రదాయము.
5. ఇది తెలంగాణమున—జనగామ తాలూకాలో నున్నది.

"శివమయ చిన్మయుడు సోమశేఖర గురుడున్' అని వేమన పద్యముల ప్రారంభమున ప్రస్తుతుడైన సోమశేఖరు డీతడే

క్రీ. శ. 1550 ప్రాంతములలో పోతన మనమలగు కేసన మల్లన కవులకు ఇవటూరి ముక్తి నాగేశారాధ్యులు గురువుల క్రీ. శ 1600 ప్రాంతముల నున్న మల్లవరపు వాలేశ్వర కవికి, అజ్జరపు పేరయ లింగ కవికి ఇవటూరి పెద రామనారాధ్యులవారు గురువులు. ఆ కాలమువాడేయైన తోభ్యచరిత్రకర్త పింగళి ఎల్లకవికి ఇవటూరి శరభారాధ్యులవారు గురువులు 1750 ప్రాంతమున కంచి వీర శరభ కవికి ఇవటూరి వీరభద్రారాధ్యులు గురువులు.

ఇట్లు కవులకు గురువులుగా కీర్తి వహించిన ఇవటూరి వారిలో కవులును గలరనుటకు సూర్యప్రకాశ కవియే సాక్షి

ఆతడీ గ్రంధమున తన వంశ వృక్షము నిట్లు తెలిపినాడు కాశ్యప గోత్రమున జన్మించిన విశ్వేశ్వరారాధ్యునివద్దనుండి మొదలు

సీ. కవిత విశ్వేశ్వరాగముడైన విశ్వేశ్వ
రారాధ్య చంద్రు డే యనఘు తాత
సంజ్ఞాత లింగాంగ సామరస్యుండైన
పేరనారాధ్యు డే ధీరు తండ్రి
ప్రాజ్ఞులు సాంబనారాధ్య విశ్వేశ్వర
మల్లనారాధ్యు లే మాన్యు సహజు
లే మహాత్ముడు సర్వతోముఖ పాండితీ
ప్రౌఢిచే సభల గౌరవము వడసె
గీ. సమ్మహాబోధు శబ్దశాస్త్రవరీణ
గూఢహిన్నాథు నివటూరి కులజలధి ని
శీథినీనాధు నిర్జిత క్రోధు సోమ
నాధు మద్గురు దలతు మానసమునందు (1—9)

సూర్య ప్రకాశ కవి తండ్రి సోమనాధుడు— శబ్ద శాస్త్రమున ఆదిశేషుని యవతారము.

## వంశవృక్షము




## కాలము

గ్రంధకర్త మనుము ఉప్పుడు జీవించి యున్నను, సూర్య ప్రకాశ కవి యిప్పటికి నూరేండ్ల క్రింద జన్మించినవాడు— క్రీ శ 1850—1931 ఈతని జీవిత కాలము తారకాపచయ రచనా కాలము క్రీ శ 1880 ప్రాంతమని గ్రంధకర్త ముద్రణ మున పీఠికలో దెలిపిన యీ క్రింది వాక్యముల వలన గ్రహింప వచ్చును

'సప్త సంతతులలో క్షితిని క్షతి లేనిది కృతి యని, కృతులలో నధిక్యతులగు పెద్దనాది మహాకవులు రచించిన మను చరిత్ర మున్నగు కావ్యములను శ్లాఘించుట విని 'తగుదును' 'తగను' అను విచారము దవ్వుల నుంచి చాపల్యప్రబోధితుడనై 'ఎల్లుభట్టు వల్లకీ యెక్కుట చూచి సర్వుభట్టు చెరువు గట్టెక్కె' నన్నట్లు నేను ముప్పదేండ్లకు ముందీ కావ్య రచనకు దొరకొంటిని' (క్రీ శ 1910)

క్రీ శ 1910 కి ముప్పదేండ్లకు మునందనగా క్రీ శ. 1880 లోనీ ప్రబంధ రచన జరిగినది

## ప్రబంధనామము

తెలుగు భాషలోగాని, సంస్కృత భాషలోగాని కుమార సంభవము చదివిన వారందరికీ తారకాసుర సంహారము మాత్రమే తెలియును గాని అతని పూర్వ వృత్తాంత మేమియును తెలియదు తారకుని పుట్టుపూర్వోత్తరములు తెలుపు కావ్యములుగాని కథలు గాని తెలుగు భాషలో లేవు ఇట్టి పరిస్థితి గమనించి సూర్య ప్రకాశ కవి తారకాసురుని చరిత్రను ప్రప్రధమముగా తెలుగున పద్య కావ్యముగా నందించి యున్నాడు

తారకాపచయము అనగా తారకునికి హాని కలిగించునది యని యర్థము కాని కావ్యమున తారకునికి హాని కలిగించు వృత్తాంతములు లేవు ఇచ్చట అపచయ శబ్దమునకు తార కాసురుని ప్రభావమునకు హాని చేయు లేక మఱుగు కల్పించునది యని యర్థము ఆ మఱుగు పరమేశ్వరుని మహిమ వలన నేర్పడి నది పరమేశ్వరుడగు పరమశివుని ప్రభావమే యీ ప్రబంధమం దెల్లెడ నుద్దీపించుచున్నది

ఈ పేరిలో మూడు చిత్రము లున్నవి— తారక అనగా నక్షత్రములు. నక్షత్రముల ప్రభ సూర్యోదయము కాగానే నశించును అట్లే— తారక (నక్షత్ర) సూర్యోదయ (సూర్యప్రకాశ) శబ్దముల శ్లేషను పురస్కరించుకొని, కావ్య నామము నిట్లు సమర్థించినాడు

1 'జగములందు సూర్యప్రకాశమ్ము తార
కాపచయ కర్త యగుట ప్రఖ్యాతమె యని
జనులు తలప సూర్య ప్రకాశమను నేను
తారకాపచయ మొనర్తు దలచి కడగి' (1—20)

2 "తారకాపచయము" అన్న పేరు సూర్యునికి సంబంధించినదే ఇం దేడక్షరము లున్నవి సూర్యుడు—ఏడు గుర్రములు గలవాడు. సప్తసైంధవుడు—కృతికర్త పేరదియే.



కాకులు : శ్రీ కొండపల్లి శేషగిరిరావు (హైదరాబాదు).

3 ఈ కావ్యమున పం(డెండాశ్వాసములు పన్నెండు ద్వాదశ సంఖ్య ఇది ద్వాదశాత్ముడగు సూర్యుని తెలుపుచున్నది. "ద్వాదశాత్మా దివాకరః" అని అమరము

## కవి ఆత్మస్వాతంత్ర్యము

కవి శైవుడు గావున నీ కావ్యమును కాశీ విశ్వనాథుని కంకితము గావించి తన నరస్తుతి విముఖత్వము నిట్లు వ్యక్తము చేసియున్నాడు

'సీ. అనయంబు బరమేశ్వరుని దక్కరాతేని
నేని యన్యుని నాశ్రయింపమియును
సామ్రాజ్య పదవి యొసఁగునన్న నొరుచేతి
క్రిందు జేఁ జాప కాంక్షింపమియును శే
కలయంత వట్టు రిక్థము మామకీనంబు
సద్వినియోగంబు సల్పుటయును
గోటి లాభంబు చేకురనున్న నీశ్వరా
గ్రహహేతు వృత్తులఁ గడుఁగమియును

గీ నా మనోనిశ్చితములు గాన నమనుజన
కెంత విడుపరి కధికర్తి కేని దీనిఁ
గృతి నొసంగుట కెద నిచ్చగింప కీశ్వ
రునకుఁ గృతి యిచ్చుటయు మనంబునఁ దలంచి

(1—20)

పోతన, ధూర్జటి, కూచిమంచి తిమ్మకవి మొదలగు మహాకవులవలె మన కవియు రాజస్తుతి విముఖుడై ఆత్మ స్వాతంత్ర్యమును ప్రకటించి ధన్యుడైనవాడు

## మూలము — కథావివరణము

ఈ ప్రబంధము పూర్వోత్తరములుగా రెండు భాగములలో నున్నది మొదటి భాగమున నెనిమిది, రెండవ భాగమున, నాలుగు మొత్తము పన్నెండాశ్వాసములు మొదటి భాగమునకు స్కాంద పురాణము శివరహస్య ఖండమును, రెండవ భాగమునకు కాళిదాసు కుమారసంభవమును మూలములు

పూర్వము విష్ణువునకు రాక్షసులందరు వోడిపోయిరి. వారు తమ స్థితిని గురువైన శుక్రాచార్యులతో విన్నవింపగా అతడు "రాక్షసరాజైన అసురేంద్రుని కూతురైన సురస అను కన్యను కశ్యప మహామునివద్దకు పంపిన, ఆమె కశ్యపునివలన ముగ్గురు కొడుకులను గనును వారిలో మొదటివా రిద్దరును దేవతలను జయించి మీకు సౌఖ్యము గలుగుజేయుదురు" అని యుపదేశించెను.

అసురేంద్రుడు గురునాజ్ఞ ననుసరించి "సురస" ను కశ్యపునివద్దకు సేవ చేయుటకై పంపెను ఆమె దానవేంద్రుని కూతురై, భాగ్యవతియైనను, కశ్యపునికి కేవలము తపస్వినివలె పరిచర్యచేసి, అతని వాత్సల్యమును బడసెను. అతనివలన శూరపద్మ్ముడు, తారకుడు, సింహవక్త్రుడు— అను ముగ్గురు తనయులను బడసెను.

శూరపద్మ్ముడును తారకుడును దండకారణ్యమున తపస్సు చేసి శివుని మెప్పించి దేవతలను జయించు సమస్త శస్త్రాస్త్రములను బడసిరి. వారికి మయుడు "వీర మహేంద్రపురము" అను నగరము నిర్మించి యిచ్చెను తారకుడు దిగ్విజయమునకై బయలుదేరెను. మొదట ధనము కావలయు గాన కుబేరునిపై దండెత్తి యాతని జయించి అసంఖ్య ధనరాసులు గైకొనెను ఆ వెనుక వరుణ, నైరుతులను లోగొనెను నైరుతి తన కుమార్తెయగు "గౌరి"ని తారకున కిచ్చి పెండ్లి చేసెను క్రమముగా యమునిని యింద్రునిగూడ జయించి జయలక్ష్మితో, తన యర్ధాంగలక్ష్మితో వీరమహేంద్రపురము వచ్చెను

ఇందుతో ప్రథమ భాగము ముగియును.

ఈ భాగమున నాల్గవ యాశ్వాసములో "దండకారణ్య వృత్తాంతము" తెలుపబడినది శుక్రాచార్యుని కూతురు "అరజ" యను నామె తపస్సు చేసికొనుటకై "దండుడు" అను రాజు పాలించు రాజ్యమున నొక వనములోనికి వచ్చి తపస్సు చేసికొనుచుండెను ఆ సంగతి రాజునకు దెలిసి, ఆ ప్రదేశమునకు వచ్చి ఆమె లావణ్యమునకు పరవశుడై యామెను కోరెను కాని ఆమె తపస్విని దృఢవ్రత కాబట్టి తిరస్కరించెను దండుడు ఆమెను బలాత్కరించి తన కోర్కె నెరవేర్చుకొనెను తండ్రియైన శుక్రాచార్యున కామె, ఈ విషయము తెలుపగా, అతడు కోపించి, ఏడు రోజులు దండుని రాజ్యముపై, మట్టి వర్షము కురిపించెను. దానితో అది అరణ్యమై, నాటినుండి దండకారణ్యమైనది [6]

రెండవ భాగము నాల్గాశ్వాసములలో దక్షయజ్ఞ ధ్వంసము, పార్వతి జననము, ఈశ్వరుని తపస్సు, మన్మథ దహనము, పార్వతి తపస్సు, శివుని వటు రూపధారణము—అను ఆరు కథలు గలవు.

మొదటి యెనిమి దాశ్వాసములును, శివుని యష్టమూర్తులకు సాంకేతకము రెండవ నాల్గాశ్వాసములలో ఆరు కథలు షడక్షరీ మంత్ర సూచకము.

## ప్రబంధ సంవిధానము

పై విధమగు పౌరాణిక కథను గ్రహించి సూర్య ప్రకాశ కవి రసవత్తర ప్రబంధముగా దిద్ది తీర్చియున్నాడు

ప్రబంధమునకు నియతములైన వర్ణనలను కవి కథా సందర్భము ననుసరించియే రచించుట ప్రశంసనీయము

1. సరస కశ్యపు నాశ్రమమునకు బోవునపుడు 'ఆశ్రమవర్ణన'[7]
2. అచట సురస చెలి కత్తెలతో పూవులుగోయుచుండ— ప్రసూనాపచయ వర్ణన
3. సురస కశ్యప సమాగమునకు ముందు శృంగార రసోద్దీపనకు ఋతు వర్ణన —వసంత ఋతువర్ణన

6 ప్రస్తుతము దండకారణ్య మంతయు ఫలవంతము చేయుటకే—దండకారణ్య ప్రణాళిక యేర్పడినది

7 అష్టాదశ వర్ణనలలో ఆశ్రమ వర్ణన లేదు—అప్పకవి చేర్చినది.

1 శివుడు మొదట వృద్ధ బ్రాహ్మణ రూపమున వచ్చి పార్వతితో శివుని పెండ్లియాడగూడదని చెప్పును. పార్వతి తగిన ప్రత్యుత్తరము చెప్పును.

2. ఆ వెనుక శివు డామె ధైర్య స్థైర్యములకు లోన మెచ్చుకొని, సుందరుడైన వటు రూపముతో వచ్చి, శివుని పెండ్లియాడవలదని చెప్పెను అయినను విప్పటను పార్వతి తన మనోనిగ్రహమును ప్రకటించెను

ఈ ఘట్టము నాటకీయతకే గాక, పార్వతి శీల చిత్రణము నకు పరమావధియై యున్నది సాధారణముగా స్త్రీలకు పెద్దల వృద్ధుల, మాటలయందు గౌరవ మునుజవలసిన యావశ్యకత యున్నది. కాని, కొంతమంది స్త్రీలు తమ మనోభావములు వ్యక్తపరచుటకు ధైర్యము చాలమి, సందేహింతురు వారి మాటల కొడంబడుదురు పార్వతి యిచట తాను పెద్దలయందు గౌరవ మున్నను, తన మనస్సు మార్చుకొనలేనని స్పష్టీకరించినది

ఒక లోకోత్తర సుందరపురుషుడు స్వయముగా, యౌవన వతియగు స్త్రీతో మాటాడినపు డెట్టి ధీరవనితయైనను లోబడి పోవును. కాని యిచ్చట—సుందర పురుషు డెట్టి ప్రాభవముగల వాడైనను శివునితప్ప, మరియొకనిని పెండ్లియాడనని నిశ్చిత ముగా చెప్పి, ఆపై శివునిగూర్చి యధిక ప్రసంగము చేసిన యట్టివానినైనను సరే, దర్శింపుడని చెలుల నాజ్ఞాపించినది పార్వతి మనోనిగ్రహమునకు పరమేశ్వరుడు ముగ్ధుడై ప్రత్యక్ష మైనాడు

ఈ రెండు సన్నివేశము లీ కృతియం దద్భుతముగా ప్రపంచితమైనవి.

ఇక్కడ నొక విశేషమున్నది నన్నెచోడని కుమార సంభ వము క్రీ శ. 1908 వరకు లోక మెరుగదు[10] ప్రకాశకవి దీనిని క్రీ శ. 1880 ప్రాంతముననే రచించియున్నాడు తాను క్రీ శ లో గ్రంధము ముద్రించినప్పటికి, ముద్రిత కుమార సంభవము చూచిన నా విషయము తాను పీఠికలో తెలిపియే యుండును. అట్టిది లేదుగాన, ప్రకాశకవి పై మార్పులను, శివ వాయు పురాణములనుండి గ్రహించియుండును ఇదియును ప్రకాశ కవి ప్రతిభ కొక నిదర్శనము ఈ విషయమై విస్త రించుట కిక్కడ వీలులేదు గాన విరమింతును దీనిని గూర్చి సంపూర్ణ వివరములు వేరొకచో గలవు[11]

## రసము

ఈ ప్రబంధము ప్రాయికముగా వీర రస ప్రధానమైనను సురసా కశ్యప సమాగమమున శృంగార రసము గలదు. దక్షాధ్వర ధ్వంసమున రౌద్ర రసము, రతీపరిదేవనమున కరుణరసము, ఆశ్రమ వర్ణనమున శాంతరసము, ఆయా ఘట్టములతో నుచిత రీతిని పరిపోషింపబడియున్నవి.

## లౌకిక విద్యలు

ఈ ప్రబంధమునుండి తెలుసుకొనవలసిన లౌకిక విష యము లెన్నియో గలవు. మచ్చునకు కొన్ని :

1. రాజనీతి : లోకమున గురువగు శుక్రాచార్యుడు రాజనీతి శాస్త్ర రచయిత. శుక్రనీతి యని దాని పేరు. 'భార్గవనీతి' యని కూడా వ్యవహారమున్నది ఇచట శుక్రుడే తారకాసురునకు నా రాజనీతిని తెలిపియున్నాడు ఈ నీతి 5—67 నుండి 124 వరకు 57 పద్యములలో నున్నది. ఇందు 102 వ పద్యమున అక్షౌహిణి నిర్వచనము గలదు

2 అష్టాదశ విద్యలు 3—74—75 వివరణ ద్వితీయాశ్వాసము 1వ అక్షరగుణింతము,అక్షరాభ్యాసము.

3 పిల్లల యాటలు (3—67)

4 పిండి వంటలు (2—72)

5 జ్యోతిషము (8—88)

6 గంగా మహిమ (8—3—17)

7 శివ తత్త్వము (3—81)

8 పుర స్త్రీలు తారక సంహారమును జూచుట, (5—16—26) వారి వేష వర్ణనము. ఇది నన్నెచోడుని కాలమునుండి వచ్చుచున్న కవితాసంప్రదాయము

## సంస్కృతభాషా పాండిత్యము

తారకాసురవధమున నే వట్టున చూచినను, సూర్యప్రకాశ కవికిగల నిరర్గళ, నిరంకుశ, నిరుపమాన సంస్కృత భాషా పాండిత్యము ప్రకాశమానమగుచున్నది. సాధారణముగ తెలుగు కవు లందరు సంస్కృత భాషా నిష్ణాతులే. అధునాతన కవులయందు సంస్కృత పాండిత్య మంతమాత్రముగ తేకపోలేదుకాని యట్టివారిలో ప్రకాశకవివలె నింత ప్రశస్తముగా తమ పాండిత్యమును కావ్య మున ప్రదర్శించినవారు లేరని చెప్పవచ్చును.

## స్తుతి దండకము

స్తుతి పరమగు దండకము సంస్కృత భాషలోనే ప్రారంభ మైనది తెలుగు కవులు స్తుతి చేయునపుడు దండకమును తెలుగుననే వ్రాసిరి కాని ప్రకాశకవి శ్రీహరి నుపాసించిన శివుడు ప్రత్యక్షమైనప్పుడు దండకము సంస్కృత భాషలో రచించినాడు

1 "వందే శ్రియా భూమ్యా చాపరాభ స్సుపర్వారిసాధ స్స దా సేవ్యమానాం పరం దేవతా మీశ్వరీ మాది శక్తిం ప్రభూతేన భక్త్యైన పాణీ కృతాం తాలయంతీం జయాభిఖ్యకర్ణే జపేన స్మిత

10 సంస్మరణీయులు—వంగూరిపల్లి రామకృష్ణ కవి మహా శయులు దీనిని ప్రథమముగా యావదాంధ్ర సాహిత్య ప్రపం చమునకు దెలిపిరి

11, నన్నెచోడని కుమార సంభవ వ్యాఖ్యానము—ముసంస్కృత ప్రతి.

వారద ప్రేషితై ర్భూషితై ర్భ్యాపి శాపాయుధ గ్రామణీభి ర్వసిష్ఠా త్రివల్మీ యా గౌతమా గస్త్య శాండిల్య మాండవ్య జాబాలి కణ్వాదిభి స్స్తూయమానం త్రయీవాగ్భి రుచ్చా వచాభి ర్హృషీకేశ లోకేశ..

జగన్నాటకే సూత్రధారం శరచ్చంద్రికా కుందమందార మందాకినీ హారనీహారహీరేందు పాటీర వాగ్భామినీ కాశ నీకాశ గాత్రం బలీవర్దపత్రం సదా త్వాం ప్రపద్యే మమాగాంసి విస్మృత్య మాం పాహి మాం పాహి సర్వేశ సంరక్షితావాపినాకిన్ పినాకిన్ సమద్భక్తవర్గైక పాలిన్ ద్విషల్లోక మర్దిన్ నమస్తే నమస్తే నమస్తేనమః" (4 ఆ 97—98 పుట)

2 స్తుతిపరములైన పద్యములలో సంస్కృత వాక్యానుకరణమే—

'ప్రణమ ద్విష్ణువిరించనాది దివిషద్వర్గాయ భర్గాయ శో భనవాహీకృత పర్వతోన్నత మహోభద్రాయ రుద్రాయ తా డనసంత్రాజితభూర్యహంయు యమరాడ్గర్వాయ శర్వాయ వం దనలక్ష్మాయ' యటంచు నీశునకుజోతల్ పెక్కుగావించుచున్ (4 ఆ 102 పు)

3 గురు నమస్కారమున సంస్కృతమే—

"భో వక్త్రంచర లోక రక్షక దయాపూరేన చిత్తేన న శ్రీనాథామర నాయక ప్రభృతిభి ర్బృందారకైః పీడితాన్ దీనాన్పాహి" యటంచు నద్దితిసుతాధీశుండు భక్త్యున్నతిన్ పౌనఃపున్యముగా నొనర్చె గవికిన్ బాద ప్రణామంబులున్. (5 ఆ 111. పు)

4. మ్రొక్కుట, దీవన యిచ్చుట సంస్కృతముననే

వావుడు మ్రొక్కి యాత'డధునా భవతాం ప్రణతావనైవతా' వావుడు 'రాజచూడ చరణౌ తవమే జయదా' వటన్న నా దైవత దైవతం బవుడు ధాత్ర్యుపలబ్ధ మహా జయప్రవో దైవత వేయమ' స్తనుచు నిచ్చె ప్రియంబలరార దీవనల్ (ఉ 2 ఆ 247 పు)

5 ఒకచో వ్యతిహార లక్షణ బహు వ్రీహి సమాసములను సూత్రానురూపములతో వాడియున్నాడు

'బాహాబాహవి కేశాంచి ముష్టీముష్ట్యుద్భుతం త థా కేశాకేశ్యభవ ద్యుద్ధం వానరాణాంచ రాక్షసాం'

'ఆహోపూరుషికన్ బరస్పరము నొయ్యంజేరు బాహాచపే టీహుంకారములన్ దివంబదురవ ముష్టీముష్టియున్ బోల్లస ద్బాహాబాహవియున్ గచాకచియు దంతా దంతియున్గా మహా త్సాహుల్ సల్పిరి దారుణాభిమరమున్ దద్యక్ష రక్షౌఘముల్' (6 ఆ. 134 పు)

నన్నయ, అపాణినీయమగు ముష్టాముష్టి (ష్టా— యతి స్థానమున) వాడినను, మన కవి పాణినీయ రూపమగు ముష్టీముష్టిని యతి స్థానమున ప్రయోగించుట ప్రశంసనీయము.

6 సమాన రచనలో సాధన—

'అంచిత సౌందర్య విశేష సంహనన రోచిస్మారితోద్యద్విషా పతి తామరస జన్మ శచీదయితాది నిర్జరేశ్వర మకుటోపమద్యుతి పిశంగిత మంగళ పాద పీఠుడు

'నాకాకో నర్మ విహార భూమి నియత మదేభ శష్మండు' ఇత్యాది రచనలు ప్రచురములు

7 సంస్కృత వాక్యములు సూక్తులు.

1 "అమరుల్ ముక్కులవీద వ్రేళ్లునిచి "హా హంతా భవల్లు ప్రమ ద్యమవర్ణంత్వమి శితు కువిశమం" చాశ్చర్యమున బొందగన్ (7—119)

2 కొందల మందుచున్ జనులు కూడదు సుమ్ము "ప్రియాత్మజా న దుఃఖం దశభి స్సహా" యనంగ (1—80)

3 "బహు వా—రములుగ "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" యని (3—99)

4 "శుభస్య శీఘ్రమ్మ"నుచున్ బ్రయాణ మిక గమ్మ (3—100)

5 పరతనుమధ్యం బొందు"న పర దారాన్గచ్ఛేత్తని(4—62)

6 పల్మా రుత్తమం స్వార్జితం విత్తమ్మంచు (4—69)

7 "సర్వం ఖల్విదం బ్రహ్మ" యంచు (4—24)

8 కానని ప్రాజ్ఞులు "రాజ్యాం తే నరకం ధ్రువ" మటంచు (5—69)

9 వినవె, రాజా ప్రకృతి రంజనా త్తను నుడువున్ (5—70)

10 ప్రామినుకులు 'చంద్రమా మనసోజాత'యనినట్లు (7—16)

11 'ధ్రువం తే రాజా వరుణో ధ్రువ'మ్మను సూక్తిన్(8—126)

12 "మాంగళ్య తంతునా నేన" (8—127)

13 "వజ్రం వజ్రేణ భిద్యతా" మను చొప్పు (ఉ 1—77)

14 "యశో వా మృత్యు ర్వా" (ఉ 2—62)

15 "పితా రక్షతి కౌమారే" (ఉ 4—18)

16 "కురు తే తస్మాత్తస్మా" దాహు రాశీర్వాదముల్(8—130)

17. "యా ఫలినీ ర్యా" అనుమంత్రము (8—131)

18 "రాజాన చార చక్షుష" (5—9)

19 "మానీ చే దపయాహి నత్వ" మనుచున్ (6—72)

20 "దుర్బలస్య బలం రాజ" యటంచు (5—74)

"అనుకృతిని విడుదకు గురుచయగునని యొకండు వలికె నది నిరాకరంబు" "దుర్బలస్య బలం రాజా యన వినవె" బాలవ్యా సంధి 53 సూ

అప్పకవి "న హరేస్తు పరస్త్రాతా" అని దీర్ఘమునకు బదులు ఛందోవ్యగ్రతవలన—"న హరేస్తు పరస్త్రాత" అని హ్రస్వముగా ప్రయోగించినాడు చిన్నయసూరి అందునకు తప్పు పట్టి అప్ప కవి నాక్షేపించినాడు. సూర్య ప్రకాశకవి యీ సూత్ర మెతిగియు

నప్పకవి మతము సమర్థించినాడు దీనికి పూర్వ కవి ప్రయోగములు గలవు— ప్రస్తుత "గ్రామో నాస్తి కుతస్సీమ" యనుచు—
అనుభవ సారము 84 ప.

ఠ సంస్కృత వైయాకరణులకుమాత్రమే అవగతమగు అకతోభయుడు, అంచితశిల్పవిద్యుఁడు, ద్వయాతిగ ప్రవేకుడు, ఒతువాఖువు, క్షేపిష్ఠపాతము—మొదలగు రూపము లీ కవి మంచినీళ్ళ ప్రాయముగా వాడును

9. ప్రకాశకవికి అమరకాండత్రయంబంతయు కంఠస్థము. ఈనాడు నిఘంటువుల కెక్కని యమరకోశస్థపదము లిందు ప్రయోగ సహితముగా నున్నవి కొన్ని యుదాహరించుచున్నాను.

| | | |
|---|---|---|
| 1 | అభిమరము | యుద్ధము |
| 2 | అభిషేణనము | సేనాసమూహము |
| 3 | అసిక్ని | — అంతఃపురదాసి |
| 4 | అహంయుడు | — నేనను గర్వము గలవాడు |
| 5 | అహోపూరుషిక | — నా కంటె వీరుడు లేడను వాడు |
| 6 | ఉశనుడు | — శుక్రాచార్యుడు |
| 7 | కశ్యము | — కల్లు |
| 8 | క్షయ | — చెడుట |
| 9 | క్ష్వేళ | — విషము |
| 10 | ఛగలము | — మేక |
| 11. | జన్యము | — యుద్ధము |
| 12 | ద్యుమ్నము | — ధనము |
| 13 | మృధాంగణము | — యుద్ధభూమి |
| 14 | యాతువులు | — రాక్షసులు |
| 15 | యవీయసుడు | — చిన్నవాడు |
| 16 | రిష్టి | — ఒక విధమైన ఆయుధము |
| 17 | వ్యవాయము | — సంభోగము |
| 18 | వృషాకపి | — విష్ణువు |
| 19 | సమజ్య | — సభ |
| 20 | హ్రీణుఁడు | సిగ్గుపడినవాడు |

లమర కోశస్థ పదములేకాక, ఇతర కవులు వాడని ఆకంపుడు—కంపము గలవాడు.

| | |
|---|---|
| అస్రపుఁడు | — రాక్షసుడు |
| అస్వప్నులు | — దేవతలు |
| అంధసికులు | — వంటలవాడు |
| ఐంద్రికుడు | — ప్రత్యక్షమైనవాడు-మొదలగు నపూర్వ |

సంస్కృత పదములు వాడినాడు

## అచ్చతెలుగు రచన[12]

"ప్రోఢింబరికింప సంస్కృత భాషయండ్రు' అన్న శ్రీనాథసూక్తి కనుగుణముగా పైరీతిని ప్రౌఢసంస్కృతరచన చేసినను 'పలుకు నుడికారమున నాంధ్రభాష యండ్రు' అన్న మాట కనుగుణముగ తెలుగుదనమును చూపినాడు

సీ తోలు సంగడికాని మేలు సంగడి కావి
జక్కులతో గూడ నుక్కుమడఁచి
వింత గర్వపుఁ బోతు దుంతవార్వపు రౌతు
నోడించి కేల్దోయి మోడిపించి
మగమానికపువాలు దగబూని దివమేలు
మగని దేవళ్లతోఁ బొగరడంచి
గ్రుడ్డు కానుపు రేని దొడ్డకానుపు వానిఁ
బగదీఱ నూడని బారనేసి

గీ వచ్చుచున్నాడు జగదేక వర్ణనీయ
విక్రముఁడు నీదు కూర్మి యవీయసుతుఁడు
పొజుగమితోడ నో శూరపద్మనామ
సకల రాత్రించరాగమ సార్వభౌమ! (పూ. 4—18)

సీ జేజేల తెరువంటి చిఱుత మొయిళ్లని
తోచఁ బూవుం దమ్మి రేచి రేచి
పరపు పూనీటి జక్కర చాలుపుల పన్ని
దంబులు పచరించి దాఁటి దాఁటి
యలరు తావులకు దావులగుచు నలరారు
తోరంపు టీరముల్ దూరి దూరి
తేనియలం గ్రోలు తేటుల నదలించి
కోసి పూల్ కుప్పలు వోసివోసి

గ చేడియల రూపుగొని చెరలాడుచున్న
పూలకోరి వజీరు తేజీలనంగఁ
గరము సంతన మొప్పు నక్కానలోన
విచ్చల విడిని యలరిరి యచ్చెలువలు (పూ 2—45)

### జాతీయములు-సామెతలు

పాలన్ముంచిన నీటముంచిన (1—54), గోరుచుట్టు పై రోకటి పోటు (2—23), అల్లారుముద్దు (3—54), గోచిపాత రాయఁడు (4—61), కట్టుపకాసులు (5—76), వంటయింటి కుందేలు (6—71), మొదలగు జాతీయములు, కోడలికి బుద్ధి చెప్పి అత్త రంకుపోయెనన్నట్లు—(5—100), సంగీతమునకు చింతకాయలు రాలునా? (7—60) మొదలగు సామెత లీ కావ్యమునకు తెనుగుదనము నాపాదించుచున్నవి.

## ఛందస్సు

ఇతని ఛందశ్శాస్త్రపారీణతకు వివిధ వృత్తములను పేర్కొనవచ్చును

ఇందు 1536 గద్యపద్యములున్నవి. అయినను వచనము లిందు 52 మాత్రమే అనియు, 'అవధరించు' 'అని తలంచి'

---

12 ప్రకాశకవి అచ్చ తెలుగు రచనలో సిద్ధహస్తుడు ఈతడు అచ్చ తెలుగున భారతమంతయు ద్విపదగా రచియించి యున్నాడు.

అల్లి చిన్నచిన్నయతులచేతను పెద్ద వచనములు గ్రంథమంతకు అయిదింటికన్న నెక్కువగాలేకపోవుటచేతను దీనిని ప్రాయికముగా పద్యప్రబంధమని చెప్పవచ్చును.

వృత్తములలో కావ్య ప్రబంధ సాధారణములైన మత్తేభ, శార్దూల, చంపకమాలలు, సీస, కందాది జాత్యుపజాతులేకాక, నూతన వృత్తము లిందు చాలా గలవు. అధునాతన కవులలో ఒక్క మహా మహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు తప్ప ఇన్ని క్రొత్త వృత్తములు వ్రాసిన కవు లెవ్వరును లేదు. వానిని తెలుపుచున్నాను.

1 పృథ్వీవృత్తము — 9వ యక్షరమున యతి. సంస్కృత సంప్రదాయము. నన్నయ — యతి 12 యక్షరము.

2 మానినీవృత్తము — 13వ యక్షరము — నన్నయ సంప్రదాయము

3 కవిరాజవిరాజితము 14వ యక్షరము — నన్నయ సంప్రదాయము.

4 క్రౌంచపదము — పాల్కురికి సోమన్న లక్షణము ననుసరించినది

5 భుజంగ ప్రయాతము, శాలిని, ఉత్సాహ, పంచ చామరము, మహా స్రగ్ధర, స్రగ్ధర, వృత్తకోకిల, మంగళ మహాశ్రీ వృత్తము లిందు గలవు.

ఇక ప్రాచీన కవులలోగాని, నవీన కవులలోగాని విశేషముగా కనబడని కొన్ని వృత్తముల క్రిందు లక్ష్యములు గలవు

(1) విద్యున్మాల (2) చంద్రకము (3) మణిరంగము (4) శుద్ధవిరాటి (5) ఇంద్రవజ్ర (6) ఉపేంద్రవజ్ర (7) రథోద్ధతము (8) స్వాగతము (9) స్రగ్విణి (10) తోటకము (11) వంశస్థము (12) ద్రుతవిలంబితము (13) మంజుభాషిణి (14) జలధరము (15) వనమయూరము (16) వసంతతిలకము (17) సుగంధి (18) మణిగణనికరము (19) మేదిని (20) శిఖరిణి (21) నర్కుటము (22) మేఘవిస్ఫూర్జితము (23) తరళ (24) ఇందువదన (25) అంబురుహము (26) చంద్రకళ (27) బంధురము (28) సరసాంకము (29) మందారమాల (30) మదనవృత్తము (31) లలితపద వృత్తము.

### జాతులు

ఇందు సీసములు 11 మాత్రమే గలవు సీసితోనే ఒక టెత్తుగీతిలో తక్కినవన్నియు సమ సీసములు 8—88లో 10 పాదములుగల సీసము గలదు.

### శేషునోట

[illegible] పదునాల్గవ శతాబ్దినుండి కవు లుపయోగింపని తరువోజ [illegible] పర్యాయములు (1—74, 7—84) ప్రయుక్తమై [illegible] అధునిక కాలమున ప్రయుక్తమగుట విశేషము.

### మధ్యాక్కర

ఆద్యతన కాలమున 'మధ్యాక్కర'ను మొదట ప్రబంధములలో వ్రాసిన కీర్తి ప్రకాశకవిదే:

"తక్షణంబు గీముల తెగి న్నా నిమిత్త మతనిచే న
మక్షణంబ బంధి యూ నైషధునక్ నీవు భోగమున్ వంత
మోక్షంబు బాపించి పిదప జేపుడు నను మదర్పకైన యు
పేక్షించి యొక్కవల్ల గమ్యమ్ముల్ గోయు హీనస్సై లపజికి.
ఉ॥ 2—17

ఇది 'అక్కర'గా ముద్రింపబడినను మధ్యాక్కరయే.

ఈ మధ్యాక్కరను ప్రకాశకవితరువాత వ్రాసినవారు కీర్తిశేషులు రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు వీరి శాకుంతలాంధ్రీకరణమున మధ్యాక్కరలు గలవు కీర్తిశేషులు పేరి కాశీనాథశాస్త్రిగారు తమ పూర్వ శాకుంతల నాటకమున మధ్యాక్కరలు వాడిరి ఇరువదవ శతాబ్దిలో శ్రీ విశ్వనాథవారు మధ్యాక్కరలతో[13] శతకములు వ్రాసియున్నారు.

### యతులు

ఇందలి యతులన్నియు సలక్షణముగా నున్నవి రెండు మూడు స్థలములలో పవ యతులు కనబట్టుచున్నవి కాని పీఠికలో ఆ యతి తనకు సమ్మతము గానట్లే వ్రాసియున్నాడు. యతుల విషయమున ప్రకాశకవి నన్నయ భట్టారక రచిత భారత భాగము జీర్ణించుకొన్నాడు. ఇందు యతులలో రేఫ—శకటరేఫ సాంకర్యము లేదు

శకంధ్వాది యతి విశేషము లిందు గలవు ఒక్కయుదాహరణము చూపుచున్నాను.

"మనీష నతని తెలియవలయు నిజ మనసిజలుల్ (బ—110) ఇది శకంధ్వాది యతులలోనిది మనీషా—మనస్—ఈషా. బుద్ధి 'మనస్' లో 'అస్' నకు పరరూపమగు 'ఈష' వచ్చి మనీష అయినది దీనికి అచ్చునకు హల్లునకు యతి వేయవచ్చును పై చోట హల్లునకు యతి..[14]

### ప్రాసలు

తేట గీతులలో ఏక ప్రాసలు.

పాత సంత్రస్త దేవతా జాత లోక
మాత హిత దుర్నిశాచర వ్రాత శైల

---

13 విశ్వనాథవారు "మధ్యాక్కర" అని శకట రేఫగా భారతిలో ముద్రించినారు కాని మధ్యాక్కరకు సాధురేఫగాని శకటరేఫ గాదు.

తారకాపచయమున మధ్యాక్కర అప్పు ప్రతినుండి యున్నా మాత్రకముగా నుదాహరించినాను. దానికి కొంచెము సంస్కారణ యావశ్యకము

14 అప్పకవీయమున దీని కుదాహరణలు లేవు. అచ్చునకు — 'ఎప్పుడు చేరెదమో యను మనీష' నిరం (4 68). హల్లునకు — 'మనిషి జనము చెప్పు మానసీయ చరిత్రా' భార శాంతి.

జాత దృఢ హార్దయును గృపోపేతము నగు
గాత యందు నా చేయు జోతలు గొని (1—3)

ఆ.వె. సాటిలేని వేల్పుటేటి తీరమునకు
జోటి తుటుములో నిశాటి జేరి
తాటి సిడము రాచమేటి తల్లిని మెచ్చె
మాటి మాటి కొసగు చేటికోళ్ళ (2—6.)

ఆ.వె. దొరకు నిందు వశోళి కరుణచే నొక తమ్మి
దొరవి యందు నొక్క గరిత నిసుగు
దొరకుటెరిగి చూడ నరిగిరి పౌరులం
ద్దొరకు స్మృతి మనః కుతూహలులయి (3—13)

ఆ.వె. మట్టు మీరినట్టి యుట్టలంపు విరాళి
పుట్టి నట్టి కొట్ట కొట్టు వెట్టి
గట్టు నట్టు దిట్టు జెట్టవట్టుట కట్టి
గట్టి పట్టు పట్టె—గట్టుపట్టి (3—74)

శ్లేషతో గూడిన యీ క్రింది ప్రాసగీతిని చూడుడు.

సూర్యభిన్నత భావన్య శోభమాన
నార్య వైలక్ష్య కృత్రుతిభాతిరేక
నార్యగాంచి వికుర్వాణులగుచు నయ్యు
హార్య సార్వభౌముండు మిన్నంటె నపుడు(ఉ 3—36.)

విశేష ప్రాస.

సంయము లున్నెడ మనము శు
భంయులమై మన మదేమి పాపమొకో వా
చంయము లూరక యుప్రతిఘు
సంయుతు లయ్యెదరు దివిజ శత్రులగనివన్(1—84)

ఛందశ్శాస్త్రమున యతి ప్రాసల విషయమున ప్రకాశకవికి గల ప్రజ్ఞాపాటవము పై యుదాహరణములవలన విశదమగును.

## చి త్ర క వి త్వ ము

ప్రాస విశేషములతోనే గాక—చిత్రకవితయందును కవి తన సామర్థ్యమును రుచి చూపినాడు 15

అచలజిహ్వా కందము

"అహి పుంగవ బాహా మహా
మహి పుంగవ వాహ భీమ ముఖ విముఖ మహా
వహ భవ గంగా భీక మ
ఖహ బహు పాపాహి భోగ్గ పుంగ విభూషా. (1—122)

శవర్ణ గుణిత చంపకమాల

"శరనిధి తూణ, శాసితనృశంసజలంధరదానవా శివం
కర సుచరిత్ర శీతకరఖండవిభూషిత మస్త శుక్ర భా
స్కర శిఖినేత్ర శూలవిలసద్భుజ దక్షిణహస్త శేవకో
త్కర భవనాజిరస్థిత సుధాభుగలారుహ శైల కన్యకా
పరి వృత శోషిత ప్రణత పాస్మక శైవక శస్త శంకరా (2—126)

ఇందు గుణితక్రమము కొరకు పంచపాదియైనది.

ముక్తపదగ్రస్తము

"ధరణిభృద్వరవాస, వాసవ ముఖ్యార్థ ప్రాంచత్ప్రశ్వాస నా
సర కృత్కోటి వికాస కాసరవరాశ్వ స్మర్శితత్రాస ధా
సరస ప్రీత విలాస లాసక చరాంచ ద్వాజమ్మహాసార్థుహా
సరుగో క్షేపిత చంద్రహాస హర రాజత్కాశికాధీశ్వరా (5-123)

## ప ద చ మ త్కృ తి

అయ్యలరాజు రామభద్రకవి, చేమకూర వెంకటకవి మొదలగువారివలె ప్రకాశకవి పదచమత్కృతిని చూపియున్నాడు.

"దీవన యొసంగి గని సుర న
దీవనవాసి యగు నా యతివరువివలనన్
నివనపాయ రిపుధ్వజి
నీవన పావకునిం బావనిం గనె దనుభున్. (1—79)

"ఇం దీవలు కెన్నడు నీ
యిందీవర నయనం జూచి యెఱుగ నెసగునా
యిందీవరవర్ణిని కే
విం దీవరపు వెత యీ వనిత నీక్షింపన్ (4—48)

"నాకులు నమలుచు నిచ్చిరి
నాకులు విని మెచ్చ గొన్నినాళ్ళ నియతులై (4—10)

ఆ పగతునిం గనుగొని వ్యాద
యాపగత క్షాంతియు నధికామర్షుండునై
యా పగలు రేని కొడుకొక
యాపగయై వైతువాఅ నాతని నేసెన్. (6—146)

సందరమం ద్రచ్చు తిక్కల
సంధఱముటం జేసి భ్రమసహ్యమయిన యీ
మందరముం దెచ్చుటకు మే
మందరముం బడినపాట్లు హరుండె యెరుంగున్(ఉ-1-63)

కంద పద్యములలోనేగాక ఉత్పలములందు నిట్టి చమత్కృతి గలదు.

ఉ. లోపలనుండి వచ్చి యుములుండు శిలాద తనూజుడింద్రనీ
లోపల మూర్తియైన పురుషోత్తము ... రం
దో పని కర్జ మేమి?.......నతం
డో పనిత స్వరూప...... (ఉ1—4)

ఇట్లే యీ కృతిలో ఉ 2—9, 2—19, 2—41, 2—47, 2-48, 3—10, 8, 5—19, పద్యములలో నిట్టి చమత్కృతి గలదు.

---

15 ఇట్టి రచన లినాటివారికి "సర్కసు ఫీట్లు"గా తోచవచ్చును. గాని ఈ కాలములోని కొక్కొండవారి విశ్వేశ్వరీయము, నాదెళ్ల పురుషోత్తమకవిగారి అద్భుతోత్తర రామాయణము మొదలగు నివి యీ కాలమునందలి కవిత్వ లక్షణము లెట్టివి యని చెప్పవచ్చును.

## సూక్తులు

మేధకు పదనిచ్చు నిట్టి పద చమత్కృతి యున్నను మన సున కాహ్లాదము గలిగించు సూక్తులు నిందు లేకపోలేదు.

"చీమలు చేరునె వహ్ని కీలలన్ (1—49)

తాపసోత్తములకు నసాధ్యములు గలవె (2—60)

మగుటిమి గనుపరుపలేని జీవ
న్మృతు బ్రతుకు బ్రతుకె (3—97)

మహీభృదగ్రణి కుపలంబు లేమికొదువ (ఉ. 3—26)

మిన్నిక దొర యంజదోయి దరిజేరిన వారికి నున్నెయంజికల్
(ఉ. 3—30)

యుక్తాయుక్త వివేకశూరులు గదా యూహింపఁగా
మర్త్యతుల్ (4—96)

సతి పాంసుల నంటునె (ఉ. 1—28)

సన్నగాండ్ర బాంధవము పొసంగినన్ బరువు తక్కువయే
గద గొప్ప వారికిన్ (ఉ. 1—8)

సాధు బాధ సలుపు దుష్టాత్ములకు సిరి తొలుగుటరుదె
(4—25)

## ప్రాచీనకవుల అనుసరణలు

సూర్య ప్రకాశకవి, పూర్వకవి సంప్రదాయము ననుసరించి ప్రాక్తన కవులైన నన్నయ, శ్రీనాథ, పోతనల ననుసరించియున్నాడు.

నన్నయ—"నీరజ మిత్రుఁడేల ధరణీగతు డయ్యెడు నొక్కొ యంచు వి
స్మేర మనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి జూచుచుండుగా
నారదుఁ డేగుదెంచి గగనంబుననుండి సురేంద్ర మందిర
స్ఫార విలాస హాసియగు పార్థు గృహంబునకున్ బ్రియంబుతోన్
(ఆది· 3—24)

ప్ర.క. "తామరసాప్తుఁ డేమిటికొ ధాత్రికి డిగ్గెడు నంచుఁ జేతన
స్తోమము విస్మయంపడుచుఁ జూచు మహోత్తర తేజ
మొప్పఁ బూ
ర్వామర రాజ బీజ వదనాంబుజముల్ వికసింపఁ జేయుచున్
వ్యోమ గతి న్నిశాటవిభు నొద్దకుఁ గావ్యుడు వచ్చె చెచ్చెరన్"
(పూ. 5—36)

శ్రీనాథుడు: "రమణి మందాక్ష మందాక్షరంబులైన
పరిమితోక్తుల నిబ్బంగి పలుకుటయును"
(నైష. 2—64)

ప్ర. క. "రమణి మందాక్ష మందాక్షరంబులైన
మధుర వాగ్గుంభనముల" (పూ. 3—24)

పోతన—చండ స్ఫూర్తి వటుండు గాంచె బహుధా జల్పన్నిశాటంబు ను
ద్దండా హూతమునీభ్య బిభ్యదమృతాంత స్పిద్ధకూటంబు వే
దండాశ్వ ధ్వజినీ కవాటము మహోద్యద్ధూమసంఛన్నవా
ర్తాండ స్యందన ఘోటమున్ బలి మఖాంతర్వేదికా వాటమున్
(భాగ. 7 స్క—21)

ప్ర.క. పారిష దాంగనల్ భయము భక్తియుఁబెద్దయుఁ గల్గి వెంబడిన్
సూరెల నేగఁ దూకొనెఁ బ్రసూతి తనూజ సభాస్థితాహిభు
గ్ద్వారణ వాసవా ద్యమర కూటము ద్రష్ట్ర నిరంతరావృత
ద్వార వితర్ది చత్వరకవాటము దక్షుని యజ్ఞవాటమున్.
(ఉ. 2—37)

పోతన—పూరించెన్ హరి పాంచజన్యము...

..............................

సారోదార సిత ప్రభా చకితపర్జన్యాది రాజన్యమున్
దూరీ భూత విపన్న దైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్
(భాగ 7—స్కం. 116)

ప్ర.క. స—ర్యక్రవ్యాదులతోడ జేరిరి నిజ ప్రాసాద రాజన్యమున్
శక్రాది ప్రభు మందిరాపిత తిరస్కార స్ఫిరాజన్యమున్.

పోతన కవితయందె క్కువ మక్కువ యగుటచే నంత్యానుప్రాసమును అనుకరణమును మరికొన్ని పట్టుల పాటించి యున్నాడు. ఒక్క ఉదాహరణము.

రౌద్రరసము వర్ణించుపట్ల తదనుగుణముగా దీర్ఘ సమాస రచన గావించియున్నాడు. రౌద్రమూర్తియగు వీరభద్రుని వర్ణన, రసానుగుణ్యము..

సీ. ఉగ్రతమోదగ్ర విగ్రహాభోగస
మాక్రాంత సర్వ రోదోంత రాళుఁ
డామకుండ దవద ప్రకాశమాఖిల బ్రహ్మాండ
హనన శక్తిష్ణు బాహా సహస్రుఁ
డశ్లక్ష్ణ పాద యుగ్మాలస విన్యాస
భార భుగ్నానంత ఫణ సహస్రుఁ
డక్షీణ రూక్ష కల్పాంతాశుశుక్షణి
నిక్షేప దేశాయితేక్షణుండు
వేల్లితా ఖర్వ కైశిక వేల్లన జని
తప్రభంజన వశ దిగంత ప్రదేశ
ధాన్య మానాంబుభృత్సముదాయుడు నయి
పొడమె నత్తఱి నొక మహాపురుషవరుడు
(ఉ. 2—246)

ఇది పోతన యనుసరణమే.

సీ. అభ్రంకషోదభ్ర విభ్రమాభ్ర భ్రమ
కృష్ణీల దీర్ఘ శరీర మమరఁ
బ్రజ్వలజ్జ్వలన దీప్త జ్వాలికా జాలి
జాజ్వల్యమాన కేశములు మెరయఁ
జండ దిగ్వేదండ శుండాభ దోర్దండ
సాహస్ర ధృత హేతి సంఘ మొప్ప
వీక్షణ త్రయలోక వీక్షణ ద్యుతిలోక
వీక్షణ తతి దుర్నిరీక్షమగుచుఁ

గీ. గ్రకచ కఠిన కరాళ దంష్ట్రలు వెలుంగ
ఘన కలాపాస్థివనమాలికలును దనర

నఖిల లోక భయంకరుఁ డగుచు వీర
భద్రుఁ డుదయించె మారట రుద్రుఁ డగుచు.
(భాగవతము 4—108)

"శౌర్య సహాయులై యరిగి సంయమిలోక కృతాధ్వరాది స
త్కార్యము నిర్జరోత్కర సుధామయ శస్త్రతరాన్న దాన ని
ర్ధార్యము సన్మహోర్షమణి తల్లజ ధుర్యము నైన మందరా
హార్యము నా సురారి నివహార్యము నిర్వురఁగాంచి రొక్కటన్'
(4—4)

రుద్రులు మున్నుగా ననుచరుల్ తన వెంబడి నేగుదేర న
య్యద్రి విరోధి దూకొనియె నచ్యుతదేవుని దివ్యసర్వతో
భద్రము పద్మనాభ పద భక్తవశీక్రియమాణ సచ్చతు
ర్భద్రము శేయ విస్మృతి నిరస్త సమస్త మహాసముద్రమున్.
(7—13)

ఒకచో రామరాజ భూషణు ననుకరించినట్లు తెలియగలదు.

సీ. గాలవ శాండిల్య కౌశికాది పదార్థ
తరు లక్షవట యుక్తి దరుల నొసఁగ.
(హరిశ్చంద్ర నలోపాఖ్యానము—ప్ర. ఆ.)

ఇచట ఒక పక్షమున వృక్షపరముగాను, మరియొక పక్షమున మునీశ్వరపరముగాను నర్థద్వయము గలదు.

1. గాలవముఁ వృక్షపరముగా లొద్దుగు చెట్టు (లోధ్ర వృక్షము), గాలవుడనెడు ముని.

2 శాండిల్యము „ మారేడు, (బిల్వ వృక్షము) శాండిల్యు డనెడుముని.

3. కౌశికము „ గుగ్గిలపు చెట్టు, కౌశికుడను ముని (విశ్వామిత్రుడు)

ప్రకాశ కవి —

> క్రాలు గాలవ శాండిల్య కౌశికాదు
> లైన ఘన తరుల్ గలిగి యక్కాననంబు,
> క్రాలు గాలవ శాండిల్య కౌశికాదు
> లైన ఘన తరుల్ గలిగి యక్కాననంబు[16]
> (ఉ. 3—176)

సంస్కృత కావ్యానుసరణములు లేవుగాని యొక్కచో అప్పయదీక్షితుల కువలయానందమునగల నిదర్శనాలంకారమునకు లక్ష్యముగా నుండిన యీ క్రింది శ్లోకమును ప్రకాశ కవి యనుసరించినాడు.

---

16 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం. 21 సం. 2.పుట. 63 దుర్భాకి సూర్యనారాయణశాస్త్రి.

"రాజ శివా మనుష్యేణా మపి ఛాయా వలేహనం
పంచానన పరిష్వంగో వ్యాళీవదన చుంబనమ్.
"సీ. కడుపు వాడి ముల్లు నాట్టి కొక్కెయ కన్ను బొడ్చు
నాల్క యంతయు జాపి నాకినట్లు
త్యక్త నిర్మోకంబు దారుణంబునునైన
కోడె చిల్వను ముద్దుగొన్న యట్లు
గళము దాక శిరంబు ఘాతుకంబైన శా
ర్దూలంబు నోటిలో దూర్చినట్లు
(పూ. 1—105)

భా వ ము లు

ఆ యుగమున తక్కిన కవులతో పోల్చి చూచిన యెడల పూర్వ కవ్యనుసరణములు ప్రకాశకవి కృతిలో చాల తక్కువగా నున్నవని ధారాళముగా చెప్పవచ్చును. ఇంతేకాక కొన్ని భావములిందు మనోహరములైనవి గలవు.

1. మయుడు క్రొత్తగా కట్టిన వీరమాహేంద్రపురములో ప్రవేశించుటకు గురువగు శుక్రాచార్యుని తారక శూర పద్మలు కోరిరి. ఆ ముహూర్త బలము చాలా గట్టిదని కవి యెట్లు చమత్కరించినాడో చూడుడు.

"గ్రహములలో నొకండయి జగత్పూర్ణ గార్హ్యదిన భార్గవుం డన్న గ్రహమున క్రొత్త వీటి కరుగన్ సుమూహూర్తము నిర్ణయించె దత్
గ్రహబల సంపద చెప్పవలె దైవత నాయక ముఖ్యులెల్ల సా
గ్రహ మతులయ్యు వేళ మపకారము చేయగ జాలరైరనన్.
(5—42)

సాధారణముగ జ్యోతిష్యనిబట్టి గ్రహ బలమున ముహూర్త బలము వ్యక్తమగును. ఇచ్చట ముహూర్తము పెట్టినవాడు శుక్రుడు. అతడు గ్రహమే కావున యింక గ్రహబలమున్న కేమి లోటు! అందుచేతనే దేవతలకు నెంత కోపము వచ్చినను రాక్షసుల నేమియు చేయజాలకపోయిరి.

2. శుక్రాచార్యులు తారక శూర పద్మలకు గురువేగాక పితృతుల్యుడు. అందుచేత నాత డొకమారు వారిని వీడ్కొను నప్పుడు వారి కన్నులవెంట నశ్రువు లుదయించినవి. కవి యీ సన్నివేశము నిట్లు సరసము చేసియున్నాడు.

శుక్రుడు పితృసముడు తమ్మతిక్రమించి
యరుగుతరి వారికిం బొసంగె నశ్రువృష్టి
స్వాతి గతుండైన శుక్రుడు వాన గురియ
జేయునను మాట లోకప్రసిద్ధమె కద (5—127)

శుక్ర గ్రహము స్వాతీ నక్షత్రమున చేరగానే వాన కురియును. ఇచ్చట శుక్ర గ్రహము—శుక్రాచార్యులు. అతడు స్వాతి తన గృహము చేరగానే వర్షము కురిసినది. అనగా కన్నులలో తారక శూర పద్మలకు బాష్ప జలములు కురిసినవి.17

3. దక్ష యజ్ఞ ధ్వంసము సందర్భమున సతీదేవి దగ్ధమైనను దక్షుడు యజ్ఞము మానలేదు. అప్పు డక్కడి సదస్యులతని కిట్లు పలికించినాడు.

"చెట్టంత కూతురుసుం జో
గొట్టి కొనియు దిటవుమునన్ తగుదునని జన్నం
బిట్టు తొనర్చుచుచునుంటివె
కట్టా నీ యట్టి పాప కర్ముండు గలండే.
(2—76)

"ఏమయ్యా దక్షా! శుభ సమయాల్లో ఏ చిన్న శిశువు మరణించినా, ఆ శుభ కార్యమాగిపోతుంది—అట్టి సందర్భములో చెట్టంత కూతురుని పోగొట్టుకొని, ఇంకా యజ్ఞమాపకుండా చేస్తున్నావు. నీ యంతటి పాపకర్ముడు మరి పుట్టబోడు" అన్నారు. దక్షయజ్ఞధ్వంసము నన్నెచోడుని మొదలు చాలామంది కవులు వర్ణించినారు, అయితే యెవ్వరును ఈ భావము వ్యక్తపరుపలేదు.

4. ఈశ్వరుడు తపస్సు చేయునపుడు వట వృక్షమున కాను కొని యల్లుకొనినట్లుండును. వటవృక్ష మూలముననే శివుడు దక్షిణా మూర్తియై మునులకు మంత్రోపదేశము చేసెను. ఈ సన్నివేశమును కవి యిట్లు మనోహరముగా తెలిపినాడు.

"అగమునకు కల్లుండౌదునని వ్యక్తము చేయుచునున్న పోల్కి న
య్యగమున కల్లుడౌనటుల స్వాంగము ప్రమానికి నాని కూరుచు
న్న గిరిశునిన్ జగత్త్రితయనాథునిం గన్గొని మేన నెల్లెడన్
గగు రొదవన్ బొనర్చె మిహికాగిరినేత బహు ప్రణామముల్
(ఉ. 3—47)

అగము అనగా కొండ, అగము—అనగా వృక్షము అను రెండర్థము లున్నవి. దీనిని పురస్కరించుకొని కవి తరువాత అగమునకు కొండకల్లుడు (జామాత) అయినట్లుగా, తొలుత అగమునకు వృక్షమునకు నల్లుడై (అల్లుకొన్నవాడై) ప్రకాశించెను.

ఇట్లు చూపిన కొలదియు నీ మహా కావ్యమున విశేషము లుత్పన్నమగుచునే యుండును. నేను పై నుదాహరించిన పద్యము లన్నియు ప్రాత ముద్రణము ననుసరించినవి అందుచే అక్షర స్ఖాలిత్యము లుండవచ్చును. పాఠకులు మన్నింతురు గాక.

ఈ రసవత్ప్రబంధము సుసంస్కృత ముద్రణముతో విపుల పీఠికా వ్యాఖ్యానాదులతో వెలువడిన నది,ఆంధ్ర ప్రబంధ సాహిత్యము నకేగాక, ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున కొక నూతనోత్తేజము గలిగింపగలదు. భాషా పోషకులు, సాహిత్య సంస్థలు అట్టి మహా కార్యమును సత్వరము పూనుకొందురుగాక.

నాను ప్రాణపదముగ రక్షించుచున్న ఈ ఏకైక ముద్రణ ప్రతిని నా కొసంగి, ఈ వ్యాసము వ్రాయుట కవకాశము గల్పించిన, లోకారాధ్యులు—అధివక్తృశేఖరులు—సహజ ఔదార్య సంపన్నులునైన శ్రీ చాగంటి శంకరశాస్త్రిగారికి నా మనః పూర్వక కృతజ్ఞతాభివందనములు అర్పించుచున్నాను.

---

17. సూర్య ప్రకాశ కవియేగాక—ఈ వంశీయు లందరును జ్యోతిషమున ప్రవీణులు.

# తీర్పు

శ్రీ విహారి, శ్రీ శాలివాహన

[చీకటిగా వుంది. కాంతి ప్రసారం మాత్రం జరుగుతోంది. దానితోపాటే కంఠస్వరం వినిపిస్తోంది—

'ఇది కాంక్ష. ఇది ఆకాంక్ష. ఇది బలీయమైన కాంక్ష— ఇది మహనీయమైన ఆకాంక్ష'.....కాంతి ప్రసారం హాల్లో వెనుక గోడమీద Triumph of labour statue ఫోటోమీద నిలిచింది.

'ఇది కాలం. ఇది విధి రూపం. ఇది శక్తిమంతమైన కాలం— ఇది అజేయమైన విధి రూపం'.....కాంతి ప్రసారం వెనుక గోడకు మధ్యగా తగిలించిన గడియారంమీద నిలిచింది—తొమ్మిది గంటలు కొట్టాయి.

'ఇది అనుబంధం. ఇది అనురాగం. ఇది మమతా మమకారాల అనుబంధం—ఇది సరాగ రాగాల అనురాగం'......కాంతి ప్రసారం కుడివైపు మూలకొచ్చింది. అక్కడున్న స్టాండ్‌మీది రాధాకృష్ణ విగ్రహంమీద, పై గోడకు గల మాతృమూర్తి ఫోటోమీద నిలిచింది.

'అనుబంధం అనురాగం కాంక్షతో, ఆకాంక్షతో పెనుగులాడాయి. అయితే కాంక్షనూ, ఆకాంక్షనూ, అనుబంధాన్నీ, అనురాగాన్నీ కూడా కాలం జయించింది మట్టి మనుషులు మిగిలారు. అవును. మట్టి బొమ్మలు మిగిలాయి దానికి నిదర్శనం మన లోకంలో నివసిస్తూ, తన లోకంలో బ్రతుకుతున్న అతను—అదుగో అతనే—అతనే గంగాధరం.......!

లైట్లు వెలిగాయి.

కలిమిని సూచిస్తున్న యింట్లో హాలు. హాల్లోనుంచి వెనుక ప్రక్కగావున్న రెండు గదుల్లోకీ వాకిళ్ళు, వాటికి డోర్ కర్టెన్లు, గుమ్మాలకు పైగా అందమైన చిత్రపటాలు, పైన సూచించిన వస్తువులు ప్రధానంగా కనిపిస్తాయి. హాల్లోనుంచి లోపలిగదిలోకి మరో వాకిలి వుంది. ఆ వాకిలి ప్రక్కగా గోడకు వో ఫోటో వుండేది ఇప్పుడు లేదు. ఆ మేరకు వో మచ్చలాంటి గుర్తు కనిపిస్తోంది.

ప్రేక్షకులకు ఎడమవైపు వో table, chair. వాటిని ఆనుకుని వో చిన్న స్టూలు, టేబుల్‌మీద రోప్స్, రెండు పలకల ఇసుకరాళ్లు, వో చిన్న సీసా. అందులో థర్మామీటర్, వో చిన్న నాప్‌కిన్, వో battery light, దినపత్రిక ఉన్నాయి. ఆ కుర్చీ మీద పాతకాలంనాటి కోటు పడేసివుంది.

ప్రక్క గదుల్లోకి వెళ్లే రెండు వాకిళ్లకూ మధ్యగా మరో టేబిల్ వుంది. దానిమీద రేడియో, ఫోన్, ఫ్లవర్‌వాజు, వాలు గైడు పుస్తకాలతో (Hydraulics, Building contruction, Earth work & Road Making, Building Meterials) చిన్న షెల్ఫ్ ఉన్నాయి. కుడివైపు వో బెంచీ వుంది. దానిమీద కొన్ని ట్రేసింగ్ పేపర్లను, ప్లాన్లను చుట్టలుచుట్టి వరసలో పెట్టారు. డ్రాయింగ్ బోర్డ్, దానికి అతికించినట్లుగా వో టి—స్క్వేర్, ప్రక్కగా సెట్ స్క్వేర్ ఉన్నాయి బెంచీకీ, గది గుమ్మానికి మధ్య మంచినీళ్ల కూజా వుంది.

హాలుకు మధ్యగా మూడు కేన్ చెయిర్లు, టీపాయి ఉన్నాయి.

గంగాధరం ఎడమవైపు టేబిల్ మీద తన కుడిచేతిని ఆనించి నిలబడి వున్నాడు. అతను చాలా బిజీగా వున్నట్టుంది. ముఖ కవళికల్లో ఒకింత చికాకు కనిపిస్తోంది. వయసు మళ్లిన వ్యక్తిత్వాన్ని తెలుపుతూ ముఖంలోని ముడతలు కదలాడుతున్నాయి— స్టూల్‌మీద కూర్చున్న మనిషిని పరీక్ష చేస్తున్నాడతను. నిజానికి అక్కడెవరూ లేరు.

గం: ఏవిటయ్యా బాధ? అంగిట్లో వుందా? (టార్చ్‌లైట్ తీసుకుని వేశాడు. అది వెలగలేదు వెలిగిందనే అతని భావన.) అడ్డమైన గడ్డీ తింటూంటే అంగిలివుండు పడదుటయ్యా మరి? రాత్రి రెండు సినిమాలూ చూడాలి. రెండు సినిమాల ఇంటర్వెల్‌లోనూ పచ్చి మిరపకాయ బజ్జీలు నమలాలి. పగలల్లా షాపికసార్లు కాఫీలు త్రాగాలి. లేకపోతే ప్రాణం పోతుంది. నాలిక పీకుతుంది! ఎత్తు.....నోరు మరికాస్త తెరవయ్యా, నాలికజాపు! ఆ......అలా! (ఆగేడు. పరీక్ష పూర్తయింది. టార్చిని బల్లమీద పడేసి మూలకి నడిచాడు. వాష్ బేసిన్‌లో చేతులు కడుక్కున్నాడు.—ఆమూల నిజానికేమీలేదు— నీళ్లు విదిలిస్తున్నట్లు చేతుల్ని ఝాడించి తుండుకు తుడుచుకున్నాడు.) సరే. (చీటీ రాసేడు) ఇదిగో! ఈ బిళ్లలు పూటకొకటి చొప్పున మూడు పూటలు వేసుకో. ఏవిటీ, తెలిసిందా? మూడు పూటలే— మూడు రోజులు కాదు. రేపు ప్రొద్దున్నే రావాలి మళ్లీ.....ఆ....ఫీ జెంతంటావా? ముందో మూడు రూపాయలిస్తే బోణీ కొట్టు. రేపటి విషయం రేపు ఆల్‌రైట్ (డబ్బు తీసి సొరుగులో వేసుకున్నాడు) ఇక నువ్వు వెళ్లొచ్చు. (కూర్చున్నాడు. సొరుగులో రూపాయి కాయితాల దొంతర తీశాడు. లెక్కపెట్ట సాగేడు. నిజాని కవి రూపాయలుకావు. సినిమా పేపర్లు వో సైజుకు చించి కట్టినకట్టు. ఆ కట్ట సొరు

గులో పడేసి, సొరుగుమూసి హఠాత్తుగా లేచాడు.)

ఏవమ్మాయ్ సరోజా! ఏవిటీ యిలా వచ్చావ్? ఈ టైమ్‌కి నువ్వు ఏ బాయ్ ఫ్రెండు నో కలవాల్సిందానివి!... పోదురూ నా? (నవ్వేడు. నీ బదులు నేవెళ్తే ఖంగారు తింటాడు మీ ఫ్రెండు. ఇంతకీ ఏవిటీ కంప్లయింటు? కంప్లయింటు చెప్పే పెయినే! సాక్షాత్తూ చెస్ట్ పెయినే!! ఏదీ!... (టేబిల్ మీది తాడుని స్టెతస్కోప్‌లా అమర్చాడు. చెవిలో పెట్టుకున్నాడు అయ్యయ్యో అంతసిగ్గయితే ఎలాగమ్మాయ్?.... ఫర్వాలేదు. చెయ్యి తియ్యి. డాక్టరంటే తండ్రిలాంటివాడమ్మా. నాదగ్గరెందుకు సిగ్గుపడతావ్.....అయినా నామొహం నా వెర్రే గానీ నీకేం సిగ్గు! సిగ్గూ లజ్జా వున్న పిల్లవయితే ఈ లోనెక్ జాకెట్, అరమీటరు పమిటా వేసుకుంటావు? సర్లే, నిన్నని ఏం లాభం? కాల ప్రభావం!... ఇదిగో ఈ ఇంజక్షన్ తెప్పించు. ఈ టానిక్ పుచ్చుకో... అలాగే నంటూ వయ్యారంగా ఉడాయిస్తున్నావేమిటి?—ఫీజు తల్లీ, ఫీజు! ఎంతా? ఎంతో నే చెప్పాల్సిందేనా? అన్నట్లు మీ నాన్న ఏ కాంగ్రెస్‌లో చేరాడూ? కొత్త కాంగ్రెసా? అయితే అధికారంలో వున్నట్టే లెక్క. పదిహేను రూపాయ లిప్పించు. (డబ్బు తీసుకుని సొరుగులో ఉంచాడు.)

అబ్బ! (దీర్ఘంగా నిట్టూర్చాడు. కుర్చీలో వెనక్కివాలేడు) Roaring Practice, Thumping Success... ఆ రోజు కారోజు పేషంట్స్‌ఎక్కువైపోతున్నారు. వంట్లో సత్తువ తగ్గుతున్నకొద్దీ పని వత్తిడి ఎక్కువై పోతోంది. హో సిగరెట్టన్నా కాల్చు కుందాం. (సొరుగులోనుం చేదో సిగరెట్ తీసేడు. నిజానికదొక కాగితపు చుట్ట. దాన్ని నోట్లో పెట్టుకుని వెలిగించుకుని, చిత్రంగా పొగపీలుస్తున్నాడు.—అభినయం మాత్రమే. నిజానికి అగ్గిపెట్టే లేదు.)

(రాజారావు వచ్చాడు ప్రక్కగదిలోంచి. 30 ఏళ్లుంటాయి. బట్టతల ఏర్పడుతున్న లక్షణం. కాకీపాంటు మీద గళ్లటెర్లిన్ షర్టుని ఇన్ చేశాడు. ఎడం చేత్తో పాంట్‌ని పైకి లాక్కుంటున్నాడు. అతని కదొక అలవాటు. కుడిచేతిలో చిన్నడైరీ. దాన్లోనుంచి చిత్తుచిత్తుగా కాగితాలు వెలికొస్తున్నాయ్— అ-నొక సివిల్ సూపర్వైజర్.)

గం:— (రాజారావ్‌కేసి చూసి నోట్లోవున్న కాగితాన్ని తీసేడు. గొణుక్కున్నాడు) 'కాకీ నీరంగేవిటే అంటే, ముదురు నీలం' అన్నదిట! అలా వుందిది. నేనో సూపర్వైజరుని కాదు అని చెప్పుకోవాలనే ప్రయత్నమో ఏంపాడో, లేకపోతే కాకీ పాంటు మీద ఆ టెర్లిన్ షర్టెందుకు?

రాజా:— (తండ్రివైపు చూసేడు. నొసలు చిట్లించాడు. చిరాగ్గా టేబుల్ మీది వస్తువుల్ని చూస్తి...పిల్చేడు) సుశీ!........సుశీ!!

(సుశీల వంటగదిలోంచి వచ్చింది, ఆమె రాజారావుభార్య. సామాన్య గృహిణి లక్షణాలు. ముఖంలో నిబ్బరం వుంది. నిండుకుండ మనస్తత్వం. ఏవో విచారరేఖలు ఆవరించి వున్నట్లున్న ముఖకవళికలు. రోగగ్రస్తలా వుంది—, ఏవిటన్నట్లు చూసింది.)

రాజా:— ఏవిటీ న్యూసెన్సంతా? ఈ సరంజామా అంతా యిక్కడ్నుంచి మార్చ మన్నానా లేదా?

సు.— మావయ్య వద్దన్నారు.

రాజా:— వద్దంటాడు. ఆయనకేం! ఆయనగా రిలా ఆవేషం వేస్తూనే వుంటాడు. వచ్చేపోయేవాళ్లు చూసి రక రకాల ప్రశ్నలు వేసేది నన్ను గదా!

గం: ఎకసెక్కెంగా చేతులు తిప్పాడు. ఓహ్ యబ్బ! అనవసరంగా రెచ్చగొట్టకు! అయ్యని గురించి వాళ్లందరూ ప్రశ్నలు వేస్తే నామోషి వచ్చేసింది అబ్బాయిగార్కి!

రా: (అరిచేడు) నాన్నా!—సుశీ, ఆయన టేబులు ఆ గదిలోకి మార్పించు.

సు. మామయ్యకు ఇష్టంకానిదాన్ని గురించి రోజూ యీ తర్జన భర్జన లెందుకండీ? పెద్దవారు—వారి కీ కష్టపడు లేవిటి?

గం: మంచి మాటన్నావ్. అలా చెప్పమ్మా.

రా: అయిందా తమ సలహా. నే చెప్పిన ప్రతి మాటకీ వ్యతిరిక్తపు సలహాలే!... రోజు రోజుకీ ఈ కొంప నరకంగా తయారవుతోంది. (డైరీని మధ్య టేబుల్‌మీదికి విసిరికొట్టాడు.

సు: అదికాదండి!......

గం: (రాగయుక్తంగా పాడేడు.) ఈ నరలోకంలో లో....లో. లో లేకుంటే నరకం మిగిలేనురా—లో అంటే ఏవిటో మీకు తెలుసా? నో....తెలీదు! లో అంటే ఇన్.... ఇన్నర్.. అంటే మన 'లో' అన్నమాట. మనలోని మనసన్నమాట. (మళ్లీ పాటలోకి గేడు.) ఆ మనసు లేకుంటే బ్రతుకే మరో నరకమవునురా... నరకమవునురా!

రా: తత్వం బాగానేవుంది గానీ, ఆపండి!...... భద్రయ్య రాలేదా?

సు: రాలేదు.

రా: (బయటికి వెళ్లిపోబోయాడు.)

సు: ఏవండీ!......

రా: ఏవిటి?

సు: ఇంట్లో బియ్యం నిండుకున్నాయ్.

రా: (తీక్షణంగా చూసేడు) తెప్పించు.

సు: డబ్బు?

రా: ఏవిటి నువ్వనేది?

సు: డబ్బులేదు.....జీతం ఖర్చయిపోయింది.

రా: నిన్న యిచ్చింది......

సు: ఉంది.

రా: దాన్లోనుంచి వాడు.

సు: దాన్ని ఖర్చు చెయ్యడం నా కిష్టంలేదు.

రా: సుశీ! తెలివిగా మాట్లాడకు. మొన్న పండక్కి చీర తెస్తే కట్టుకోనని మొరాయించి కూర్చున్నావు. ఇవాళ బియ్యానికి డబ్బు ల్లేవంటున్నావ్. నీ తరహా ఏమీ బాగా లేదు!

సు: యధార్థం గనక చెప్పాల్సివచ్చింది.

రా. నువ్వేం చెప్పక్కర్లేదు. నే చెప్పినట్లు చెయ్. భద్రయ్య రాగానే ఆ డబ్బులోంచి వో బస్తా బియ్యం తెప్పించు. (విసురుగా వెళ్లిపోయాడు.)

గం: (పేపరు చదువుతున్నాడు.) మంత్రివర్గంపై అవినీతి ఆరోపణలు..... ముఖ్యమంత్రి ఖండన—ఖండనమే ! మంచికీ నీతికీ, నిజాయితీకీ ఖండనమే!!—అమ్మాయ్ సుశీలా, కొంచెం కాఫీవుంటే యిద్దూ!

సు: అలాగే మామయ్యా......(వంటింట్లోకి వెళ్లింది.)

గం: (పేపర్లో పేజీ తిప్పాడు ) అవినీతి నిరోధకశాఖ ఇన్‌స్పెక్టర్‌పై లంచం కేసు..... భేషుగ్గావుంది! కంచే చేను మేసిందంటే ఇదే కాబోలు! (పాడుకున్నాడు) చిరుచేపను చిన చేపను, చిన చేపను పెదచేప ...
(భద్రయ్య వచ్చాడు వయస్సు 30—35 మధ్య అతను రాజారావు డిపార్టుమెంటులో మేస్త్రీ.)

భ: ఏంటి బాబూ, చేపలంటున్నారు....

గం: ఎక్కడన్నా దొరుకుతాయిటోయ్?

భ: ఎంతమాట ఎంత మాట. సాక్షాత్తూ సూపర్‌వైజర్ రాజారావు గారి ఫాదర్‌గార్కి చేపలు దొరక్కపోవటమే!... మొన్న ఏ. ఇ. గారు కేంపు కొచ్చినప్పుడు, 'ఉప్పు చేప తిని చాలా రోజులైందోయ్ భద్రయ్యా!' అన్నారు బాబూ.

గం: అన్నాడూ?

భ. వెంటనే సైకి లేసుకుని సింగుపాలెం పోయాను. పదిమైళ్లు సార్. టు అండ్ ఫ్రో ట్వంటీమైల్స్. మర్నాటి కల్లా ఏ. ఇ. గారింటికి తట్టెడు ఉప్పు చేప జేరింది...... రమణయ్య పంపేడు లెండి!

గం: ఎవరూ?

భ: అదేనండీ, కంట్రాక్టర్ రమణయ్య!

గం ఒహో!

భ. అలాగే మీరు కావా లనాలేగాని, నిమషాలమీద సప్లై చేయనా సార్!.. .పైగా ఇంకో సంగతి సార్ (దగ్గరగా వెళ్లేడు. రహస్యం చెబుతున్న ధోరణిలో అన్నాడు). చెరువు పని చేయిస్తున్న కంట్రాక్టర్ కనకారావుకీ, అయ్యగారికీ బేరం సరీగ్గా కుదరటంలేదు ఈ మాట అతని చెవిన పడేశానో, రాత్రికి రాత్రి లారీడు ఉప్పు చేప కావాలన్నా పంపిస్తాడు.

గం: అబ్బా!

భ: అవునండీ!.....ఆయన చాలా మంచి వాడండీ పాపం....

గం: పాపం... .ప్చ్! . ప్చ్!! నీకూ ఆయనకూ బేరం కుదిరినట్టుంది పాపం.

సు. (వచ్చింది.) ఇదిగో మామయ్యా, కాఫీ! (ఇచ్చింది. గంగాధరం తీసుకుని తాగేడు ఆమెని చూసి భద్రయ్య బెంచీ దగ్గర కూర్చుని కాగితాలు సరిచేయసాగేడు ) భద్రయ్యగారూ!

భ: అమ్మా...తమరు నన్నలా గారూ అనకండమ్మా... వాకదోలా ఉంటుంది.

సు: తప్పేవుందండీ?

భ: ఏదో మేస్త్రీగా పని చేస్తున్నవాణ్ణి నాకింత మర్యాద లెందుకండీ?

సు. ఉద్యోగా నిక్కాదు కదండీ ఈ మర్యాద!

గం: I concur........I Concur with you.

సు: మీచేత బియ్యం తెప్పించమన్నారు.

భ: అలాగే నమ్మా. వో బస్తా వేయించుకు రానా?

సు: చెప్పాను. (లోపలికి వెళ్లింది, కాఫీ కప్పు తీసుకొని.)

గం: భద్రయ్యా!

భ: బాబూ.....

గం: నీకు పిల్లలెంతమందోయ్?

భ: ఎంతో మందెక్కడండీ!—పరిమిత కుటుంబమో పరిమిత కుటుంబమో అని మా ఆవిడ ఒకటే గోల. నేనేమో అప్పుడే ఏం తొందర్లేవే అంటాను. అది వినదు. నేను వినవే అంటాను. కంట్రాక్టర్లు ఉన్నంతవరకు మన సంపాదనకు లోటేం లేదు; భయపడకే అంటాను. అబ్బ, ఏమోనండీ. నాకు భయం అంటుం దది. ఏం ఫరవా లేదు మరో నలుసు పుట్టిన తర్వాత ఆలోచిద్దాంలే అంటూ న్నేను. అమ్మో అని కళ్లార్పుతుం దది....

గం: ఇంతకీ ఎందరయ్యా బాబూ?

భ: ఎందరో ఎక్కడండీ!.....రామాపురం బ్రిడ్జికి ఎస్టిమేట్లు తయారుచేసేప్పు డనుకుంటాను మాలక్ష్మి పుట్టింది. ఇప్పుడా వంతెన పైకి లేచింది. ఎడ చంటోడికి ఏడ్దర్థం—అంతేనండి!

గం: అబ్బ! హరికథ చెబుతున్నావు కదయ్యా!.....అంతకుముందో?

భ: అంతకుముందు నా సర్వీసెంత బాబుగారూ!

గం: (చిరాగ్గా) సర్లే, కూర్చో....

భ. ఆ ..మొత్తం ఎంతమందని కదూ మీ రడిగేది. మొత్తం నలుగురు సార్! - ప్లస్ వన్, మైనస్ త్రీ. (వేళ్లు చూపాడు (వీళ్ల మాటల మధ్యలో సుశీల అక్కడికొచ్చి మధ్యటేబుల్

లోంచి తాళం చెవుల గుత్తి తీసుకుని లోపలి కెళ్ళింది. మురళి వచ్చాడు. వయస్సు పాతిక. (టిప్‌గా ఉన్నాడు. స్లిమ్‌గానూ ఉన్నాడు)

ము: Well: one minus three is always minus two, which represents a deficit. The deficit can be made up by adding two to the positive figure i. e. one. It is the only solution. (భద్రయ్య వైపు తిరిగి) అర్థమైందా? కాదులే!....ఈ ఉద్యోగపర్వం తోరణి మహా మహా కొమ్ములు తిరిగిన కాలేజీ లెక్చెరర్లకే అర్థం కాలేదు.

భ: నిజమే సార్ ...నా కర్థం కాలేదు.
(గంగాధరం మురళివైపు తదేకంగా చూడసాగేడు.)

ము: వెల్ సెడ్! అలా ఒప్పుకో. Be plain and frank man అది నిన్ను ఉద్ధరిస్తుంది. నే నన్నది అర్థం కాలేదు కదూ—అయితే చెప్తా విను—నీ కున్నది ముగ్గురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు. అంతేనా?

భ: అంతేనండీ! ఆ నలుగురికే ఇంక వద్దో యింక వద్దో అని ఒకటే గోల మా ఆవిడ.

ము: పూర్ వుమెన్! బహుసంతానవతికి యీ మధ్య అక్కడెక్కడో సన్మానం చేసి పర్సు బహూకరించారు. బహుశా మీ ఆవిడ కా వార్త తెలిసుండదు!—వెల్! ఆ నలుగుర్నీ సమానం చెయ్యటానికి. అర్జంటుగా నువ్వు మరో యిద్దరు మగ పిల్లల్ని యిాల్డ్ చెయ్యాలి.....తెలిసిందా?

భ: (సిగ్గు పడుతూ నవ్వేడు.)

ము: Not a joke man! నే చెప్పేది నిజమేనయ్యో—Be serious; try sincerely—success is yours
(సుశీల వచ్చింది: ఆమె చేతిలో చిన్న సంచీ వుంది. దాన్ని భద్రయ్య కందిచింది)

సు: ఇదుగోనండీ!

భ: సంచీ ఎందుకమ్మా?

సు: బియ్యానికి!

భ: బియ్యానికా?

సు: అవును. నాలుగు కిలోలు పెట్టకు తండి! (డబ్బులు యిచ్చింది.)

ము: వదినా! వాట్ ఈజ్ దిస్? పొట్టకే. జీ. ల రేషనే మనింటికి చస్తేం లెక్కనగానీ వచ్చేవి కావుగా బియ్యం? ఇవాళిదేవిటి?

సు: మీరు వెళ్ళండి భద్రయ్యగారూ!

గం: (పిల్చాడు) భద్రయ్యా!

భ: (ఆగి) సార్!

గం: మీ అమ్మాయిని లా చదివించవయ్యా!

భ: (స్మైల్లుగా చూస్తుండిపోయాడు.)

ము: Well said! గుడ్ విష్షెస్!—Accept! Accept!!
(భద్రయ్య ముఖ కవళికలు మారిపోయాయి. దీనంగా గంగాధరంవైపు చూస్తూ వెళ్ళిపోయాడు. గంగాధరం ప్రక్క గదిలోకి వెళ్ళాడు.)

ము: వదినా! ఏమిటీ అలా వున్నావ్?

సు: (పేలవంగా నవ్వి) ఏం, ఎలా వున్నాను?

ము: చెప్పనా?

సు: (కుతూహలంతో) చెప్పు.

ము: బ్లాక్ డ్రెస్సులో వున్న సినిమా హీరోయిన్‌లా వున్నావ్.

సు: భలేవాడివే. అదేం లేదు (ముఖం ప్రక్కకు తిప్పుకుంది. మురళి ఆ వైపుకి వచ్చాడు.)

ము: అయితే నాలుగు కిలోల బియ్యం తెప్పించటానికి ....

సు: కారణాలు నీ కెందుకుగ్గానీ నీ పని నువ్వు చూసుకో! (కుర్చీ లోంచి లేచి టేబిల్ దాకా వెళ్ళింది. రేడియో ఆన్ చేసింది. సన్నగా ఏదో మ్యూజిక్ రావడంతో కట్టేసింది.)

ము: అంతేనా? నా పని నేను చూసుకోనా! అయితే నా ప్రోగ్రాం చెప్తా విను! మంత్రిగారి సుపుత్రుడు చిరంజీవి రాంబాబుని కలుసుకుని నా ఉద్యోగం విషయం ముచ్చటించాలి. వారి మధ్య నాకు చాలా పోటీ వుంది. పోటీని సాధ్యమైనంత త్వరగా క్యాష్ చేసుకోవాలి. లేకపోతే రేపీపాటికి సన్ ఆఫ్ మినిస్టర్ కాస్తా సన్ ఆఫ్ అపోజిషన్ లీడర్‌గా మారిపోయే ప్రమాదం వుంది. ఈ కార్యక్రమానికి నీ సహాయం కావాలి!

సు: నా సహాయమా?

ము: అవును. చిరంజీవి రాంబాబుని మనింటికి ఆహ్వానిస్తాను. అతనికి చిన్న పార్టీ యిచ్చి ఖుషీ చెయ్యాలి.

సు: పార్టీనా?

ము: ఊ!.....పార్టీల్లో మాత్రమే మన కోరిక మన్నిస్తుం టారు వీళ్ళంతా.

సు: నా కిలాంటి వాటిపుడే నచ్చవు.

ము: నాకు తెలుసు. కానీ, నా ఫ్యూచర్ కోసం నువ్వే సహాయం చెయ్యాలి.

సు: మీ అన్నయ్యగారితో చెప్పు.

ము: నో, నో, నో. అన్నయ్య మోస్ట్ ఇరిటబుల్.....ఏ సమయంలో ఏ మూడ్‌లో ఉంటాడో వాడికే తెలియదు. అందుకని నేను చెప్పను. నువ్వే వీలోగో...

గం: మీరు దీ చిరంజీవి వడుగు! పోనీ లిఖ్యసరతి తేలిక్కాదు గదా, పాటీని నెరవేర్చి చూపటం.

ము: వెల్! అయితే అతన్తో మాట్లాడొస్తాను.
(మురళి వెళ్ళిపోబోతుండగా శంకరం వచ్చేడు. అతడు మురళి

ఫ్రెండ్. ఇద్దరిదీ ఒకే వయస్సు, సామాన్యమైన దుస్తులు. మని షిలో మోడెస్టీ వుంది. కళ్లు బిరువుగా క్రిందికి వాలి పోతున్నాయి. మనుషుల కళ్లల్లోకి చూసి మాట్లాడలేడు.)

శం: ఎవరి దర్శనార్థం ప్రయాణమవుతున్నావ్?

ము వచ్చేశా? ఇహా మన పని పూర్తయినట్టే.

శం ఇదేవి టక్కయ్యా, ఇలా మాట్లాడుతాడు?

సు. మురళికి సూపర్‌స్టిషన్స్ జాస్తి! నీ శకునం మంచిదీ కా దనేమో అతని అభిప్రాయం.

ము వెల్‌సెడ్! సరియైన అంచనా. నా థాట్స్ రీడ్ ఔట్ చేసేశావు వదినా! (శంకరాన్ని ఉద్దేశించి) అప్పుడ్నా పోయినా. నేను మురదుకి పోదాంరా అంటే నువ్వో అలవ్మైల వెనక కురుటుతూ వుంటావ్. రెండు రెక్కల్లోనూ ఎగిరితేనేగాని పైకి పోలేంరా భాయ్ అంటే...

శం: ఎగిరెగిరి పడితే ఎగతాళికి గురవుతావుతా అంటాను. అంతేగా?

ము: ఎగ్జాక్ట్లీ! అదే నీ తత్వం. which of course I don't like.

సు: (నవ్వి) ఇప్పుడు నచ్చకపోయినా అనుభవంటోటి నేర్పుతుంది మురళీ.

ము: How!...How.

శం: నిజం నిష్కర్షంగా వుంది; నిలకడమీద ప్రూఫ్ అవు తుందిరా. మినిష్టరుగారి చిరంజీవిని వూసుకు తిరిగినా, చైర్మన్‌గారి బాబ్జీతో చేతులు కలిపినా వాళ్లరితా నిన్ను ఉద్ధరిస్తారని ఆశించడం—కేవలం ఆశ మాత్రమే. నీ మంచి కోరి ఇలాంటివి చెప్తూ వుంటాగాని, నిన్ను డిస్కరేజ్ చెయ్యాలని కాదు.

ము: వెల్! నీ హితబోధకు నా థ్యాంక్స్?

సు: అంతవరకూ శంకరం ధన్యుడే. శంకరం! మురళికి ఉద్యో గంలో చేరిపోవాలని మహా ఆతాతురంగా వుందిగానీ; నీ ఎరి కలో ఎక్కడన్నా ఖాళీలుంటే చెప్పు.

ము: (నవ్వేశాడు.) భలే దానివి వదినా! శంకరం ఏ ఆఫీసులో అను కుంటున్నావా? వాడు చేస్తున్న ఉద్యోగం... ఏందుకుతే.... ఫ్!

శం: (నొచ్చుకున్నాడు.) అవున్నా మురళీ! నువు పైకి అనకపోయినా నేను చెబుతున్నాను. నేను నాలో తరగతి ఉగిద్యోని. (విచారం కమ్మేసింది). కాలేజీలో చదువుకునే రోజుల్లో నేనూ జీవితాన్ని గురించి బంగారు కలలే కన్నాన్రా మురళీ. బియ్యే పూర్తయితే చాలు మూడంకెల జీతం ఋచ్చే ఆఫీ సరుద్యోగాలు మనకోసం కాసుకుక్కొర్చుంటాయనీ, అంద మైన భార్య, కారు, సిటీ జీవితం...ఇవన్నీ మన బతుకువుతా యనీ ఎన్నో ఆశలు, విన్నెన్నో భావాలతో బ్రతికేను. తీరా కాలేజీ వదిలి బ్రతుకులోకి ప్రవేశించగానే తెలిసింది, ఊహా లోకాల్లో సృష్టించుకున్న స్వర్గమంతా పొగమంచు కల్పించిన చిత్రమనీ, అంచెలంగా నిర్మించుకున్న బంగారు సౌధమనీ, గాలిలో కట్టుకున్న పేక మేడ అనీ అర్థ మైంది.

రోగంతో తీసుకుంటున్న అమ్మ, పెళ్లి కెదిగి కూర్చున్న చెల్లెళ్లు, చదువుకుంటున్న తమ్ముడు—వీళ్లంతా నా కళ్లలో తమ ఆశల స్వరూపాల్ని, బ్రతుకుల ధ్యేయాన్ని వెతుక్కుంటూ నా ముందు నిలబడ్డారు. What to do అనేదికాదు నా సమస్య! to do or not to do అనేదే ప్రశ్న.

వాస్తవం వెన్ను చరిచింది. కర్తవ్యం కళ్లకి కట్టింది. ఫలితంగా ఉద్యోగి నయ్యాను. కాకుంటే నువ్వన్నట్టు ఆఫీ సర్ని కాలేదు. వట్టి క్లాస్ ఫోర్ ఉద్యోగినయ్యాను. మురళీ. (కళ్లలో నీళ్లు తిరిగాయి. స్వరం గాద్గదికమైంది.)

సు: (కుర్చీలోంచి లేచి శంకరం దగ్గరగా వచ్చింది. అతనిభుజం తట్టింది.) అక్కో; అక్కా అంటూ తమ్ముడు లేని కొరత తీరుస్తుంటివే శంకరం, మీ అక్క ఎప్పుడైనా యిలా కంట తడిపెట్టడం చూశావా?...చేసే ఉద్యోగంలో లేదు తమ్ముడూ ఔన్నత్యం, మనిషి వ్యక్తిత్వంలో వుంది.

ము: వెల్! వెల్‌సెడ్! సరికొత్త సిద్ధాంతం (మాట మారుస్తూ) ఏరా శంకరం మీ అక్కయ్య వోదార్పు మాటలు వింటూ కూర్చోవటమేనా, బయట కొచ్చేదేమైనా వుందా?

శం: ఇదిగో వచ్చేస్తున్నా.

గం: (లోపల్నించి వచ్చేడు. అతని చేతిలో పొడుగుపాటి బెంచీ వుంది: దాన్ని సరిచేస్తూ తలపాగా చుట్టుకునే ప్రయ త్నంలో ఉన్నాడు) మురళీ! (మురళి ఆగి ఏమిటన్నట్టు చూశాడు.) దోస్తూరి శరదాకటిలా ఇంగ్లీషులో మాట్లా డరా...

ము: (మొహమాట పడి) ఏవున్నాయ్ మాట్లాడటానికి? ('అమ్మగారూ, నే వెళ్తున్నా' అన్న పనిమనిషి కేక పెర ట్లోంచి వినిపించింది. సుశీల చిరునవ్వు నవ్వుతూ అక్క ణ్ణుంచి వంటింట్లోకి వెళ్లిపోయింది)

గం: (మరో లోకంలో పడ్డాడు). ఏవీ లేకపోతే వెళ్లు! (మురళీ, శంకరం పాకిట్లోకి నడిచేరు) 'One minus three is always minus two, which represents a deficit. The deficit can be made up by adding two to the positive figure i. e. one'—హా ఉన్నట్టు ఆ ఉచ్చారణ, వేగం, ధోరణి నాకేం వస్తాయ్? (కుర్చీలో కూర్చున్నాడు. సొరుగు తెరిచాడు. దాన్లోంచి ఓ పెద్ద రౌండ్ బుక్ తీసేడు. తెరిచి చదువసాగేడు.) వక్తృత్వం, తర్కం, సమయస్ఫూర్తి, చమత్కృతి—ఇవన్నీ అల్లాడి

సొత్తు. (ఆగేడు. కుర్చీలో వెనక్కి వాలి కప్పు వైపు చూపులు మరల్చి ఆలోచనలో పడ్డాడు.)

భ: (వచ్చేడు. చేతిలో బియ్యపు సంచీ వుంది.) కేజీరేటొకటి, క్వింటాల్ రేటొకటి, లారీ రేటొకటి, ఇందులోనే మళ్లీ, వెలుగురేటు, చీకటి రేటు బ్లాకు వైటు.. ఇనుముకీ ఉక్కుకే అనుకున్నా, బియ్యానికీ అంటుకుందీ జబ్బు!

గం: (ఉలిక్కిపడి) జబ్బా? ఎవరికి, ఎక్కడ, ఏం జబ్బు, ఎలా వుంది?

భ: బాబుగారూ! ఏవిటా ఖంగారు?

గం: జబ్బంటూ వుంటివి!

భ: (నవ్వి) నే నంటున్నది బ్లాకు మార్కెట్టూ, కంట్రోలు రేటూ గురించి బాబూ! ఎవరికీ ఏ జబ్బూ లేదు!

గం: లహ!.....అలాగేం? ఎవరికీ జబ్బు లేదూ? మా తల్లి సుశీలకీ జబ్బు లేదా?

భ: (నాలిక్కరుచుకుని విచారంగా ముఖం పెట్టాడు.)

(సుశీల వచ్చింది. భద్రయ్య మౌనంగా బియ్యపు సంచీ ఆమె కిచ్చేడు.)

సు: (ఇద్దరివైపు పరీక్షగా చూసి) ఏవిటి భద్రయ్యగారూ, అలా వున్నారేం?

భ: ఏవీ లేదమ్మా—

గం: నే చెప్తాను వినమ్మా! భద్రయ్య ఎవరికీ ఏ జబ్బూ లేదని వో జనరల్ స్టేట్‌మెంట్ పడేస్తేనూ, నీ సంగతి అడిగేను.

భ: బాబుగారూ! (వారించాడు)

గం: నువు నిజం చెప్పు సుశీలా: నీకేవీ అనారోగ్యం లేదా?

సు: (నర్వస్‌గా నవ్వి) లేదు మామయ్యా....నిజంగా .. నేను లక్షణంగా ఉన్నాను!(సంచిలో బియ్యం గుప్పిట్లోకి తీసుకుని చూసింది. కొన్ని గింజలు, టేబిలు మీద పడతాయి.)

గం: అవును. నువు చాలా లక్షణంగా వున్నావు తల్లీ—అందంగా కనువిందుగా నీటిని పీల్చి దాచుకునే స్పాంజిలా రోగాన్ని నీలో దాచుకుని జీవంలేని నవ్వు నవ్వుతూ చాలా ఆరోగ్యంగా వున్నావమ్మా సుశీలా, చాలా ఆరోగ్యంగా ఉన్నావు.

సు: (దుఃఖం పొంగుకొచ్చింది. కాని ఆమె దాన్ని పెదవులమీదా, కనుకొలకుల్లోనూ బిగించింది. మాట మారుస్తూ)భద్రయ్యగారూ, డబ్బులు సరిపోయాయా?

భ: సరిగ్గా సరిపోయాయండి. నాలుక్కిలోలు నాలుగూ నలభై పైసలు.

(సుశీల మౌనంగా లోనికి వెళ్లిపోయింది)

గం: భద్రయ్యా, మా కోడలుకి నువు మందుతెచ్చి ఎన్నాళ్లయిందయ్యా?

భ: వార మవుతోందేమో నండీ. మొన్నొక రోజున అడిగితే 'వద్దు, ఇప్పుడు వంట్లో బాగానే వుందన్నా'రండి.

గం: (బాధగా) అంటుంది భద్రయ్యా. ఆవిడ అలాగె అంటుంది.

రాజా. (చాలా విసురుగా వచ్చి) సూదల్లే రావడం,దబ్బనాల్లా తయారవడం!... ఛీ! ఛీ!!...ఏం మనుషులో!—భద్రయ్యా! భద్రయ్యా!!

భ: అయ్యా!

రా. ఏవిటయ్యా నువు చేసింది? సూపర్‌వైజర్ని నేనా, నువ్వనుకున్నావా?

భ: ఏం జరిగింది సార్?

రా: పేనుకు పెత్తనమిస్తే ఏదో చేసిందిట! ట్యాంక్ వర్క్‌ని చూసిరావయ్యా అంటే కంట్రాక్టరు కనకారావుతో ఏం చెప్పావ్?

భ మరేమోనండీ...(నీళ్లు నమిలాడు)

రా: నేను అలా చేయనన్న పనిని కంటిన్యూ చేయిస్తావ్? ఏవిటయ్యా నీ ధైర్యం... పిచ్చి పిచ్చి చేష్టలు చేస్తే కావ్ంగా ఇంటికి పంపించెయగల్ను. Be careful! Dirty **nonsence!** హద్దులు తెలుసుకుని ప్రవర్తించటం చాలా మంచిది.

భ: (బెరుగ్గా దిక్కులు చూడసాగేడు.)

గం: మంచి మాట చెప్పావురా. హద్దులు తెలుసుకుని ప్రవర్తించటం చాలా మంచిది.

రా. నాన్నా! (అరిచేడు.) మీ కక్కుర్లేని విషయాల్లో కలగజేసుకోకండి! (భద్రయ్య నుద్దేశించి) కృష్ణాపురం స్కూలు బిల్డింగ్ ప్లాన్ ఏం చేశావు? అయిందా?

భ: ఇంకా కాలేదండీ...వాళ్లెవరూ రాలేదు కదండీ?

రా. ఏం, వాళ్లెవరైనా వస్తేగానీ పూర్తికాదా?......చెప్పిన పని చెయ్, ఎదురు ప్రశ్నలు వెయ్యకు.

భ: నేనేం ప్రశ్నలు వేశానండీ?

రా. **I say don't argue, Do it; that's all.**

భ: అలాగేనండీ.

రా: ఇదిగో రఫ్ స్కెచ్. (డైరీలో నుంచి కాగితంలాగి విసిరేడు. టేబిల్‌మీద బియ్యపు గింజల కనిపించాయి.) బియ్యం తెచ్చావా?

భ: అవునండీ....నాలుక్కేజీలు.

రా.— (అతని వైపు అసహనంగా చూసి అరిచేడు.) సుశీ! (మళ్లీ గట్టిగా) సుశీ!! (సుశీల వచ్చింది. భద్రయ్య బెంచి మీద కూర్చుని కాగితాలు పరిచేయసాగేడు. గంగా

ధరం టేబుల్‌మీది శాండ్‌స్టోన్ తీసి ఒకదానితో ఒకటి టకటకలాడిస్తూ చిత్రంగా ఆడుకుంటున్నాడు)

రా:— బియ్యం తెప్పించావా?

సు:— అ.....

రా:— ఎన్ని?

సు:— నాలు క్కిలోలు.

రా:— ఏం?

సు:— చెప్పాను గదా! ఆ నాలుక్కిలోలకే చిల్లర పోగుచేసి యివ్వాల్సి వచ్చింది. డబ్బులేదు.

రా:— డబ్బు ........ డబ్బు .. .డబ్బు!!! ఒకటే ఏడుపు ఉన్నది ఖర్చు చెయ్యమంటే ఉలకవు, పలకవు డబ్బు లేదని పండగరోజున పచ్చడి మెతుకులు పడేస్తావ్. డబ్బులేదని మాసిన చీరెలో రోజులు గడుపుతావ్. డబ్బు లేదని ఇంటిఖర్చుల్లో పొదుపు చేస్తావ్...... డబ్బులేదని... (ఆగేడు. బాధగా అన్నాడు.) మందుకూడా తినవు. భద్రయ్యా ..మందు తెచ్చావా?

భ:— వద్దన్నారండి.

రా:— ఏం?

సు:— నాకు మం దెందుకండీ?

రా.— అక్కర్లేదు. తిండి తినకుండా, మందు తాగకుండా నన్ను సాధించు.

సు:— మిమ్మల్ని సాధించటమా?

రా:— భద్రయ్యా! నువ్వెళ్ళి మందు పట్టుకురా.

భ:— అలాగేనయ్యా.

సు— భద్రయ్య గారూ! మీరు వెళ్ళక్కర్లేదు. మీపని చూసుకోండి.

భ:— అలాగే నమ్మా.

రా:— చెప్తున్నది నేను, వెళ్ళిరా.

సు:— వెళ్ళినా ఆ డాక్టరుగారు నాకింక మందివ్వరు.

రా:— ఎందుకని?

సు — అంతే లెండి! (వంటింటి వైపు నడిచింది.)

రా.— మొండితనం, పెంకిఘటం. (లోపలికి పోబోతూ ఆగి) భద్రయ్యా సాయంత్రం డాక్టర్ రమణరావు దగ్గరికి ఒకసారి పోయొద్దాం. గుర్తు చెయ్.

భ:— అలాగే నండి.

రా:— (లోపలికి వెళ్ళి పోయాడు.)

గం:— (రెండు రాళ్ళనూ విడి విడిగా రెండు చేతుల్లోకి తీసుకున్నాడు.) ఇది ఆదర్శం, ఇది ఆచరణం. (రాళ్ళని చేతులు మార్చి) ఇది ఆచరణ, ఇది ఆదర్శం. (కొట్టేడు) ఇది ఈ రెంటికీ ఘర్షణ. సంఘర్షణ! ఎక్కడెక్కడ సంఘర్షణ వుందో, అక్కడక్కడల్లా వో కేసు వున్నట్టే, ఎక్కడెక్కడ కేస్ వుందో అక్కడక్కడల్లా మనవూ వుండాల్సిందే. (లేచాడు. కుర్చీని దులిపేడు. టేబుల్ మీది వస్తువుల్ని ప్రక్కకి సర్దేడు స్టూల్‌ని తీసికెళ్ళి వోమూలగా వుంచాడు. ఆవురించటంలో దాన్ని తల్లక్రిందులు చేసి వుంచేడు. కుర్చీ మీది కోటు తొడుక్కుని చొక్కాకాలర్ సరిచేసుకున్నాడు. తలపాగా పెట్టుకున్నాడు, భద్రయ్య దగ్గరకొచ్చి) భద్రయ్యా, రావయ్యా!

భ:— ఎక్కడికి బాబూ?

గం:— చెప్తానుగా రావయ్యా! భద్రయ్యని చేతులు పుచ్చుకుని తీసుకొచ్చి కుర్చీలో కూర్చో పెట్టాడు.

భ:— బాబూ!

గం.— (టేబుల్ ముందుకొచ్చి ప్రేక్షకులకు ఎదురుగా నిలబడ్డాడు. ఉపన్యాసం మొదలెట్టేడు.) మైలార్డ్! ఈ కేసు చాలా చిత్రమైనది. ఇదిగో చూడండి. (రాళ్ళు తీసేడు.) ఇది ఆదర్శం, ఇది ఆచరణ, ఆదర్శానికీ ఆచరణకీ పొత్తు కుదరటంలేదు. సూచనా ప్రాయంగా ఆదర్శం చెప్పే ఏమాటా ఆచరణకి నచ్చదు. ఆచరణ చేసే ఏ పనినీ ఆదర్శం హర్షించదు. ఒకదానితో ఒకటి పోటీ పడ్డాయ్. ఘర్షణ ప్రారంభమైంది! గొప్ప సంఘర్షణ!

భ: బాబుగారూ! ఏవిటిసార్ ఇదంతా? (లేవబోయాడు )

గం. కదలకు మరి. జడ్జీగారు లేస్తే బెంచ్ లేవాలి. బెంచ్ లేస్తే లాయర్లు లేవాలి. లాయర్లులేస్తే ప్రేక్షకులు లేవాలి. **Don't move. Don't disperse.** కేస్‌లో ఆర్గ్యుమెంటు వినకుండా వాయిదావేసే నిరంకుశ ధోరణి నశించాలి... కూర్చో! (బలవంతంగా కూర్చోబెట్టాడు ) ఈ సంఘర్షణలో వాది ప్రతివాదు లిద్దరూ సమాన దోషులే కనుక (ఆగేడు. ఆలోచించేడు) కనుక ఏం చేయాలి?—

భ: కేసు విచారణకి సాక్షు లేరీ? మీ రెవరినైనా సాక్షులుగా విచారించదలచుకుంటే వారిని పిలిపించండి!

గం: కరెక్ట్! ... ఆదర్శాన్నీ, ఆ చ ర ణ నీ నడిపిస్తున్న నీతీ నిజాయితీల్ని సాక్షులుగా బోనెక్కించటానికి అనుమతి దయచేయించండి.

భ: **Permission granted.**

గం: యస్! నీతీ! (పిలిచాడు) నీతీ, నువు బోనెక్కు. (స్టూల్ వైపు చేతిని చూపేడు. సరిగ్గా ఆ సమయానికి రాజారావు లోపల్నించి వచ్చాడు. అతను లుంగీ కట్టుకుని

ఉన్నాడు అప్పుడే స్నానం చేసి వచ్చాడు. భుజంమీద టవల్ వుంది.)

రా: భద్రయ్యా! ఏవిటది? ఆయనతోపాటు నువ్వూ ఆడుకుంటున్నావా? (భద్రయ్య కంగారుగా పరిగెత్తుక్కుని పోయి బెంచీ మీద కూర్చున్నాడు) నేను చెప్పి పోయిందేమిటి, నువు చేస్తున్న దేమిటి? మనిషి కొక మాటన్నారయ్యా! ఆయన కెలాగా పనిలేదు. నువ్వూ ఆయనతోపాటు లెక్కెక్కతావా యేం?

గం: (చిత్రంగా నవ్వి పాడేడు.) బయలుదేరి బండెక్కినంతనే బసకు చేరగలవా?

రా: ఆపండి! (విసుగ్గా రేడియో ఆన్‌చేసి లోపలికి వెళ్ళాడు... 'మారాలి మారాలి మనుషులు మారాలి' అనే పాట వస్తోంది. రాజారావు విసురుగా బయటికి వచ్చి రేడియో ఆఫ్‌చేసి వెళ్ళిపోయాడు.)

గం: (మళ్ళీ పాడేడు) చింతచెట్టు చిగురు చూడు, చిన్నవాడి పొగరు చూడు

రా: (లోపల్నుంచే) సుశీ! పెరట్లో చింతచెట్టు క్రింద ఈయన కో మంచం వెయ్యి.

సు: (వచ్చి) స్నానం చేద్దురు గాని, రండి మావయ్యా

గం: అలాగే నమ్మా, పద! (ఇద్దరూ దొడ్లోకి వెళ్ళారు.)

భ: (గీస్తున్న ప్లాన్‌ను ప్రక్కకు పెట్టి, పెన్సిల్ తీసి చేతిలో పెట్టుకున్నాడు.) అయ్య ఆ తీరు, కొడుకు ఈ తీరు!... పొద్దస్తే అయ్యగారు బజారు కెళ్తోన్నారుగా, అయ్యరు హోటల్లో కలిసే వుంటాడు రామనాథం, వాడి బ్రాంచా ఫీసు అదేగా! అయ్యగారికీ రామనాథానికీ భేదం కుదిరుంటుంది. దాంతో కృష్ణాపురం స్కూలు బిల్డింగ్ ప్లాన్‌కి కాలం తోసుకొచ్చింది. రామనాథం జిత్తులమారి నక్క. పైవాళ్ళని మెప్పటానికి వెనకాడడు గానీ, చిల్లర దేవుళ్ళంటే చిరా కెక్కువ. 'అసలు విగ్రహాలు నా చేతిలో వుంటే, ఉత్సవ విగ్రహా లెలా పోతే యేం?' అనుకునే మనిషి... ఏది ఏమైనా ఈ వ్యవహారంలో మన నోట గడ్డే! ఛీ...ఛీ... ఉత్సాహవి చేయాలంటే ఉత్సాహ మేముంటుంది?

ము: (వచ్చాడు. అతని చేతిలో కాగితాల మడత వుంది.) Well said! ఉండదు, ఉండకూడదు, ఉండరాదు— అనలెందు కుండాలనీ! వెల గిట్టని పని వెలా తెలా పోతూనే వుంటుంది. The work for which no remuneration is offered or no incentive is provided for always suffers from lack of quality and turnover. తీరి నా మజాకా! అందుకనే కదా నాలాంటి వాళ్ళంతా పెద్దపెద్ద జీతాలున్న ఉద్యోగాలకోసం భూమ్యాకాశాల్ని కదిలించడం! Yes! we are moving earth and heaven.

రా: (వచ్చి కుర్చీలో కూర్చుని బూట్‌లేసెస్ వదిలేసుకుంటూ అన్నాడు) ఏరా! ప్రెసిడెంటుగార్ని కలుసుకున్నావా?

ము: వోహ్! I am sorry. నాకు గుర్తులేదు.

రా: ఎందు కుంటుందిరా? మినిష్టర్‌గారి చిరంజీవితో కలిసి తిరుగుతున్నావ్‌గా! సినిమాలకు హోటళ్ళకు పార్టీలకూ తిరిగితే చాలదురా, తెలివిగా పని గడుపుకోవటం నేర్చుకోవాలి... వాళ్ళసలే కాలికి వేస్తే తలకు, తలకు వేస్తే కాలికీ ముడి పెట్టే రకాలు. అలాంటి ముళ్ళు పెట్టటం చేతొచ్చిన వాళ్ళ దగ్గర సీటు ముడి వేసే ట్రిక్కుండటం చాలా అవసరం. Remember it.

ము: నాలుగ్గైదు పోస్ట్సు వేకెంటుగా వున్నట్టు తెలిసింది. అప్లై చేస్తున్నాను. ఇదిగో ఫారమ్స్.

రా: (వాటి నందుకోకుండానే) That is all right. (కుర్చీ లోంచి లేచాడు. టేబిల్ దాకా నడిచి దాని సొరుగు లాగి ఏదో వస్తువుకోసం వెతికాడు. కనిపించలేదు.) సుశీ! .... సుశీ!!

సు: (వచ్చి) ఏవిటండీ?

రా: ఏవిటండీ అని ముచ్చటగా అడుగుతావు. చెప్పిన మాట వినవ్. చెయమన్న పని చెయ్యవ్ . నా గ్లాసెస్ ఏవీ?

ము: (కుర్చీలో కూర్చుని ఫారం పూర్తి చెయ్యటంలో నిమగ్నుడయ్యాడు.)

సు: ఇక్కడ లేకపోతే గదిలో వుంటాయ్! (గదిలోకి వెళ్ళింది తిరిగొచ్చింది. చేతిలో కళ్ళజోడుంది!) ఇదిగో! (జోడు అతని చేతికిస్తూ డొక్కలు పట్టుకుని 'అబ్బా!' అనుకుని బాధతో మెలి తిరిగి పడిపోబోయింది. తూలుతూ వెళ్ళి కుర్చీలో కూలబడింది.)

ము: (హడావిడిగా లేచి) వదినా, ఏవిటి?

భ: ఏవి టమ్మగారూ?

రా: (దగ్గరగా వచ్చి ఆమె కేసి చిరాగ్గా చూసేడు.) ఏవుంటుందీ! మళ్ళీ నొప్పి వచ్చింది కాబోలు — మందు తినమంటే చేదు డాక్టరికి చూపించుకోమంటే విషం. ఉండుండి వోసారి అబ్బా, అమ్మా అంటూ ప్రకంగ తీసుకుపోవటం... ఛీ! ఛీ! ఏం మనిషో!

ము: (అరిచేడు) అన్నయ్యా! ఏవిటా మాటలు? వదిన బాధతో గిలగిల లాడుతుంటే చీదరించు కుంటున్నావా? What a man you are?...భద్రయ్యా! డాక్టరుగారిని పిలుచుకురా!

సు: (వద్దన్నట్టు చేయి చూపింది. మంచి నీళ్ళు కావాలన్నట్టు సైగ చేసింది. మురళి కూజాలో నీళ్ళు గ్లాసులోకి వంచి తెచ్చాడు.).

రా: చూసేవా ఆ మనిషి మొండితనం? ఇప్పుడు కూడా అదే పంతం! చావనీ! చెప్పినా వినని మనుష్యుల్తో ఎవ రేడుస్తాడు?— భద్రయ్యా! నేను హెడ్‌క్వార్టర్స్‌కి పోతున్నా, రాత్రికి గానీ రాను. ఈలోగా నువ్వా ప్లాను పూర్తిచేసి ఎస్టిమేట్ వెయ్.

భ: అలాగేనండి!

రా: (భార్య వైపు మరోసారి చూసి వెళ్లిపోయాడు)

సు. (కళ్లల్లో నీళ్లు తిరిగాయి.)

ము: ఇప్పు డెలా వుంది వదినా?

సు: చాలా హాయిగా, సంతృప్తిగా వుంది మురళీ.

ము: వదినా! అన్నయ్య మాటలకి బాధ పడుతున్నావా?

సు. పిచ్చి మురళీ, బాధ పడటమా? కాదు అపూర్వమైన ఆనం దాన్ని అనుభవించినట్లు, అవ్యక్తమైన అనుభూతిని పొంది నట్లు ఫీలవుతున్నాను.

ము. (నిర్వేదంగా చూస్తూ కూర్చున్నాడు.)

సు: (బాధ నుండి తెప్పరిల్లుకుని) ఆ కాగితాలన్నీ ఏమిటి మురళీ?

ము: అప్లికేషన్ ఫారమ్స్ వదినా!

సు: మినిస్టరు గారబ్బాయి ఏమన్నాడు?

ము: రేపు ఆదివారం మనింటి కొస్తానన్నాడు.

భ. అయితే మురళిగారి పంట పండిందన్నమాటే ఈ ఉద్యోగాల్లో తప్పకుండా ఏదో ఒకటి మీ కొస్తుందండి!

ము: Correct, well said. రావాలి, వచ్చి తీరాలి, ఎవడికోసం యిస్తారయ్యా! మురళి బి. ఎ. ఎదిన్ బ్రాకెట్స్ (ఎం. ఆర్.) అని కనిపించగానే అపాయింటెడ్ అని రాసె య్యాల్సిందే.

భ: యం. ఆర్. అంటే ....

ము. అంటే, మినిస్టర్ రికమెండెడ్ అని అర్థం.

ము: 'మామూలు రావాలి' అనుకున్నారంటే అదే అప్లికేషన్ మీద 'నాట్ సెలెక్టెడ్' అని అడ్డంగా రాసి పారేస్తారు.

సు: పో వదినా .... నువ్వెప్పుడూ యిలాంటి అనుమానాలే కల్పి స్తావ్.

భ: అమ్మగారిదీ చాలా తెలివైన ఆలోచనే!

గం: (వస్తూనే) అందుకనే మా సుశీల కీ బాధలన్నీ—

## [లైట్స్ ఆఫ్]

(గడియారం టకటక లాడటంతోపాటు ఒక కంఠస్వరం వినిపిస్తోంది. అజేయమైన విధి రూపంలో శక్తివంతమైన కాలం గడు స్తోంది. ఆదివారాలు వస్తున్నాయ్, పోతున్నాయ్. గంగాధరం తన లోకంలో తాను బ్రతకటంలో మరికొంత ముందుకు వెళ్లాడు. రాజారావు ఆచరణకీ, సుశీల ఆదర్శానికీ ప్రారంభమైన ఘర్షణ తీవ్రతర మవుతోంది. మురళి తన కోరికల్లో సఫలీకృతుడవటానికి ఎన్నోవిధాల ప్రయత్నిస్తూనే వున్నాడు— .....)

## [లైట్స్ ఆన్]

(మురళి, శంకరం వున్నారు స్టేజిమీద. మురళి చేతిలో కవరుంది. దానివైపు పరీక్షగా చూస్తూ లోపలి పుత్త రాన్ని తీసి చదివి లోపల వుంచుతాడు.)

శం: నే నిన్ను దెప్పుతున్నా ననుకోకు. పర్యవసానం యిలా వుంటుం దని వూహించే గతంలో నీకు కొన్ని హెచ్చరికలు చేశాను.

ము: Don't try tosympathise with me శంకరం! నాకు సానుభూతి వద్దు. ఎందుకంటే అది పిరికి వాళ్లకి tonic. నేను పిరికివాణ్ణి కాదు. You must know this శంకరం! You must know this!!

శం: పిరికివాడివి కాకపోవచ్చు గాని దెబ్బతిన్న మనిషివి.

ము: నో! కాదు. కానే కాదు, నేను ఏ దెబ్బా తినలేదు.

శం: బుకాయించకురా మురళీ! నువ్వు జీవితంలో గట్టి దెబ్బతిన్నావు.

ము: లేదు శంకరం, లేదు.— మినిష్టరుగారి చిరంజీవి, ఛైర్మన్ గారి చిట్టిబాబూ నన్ను నట్టేట ముంచారని నేను బాధ పడటం లేదు. అసలు ఆ మురళితత్వంలోనే లేదు రేయ్ శంకరం. నువు నన్ను మాత్రం అర్థం చేసుకోలేదురా? You know Mr. Sankaram — మా అమ్మ పోయి నప్పుడు నేనేం చేశానో నీకు తెలీదురా! ఆవేళ నా కే విచా రమూ కలగలేదు. ఆవిడ్ని దహనం చేసిన రాత్రే నేను సెకండ్ షోకి పోయాను. .... అవును ఎందు కలా ఆశ్చర్యపోతావ్?

శం: ఆ బాధని దిగమింగటానికి పోయుంటావ్!

ము: No. Not at all. నా కప్పుడు ఏ బాధా, దుఃఖమూ లేవు.

శం: నీ ప్రవర్తనకీ మనస్తత్వానికీ పొత్తు కుదరటం లేదన్న మాట.

ము. అది నీ deduction Mr. Sankaram. — నో చిన్న రహస్యం చెప్తా విను!....గీత రా.... ఇదిగో! (అరచేయి, నుదురు చూపేడు) ఇక్కడా, ఇక్కడా రాసిన గీతప్రకారం అన్నీ జరిగిపోతాయ్ రా.

శం: అయితే అన్ని ట్రయల్స్ ఎందుకు చేసినట్టు?

ము: సరియైన ప్రశ్నరా శంకరం. I want this question. I must...I must give an answer to it. ఓరేయ్ శంకరం— నా ప్రయత్నాలకీ, పథకాలకీ వెనుక వున్న అంతర్యం వేరురా. నా ఆకాంక్షకూ, ఆశాభావానికీ అట్టడుగున వున్న ప్రోద్బలం వేరురా, అది మమతకూ, మమకారానికీ సంబంధించిందిరా. అది బాధ్యతకూ బుణా నికీ సంబంధించిందిరా. ఆరని ఆరాటంరా అది. మరొక

మనిషి కలని నిజం చెయ్యాలన్న తపనరా అది. **You don't know it Sankaram, you, don't know it.** ఆ **respect** లో నేను ఓడిపోయా(నా శంకరం. **I pity myself, I pity him also, I pity him also.**

శం: ఏమైనా ఫలితం మన చేతులో లేదని తేలింది.

ము: **Don't be silly** శంకరం. **Life is full of chances** రా భాయ్. ఇవాళ ఈ అవకాశాలు తప్పిపోయాయి. రేపు మరికొన్ని రావచ్చు. దొరికితే మనం వాటిని అంది పుచ్చుకోవటమే. దొరక్కపోతే వో నిట్టూర్పు, వో చిరునవ్వూ వుండనే వున్నాయ్.

శం: మొత్తానికి ఇప్పటికి భూమ్మీదకు దిగారు అబ్బాయిగారు.

ము: నీ సంతృప్తికోసం నువ్వు అలాగే అనుకో.

శం: ఏదీ ఆ కాగితం?

ము: ఎందుకీ చర్విత చర్వణం? ఏ కాగితంలో చూసినా ఒక్కటే ఒక్క వాక్యం, **«We regret to state that you have not been selected** అవటాని.

గం: (వచ్చేడు. అతని చేతిలో న్యూస్‌పేపరు వుంది.) చెబితే వినడు, కొడితే ఏడుస్తాట్ట నీలాంటివాడు. చిలక్కి చెప్పినట్టు చెప్పాను, 'ఈ బోడి బి. ఏ.తో ఏ వవుతుందిరా?' అని. వింటేనా? పెద్ద మనుషులు కాని ఆడపిల్లలు కూడా ప్యాసై పోతున్న బి. ఏ. చదివి ఏం సాధించగలవురా అంటే, తల తాటించారు అన్నా తమ్ముడూను ఆనాడు. ఇప్పుడో....

శం: **Bad luck** మామయ్యగారూ! మురళికి సెలెక్షన్ వచ్చేదే, తప్పిపోయింది.

గం: జూదం అచ్చిరాదురా శంకరం!

ము: అవు న్నాన్నా జూదం అచ్చిరాదు......శంకరం! పోదాం పద

శం: వెళ్దాం పద అదీ (ప్రయత్నిద్దాం. (ఇద్దరూ బయటికి పోయారు.)

గం: (లావుపాటి పుస్తకం తీసి చదివాడు, 'జాతి రత్నాలు' పేజీలు తిరగేశాడు.) రాజకీయ సాంఘిక ఆర్థికరంగాల్లో ఏ రంగంలో కీర్తి (ప్రఖ్యాతులు గడించిన వారినైనా తీసుకోండి, అంతా లాయర్లు, డాక్టర్లు, జాతి రత్నాలన్నీ ఆ రెండు జాతుల్లోంచి పుట్టినవే (మూడ్ మారింది పుస్తకం మూసేడు, లేచి స్టూల్ తెచ్చి తన టేబిల్ ముందు వేసుకున్నాడు.) అవును, ఆపరేషన్ చేసినా నొప్పింకా వస్తోందా? ఇదిగో, ఇవి చూడు. (శాండ్ స్టోన్స్ చూపేడు) ఇవి నీ కడుపులోంచి తీసినవే స్వామీ, ఇంకా ఎన్ని వున్నాయో ఇలాంటివి? చూస్తుంటే నీ పొట్ట రాళ్లక్వారీగా మారిపోలేదు గదా! సర్లే ...మరోసారి ఆపరేషన్ చేస్తాను భయం లేదు లేవయ్యా, నేనే స్వయంగా చేస్తాను, సరేనా? వెయ్యి రూపాయ లిస్తావా? ఇస్తావ్, వెయ్యంటే నీ కో లెఖ్ఖా? నాలుగు గొలుసుల్లో నాలుగు నలుసులు చెక్కేశావంటే వెయ్యొస్తుంది. పేరు గాంచిన జ్యూయెలర్‌వి గదామరి. ఆ! అలాగే వెళ్లిరా, నేనూ ఆపరేషను సామాను సిద్ధం చేసుకుంటాను మరో కేసుందిలే...(పొరుగు లాగీ సరంజామా అంతా బయటికి తీసేడు)

సు: (వచ్చింది సిగ జారివుంది రోగ(గ్రస్తముఖం, శరీరంలో అనట, నీరసం, కుర్చీలో వాలింది)

గం: ఏమ్మా సుశీలా! వంట్లో ఎలా వుంది?

సు: బాగానే వుంది మామయ్యా.

గం: (సీసాలోని థెర్మామీటర్ తీసి ఆమె కిస్తూ) టెంపరేచర్ చూడమ్మా.

సు: జ్వరం లేదు మామయ్యా.

గం: చూడమ్మా!

సు: అక్కర్లేదు మామయ్యా. నాకు తెలుస్తోంది కదా!

గం: (వెనక్కువెళ్లి థెర్మామీటర్ సీసాలో ఉంచాడు) లోపల (ప్రవహించేది పాదరసం.....పైకి చల్లగా వుంటుంది.

సు: మామయ్యా మీకు భోజనం వడ్డించాను. వెళ్లి భోంచేసి రండి. నేను కాస్సే పిలా కూర్చుంటాను.

గం: అలాగే నమ్మా.... .అలాగే వంటింట్లోకి వెళ్లాడు.

సు: (దిన పత్రిక తీసుకుని చదువుతుంది. లంచం తీసుకుంటున్న ఇన్‌స్పెక్టర్ పట్టివేత. పోలీసులు కస్టడీలోకి తీసుకున్నారు. దర్యాప్తు జరుగుతోంది. రాజారావు బయట్నుంచి వచ్చి సుశీలవైపు చూసేడు ఆమె లేవబోయి అలాగే కూర్చుంది. రాజారావు తన చేతిలోని కాగితాన్ని బెంచి మీద విసిరేడు.)

రా: ఏవిటలా ఉన్నావ్?

సు: ఏమీలేదు.

రా: డాక్టరు దగ్గరికి వెళ్లొచ్చావా?

సు: లేదు.

రా: ఎందుకని?

సు: అవసరం లేదు.

రా. దగ్గరసా వచ్చి ఎందుకు సుశీ ఈ సాధింపు, పట్టుదల?

సు: పట్టుదల కాదు, కేవలం (ప్రార్థనే అనుకోరాదూ?

రా: ఏవిటది?

సు: మీకు తెలిసిందే!

రా: (కోపంగా) లోకం తెలీనిదానివి సుశీ నువ్వు. ఈ సంఘం, సమాజం—అన్నీ కేవలం డబ్బుమీద తిరుగుతున్నాయి. దాన్ని పొందే అవకాశం వుంటే, పొందకపోవటం అవివేకమవుతుంది.

సు: ఆ అవకాశం ఋజుమార్గంలోది కానప్పుడు దాన్ని పొంద టమే అవివేక మవుతుంది.

రా: సుశీ, తర్కించకు. నా భర్త ఆదాయం యింత అని స్వాతిశ యంతో యధార్థాన్ని రెండింతలు చేసి చెప్పుకునే ఆడ వాళ్ల మనస్తత్వానికే విరుద్ధంగా వుంది నీ తత్వం.

సు: నిజమే. అలాంటి స్వాతిశయాన్ని నేను కాంక్షించటం లేదు.

రా: డబ్బును ద్వేషించటం మంచిది కాదు

సు: డబ్బును ద్వేషించటం లేదు నేను. అవినీతితో పొందే సంపాద నను హర్షించటంలేదు.

రా. నీకు తెలీదు సుశీ! ఆదర్శాలు, ఆశయాలు—వాటిని పాటించా లని నేనూ కలలు గన్నవాడినే. కాని ప్రపంచజ్ఞానం కలి గినకొద్దీ ఎన్నెన్నో చేదు నిజాలు తెలిసొచ్చినై. ఆద ర్శాన్ని నమ్ముకుని వస్తుంటే జేకొట్టేవాళ్లేగానీ, గుక్కెడు గంజినీళ్లు పోసేవాళ్లు లేని సమాజం సుశీ ఇది. ఈ సమాజంలో జీవించటానికి కనీసార్హత డబ్బు. దానిని పరి మాణాన్నిపట్టి అంతస్తు, హోదా, గౌరవం ఇవన్నీ నీకు తెలీవు!

సు: తెలుసు. కానీ నా కోరిక ఒక్కటే. కానిదారిలో మీరు నడవొద్దు. నాకు కానివారు కావద్దు.

రా: సుశీ! సుశీ, ఎలా నీకు నచ్చజెప్పను?—బియ్యం నిండు కున్నాయని నాలుక్కేజీలు తెప్పించావే డబ్బు లేదని, అప్పుడు నీ ఆదర్శం నిన్ను కాపాడిందా సుశీ? లేదే!.... పండక్కి తెచ్చిన చీరె కట్టుకోకుండా మాసిన చీరెతో పేరంటానికి వెళ్తే నీకు బ్రహ్మరథం పట్టారా అమ్మ లక్కలు? లేదే! పైగా నీ లేమిని నీకు తెలుపుతూ సూటీ పోటీ మాట లనలేదూ?.........ఫీజు నెలా ఖరికి పంపుతాను మందివ్వమంటే నీ నిజాయితీని అలాగే నన్నాడా డాక్టర్? లేదే! రేపట్నుంచి మందుకు రానక్కర్లేదు భద్రయ్యా అని కబురు చెయ్యలేదూ?— ఇదే సుశీ ఈ లోకం. ఇంతే సుశీ ఈ మనుషులు.

సు: తాత్కాలికమైన ఈతిబాధల్ని భూతద్దంలో చూస్తూ ఆ ఆకారాలకు సరిపోయే పరిమాణంలో అవినీతిని పెంచి డబ్బు గడించటం ...

రా: అవినీతి—అవినీతి—అవినీతి ఏది అవినీతో నీకు తెలుసా అసలు? బస్తా సిమెంటు కలపాల్సివుంటే అర బస్తా కలపటం అవినీతా? దానికి ప్రతిఫలంగా మాకో తృణమో పణమో ముట్టచెప్తే తీసుకోటం అవినీతా? నేను మామూలు తీసుకోనంతమాత్రాన అరబస్తాని బస్తాకి పెంచి పని చేయించడు సుశీ కంట్రాక్టరు. నా పైవాణ్ణి పట్టుకుని తన పని తను చేసుకుపోతాడు. నా విలువ ఎంత దిగజారి పోతుందో ఆలోచించు.....మనం మడి కట్టుకుని వీధి వాకిట కూర్చుంటు బజార్నపోయే కుక్కా, నక్కా మడి కట్టుకుని మాత్రమే మన దగ్గరకు రావు సుశీ, ఇది నిజం!

సు: నిజమయితే కావచ్చు! కానీ ఆ గంజాయి మొక్కల్లో మీరో మొక్క కాకూడదనీ, ఆ గాజు పూసల్లో మీరో పూస కాకూడదనే నే కోరుకునేది.

రా. నీ కోరికలో అసహజత్వం ఎక్కువగా వుంది సుశీ.....భార్య దీర్ఘరోగంతో తీసుకుంటూ రోజు రోజుకూ క్రుంగి పోతుంటే ఆమెకు మందిప్పించటానికి అశక్తత కల్పించే ఆదర్శాన్ని నే నెందుకు నమ్ముకోవాలి? దోసిళ్లతో డబ్బు సంపాదించి గుప్పెట్లతో విరజిమ్మి భార్యకు వైద్యం చేయించుకోగలిగే అవకాశాన్ని నే నెందుకు వదులుకోవాలి సుశీ?

సు: మార్చుకోలేను.

రా. అథవా, నీ మాట విని నేను మారినా, నీకు నేను సరియైన వైద్యం చేయించలేక ...

సు: ఫర్వాలేదు, నేనేమైపోయినా బాధలేదు......అపమార్గంలో ఆర్జించిన సొమ్ముతో మాత్రం నా అవసరాలేవీ గడవటానికి నే నంగీకరించను.

రా: కోపంగా నీ మాటకు నేనూ సమ్మతించకపోతే—

సు (మాట్లాడలేదు. దీనంగా అతనివైపు చూసి నెర్వస్‌గా నవ్వింది. తల వెనక్కివాల్చి పడుకుంది. రాజారావు తన గుప్పిటితో కుర్చీమీద కొట్టేడు.)

భ: (వచ్చేడు. అతని చేతిలో చిన్న జిప్ బేగ్ వుంది) కనకారావుగారు దీన్ని మీ కివ్వమన్నారండి. ఎస్టిమేట్ల కాపీ లున్నాయని చెప్పమన్నారు.

రా: ఎక్కడ కనిపించాడు.

భ: రైల్వే స్టేషనులో కనిపించేరు ఏ. ఇ. గారి దగ్గరకు వెళ్తు న్నార్ట. మీరే చెప్పార్టగా ఏ. ఇ. గారితో మాట్లాడి రమ్మని. చెక్—మెషర్మెంట్స్‌కి రమ్మని చెప్పొస్తార్ట.

రా: (అరిచేడు) భద్రయ్యా! ఎందుకా సొదంతా?

భ. నన్నివ్వాళ వాళ్లవూరు వెళ్లి రమ్మంటారా?

రా. వెళ్లు, వెళ్లి పని సరిగా చేయించు.

భ. అలాగేనండి. (వెళ్లిపోయాడు.)

రా. (జిప్‌బాగ్ తెరిచి చూసేడు. అరటాఫుకు మడిచిన కాగితా ల్లోంచి నోట్ల కట్టను బయటకు తీసి చూసుకుని మళ్లీ దాన్లోనే ఉంచాడు. సుశీల ఇదంతా గమనిస్తోంది. ఆమె వైపు చూసి అతను కలవరపడ్డాడు. బ్యాగ్ తీసుకుని గది లోకి నడిచేడు.)

సు. (వీక్‌గా నవ్వింది.) శూలనొప్పితో రెండేళ్లనుంచి తీసు కుంటున్నా శారీరకంగా బలహీనం కాలేదుగానీ, ఈ మనో వ్యాధి మనిషిని తినేస్తోంది. ఎన్ని విధాల చెప్పి చూసినా

ఫలితం శూన్యంగా వుంది. చేస్తున్నది తప్పైనా పనే అయినా, దానికి రంగు పులిమి, అందమైన మాటల్లో పొదిగి సమర్థించుకోవటం...(సుశీలకి పేపర్లో వార్త గుర్తు కొచ్చింది. 'లంచం తీసుకుంటున్న ఇన్‌స్పెక్టర్ పట్టివేత'— రాజారావుని పోలీసులు పట్టుకుపోతున్న వూహాదృశ్యం ఆమె కళ్లకు కట్టింది.—అరచింది) వద్దు.... వద్దు, వారిని తీసుకు పోవద్దు.

గం: (బయటికి వచ్చాడు, తుండుకు చేతులు తుడుచుకుంటూ. సుశీల అరుపుకు ఖంగారు పడ్డాడు.) ఏవిటమ్మా? ఏం జరిగింది?

సు: (ఉలిక్కి పడింది.) అహహ.... ఏం లేదు మామయ్యా... ఏదో పీడకల వచ్చింది.

గం పగలు కల లేమిటమ్మా? లేచి భోజనానికి పద.

సు: (లేవబోయింది. సగంవరకూ లేచి తూలి 'అబ్బా' అని మూలిగి కుర్చీలోనే పడిపోయింది గంగాధరం కంగారుగా ఆమె దగ్గరగా వచ్చి 'సుశీలా! అమ్మాయ్ సుశీలా!' అంటూ పిల్చేడు. సుశీల బాధగా మూలిగింది. గంగాధరం 'రాజా!' అంటూ కొడుకుని పిల్చేడు. రాజారావు పరిగెత్తుకొచ్చేడు )

గం అమ్మాయి పడిపోయిందిరా. (సుశీల బాధతో మెలికలు తిరుగు తోంది.) డాక్టర్ని పిలవరా!

రా. (ఫోన్ వైపు పరిగెత్తాడు.)

సు (పిచ్చిగా అరిచింది) వద్దు....వద్దు పిలవకండి—నాదైనసొమ్ము, నా వారిదైన సంపాదన ఇంట్లో ఏమీ లేదు. ధర్మానికి వైద్యంచేసే డాక్టర్లెవరూ లేరు. నాకేం ఫరవాలేదు.

రా బాధగా సుశీ! ఏమిటి నీ మొండితనం—ఈ స్థితిలో కూడా! (వెళ్లి రిసీవర్ ఎత్తి డయల్ చేయసాగేడు.)

సు. డాక్టర్ని పిలిచి నలుగురిలోనూ నన్ను అవమానం చేసి మీరు అవమానాలు పొందకండి. మీ మనసును మార్చలేక పోయాను. నాకు వైద్య మెందుకు? జీవిత మెందుకు?

గం: తప్పమ్మా, అలాంటి మాట అనకు.

రా. (ఆమె దగ్గరగా వచ్చి, తన చేతుల్తో ఆమెను లేవనెత్తి) రా సుశీ! (అంటూ గదిలోకి తీసుకువెళ్లాడు.)

గం 'రోగం రట్టు కాపరం గుట్టు' అన్నారు రోగాన్ని గుట్టు చేసుకుని ఇంతదూరం తెచ్చుకుంది పిచ్చిపిల్ల.

రా: (బయటికొచ్చాడు.)

గం ఇప్పు డెలా వుందిరా?

రా (జవాబు చెప్పకుండా కూజాలో నీళ్లు గ్లాసులోకి వంచాడు.)

గం. నే తీసికెడతాలే, ఇటియ్. (గ్లాసందుకుని గదిలోకి వెళ్లాడు.)

రా (అస్థిమితంగా వున్నాడు. రేడియో ఆన్ చేసేడు. ఏదో విషాద సంగీతం వస్తోంది. టక్కున ఆపేశాడు. షెల్ఫ్ లోంచి పుస్తకం లాగేడు. పేజీల్లో కుడి బొటనవ్రేలుతో నల్గు మనిపించేడు. పుస్తకం అక్కడే పడేశాడు. బెంచ్ దాకా వెళ్లేడు. ప్లాన్ల కాగితాలు ఒకటొకటి తీసిచూసి విసిరేయ సాగేడు. టీ—స్క్వేర్ తీసుకుని నుదుట అలవోకగా కొట్టుకున్నాడు. సెట్ స్క్వేర్ తీసి దాన్ని టీ—స్క్వేర్‌కి తగిలించేడు. రెంటినీ కలిపి టేబిల్ మీద నిలబెట్టేడు. మళ్లీ కుడి మూలకు వెళ్లి రాధా కృష్ణ విగ్రహం తెచ్చి టీపాయ్‌మీద పెట్టేడు. కుర్చీలో కూర్చుని తదేకంగా దాన్ని చూసేడు.....ఏవేవో మాటలు గుర్తుకు వస్తున్నాయ్.

—అన్నయ్యా ఏమిటా మాటలు! వదిన బాధతో గిలగిల లాడుతూంటే చీదరించుకుంటున్నావా?

*—అవును What a man I am!

—పట్టుదల కాదు, కేవలం ప్రార్థనే అనుకోరాదూ?

*—నిజమే. కేవలం ప్రార్థనే ....

—డబ్బును ద్వేషించటంలేదు నేను. అవినీతితో పొందే సంపాదనను హర్షించటంలేదు. అంతే!

*—అవినీతితో పొందే సంపాదన. .. కంట్రాక్టర్ కనకారావ్, ప్రెసిడెంట్ చంద్రయ్య, కృష్ణాపురం కరణం.....వీళ్లం దరినుంచీ పొందిన సొమ్ము అవినీతితో పొందిందేనా?

—తాత్కాలికమైన ఈతిబాధల్ని భూతద్దంలో చూస్తూ ఆ ఆకారాలకు సరిపోయే పరిమాణంలో అవినీతిని పెంచు కుంటూ డబ్బు గడించటం—

*—ఈతిబాధల్ని భూతద్దంలో చూడక్కర్లేదు సుశీ, వాటి సూక్ష్మరూపం చాలు మనసును వికలం చేయటానికి.

—ఆ గంజాయి మొక్కల్లో మీ రొక మొక్క కాకూడదనీ, ఆ గాజు పూసల్లో మీరో పూస కాకూడదనే నేను కోరు కునేది!

—అపమార్గంలో గడించిన సొమ్ముతో మాత్రం నా అవ సరా లేవీ గడవటానికి నే నంగీకరించను. ఫర్వాలేదు. నే నేమైపోయినా బాధలేదు!

రా: (కళ్లలో నీళ్లు తిరిగాయి. 'సుశీ' అంటూ ఎలుగెత్తి అరి చేడు.) నిజం సుశీ! నీవేమీ కావటానికి వీల్లేదు! (టేబుల్ దాకా వెళ్లేడు సొరుగు లాగి లెటర్ హెడ్ తీసుకున్నాడు. ఏదో రాశాడు. రాసిన కాగితం చించకుండా ప్యాడ్‌ని టీపాయ్‌మీద ఉంచాడు—తాళం చెవుల గుత్తి తీసుకుని గదిలోకి వెళ్లేడు. జిప్‌బాగ్‌తో తిరిగొచ్చాడు. దాన్ని తెరచి నోట్ల కట్టలు తీసేడు. దాన్లో ఇప్పుడు నాలుగు కట్టలున్నాయి—ఫోన్ మ్రోగింది. వెళ్లి రసీవ రందుకున్నాడు.) హాలో! రాజారావ్ స్పీకింగ్.. ఆ నమస్తే సార్...నమస్తే— వాట్ ! (ఆశ్చర్యపోయాడు) మీమీదనే Is it ? Corruption Charge! Sorry Sir, ......... .........

ఇక్కడెవరూ లేరులేండి — ఆ...అలాగే...అలాగే వస్తా లెండి! (ఫోన్ పెట్టేశాడు. బ్యాగ్ పుచ్చుకుని బయటికి పోబోయాడు. మళ్లీ వెనక్కి వచ్చి ఫోన్ చేసేడు. Yes ...డాక్టర్ రమణరావుగారేనా? నమస్తే. మీరు మా యింటికోసారి రావాలి. నా మిసెస్‌కి బాగాలేదు. (రిసీవర్ పెట్టేసి బ్యాగ్ పట్టుకున్నాడు.)

సు వచ్చి ఏవండీ! డాక్టరికి ఫోన్ చేశారా?

రా అవును సుశీ! డాక్టరు ఇప్పుడే వస్తాడు నేను అర్జంటు పనిమీద బయటికి పోతున్నాను. వో గంటలో వచ్చేస్తా.

సు: (కుర్చీలో కూర్చుని టీపాయ్‌మీదున్న లెటర్ ప్యాడ్ తెరిచి లెటర్ చదివింది.) ఏవండీ, ఆగండి! ఈ లెటరేమిటి?

రా: అరెరె! దీన్నిక్కడే మర్చిపోయాను. ఇటు తే.

సు: ఏవిటండీ ఇది?

రా. వీధి కుక్కని తీసికొచ్చి శాఖాహారిగా పెంచినా, మన పెంపకం నుంచి తప్పుకుని మళ్లీ ఆ వీధిలోకే పోయిందంటే అది నానా చెత్తా తింటుంది. పాత స్మృతుల్తో పాత అల వాట్లతో పాత మనుష్యుల మధ్య ఇదే ఉద్యోగంలో క్రొత్త జీవితాన్ని గడపలేను సుశీ అందుకే నే నీ నిశ్చయాని కొచ్చేను. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తున్నాను ఇదిగో, మనది కాని డబ్బుని కూడా పంపించేస్తున్నా.

గం· (వస్తూనే) ఏవిట్రా రాజా! ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేవా?

రా అవున్నాన్నా.

గం. లేని కంటికోసం ఏడిస్తే ఉన్న కన్నూ కూడా పోయిందని సామెత.. ...(శంకరం, మురళి వచ్చేరు.)

ము. నో సామెతలూ, నో సమస్యలూ, వదినా.....వదినా..... ఇదిగో వదినా, అపోయింట్‌మెంట్ ఆర్డర్.

శం: మొత్తానికి సాధించా డక్కయ్యా. మా ఆఫీసర్ని బ్రహ్మాండంగా ఇంప్రెస్ చేశాడు.

ము· కాదులే వదినా ఇందులో మన ఘనతేం లేదు. శంకరం సిఫారసే! (అంటూ ఆ ఆర్డర్ని సుశీల కిచ్చేడు.

ఆమె చదివి పేలవంగా నవ్వి మురళి కళ్లలోకి చూసింది అతను తలవంచుకున్నాడు. ఆ కాగి తాన్నామె రాజారావు కందించింది.)

రా· కంగ్రాట్స్ తమ్ముడూ!

గం ఏదిరా ఆ ఆర్డరు (రాజారావు ఇచ్చాడు గంగాధరం చదివేడు.) Mr M S. Murali is hereby appointed as a lower division clerk (ఆయన కళ్లు తేలిపోయాయి. కాగితం క్రింద పడింది) Lower Division clerk. . మురళి L. D. C. Supervisor రాజారావ్ resigned supervisor! (పిచ్చిగా నవ్వేడు. అందరూ అతనివైపు ఖంగారుగా చూసేరు—)

## [లైట్స్ ఆఫ్—ఫ్లాష్ ఆన్]

హ్హా....హ్హా. హ్హా..... L. D. C.—Resigned supervisor–లేని కంటికోసం ఏడిస్తే ఉన్న కన్ను కూడా పోయిందిట. (తన టేబుల్ ప్రక్కగా వెళ్లేడు. గోడకు ఫోటో ఉండాల్సిన వైపు చూసేడు. చూసేవా శాంతా! మనబ్బాయి లిద్దరూ ఒక డెంచక్కా. Resigned civil supervisor, రెండో వాడేమో మహా ఘనత వహించిన Lower division clerk... ....హ . హ...హ.. నువ్వు సంతోషిస్తున్నావో లేదో గానీ, శాంతా నా కిప్పుడు కన్నుల పండుగగా వుంది— అందని పూలకేసి చూసి చూసి 'నా పిల్లలన్నా ఆ పూలను అందుకునేటట్టు చేయాలని శతథా ప్రయత్నించాను. కానీ శాంతా (కళ్లనీళ్లు తిరిగి) కానీ శాంతా నేవేసిన నిచ్చెనలు నిరుపయోగమైపోయాయి కొడుకు లిద్దరూ వాటి దరిదాపుల్లోకి కూడా రాలేదు......వాళ్ల ఆశలు వేరైనై. వాళ్ల దారులు వేరైనై....నేను....నేను, చూస్తున్నావ్ కదూ నే నెలా వున్నానో. నే నిలాగే వున్నాను. శాంతా.....ఇలాగే ఉన్నాను. (వెర్రి నవ్వు నవ్వి టేబిల్ మీది థెర్మామీటర్ విరిచేశాడు. కుర్చీమీద కోటు తీసి విసిరేశాడు.)

నాన్నా, మామయ్యా అన్న పిలుపులు గాలిలో కలుస్తూ వుండగా (తెర.)

# ప్రభుత్వరంగంలో పరిశ్రమలు

శ్రీ సి. చంద్రశేఖర్

ఆధునికయుగంలో ప్రభుత్వంయొక్క పరిధి నానాటికీ విస్తృతమవుతున్నది. ఒకప్పుడు శాంతి భద్రతలకుమాత్రమే పరిమితమై ఉండిన ప్రభుత్వాధికారం నేడు ఒక వ్యక్తి చదువు సంధ్యలు మొదలుకొని ఆ వ్యక్తి వివాహము, సంతానము, ధనార్జన మొదలైన సర్వ విషయాలనూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో శాసిస్తున్నది. ప్రభుత్వం ప్రజాస్వామికమైనకొద్దీ సర్వతోముఖమైన సాంఘిక ప్రగతి ప్రభుత్వ లక్ష్యంగా ధ్రువపడుతున్నది. ఈ లక్ష్యాని కనుగుణంగానే ప్రభుత్వంయొక్క బాధ్యతలూ, అధికారాలూ పెరుగతున్నవి.

సంఘానికి ప్రాణనాడివంటిది ఆర్థిక వ్యవస్థ. మానవుని కనీసావసరాలను తీర్చగల ఆర్థిక వనరు లున్నప్పుడే ఇతరమైన నైతిక, సాంస్కృతిక పురోగమనం సాధ్యమవుతుంది. కనుక నేడు ప్రభుత్వ దృష్టి, ప్రధానంగా వర్ధమాన దేశ ప్రభుత్వముల దృష్టి ఆర్థిక ప్రగతిపై కేంద్రీకృతమై ఉంది. జాతీయోత్పత్తి, తలసరి ఆదాయము మొదలైన కొన్ని ప్రమాణాల ననుసరించి ప్రపంచ దేశాలలో కొన్నిటిని అభివృద్ధి సాధించిన దేశాలుగా, మరికొన్నిటిని వెనుకబడిన దేశాలుగా వర్గీకరింపవచ్చును. నిజానికి ధనికదేశాలు కూడా తమ ఆర్థిక వ్యవస్థ సుస్థిస్థితిని పోషించుకొనేందుకై ఒకవిధంగా నిరంతర ప్రాణాయామం జరుపవలసి ఉంటుంది ప్రస్తుతం, ఆర్థికంగా వెనుకబడి త్వరితగతిలో అభివృద్ధి సాధింపదలచిన వర్ధమాన దేశాలతో మాత్రమే మనకు నిమిత్తం. వీనిలోనూ ప్రాథమిక హక్కుల ప్రసక్తి లేకుండా ఆర్థిక నియంతృత్వం అవలంబించిన దేశాలను వదిలివేసి, ప్రజాస్వామ్య పద్ధతిలో వైయక్తికమైన విలువలకు ప్రాధాన్యమిచ్చే కమ్యూనిస్టేతర రాజ్యాలకు మాత్రమే ఈ చర్చ పరిమితమైంది.

ఆర్థిక ప్రగతిలో రెండు విభాగా లున్నాయి. ఒకటి అత్యధికోత్పత్తిని సాధించడము. దేశంలోని వనరులన్నిటినీ సమీకరించుకొని పూర్తిగా ఉపయోగించుకొనడం ద్వారా ఇది సాధింపవచ్చును. రెండవది ఈవిధంగా సమకూరిన జాతీయాదాయము ప్రజలందరికీ సౌమ్య పద్ధతిలో విభజింపబడడము. అనగా కేవలం తలసరి ఆదాయం వృద్ధి పొందడం మాత్రమేకాక, వ్యక్తిగత ఆదాయాల మధ్యకల తారతమ్యాన్ని కనీస స్థాయికి తగ్గించగలిగినపుడు మాత్రమే ఆర్థిక ప్రగతి సంపూర్ణమవుతుంది. మరొక రకంగా చెప్పాలంటే అధికోత్పత్తీ, ఆర్థిక న్యాయమూ ప్రగతి లక్షణా లనవచ్చు.

అయితే ఈ రెండూ పరస్పరాశ్రయాలు. ఉత్పత్తిని సాధించడంలోనే వ్యక్తిగత ఆదాయాల అవకాశం ఏర్పడుతుంది. ఆదాయం వృద్ధి పొందిన పక్షంలో మాత్రమే ఉత్పత్తి సాధకమయిన పరిశ్రమ నిరంతరాయంగా కొనసాగగలదు. కనుక అధికోత్పత్తీ, ఆర్థిక న్యాయమూ అన్నవి పైకి కనుపించినంత భిన్నమైన వ్యవహారాలు కావు. రెంటినీ ఏక కాలికంగా సాధించడం అంత సులభమైన విషయమున్నూ కాదు.

## 2

అధునాతన స్థితిగతులమధ్య అధికోత్పత్తి కేవలం పారిశ్రామికీకరణం ద్వారా మాత్రమే సాధ్యం. వ్యవసాయమే ప్రధానంగా గల దేశాలలో కూడా ఆధునిక పద్ధతులలో సాగు చేసేందుకు యంత్రాలను, రసాయనిక ఎరువులను ఉపయోగించడం ఆవశ్యకమవుతుంది పారిశ్రామికోత్పత్తుల పెంచేందుకుగాను ముడి సరుకులూ, పెట్టుబడి ధనమూ ప్రాథమికావసరాలు. తర్వాతి స్థాయిలో సాంకేతిక నైపుణ్యము, సమర్థమైన నిర్వహణ ప్రధానమైనవి. అనగా ఉత్పాదకమైన వనరులూ, ఆర్థిక వనరులూ, మానవశక్తి—వీని సమగ్ర సహకారంతో అధికోత్పత్తి సాధ్యమవుతుంది

బడుగుదేశాలలో వస్తు సామగ్ర్యుత్పత్తి చాలా తక్కువ. ఉన్న ఉత్పత్తి విధానాలు కూడా చాలా పురాతనమైనవి క్రొత్త పరిశ్రమలపై మోజు కలిగిన వ్యక్తులు ఉన్నా పరిశ్రమలు ప్రారంభించేందు కనువైన పరిస్థితులు, ప్రారంభించగల సామర్థ్యము ఉండవు. ఒకవేళ ఇన్నీ ఉన్నా లాభార్జన దృష్టి ప్రధానంగా కల వ్యష్టి పారిశ్రామికవేత్తలు, జాతి దీర్ఘకాలికావసరాలకు అనుగుణమైన పరిశ్రమలు మాత్రమే చేపట్టుతారన్న నమ్మకంలేదు. ఈ కారణాలవల్ల సక్రమమైన పారిశ్రామికీకరణమన్నది ఒక ఉద్యమంగా సామూహిక ప్రయత్నంవల్ల మాత్రమే సిద్ధిస్తుంది. వైయక్తిక ప్రయోజనాలకు దూరంగా అట్టి ఉద్యమాన్ని నిర్వహించేందుకు ప్రభుత్వంకన్నా తగిన వ్యవస్థ లేదు.

అధికోత్పత్తి అనగా ఆర్థిక ప్రగతికి అనుకూలమైన ఉత్పత్తి అని మాత్రమే అర్థం. దీర్ఘకాలిక ప్రాతిపదికపై ఏ ఉత్పత్తులు ఏ పరిమాణాలలో ఎప్పుడు లభ్యమయితే జాతీయాదాయం వృద్ధి పొందుతుందో ప్రభుత్వం నిర్ణయించి ఒక ప్రణాళిక నేర్పరుస్తుంది. వ్యష్టి రంగాన్ని నిర్మూలించి పారిశ్రామిక రంగాన్ని పూర్తిగా స్వాయత్తం చేసుకొనడం కమ్యూనిస్టు రాజ్యాలలో తప్ప

ప్రభుత్వానికి సాధ్యంకాదు. అది అవాంఛనీయం కూడా. ప్రభుత్వమే ఒక వాణిజ్య కేంద్రంగా కాగల ప్రమాదాన్నుండి తప్పుకొనేందుకు ప్రభుత్వరంగం పరస్పర సహకారంతో పరిశ్రమించడమే సర్వదా ఆచరణీయము. నిర్ణీత లక్ష్యాల కనుగుణంగా ఉత్పత్తులను ఒక క్రమ పద్ధతిలో ప్రోత్సహించడం ప్రభుత్వ స్వీకరింపవలసిన బాధ్యత. ప్రభుత్వ ప్రణాళికల కనుగుణంగా దేశ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకుని తమ కార్యకలాపాలను కొనసాగించడం వ్యష్టి రంగ పారిశ్రామికవేత్తల బాధ్యత. ఈవిధంగా ఆర్థిక ప్రగతికై వ్యష్టి, ప్రభుత్వరంగాలు సమష్టి బాధ్యత వహించడాన్ని మిశ్రమ ఆర్థిక విధానమని అంటారు. ఇంచుమించు, ప్రపంచంలోని వర్ధమాన దేశాలన్నీ ఈ దృశమైన విధానా న్నవలంబిస్తున్నవే.

మిశ్రమ ఆర్థిక విధానంలో ప్రభుత్వం తన బాధ్యతను రెండు విధాలుగా నిర్వర్తింపవచ్చు. పారిశ్రామికాభివృద్ధి పర్యవేక్షణమాత్రమైన బాధ్యత ఒక విధం. వ్యష్టిరంగంలో పరిశ్రమలు ప్రారంభించేందుకు తగినంత ఉత్సాహం, సామర్థ్యం వ్యక్తమవుతున్నప్పుడు ఆ ఉత్సాహాన్ని ఉచిత రీతిలో వినియోగించేందుకుమాత్రమే ప్రభుత్వ బాధ్యత పరిమితమవుతుంది. నిర్దిష్ట కార్యక్రమానుసారం ప్రభుత్వం అనావశ్యకమైన పరిశ్రమలపై ఎక్కుడు పన్నులు విధించడం, ఆవశ్యకమైన పరిశ్రమలకు అదనపు సౌకర్యాలు కలగజేయడం మొదలైన విధానాల ద్వారా పరోక్ష నియామకం అవలంబింపవచ్చు. మరిన్నీ ఈదశలో పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన రవాణా, విద్యుచ్ఛక్తి మొదలైన సౌకర్యాలుగల అంతర్వ్యవస్థితిని కల్పించి ప్రభుత్వం వ్యష్టిరంగాన్ని ప్రోత్సహిస్తుంది.

ప్రభుత్వం అవలంబింప దగిన రెండవ విధానం పారిశ్రామికీకరణంలో ప్రత్యక్షంగా పాల్గొని అభివృద్ధిని అవసరమైన క్రమంలో మలచుకొనడం. ఇందుకుగాను ప్రభుత్వం కీలకమైన పరిశ్రమల జాతీయం చేసి, తక్కిన పరిశ్రమల వ్యష్టిరంగానికి వదలి వేయడమో, లేదా పాక్షికంగా తానే నిర్వహించడమో చేయవచ్చు. వ్యష్టిరంగంలో ఉత్పత్తి, వాణిజ్యం బహుముఖాలుగా సాగి పరోక్ష నియామకం కష్టసాధ్యమయినపుడు, లేదా వ్యష్టిరంగంలో సామర్ధ్యం కొరవడి ఆశించిన వేగంతో ఆర్థిక పురోగతి సాధ్యం కాదనుకున్నప్పుడు ప్రభుత్వం ఈ విధానం అవలంబిస్తుంది.

పెక్కు వర్ధమాన దేశాలలో పరిశ్రమలకు సంబంధించినంతవరకు, ప్రభుత్వం వ్యష్టిరంగాన్ని అతిక్రమించి పో జూస్తున్నది. ప్రభుత్వరంగంలోని పరిశ్రమల త్వరిత వ్యాప్తికి గల కారణాలను మరికొంత వివరంగా ముందు పరిశీలిద్దాము.

## 3

ప్రణాళికాబద్ధమైన పురోగతిని సాధించదలచడమే, ప్రభుత్వం పారిశ్రామిక రంగంలో అడుగు పెట్టడానికి గల ప్రధానమైన కారణం. ప్రణాళిక అనగానే, కొన్ని మౌలిక పరిశ్రమలకు తక్కిన పరిశ్రమల కన్నా ఎక్కుడు ప్రాధాన్యం ఉండడం, ఐకకాలికమైన వివిధ పరిశ్రమల అభివృద్ధిలో సమన్వయం కొరకై ప్రయత్నం దేశంలోని వివిధ ప్రాంతాల అభివృద్ధిలో కల తారతమ్యాన్ని వ్యక్తుల ఆదాయాలలో గల వ్యత్యాసాన్ని కనీస స్థాయికి తగ్గించడం మొదలైన విషయాలన్నీ ఆవశ్యక మౌతాయి. ఈ ప్రణాళికా లక్ష్యాలను సాధించేందుకు ప్రభుత్వ పరిశ్రమలు ఒక సాధనంగా ఉపయోగ పడతాయి.

వ్యష్టి రంగంలోని పారిశ్రామికవేత్తలది ప్రధానంగా లాభార్జన దృష్టి. దేశప్రయోజనాల దృష్ట్యా అభివృద్ధి దశలో ఆవశ్యకమైన కొన్ని పరిశ్రమలలో సంతృప్తికరమైన లాభాల కవకాశం లేకపోవచ్చును. అట్టి పరిశ్రమలను కొంత నష్టాన్ని భరించియైనా నిర్వహించగల వ్యవస్థ ప్రభుత్వం మాత్రమే.

వ్యష్టిరంగంలో విభిన్న వ్యక్తులు తమ తమ ఉద్దేశాలకు, స్తోమతలకు అనుగుణంగా పరిశ్రమలను ప్రారంభిస్తుంటారు. వీరిలో పరస్పరావగాహనకు కల అవకాశం చాలా తక్కువ. వీరి ప్రయత్నాలలో సమన్వయం కుదిర్చేందుకు పరోక్షనియామకం విఫలమైనప్పుడు, ప్రభుత్వం కొన్ని పరిశ్రమల జాతీయీకరణకో లేదా కొరతవడిన రంగాలలో స్వయంగా క్రొత్త పరిశ్రమల స్థాపనకో పూనుకోవలసి వస్తుంది.

వెనుకబడిన ప్రాంతాలలో తగిన సౌకర్యాలు లోపించిన కారణంగా వ్యష్టి పారిశ్రామికవేత్త లెవరూ పరిశ్రమలు స్థాపించ సాహసించరు. వివిధ ప్రాంతాల మధ్య అసమానమైన అభివృద్ధిని నిరోధించేందుకు గాను ప్రభుత్వమే వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమల ప్రారంభించి, పారిశ్రామిక వాతావరణాన్ని కలిగించడం ద్వారా ప్రాంతీయాభివృద్ధికి తోడ్పడవలసిన అవసరం కలుగుతున్నది.

ప్రభుత్వం రంగంలోకి దిగవలసిన వచ్చిన కారణాలలో ప్రధానమైనది ప్రగతి లక్షణాలలో ఒకటైన ఆర్థిక న్యాయమన్న ఆదర్శం. దేశంలో పారిశ్రామికమైన జాగృతి సంపూర్ణంగా కలుగనందువల్ల, ప్రాథమిక దశలో వ్యష్టిరంగాన్ని ఏకాధిపత్యం గల కొందరు పారిశ్రామికవేత్తలే పరిపాలిస్తుంటారు. వివిధ పరిశ్రమలలోనికి చొచ్చుకొని పోయిన గుత్త పెట్టుబడిదారులు పోటీ లేని కారణంగా అక్రమంగా ధరలను పెంచి, విపరీత లాభాల నార్జిస్తారు. తత్కారణంగా, దేశంలో తలసరి ఆదాయం పెరిగినా సామాన్యుని వ్యక్తిగత ఆదాయం పెరగదు. ఆదాయాల మధ్య నానాటికీ విస్తరిస్తున్న తారతమ్యాన్ని నివారించేందుకు ప్రభుత్వం మొదట పరోక్ష నియామకాన్ని అవలంబిస్తుంది. అది విఫలమైన పక్షంలో ప్రభుత్వం ఏకాధిపత్యం వల్ల జర్జరితమై ఉన్న పరిశ్రమల జాతీయమైనా చేయాలి, లేదా వాటిలోని ఏకాధిపత్యాన్ని నశింపజేయగల పోటీ కార్యకలాపాన్ని ఆయా పరిశ్రమలలో స్వయంగానైనా ప్రారంభించాలి.

ఒకవిధంగా పెట్టుబడిదారీ వ్యవస్థలోని లోపాలను సవరించేందుకు ప్రభుత్వ పరిశ్రమ ప్రారంభమైనదని చెప్ప

వచ్చు. ప్రజల ప్రాథమికావసరాలకు సంబంధించి, సర్వజనోపయోగం కల పరిశ్రమలు లాభార్జనోద్దేశం కల ప్రత్యేక వ్యక్తుల అధీనంలో నున్నప్పుడు, వారు నిర్ణయించిన ధరల నిచ్చుకోలేని సామాన్యులు బాధపడవలసి వస్తుంది. అందువలన అట్టి పరిశ్రమలను ప్రభుత్వమే నిర్వహించడం తప్పనిసరి. పైగా దేశమంతటికీ సంబంధించిన వ్యవహారం గల పనుల నిర్వహణకు వ్యష్టిరంగం అసమర్థమైనది. ఈ కారణం వల్లనే తంతితపాలా శాఖ సాంప్రదాయికంగా ప్రభుత్వ నిర్వహణలో ఉంటున్నది. పెక్కు దేశాలలో నీటిసరఫరా, విద్యుచ్ఛక్త్యుత్పాదన రవాణా సౌకర్యాలు మొదలైన ప్రధాన పారిశ్రామిక, వాణిజ్య కార్య కలాపాలను ప్రభుత్వమే చేపట్టింది.

వర్తమానదేశాలలో ప్రభుత్వరంగం యొక్క త్వరితగతి విస్తరణకు పై కారణాలన్నిటి కన్నా ప్రధానమైనది నిర్దిష్టమైన వ్యవధిలో ప్రణాళికలో ఉద్దేశించిన అభివృద్ధిని సాధించేందుకు వ్యష్టిరంగం అసమర్థమై ఉండడము. ఈ అసమర్థత పెట్టుబడి, సాంకేతిక నైపుణ్యము, నిర్వహణ సామర్థ్యము అన్నవాని కొరతలవల్ల ఏర్పడినట్టిది. ఇనుము, ఉక్కువంటి పారిశ్రామికాభివృద్ధికి అత్యావశ్యకమైన మౌలిక పరిశ్రమలకు పెట్టుబడి ఎక్కువ పరిమాణంలో కావలసి ఉంటుంది. వెనుకబడిన దేశాలు సాంకేతికంగా కూడా వెనుకబడిఉండడంచేత ఎరువులు, యంత్ర పరికరాలు, అణుశక్తి మొదలయినవానికి సంబంధించిన పరిశ్రమలు వ్యష్టిరంగంలో ఒక్కసారిగా స్థాపించడం కష్టతరమైన విషయం. ప్రభుత్వరంగంలోని పరిశ్రమలకు పెట్టుబడిఋణాలకైగాని, సాంకేతిక నైపుణ్యంకొరకైగాని విదేశీ సహకారం సులభసాధ్యమవుతుంది. కొన్ని ధనిక దేశాలు ప్రభుత్వ పరిశ్రమలకు గాని సహకారమందజేయవు. ఈ కారణాలవల్ల హెచ్చు పెట్టుబడి, మాత్ర సాంకేతిక పరిజ్ఞానం అవసరమైన భారీ పరిశ్రమల చాలా భాగం ప్రభుత్వ నిర్వహణలో ఉంటున్నాయి. నిర్వహణ సామర్థ్యంలోనూ వ్యష్టిరంగంయొక్క అవధికి మించిన విషయాలున్నాయి. ఉదాహరణకు: విద్యుచ్ఛక్తి వినియోగదారుల ఆర్థిక స్థాయి ననుసరించి ధరలలో వ్యత్యాసం సంకల్పించడం, పెద్ద ఆనకట్టలవంటి ప్రజోపయోగమైన కార్యాలకు వెచ్చించినధనాన్ని పన్నుల రూపంలో తిరిగి రాబట్టుకోవడం, ఇవి వ్యష్టిరంగాని కతీతమైన పనులు.

భారీ పరిశ్రమలవల్ల నిర్మాణ కార్యక్రమం పూర్తయి ఉత్పత్తి ఒక స్థాయికి వచ్చేప్పటికే దీర్ఘకాలం పడుతుంది. ఇందులోని కష్టనష్టాలను సహించి వ్యష్టిరంగం ఒకవేళ అట్టి భారీ పరిశ్రమల స్థాపనకు పూనుకోగలిగినప్పటికీ, పెట్టుబడియొక్క అధిక పరిమాణంవల్లా, ఆ యా పరిశ్రమలకు (ఉదా: విద్యుచ్ఛక్తి, రసాయనాలూ) ఇతర పరిశ్రమలపై ఉండే ప్రభావంవల్ల సంక్రమించే ఆర్థికశక్తి వ్యష్టిరంగంలో కేంద్రీకృతమై ఉండడం దేశ ప్రయోజనాల దృష్ట్యా ఆశంసనీయం కాదు. కనుక ప్రభుత్వమే ఇట్టి కీలక పరిశ్రమల నిర్వహించవలసి ఉంటుంది.

ప్రభుత్వ పరిశ్రమలవల్ల కలుగవలసిన ప్రయోజనం, అనేక వాద ప్రతివాదాలకు ఆస్పదమయినది మరొకటున్నది. అది ప్రభుత్వ పరిశ్రమలు లాభాల నార్జించి ప్రణాళికకు అవసరమైన పెట్టుబడిని సమకూర్చాలన్నది. దీనినిగూర్చి ముందు కొంత విపులంగా చర్చిద్దాము.

ప్రభుత్వ పరిశ్రమల త్వరితగతివ్యాప్తికి చివరి కారణం ప్రభుత్వం దేశంయొక్క ఆర్థిక వ్యవస్థపై సాధ్యమయినంత ఎక్కువ అధికారాన్ని ఆశించడమే. వివిధ పరిశ్రమలలో కాలూనడం ద్వారా ప్రభుత్వం ఏకాధిపత్యం సంపాదించడంకాని, లేక ఆ యా పరిశ్రమలలో వ్యష్టిరంగంలోని ఏకాధిపత్యంకలవారిని అరికట్టడం కాని జరుగుతున్నది. ఈ సౌలభ్యంవల్ల ప్రభుత్వం ధరల నియామకము, దేశీయ అంతర్దేశీయ వాణిజ్యము, కార్మిక సంక్షేమము మొదలైన విషయాలలో తాను ప్రకటించిన విధానాలను సమర్థంగా ఆచరణలోపెట్టి, వ్యష్టి రంగానికి మార్గ దర్శకత్వం నెరపగల్గుతున్నది.

పై కారణాలలో కొన్ని అవసరాలు కాగా, మరికొన్ని ఆదర్శాలు. ఉదాహరణకు, వ్యష్టిరంగంయొక్క అసమర్థత, ప్రణాళికోద్దిష్టమైన ప్రాధాన్య క్రమము మొదలైనవి అవసరాలు కాగా, ప్రాంతీయాభివృద్ధి ఆర్థిక న్యాయము, ఏకాధిపత్య నిరోధమువంటివి ఆదర్శా లవుతున్నాయి. నిజానికి, ప్రభుత్వ రంగంయొక్క విస్తరణకు మూలభూతములైనవి అవసరములేకాని, ఆదర్శములు కావు. అవసరములు కేవలం ఆర్థిక సంబంధమయినవి కాగా, ఆదర్శములు రాజకీయ వ్యవస్థతో కూడా సంబంధము కలిగియుండేవి. ఆదర్శములయొక్క నిజమైన ఉపయోగము ప్రభుత్వ పరిశ్రమల సమర్థమైన నిర్వహణతో ముడిపడి ఉంది.

## 4

ఇప్పుడు ప్రభుత్వరంగంలోని పారిశ్రామిక వ్యవస్థయొక్క స్వరూప స్వభావాలను సంగ్రహంగా పరిశీలిద్దాము.

పన్నుల ద్వారా ప్రభుత్వంవద్ద ప్రోగైన ధనాన్ని, నిక్షేపాలు, ఋణాలు మొదలైన ఇతర మార్గాలద్వారా సేకరించిన నిధులను ఆర్థికాభివృద్ధికిగాను రెండు రకాలుగా వినియోగించవచ్చు. వ్యష్టిరంగంలోని పెట్టుబడిదారులకు ఋణాల నిచ్చి పరిశ్రమల ప్రోత్సహించడం ఒక మార్గం. ప్రభుత్వం స్వయంగా ఆ ధనంతో పరిశ్రమల నిర్వహించడం మరొకమార్గం.

వ్యక్తిగత నిక్షేపాల కధికంగా అవకాశంలేని బీద దేశాలలో ప్రభుత్వం పన్నులద్వారా పెట్టుబడిని సేకరించి పారిశ్రామిక రంగానికి సమకూర్చడం సమంజసమే. వ్యష్టిరంగంలో తక్కిన వసరులన్నీ ఉండి, ఒక్క ఆర్థిక సమస్య మాత్రమే ప్రధానంగా ఉన్నప్పుడు ప్రభుత్వం ఈ బాధ్యత వహించవలసివస్తుంది. బ్యాంకుల వంటి ఆర్థిక సంస్థలు పరిశ్రమల నిత్యావసరాల కనుగుణమైన స్వల్ప కాలిక ఋణాల నివ్వగలవేకాని, మూలధనాన్ని సమకూర్చుకొనడంలో సహాయపడలేవు. ఇందుకుగాను ప్రభుత్వం ప్రత్యేకంగా ఫైనాన్స్ కార్పొరేషన్లను స్థాపించి పరిశ్రమల స్థాపనకు

కాని, విస్తరణకుకాని అవసరమైన దీర్ఘకాలిక ఋణాలు న్యాయమైన వడ్డీతో లభించేట్లు సౌకర్యం కలుగజేస్తుంది. ఇందువలన వ్యష్టిరంగంలో వ్యక్తమయ్యే ఉత్సాహమూ, సామర్థ్యమూ సక్రమంగా వినియోగపడగలవు. వ్యష్టిరంగాన్ని ప్రోత్సహింపదలచిన వర్ధమాన దేశాలన్నిటితో ఈ పద్ధతి ఆచరణీయమైనది. కేవలం ధన సహాయానికే గాక, సాంకేతిక సహాయానికి కూడా ప్రభుత్వ సంస్థ లుండడం అసామాన్యంకాదు.

అయితే ఈ పద్ధతిలో ఒక ఇబ్బంది ఉంది. ప్రభుత్వం నుండి తీసుకున్న ఋణాలతో వ్యష్టిరంగంలో స్థాపింపబడే పరిశ్రమలు సర్వదా ప్రణాళికా నిర్దిష్టమైన పురోగతి ననుసరించి ఉండకపోవచ్చు. పరిశ్రమలకు ఋణాల నివ్వడమేగాకుండా, ఆ ఋణాలు సక్రమంగా వినియోగమయ్యేట్లుచూడడం కూడా ప్రభుత్వంయొక్క బాధ్యతయే. కొంతవరకీ అదనపు భారాన్ని తగ్గించుకునేందుకుగాను ప్రభుత్వమే స్వయంగా తన నిధులతో పరిశ్రమల నిర్వహించడము ప్రత్యామ్నాయమార్గం. కేవలం ఉత్పాదక పరిశ్రమలేకాక వాణిజ్య సంస్థలు కూడా ప్రభుత్వ ఆధ్వర్యంలో ఉండవచ్చు. ఈవిధంగా ప్రభుత్వం ఒక వంక వ్యష్టి రంగంలోని అనభిలషణీయమైన పెరుగుదలను నిరోధిస్తూ మరొకవంక వ్యష్టి పారిశ్రామికనేతలకు మార్గదర్శకమైన రీతిలో ప్రయోగాత్మకంగా తన పారిశ్రామిక, వాణిజ్య సంస్థలను నిర్వహిస్తుంది.

ప్రభుత్వరంగంలోని పారిశ్రామికవ్యవస్థలో ఆర్థికసంస్థలూ, ఉత్పత్తి, వాణిజ్య సంబంధమైన ఇతర సంస్థలూ అని రెండు తెగలున్నట్లు తెలుసుకొన్నాము. వీనిలో ఆర్థిక సంస్థలు రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత గత రెండు మూడు దశాబ్దాలలో ప్రచారంలో కొచ్చాయి. సాంప్రదాయికంగా అన్ని దేశాలలోనూ తంతి, తపాలాశాఖను ప్రభుత్వమే నిర్వహిస్తున్నది. పెక్కు దేశాలలో రైలు, రోడ్డు మార్గాల నిర్మాణం, రవాణా ప్రభుత్వ నిర్వహణలోనే ఉన్నాయి. ఇవికాక జన సామాన్యోపయోగంకల నీటి సరఫరా, విద్యుచ్ఛక్తి సరఫరా మొదలయిన కార్యక్రమాలను తప్పనిసరిగా ప్రభుత్వమే స్వీకరిస్తుంది. వర్ధమాన దేశాలలోని ప్రభుత్వం ఇనుము, ఉక్కువంటి మౌలిక పరిశ్రమలను, భారీ యంత్ర పరికరాలు, విద్యుచ్ఛక్తి పరికరాలు, ఎరువులు, రసాయన పదార్థాలు మొదలగు వాని ఉత్పత్తి, రైళ్ళు, ఓడలు, విమానాల నిర్మాణం, అంతర్జాతీయ వాణిజ్యంవంటి వివిధ పారిశ్రామిక కార్యకలాపాలను స్వయంగా నిర్వహిస్తున్నది అంతేకాక వ్యవసాయ ప్రధానమైన దేశాలలో పెద్ద పెట్టుబడి, సాంకేతిక విజ్ఞానం ఆవశ్యకమైన భారీ ఆనకట్టల నిర్మాణాదికాలు ప్రభుత్వాధిపత్యంలోనే ఉన్నాయి. మధ్యతరగతి ప్రజలకై గృహ నిర్మాణం, గడియారాలు, రేడియోలు మొదలైన ప్రత్యక్ష వినిమయంగల వస్తువుల ఉత్పత్తి కూడా ప్రభుత్వరంగానికి క్రొత్త కాదు. బ్యాంకింగ్ ఇన్సూరెన్స్‌వంటి కీలకమైన మరికొన్ని పరిశ్రమలను ప్రభుత్వం జాతీయీకరణ ద్వారా వ్యష్టిరంగంయొక్క ఆధిపత్యాన్నుండి తప్పిస్తున్నది. ఈవిధంగా బహుముఖమైన ప్రభుత్వ రంగంయొక్క విస్తరణకు కేవలం వ్యష్టిరంగంలోని అశక్తతయే కాక, పైన చెప్పినట్లుగా ఆర్థికరంగంపై వీలయినంత ఎక్కువ నియంత్రణాధికారం కావాలన్న ప్రభుత్వంయొక్క ఆసక్తికూడా ప్రధానమైన కారణమే.

ప్రభుత్వరంగం విస్తరిస్తున్నకొలదీ ఆ యా పారిశ్రామిక వాణిజ్య సంస్థల నిర్వహణ స్వరూపం మారిపోతున్నది. ప్రస్తుతం మూడు రకాలుగా ఈ సంస్థలు నిర్వహింపబడుతున్నవి. సాంప్రదాయికంగా ప్రభుత్వశాఖవలె నిర్వహింపబడడం ఒక పద్ధతి. తంతి తపాలాశాఖ, రక్షణశాఖకు చెందిన పరిశ్రమలు, కొన్ని దేశాలలో రవాణా, ఆకాశవాణి కేంద్రాలు ఈ పద్ధతిలో ప్రభుత్వంలోని అంతర్గతభాగాలుగా నిర్వహింపబడుతున్నవి. లాభార్జన దృష్టితో పని చేయని సంస్థలను ప్రభుత్వ శాఖలుగా నిర్వహించడం సుకరం. కాని, వాణిజ్య విధానాలకు, సామాన్యంగా ప్రభుత్వ కార్యాలయాలలో అనుసరించే నియమ నిబంధనలకు పొత్తు కుదరకపోవటం చేత ప్రభుత్వ పరిశ్రమలకు స్వతంత్రంగా పని చేయగల మరొక విధానం ఆవశ్యకమయింది. ఈ లక్ష్యానికి కనుగుణంగా, పార్లమెంటులో ప్రత్యేక చట్టాల ద్వారా ఏర్పరుపబడిన కార్పొరేషన్లు బహుళ ప్రచారంలోనికి వచ్చాయి. కార్పొరేషన్లు ప్రధానమైన నిర్వహణ విధానాలలో మాత్రం ప్రభుత్వానికి లోబడి, దైనిక వ్యవహారాలలో అనుకూలమైన పద్ధతుల నేర్పరుచుకొని స్వతంత్రంగా వ్యవహరించగలవు.

సాధారణంగా పారిశ్రామిక, వాణిజ్య సంస్థలన్నీ కార్పొరేషన్లుగా ఉండవచ్చును. అయితే, బహుళంగా పెరిగిపోతున్న ప్రభుత్వ సంస్థలకు ప్రత్యేక చట్టాల నేర్పరచడం కష్టతరం కనుకనూ, వ్యష్టిరంగంతో మరింత సామ్యం సంపాదించుకుని వాణిజ్య సంబంధమైన సమగ్రతను పెంపొందించుకునేందుకున్నూ మూడవదైన జాయింట్ స్టాక్ కంపెనీ విధానం ప్రారంభమయింది. ఈ విధానంలో, వ్యష్టిరంగంలోని పరిశ్రమలు ఏ చట్టంక్రింద స్థాపింపబడినవో, అదే చట్టంక్రింద ప్రభుత్వం భాగస్వామిగా ఉండి పరిశ్రమలను స్థాపించి, వ్యష్టిరంగంలో మాదిరిగానే నిర్వహిస్తుంది. ఈవిధానంలోనూ, పారిశ్రామిక సంస్థలు ప్రభుత్వంయొక్క ప్రధానాధికారానికి లోబడి ఉంటూనే స్వతంత్రంగా వ్యవహరించగలవు. కంపెనీ విధానం ప్రచారంలో ఉన్న దేశాలలో ప్రధానమైన ప్రభుత్వ విధానాలను ఆచరణలో ఉంచవలసిన సంస్థలనూ, ఆర్థిక సంస్థలనూ, ఏకాధిపత్యం వహించిన పారిశ్రామిక సంస్థలనూ కార్పొరేషన్లుగా ఉంచి, తక్కినవానిని కంపెనీలుగా స్థాపించడం పరిపాటి. అయితే ఇదే నిశ్చితమైన విధానమని కాదు. ఆ యా ప్రభుత్వాల ఇచ్ఛానుసారంగా ఏ పారిశ్రామిక, వాణిజ్య సంస్థ అయినా కార్పొరేషనుగా కాని, కంపెనీగా గాని నిర్వహింపబడవచ్చు.

## 6

వర్ధమానదేశాలలో ఇప్పుడు ప్రభుత్వరంగంలోని పారిశ్రామిక వ్యవస్థ ఎదుర్కొంటున్న కొన్ని ప్రత్యేక సమస్యలను సంగ్రహంగా పరిశీలిద్దాము. ఈ సమస్యలకు కారణం ఆ యా పరి

శ్రమలు ప్రభుత్వరంగంలో ఉండడమే అయినా, ఈ క్రింది కారణాలను వేర్పరచి చెప్పవచ్చును.

అ. ఈ పరిశ్రమల యాజమాన్యం దేశంలోని ప్రజలందరిదీ కావడం.

ఆ. పరిశ్రమలపై ప్రభుత్వం నియంత్రణాధికారాన్ని కలిగిఉండడం.

ఇ. ఈ రంగంలోని పారిశ్రామిక సంస్థల ప్రధానలక్ష్యం లాభార్జనపరమైనదికాక, సాంఘిక సంక్షేమమూ, అనుబంధ పరిశ్రమలను ప్రోత్సాహ మివ్వడమూ అయిఉండడం.

వ్యష్టిరంగంలోని పరిశ్రమల యాజమాన్యం పెట్టుబడిలో భాగస్వాములైన కొందరు పరిమిత వ్యక్తులకు చెంది ఉంటుంది. ఆ యా పారిశ్రామిక సంస్థలలో వీరి శ్రద్ధ లాభార్జనవరకు మాత్రమే పరిమితమై ఉంటుంది మరిన్నీ జాయింట్ స్టాక్ కంపెనీ రూపంలో ఉన్న సంస్థల పరిమాణం పెరుగుతున్న కొద్దీ, సంస్థయొక్క నిర్వహణకు, యాజమాన్యవర్గానికీ మధ్యన ఉన్న సంబంధం తరుగుతున్నది. భాగస్వాములలో పలుకుబడిగల ఏ ఇరువురు ముగ్గురో సంస్థ నిర్వహణతో ప్రత్యక్ష సంబంధం కలిగిఉండడం, తక్కిన భాగస్వాములలో అధిక సంఖ్యాకులకు సంస్థ వ్యవహారాలను గురించిన ప్రాథమిక పరిజ్ఞానం కూడా లేకపోవడం, వ్యవహారాలపై ఆసక్తి కలిగిన వారికైనా మొత్తం లాభంలో తమకు సంక్రమించే స్వల్పభాగం దృష్ట్యా సంస్థ సమావేశాలన్నిటికీ హాజరు కావలసిన ఆవశ్యకతా, తీరుబడీ లేకపోవడం—వీటన్నిటిమూలాన, సంస్థలోని నిర్వాహకవర్గంవారు వ్యాపార వ్యవహారాలలో పూర్తి స్వాతంత్ర్యం అవలంబించే అవకాశం కలుగుతున్నది.

ప్రభుత్వ సంస్థల పెట్టుబడి నిధులు ప్రజలు చెల్లించిన పన్నులద్వారా, ఇతర ఋణాలద్వారా సేకరించినవే కనుక, ఆ సంస్థలకు న్యాయమైన పెట్టుబడిదారుల స్థానంలో ఉన్నవారు ప్రజలు. కాని ప్రజ లందరూ ఒక వర్గానికి చెందినవారుకాని, ఒకే దృక్పథం కలవారుగాని కాకపోవడంవలన, భిన్న వర్గాల ప్రయోజనాలమధ్య సామరస్యం కరువవుతున్నది. ఒక వర్గానికి ప్రయోజనకారి అయినది మరొక వర్గానికి నష్టకారి అవుతున్నది. తత్ఫలితంగా దీర్ఘకాలంలో ప్రభుత్వ సంస్థలన్నీ ఆర్థికాభివృద్ధికి తోడ్పడవలసినవే అయినా, వాని తక్షణ గమ్యమేమిటో స్పష్టంగా, ఒక సాధారణ ప్రాతిపదికపై నిర్ణయింపబడలేదు.

ఇక ప్రజలకూ, వారి యాజమాన్యంలోనివని చెప్పబడుతున్న సంస్థలకు మధ్యనున్న సంబంధం వ్యష్టిరంగంలోని పెట్టుబడిదారులైన భాగస్వాములకూ, వారి సంస్థలకూ మధ్యనున్న సంబంధంకన్నా గరిష్ఠమైనది, విశిష్టమైనది కూడాను. ప్రజలలోని భిన్న వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తూ పార్లమెంటుకు ఎన్నికైన రాజకీయ నాయకులు ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలపై ప్రత్యక్ష పరిశీలనాధికారం కోరవచ్చు. ఆ 'ప్రత్యక్ష పరిశీలన' తరచు కేవలం ఆర్థిక విషయాలకు మాత్రమే పరిమితం అయి ఉండకపోవచ్చు; రాజకీయాలచే కూడా ప్రభావితంకావచ్చు. ప్రతిపక్ష సభ్యులు గోరంతలను కొండంతలు చేయ ప్రయత్నించగా, అధికార పక్ష సభ్యులు అసలు లోపాలనే కప్పిపుచ్చడానికి ప్రయత్నించడం జరుగవచ్చు. ప్రజలలో త్వరితంగా వ్యాపించే ఈ కీర్త్యపకీర్తులు అటుండగా, పార్లమెంటు సభ్యుల బృందాలు అనేకం అనేక కమిటీల పేరుతో పారిశ్రామిక సంస్థలను దర్శిస్తూ వాని ఆంతరంగిక విషయాలలో కూడా జోక్యం కల్పించుకో యత్నించడంవలన ఆ యా సంస్థల నిర్వాహకవర్గ స్వాతంత్ర్యానికి చెప్పుకోదగిన భంగం కలుగుతున్నది.

అయితే, ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలు ఏ విషయంపైనైనా పార్లమెంటుకు సంజాయిషీ చెప్పుకోవలసిన అవసరం లేదా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. నైతికంగా ఈ అవసరం సర్వదా ఉన్నది కనుక పార్లమెంటు సభ్యులు ఆ యా సంస్థల నిర్వహణను పర్యవేక్షించడం సమంజసమే. కాని, ఈ పర్యవేక్షణ సర్వులకూ ఆమోదయోగ్యంగా కొనసాగడానికి కొన్ని స్థితిగతులు ఏర్పాటు చేసుకోవలసి వుంటుంది. పార్లమెంటుకూ, ప్రభుత్వ సంస్థలకూ మధ్యనగల సంబంధాలలో ఒక స్థిరమైన సంప్రదాయం ఏర్పడడం అవసరం. అంతేకాక, పర్యవేక్షణ రాజకీయాల నుండి ఆర్థిక విషయాలను వేర్పరచి చూడడం, పర్యవేక్షణ ఆ యా సంస్థల ముఖ్యమైన 'విధానాలకు' మాత్రమే పరిమితమై నైమిత్తిక వ్యవహారాలకు దూరంగా ఉండడం మొదలయినవిగా ఉండాలి. ప్రధానంగా నేడు వర్ధమాన దేశాలలో లోపిస్తున్నవి కూడా ఇవే. పై స్థితిగతులు లోపించిన పక్షంలో, అవసరానికి మించిన పర్యవేక్షణ అవినీతికీ, అక్రమ ఆరోపణలకూ దారి తీస్తుంది.

పార్లమెంటుకూ, ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలకూ మధ్యన ప్రభుత్వం ఉంటుంది. సంస్థల లోటుపాట్లకు ప్రభుత్వం పార్లమెంటులో సమాధానం చెప్పుకోవలసిఉండగా, సంస్థ అధిపతులు ప్రభుత్వానికి బాధ్యత వహించవలసి ఉంటుంది. ప్రభుత్వ రంగంలోని సంస్థలపై ప్రభుత్వ నియామకం పలురకాలుగా ఉండవచ్చు. కార్పొరేషన్ల విషయంలో, ఆ యా కార్పొరేషన్లకు సంబంధించిన ప్రత్యేకమైన చట్టాలలో ప్రభుత్వ నియామకం యొక్క పరిమితి విధింపబడి ఉంటుంది. కాని, జాయింట్‌స్టాక్ కంపెనీల విషయంలో ప్రభుత్వం స్వేచ్ఛానుసారంగా వాని విధానాలను రూపొందించడంలోనూ, నిత్య వ్యవహారాలలోనూ కల్పించుకోవచ్చు. సాధారణంగా ఇట్టి సంస్థల నిర్వాహకవర్గానికి అధ్యక్షుడుగా, ఒక కేంద్రమంత్రిగాని, లేదా ఒక ప్రభుత్వశాఖకుచెందిన సెక్రటరీ, జాయింట్ సెక్రటరీవంటి సీనియర్ అధికారిగాని నియమింపబడుతాడు. ఆయా సంస్థల ప్రధాన అధికారులు సివిల్ సర్వీస్‌కు చెందినవారు కావడంవలన ప్రభుత్వం తన అదీనంలోని సంస్థలతో ప్రత్యక్ష సంబంధం కలిగిఉంటుంది. ప్రధానమైన విధాన విషయాలలోనేగాక, మంత్రిమండలిగాని, ప్రభుత్వాధికారులుకాని తమ అధికారాన్ని ఉపయోగించి ఇతర వ్యవహారాల్లో కూడా తరచు పరోక్షంగా జోక్యం కల్పించుకొనడం అనివార్యమవుతుంది. ఈ విధమైన 'బ్యాక్ సీట్ డ్రైవింగ్' వలన,

వారి అధికారాన్ని ప్రశ్నించలేని సంస్థ నిర్వాహకవర్గం వారు తాము స్వతహాగా చేయని పనులకు కూడా ప్రజలకు సమాధానం చెప్పుకోవలసిన నిస్సహాయస్థితిలో ఉండిపోతారు. ఈ పరిస్థితికి కూడా స్పష్టమైన సంప్రదాయం ఏర్పడకపోవడమే ప్రధాన కారణం.

ఈవిధంగా సివిల్ సర్వీసులకు చెందినవారు ప్రభుత్వ సంస్థలపై ఆధిపత్యం వహించడానికి వ్యష్టిరంగంలో సమర్థులైనవారు లభించకపోవడమేగాక, ప్రభుత్వం తన నియంత్రణాధికారాన్ని ఏమాత్రమూ తగ్గించుకోలేని స్థితిలో ఉండడం కూడా కారణమే. ప్రభుత్వ పాలన రీతుల కలవాటుపడిన సివిల్‌సర్వీసు అధికారులు అనేక పరిస్థితులలో వ్యాపారానుగుణమైన సంస్థల నిర్వహణలో సామర్థ్యం ప్రదర్శించలేకపోవడం కూడా కద్దు. అయితే ప్రభుత్వం ఈ విషయాన్ని గుర్తించే వ్యష్టిరంగంలోని ప్రసిద్ధులైన పారిశ్రామికవేత్తలను తరచు ఆహ్వానిస్తుంది. కాని వేతనాలు తక్కువగా ఉండడము, ప్రభుత్వాధికారుల పెత్తందారీ పద్ధతులను అన్నివేళలా ఆకర్షించలేవు.

ప్రభుత్వరంగంలోని పరిశ్రమలను గూర్చిన అధిక వివాదాస్పదమయిన విషయాలు ఆ యా సంస్థల లక్ష్యాలకు సంబంధించి ఉన్నాయి. వ్యష్టిరంగంలోని సంస్థలవలెగాక, ప్రభుత్వసంస్థలు ప్రజోపయోగంకొరకు సృష్టింపబడినవి కాన, లాభాలతో నిమిత్తం లేకుండా సాంఘిక సంక్షేమమే ప్రధానంగా వర్తించవలెనన్నది ఒక సాంప్రదాయికవాదం. ఉదాహరణకు : రోడ్డు, రైలుమార్గాలు ఆర్థికంగా లాభసాటికాని పల్లె ప్రాంతాలలో కూడా నిర్మించవలసివస్తుంది. వ్యవసాయాభివృద్ధినిమిత్తం విద్యుచ్ఛక్తి రైతులకు తక్కువ ధరలలో సరఫరా చేయవలసి రావచ్చు. అనుబంధ పరిశ్రమల అభివృద్ధికై, లేదా నిరుద్యోగ నిర్మూలనకొరకై కొన్ని ఖాదీ పరిశ్రమలను కొంత నష్టానికి సహించి కూడా నిర్వహించవలసివస్తుంది. ఈవిధంగా సంక్షేమ, అభివృద్ధి కారణాలవలన నష్టపోయిన సంస్థలకు ప్రభుత్వం సబ్సిడీల రూపంలోనూ, ఋణాలరూపంలోనూ సహాయం చేస్తుంది.

అయితే ప్రజా సంక్షేమ, అభివృద్ధి సంబంధమైన లక్ష్యాలు ఎంతవరకు నెరవేరినవో నిర్దిష్టంగా చెప్పగలగడం అంత సులభమైన పనికాదు. నష్టపోయిన ప్రతి పారిశ్రామిక సంస్థా ఈ సాకుతో తన అసమర్థతను కప్పిపుచ్చుకోవచ్చును. సాంకేతిక, నిర్వహణ సంబంధమయిన లోపాలవలన కలిగిన నష్టాన్నీ, సాంఘిక లక్ష్యానుగుణమైన ప్రత్యేక సౌకర్యాలు ఏర్పరచడంవలన కలిగిన నష్టాన్నీ వేర్పరచి చెప్పేందుకు సులువైన సాధనాలు లేవు. సాంఘిక ప్రయోజనం ప్రత్యక్షంగా కనిపిస్తున్నప్పటికీ, సాపేక్షమైన దాని విలువను ఇంత అని నిర్ణయించి చెప్పడం అసాధ్యం. మరిన్నీ సాంఘిక ప్రయోజన మన్నది కొన్ని ప్రజోపయోగి, పబ్లిక పరిశ్రమలకు మాత్రమే వర్తిస్తుంది కాని, నేడన్ని రంగాలలోనికీ విస్తరించుకుపోతున్న ప్రభుత్వ వ్యవస్థలోని ప్రతి పారిశ్రామిక సంస్థకూ నిర్నిమిత్తంగా వర్తించదు.

ప్రభుత్వ సంస్థల సామర్థ్యాన్ని బేరీజు వేస్తున్నప్పుడు వ్యష్టిరంగంలోని సంస్థలతో పోల్చిచెప్పడం తప్పనిసరి అవుతుంది. ఒక పారిశ్రామిక సంస్థ వ్యష్టిరంగంలో ఉండి అధిక లాభాల నార్జించగలిగిఉన్నప్పుడు, అదే సంస్థ ప్రభుత్వరంగంలో ఉండి నష్టకారకం కావడం సమర్థనీయం కాదు. ప్రభుత్వరంగంలోని పరిశ్రమలు—కొన్ని ఆవశ్యకమైన ప్రజోపయోగి పరిశ్రమలు మినహాయించి— వ్యష్టిరంగంతో పోటీపడి లాభాల నార్జించినపక్షంలో మాత్రమే వాని నిర్వహణ సామర్థ్యం వెల్లడవుతుం దన్నది మరొక వాదం. లాభాల నుద్దేశించకపోయినా కనీసం నష్టాలకు గురికాకుండా ప్రభుత్వ సంస్థలు స్వయం సంపూర్ణతను కలిగి ఉండాలని దీనికి అనుబంధమైన మరొకవాదం కూడా ఉన్నది. ప్రభుత్వంనుండి కనీస సహాయం మాత్రమే స్వీకరించడంవల్లా, లాభాల నార్జించి అదనపునిధులను చేకూర్చడంవల్లా ప్రణాళికలో ఉద్దేశించిన అభివృద్ధి కార్యక్రమాలకు తోడ్పడడం ప్రభుత్వ పారిశ్రామిక సంస్థల బాధ్యత అన్నది ఈ వాదాలలో అంతర్గతమైన సూత్రం. లాభ నష్టములు ఉత్పత్తి, వినిమయముల విషయంలో నిర్వాహకులు ప్రదర్శించే సామర్థ్యానికి నిర్దిష్టమూ, స్పష్టమూ అయిన కొలబద్దలు కాగలవని వీరి వాదన.

అయితే పలు దేశాలలో ప్రభుత్వరంగంలోని పారిశ్రామిక సంస్థలు ఏకాధిపత్యం కలవిగా గాని, లేక ఆయా పరిశ్రమలలోని ఇతర సంస్థలనన్నిటినీ పరోక్షంగా శాసించగల సామర్థ్యం కలవిగా గాని ఉంటున్నవి. ఈ కారణంవల్ల లాభార్జనయే ప్రధానంగా కావలసి ఉన్నప్పుడు, ఆ యా సంస్థలు తమ ఉత్పత్తుల ధరలను అమితంగా పెంచి లాభాలను ఆర్జించడంవలన కృత్రిమ సామర్థ్యం ప్రదర్శితం కావచ్చు. లాభాల నుద్దేశించడంలో పరమార్థం ఉత్పత్తి ఖర్చులను తగ్గించుకొని నిర్వహణ సామర్థ్యం పెంపొందించుకోవలెనని మాత్రమేకాని, సాంకేతిక లోపాలను యథాతథంగా ఉంచుకొని పోటీదారులేని కారణంగా ధరలను పెంచి లాభాల నార్జించమని కాదు. ప్రమాదంనుండి తప్పుకొనేందుకు హేతుబద్ధమైన ఉత్పత్తి ఖర్చులకు,ఒక పరిమితమైన లాభశాతాన్ని కలుపుకొని వినియోగదారులకు అందుబాటులోగల ఉచితమైన ధర నిర్ణయించడం అవసరం. అయితే, తిరిగి 'హేతుబద్ధమయిన ఖర్చులు' 'యోగ్యమైన ధర' అన్నవి సాపేక్షపదాలు—పరస్పరం పోటీ పడుతున్న సంస్థలు ఉత్పత్తి నాణ్యానికి భంగం లేకుండా, ఖర్చులను, తద్వారా ధరలను ఎంత కనీస స్థాయికి తగ్గించగలవో, ఆ కనీస ఖర్చులూ, ధరలూ హేతుబద్ధమైనవీ,యోగ్యమైనవీ అని నిర్వచింపవచ్చును. కనుక ప్రభుత్వ సంస్థలలో పరస్పరంగాని, ప్రభుత్వ సంస్థలకూ, వ్యష్టి సంస్థలకూ మధ్యకాని 'పోటీ' లేక 'స్పర్ధ' ఉండడం ఆవశ్యకమని తేలుతున్నది. అయితే తిరిగి ఏకాధిపత్యంగల సంస్థలు చిన్న చిన్న సంస్థలుగా చీలిపోవడం నిర్వహణ దృష్ట్యా అసౌకర్యం కలుగజేస్తుంది.

ప్రభుత్వ సంస్థల ఏకాధిపత్యంవలన వ్యష్టిరంగంలోని ఏకాధిపత్యంకన్నా కొన్ని ప్రత్యేకమైన ప్రమాదా లున్నాయి. కొన్ని ఉత్పత్తుల ధరల విషయంలో (ఉదా: విద్యుచ్ఛక్తి, రవాణా) సమాజంలోని కొన్ని వర్గాలకు సౌకర్యం కలుగజేసేందుకుగాను

విచక్షణా పూరితమైన విధానాన్ని అవలంబిస్తుంది. అందువలన ఒకే రకమైన ప్రయోజనం పొందిన రెండు వర్గాలలో ఒక వర్గం ఉత్పాదక వ్యయంతో లాభశాతాన్ని కలుపగా వచ్చే న్యాయమైన ధరకన్నా అధికంగా చెల్లించడం, రెండవవర్గం అంతకన్నా తక్కువ ధర చెల్లించడం జరుగుతున్నది. ఆర్థికంగా ఉచ్చదశలో ఉన్న మొదటివర్గంవారు చెల్లించే ధరలోని 'అధిక భాగం' ప్రభుత్వం వసూలుచేసే 'రాబడి పన్ను' రకానికి చెంది ఆదాయాలలో వ్యత్యాసాలను తగ్గించేందుకు ఉపయోగపడుతుంది. ఈ విధమైన 'పన్ను' లను కలుపుకొన్న ధరల నిర్ణయాధికారం పార్లమెంటుకు ఉండవలసిందే తప్ప, ప్రభుత్వానికిగాని, ఆ యా సంస్థలకుగాని నిర్ణిమిత్తంగా ఉండకూడదని ఒక ముఖ్యమైన వాదన ఉంది. ఈ విధమైన అధికారాన్ని హస్తగతం చేసుకొన్న ప్రభుత్వం—అనగా అధికారంలో ఉన్న పార్టీ, అధికారాన్ని దుర్వినియోగంచేసే ప్రమాదం సర్వదా ఉన్నది.

వ్యష్టిరంగంలోని ఏకాధిపత్యంవలన కొన్ని పరిమితమైన ప్రమాదాలు మాత్రమే ఉండగా, ప్రభుత్వరంగంలోని ఏకాధిపత్యంవలన—రాజకీయాలతో ప్రమేయం ఉన్న కారణాన—అపరిమితమైన ప్రమాదం ఉంది. ఈ విషయంలో నిపుణులైన ప్రొఫెసరు రామనాథంగారు ఈవిధంగా అభిప్రాయపడుతున్నారు: "వివేకంతో పరిష్కరించుకోలేని పక్షంలో, ప్రభుత్వ పారిశ్రామిక సంస్థల ఏకాధిపత్యం, వ్యష్టిరంగంలోని ఏకాధిపత్యంకన్నా ప్రమాదకరమై విషమ పరిణామాలకు దారితీయగలదు." ప్రభుత్వ సంస్థలకు సంబంధించి ధరలు, ఉత్పత్తి వినిమయ విధానాలు మొదలయిన విషయాలను సమగ్రంగా నిశ్చయించగల 'పబ్లిక్ ఎంటర్ ప్రైజ కమిషన్' వంటి ఒక కేంద్రీయసంస్థ అవసరమని కూడా వారు సూచిస్తున్నారు.

వర్ధమాన దేశాలలో ప్రభుత్వరంగానికి ప్రత్యేకమైన కార్మిక సమస్యలున్నాయి. అవసరానికి మించిన కార్మికులను కలిగిఉండడం, నిరుద్యోగిత కారణంగా వారిని తొలగించలేకపోవడం చాలా ప్రభుత్వ సంస్థలలో ప్రత్యక్షమైన విషయం. ఇందువలన ఎక్కువ పొదుపుకు అవకాశంగల ఆధునిక సాంకేతిక విధానాలను పూర్తిగా వినియోగించుకో వీలులేకపోతున్నది. ప్రభుత్వ ఆదర్శాల కనుగుణంగా ఈ సంస్థలలో కార్మిక సౌకర్యాలకై వెచ్చింపబడే మొత్తం వ్యష్టిరంగానికన్నా ఎక్కువ. తరచు యాజమాన్యంలో కూడా కార్మికులకు పాలు ఉంటుంది. అయినా, ప్రభుత్వ సంస్థలన్నిటిలో అనురూపమైన కార్మిక పరిస్థితులు ఉండ వీలు కానందువలన క్రొత్త ఇబ్బందులు బయల్దేరుతున్నవి.

మొత్తంపై ప్రభుత్వరంగంలోని పరిశ్రమల సమస్యలు వ్యష్టిరంగంలోని వానికన్నా ప్రత్యేకమైనవీ, క్లిష్టతరమైనవీ. ఈ సమస్యలయొక్క సాధారణమైన కారణాలను ఈ విభాగం మొదట్లో పేర్కొన్నాము. వర్ధమానదేశాలలో ఈ సమస్యలు క్లిష్టతరంగా ఉండడానికి, వానినే కొద్దిగా మార్చి ఈ క్రిందివిధంగా పేర్కొనవచ్చు:

1. పార్లమెంటరి ప్రజాస్వామ్యంలో ఆర్థికరంగానికి సంబంధించినంతవరకు నిశ్చితమైన సంప్రదాయాలు ఏర్పడనందున రాజకీయాలు, ఆర్థిక విషయాలు కలగాపులగమవుతున్నవి.

2. ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలకు వేరు వేరుగా నిర్దిష్టమైన లక్ష్యాలు, వానిని సాధించే విధానాలు నిర్వచింపబడలేదు.

3. ప్రభుత్వరంగంలో అనివార్యమైన ఏకాధిపత్యాన్ని, నియమించేందుకుగానీ, నిరోధించేందుకుగానీ తగిన మార్గాలు ఇంకా అన్వేషించవలసి ఉంది.

పై మూడు విషయాలను నిర్వివాదంగా పరిష్కరించుకోగలిగినప్పుడు ప్రభుత్వరంగం ఇతోధిక సామర్థ్యంతో, ఆర్థికాభివృద్ధికి నిజమైన తోడ్పాటును ఇవ్వగలుగుతుంది.

## అనుబంధం

పై చర్చల దృష్ట్యా వర్ధమానదేశాలలో ప్రముఖంగా గణింపబడుతున్న భారతదేశంలో ప్రభుత్వ పారిశ్రామిక వ్యవస్థ వివరాలను సంగ్రహంగా తెలుసుకోవడం ఉచితం.

భారత ప్రభుత్వం ప్రణాళికాబద్ధమైన పురోగమనం సాగింపదలచింది. 1951 సం. నుండి ప్రారంభమై ఇప్పటికి మూడు పంచవర్ష ప్రణాళికలు పూర్తికాగా ప్రస్తుతం నాలుగవ పంచవర్ష ప్రణాళిక అమలులో వుంది. రెండు శతాబ్దాల బ్రిటిషు పాలన ముగిసేనాటికి దేశంలో అటు పారిశ్రామికరంగంకాని, ఇటు వ్యావసాయికరంగంకాని స్వయంసమృద్ధికరమైన దశలో లేవు. వ్యవసాయంలో ఇంకా పురాతన పద్ధతులే కొనసాగుతుండడము, రసాయనిక ఎరువులూ, ఆధునికోపకరణాలూ కొరవడి ఉండడమూ, మౌలిక పరిశ్రమల ప్రారంభించేందుకు అవసరమైన పెట్టుబడీ, నిర్వహణ సామర్థ్యమూ వ్యష్టిరంగంలో లభ్యం కాని స్థితీ మొదలైన కారణాలవల్ల ప్రభుత్వమే ప్రధానంగా త్వరితగతి పారిశ్రామికీకరణకై పూనుకొనవలసివచ్చింది. అయితే వ్యష్టిరంగాన్ని పూర్తిగా మినహాయించడం ప్రభుత్వోద్దేశం కాదు. కేవలం కీలకమైన పరిశ్రమలు మాత్రమే ప్రభుత్వం చేపట్టి తక్కిన పరిశ్రమలన్నీ వ్యష్టిరంగంలోనే ఉండేట్లుగా రెండు రంగాల సమన్వయంకొరకై ఒక మిశ్రమ విధానం రూపొందించబడింది.

1956 వ సంవత్సరంలో భారత ప్రభుత్వం అంగీకరించిన పారిశ్రామిక విధానం పరిశ్రమలన్నిటికీ మూడు తరగతులుగా విభజిస్తున్నది. మొదటి తరగతికి చెందిన ఆయుధాలు, యుద్ధ పరికరాలు, అణుశక్తి, ఇనుము, ఉక్కు, భారీ యంత్ర పరికరాలు మొదలైన పరిశ్రమలన్నీ పూర్తిగా ప్రభుత్వరంగానికై ప్రత్యేకించబడినాయి. రెండవ తరగతిలో తక్కిన లోహాలు, యంత్రపరికరాలు, రసాయనాలు, ఎరువులు మొదలైనవానికి సంబంధించిన పరిశ్రమ లున్నాయి. ఇవి వ్యష్టిరంగం అధీనంలోనే ఉన్నా ప్రభుత్వం క్రమంగా ఈ పరిశ్రమలలో ప్రవేశించి ప్రముఖపాత్ర వహిస్తుంది. మూడవ తరగతికి చెందిన మిగతా పరిశ్రమలన్నీ పూర్తిగా వ్యష్టిరంగానికై వదలివేయబడినవి. దేశ పారి

శ్రామికాభివృద్ధి బాధ్యతను ప్రభుత్వరంగంతో సమానంగా వ్యష్టి రంగం పంచుకోవలసిన అవసరాన్ని ఈ విధానం స్పష్టపరుస్తున్నది.

పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన అంతర్వ్యవస్థితి కల్పించడమేగాక, ప్రణాళికానుగుణమైన అభివృద్ధిని సాధించ వలసిన అవసరంవల్ల ప్రభుత్వ పారిశ్రామికరంగం అతిమాత్రంగా విస్తరించింది. కేంద్ర ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలలో పెట్టుబడి ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఆరంభంలో 29 కోట్ల రూపాయలు మాత్రమే కాగా, 1967 మార్చి చివరన 2841 కోట్ల రూపాయలకు పెరిగినది. ఇందులో సుమారు రు. 1069 కోట్ల పెట్టుబడి కేవలం ఉక్కు పరిశ్రమలోనే ఉంది. మూలధనం దృష్ట్యా నేడు ప్రభుత్వరంగం, వ్యష్టిరంగంతో సమానంగా ఉంది.

వ్యష్టిరంగంలోని పరిశ్రమలకు సహాయంచేసే నిమిత్తం ఏర్పడిన ఆర్థిక సంస్థలు మొదలుకొని, అంతర్జాతీయ వాణిజ్యం, భారీ విద్యుత్పరికరాల ఉత్పత్తి, చేతి గడియారాల నిర్మాణం, వాయుయానం మొదలైన భిన్నభిన్న శాఖలలోకి ప్రభుత్వపుపెట్టుబడి విస్తరించింది. ప్రభుత్వ సంస్థలలో చాలా భాగం కంపెనీలు కాగా, కార్పొరేషన్లు పరిమితంగా మాత్రమే ఉన్నవి. భారీ విద్యుత్పరికరాలు, యంత్రపరికరాలు, ఎరువులు, రసాయనాలు, దేశీయ వాయుయానం, లైఫ్ ఇన్స్యూరెన్స్ మొదలైన అనేక పరిశ్రమలలో ప్రభుత్వ సంస్థలది ఏకాధిపత్యం కాగా, ప్రభుత్వపు పెట్టుబడిఉన్న తక్కిన పరిశ్రమలన్నిటిలోనూ ప్రభుత్వ సంస్థలే కీలకమైన నియంత్రణాధికారం కల్గిఉంటున్నవి. అంతర్దేశీయ వాయుయానం, వాణిజ్యంవంటి కొన్ని శాఖలలో మాత్రమే ప్రభుత్వం తీవ్రమైన స్పర్ధను ఎదుర్కోవలసివస్తున్నది. కొద్దికాలం క్రితమే జరిగిన బ్యాంకుల జాతీయాకరణతో దేశంలోని ధనంలో అత్యధికభాగం సుమారు 85% ప్రభుత్వ వశమయ్యింది.

ఈదృశమైన విస్తరణతో ఆర్థిక వ్యవస్థపై ప్రభుత్వం యొక్క ప్రత్యక్షాధికారం క్రమంగా వృద్ధిపొందుతున్నది ఈ అధికారం ప్రణాళికాబద్ధమైన పురోగతిని ఇతోధికమైన వేగంతో సాధించేందుకు ప్రయోజనకారి అవుతుందని ఆశించవచ్చు ప్రభుత్వ సంస్థలు పారిశ్రామిక వ్యవస్థను పటిష్ఠం చేయడంద్వారా, ప్రణాళిక కవసరమైన నిధులను సమకూర్చడంద్వారా పురోగతికి తోడ్పడవచ్చు.

అయితే ప్రభుత్వ సంస్థలలోని పెట్టుబడియొక్క సాఫల్యాన్ని పరిగణించేందుకు ఖచ్చితమైన సాధనాలు లేవు ఒక ఆర్థిక చైతన్యాన్ని కలుగజేయడంలోనూ, అనుబంధ పరిశ్రమల ప్రోత్సహించడంలోనూ, జీవనస్థాయిని పెంపొందించడంలోనూ ప్రభుత్వ సంస్థల పాత్రను నిక్కచ్చిగా బేరీజు వేయలేము. ఆ యా సంస్థల నిర్వహణ సామర్థ్యానికి సంబంధించినంతవరకు ఉత్పత్తికైన ఖర్చు, ఆర్జించిన లాభాలు కొలతలుగా ఉపకరిస్తాయికాని, అనేక శాఖలలో ప్రభుత్వ సంస్థలకుగల ఏకాధిపత్యం దృష్ట్యా వీని ప్రయోజనం కూడా పరిమితమే.

స్థూలంగా లాభాలు పెట్టుబడియొక్క సార్థక్యాన్ని సూచిస్తాయనుకోవచ్చు. ఈ దృష్ట్యా ప్రభుత్వరంగం చెప్పుకోదగ్గ ప్రమాణాల నందుకోలేదు మూలధనంలో ప్రభుత్వ, వ్యష్టిరంగాలు సమానమైన భాగాలనే కలిగిఉన్నా, 1966—67 సంవత్సరం దేశంలోని మొత్తంలాభాలలో నూటికి 16 3 వంతులు మాత్రమే ప్రభుత్వరంగం ఆర్జించగలిగింది. ఇదే సంవత్సరంలో కేంద్ర ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలలో 26 సంస్థలు రు. 30 62 కోట్లు లాభం సంపాదించగా, 18 సంస్థలకు రు 53 18 కోట్లు నష్టం వచ్చింది. ఒక్క హిందూస్థాన్ స్టీల్ లిమిటెడ్‌లోనే రు. 20.56 కోట్ల నష్టం సంభవించింది. ఈ సంస్థ స్థాపించినప్పటినుండీ సంభవించిన నష్టం సుమారు రు 60 కోట్లకుపైగా ఉంటుంది అదేవిధంగా హెవీ ఇంజనీరింగువర్క్సు వంటి మరి కొన్ని భారీ సంస్థలు వరుసగా నష్టాన్ని చూపుతున్నవి.

ప్రభుత్వ సంస్థల పరోక్ష ప్రయోజనాలు ఏమైనప్పటికీ, ఈవిధమైన ఆర్థికనష్టం ఎంతో కాలం భరించరానిది. లాభాలకు సంబంధించి నిర్దిష్టమైన విధానం లేకపోవడం, సంస్థల ఏకాధిపత్యంపై, ఉత్పత్తి ఖర్చులపై తగినంత నియామకం లోపించడం, లాభదాయకంకాని రంగాలలో పెట్టుబడి—మొదలైనవి ఈ నష్టాలకు కారణాలు ప్రభుత్వానికీ, ప్రభుత్వ సంస్థలకూ మధ్యనున్న సంబంధాలను నిర్దుష్టంగా నిర్వచించలేకపోవడం, తగిన సంప్రదాయాలు ఇంకా నెలకొనకపోవడం మొదలైన లోపాలు ఈ నష్టాలకు కేవలం సంస్థ నిర్వాహకులు మాత్రమేకాక, వారిని శాసిస్తున్న ప్రభుత్వాధికారులు కూడా కారణమని సూచిస్తున్నవి.

ప్రభుత్వపు పెట్టుబడుల సామంజస్యం ఎట్లున్నప్పటికీ, వానిని ఆశించిన ప్రయోజనాల కనుగుణంగా వినియోగించుకోవలసిన బాధ్యత ప్రభుత్వానిది, ప్రజలదీను. స్పష్టమైన విధానాలను రూపొందించుకొనడంవల్ల అనేక నష్టాలను నివారింపవచ్చు. ప్రస్తుతం ప్రభుత్వరంగంలోని పెట్టుబడుల సార్థక్యాన్ని పరిశీలించుకోకుండా కేవలం విస్తరణమే ప్రధానలక్ష్యంగా పురోగమించే పద్ధతి మానుకొనడం అనేక విధాల శ్రేయస్కరం.



జింక : శ్రీ కొండపల్లి శేషగిరిరావు (హైదరాబాదు).

# పిచ్చిముడి

శ్రీ కె. శివారెడ్డి

ఈ బ్రతు కింతకన్నా
ఉత్తమంగా ఉండటానికి వీల్లేదు,
ఇంతకన్న శుభ్రంగా, శుచిగా
ఉండటాని కసలే వీల్లేదు.
'ఒకటి, రెండు, మూడు'
ఇది జీవన సౌధానికి
సోపాన సిద్ధాంతరాజం.
అందంగా, అనుసరణ యోగ్యంగా
వాడుకోవలసిన ఈ జీవన సత్యాన్ని
కాల్చి నుసిచేసి, ముఖంనిండా
పులుముకుంటే
ఈ బ్రతు కిక్కింతకన్న
మంచి యోగ్యతాపత్ర మెలా లభిస్తుంది?
కాలిన వక్షఃస్థలంలో
కమ్మని చామంతులు మొలవ్వు —
అడుగంటిన మనోనయంలో
అందమైన గులాబులు విరియవు.
తాడు తెగిన
*పతంగికోసం
తలకిందులుగా
పడిపోతున్న పతంగికోసం
'కుచ్చుల తలకర్ర' పుచ్చుకుని
మన్నా, మిన్నా కానక
పరుగెత్తుతూ, పరుగెత్తుతూ
పాపం! కారుకింద పడ్డ

* పతంగి=గాలిపటం.

పిల్లవాని పోలిక — మనిషి
కోరిక అందని పతంగి.
ఆశయం, ఆచరణకి
పెళ్లి జరగబోతోంది
ఈ ప్రపంచం పందింట్లో—
కాని! ఏ మూలో
ఏ పెట్రోమేక్స్ లైటో
కనుతెర జేస్తుంది
మిగిలేది మశనమే!
ఈ పిక్చరే ప్రతివ్యక్తీ
పతితుడయ్యేముందు
ప్రత్యక్షమౌతుంది.
నిర్గుణ, నిస్సార, నిర్జీవ, అకాంతి
అరుచి, అనిర్మల జీవన పతంగి నూహించలేను.
తమస్త్రపాతభరమైన
కబోది బ్రతుకు ముదితను ముద్దాడలేను.
అర్థాన్ని అర్ధాంగిగా
చేసుకోవటం, చూచుకోవటం
మంచిదా—అంటే—మంచిదే—
నిన్నా, నన్నా కబళించనంతవరకు
పూర్తిగా మనగుణాల గుర్తుల్ని తుడిచేసి
తన 'నేమ్‌బోర్డ్' తగిలించుకు ఊరేగనంతవరకు,
అసలంతవరకు
ఏ గుణాన్నైనా పెంచటం
సజీవలక్షణమైతే కావచ్చు
సల్లక్షణం మాత్రం కాదు—
అందమైన అమ్మాయి
బొడ్డుమల్లెలాంటి అమ్మాయి
నల్లని మేఘాలకింద
తెల్లని ఆకాశంలాంటి నుదుటిపై
ఓ చుక్క, 'తిలకం' చుక్కబొట్టు
పెట్టుకుంటే, అందానికే, అందం.
ఆ తిలకాన్నే ముఖంనిండా
పులుముకోవటం లాంటిది—
అర్థంతప్పు జీవితాన్కి వేసే

అర్థమేమున్నది అనే నిర్వచనం.
ప్రాకులాడి, ప్రాకులాడి
లాగులాడి, లాగులాడి
గుంజుకుని, గుంజుకుని
వెనక్కీ ముందుకు, ముందుకీ వెనక్కూ
గాబు అందక, దాహం తీరక
మేకు చుట్టూ
మెలికలు తిరిగి, తిరిగి
ముసాణి బిగిసి
పోరీమన్న గొడ్డు—మనిషి.
ఇదీ అందని బ్రతుకులోని
అసలు సిసలైన రహస్యం.
అందని ప్రాణి పండు జీవన సౌందర్యం
అందనీ సోదు పులుపనుకోదు మనిషి,
అందుకునే ఆరాటంలో
ఒడ్డునపడ్డ చేపలా కొట్టుకు తన్నాడు.
జీవితం
పీట ముడిపడితే
విప్పుకోవచ్చు;
కాని!, పిచ్చిముడి
పడితే వహ్రా తీరి—?—

# తిన్నని కథ - ధూర్జటి కవితాశిల్పము

శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

శ్వపచుం డైనను శివభ
క్తిపరుం డగునేని నతఁడు ద్విజవర్యుం డా
శ్వపచునకుఁ గీడు శివభ
క్తి పరాఙ్ముఖుఁ డైనయట్టి ద్విజుఁడు మహేశా!

శివ సంస్కార విహీనుం
డవు మానవుఁ డంత్యజునకు నత్యంజుఁ డరయన్
శివ సంస్కార నియుక్తుం
డవు మానవుఁ డగ్రజునకు నగ్రజుఁ డరయన్.

అని శివతత్త్వసారకర్త మల్లికార్జున పండితులు వక్కాణించిరి. వీర శైవ కవుల వ్రాత లిట్లుండుటలో వింత యేమున్నది? అట్టిచో బోయవాడగు తిన్నడు శివభక్తి సంపన్నుడు కావున "ద్విజవర్యు" డగును. "అగ్రజునకు నగ్రజు" డగును. ఆ తిన్నని భక్తి యెవరు స్మరింపదగినది గాదు? శివభక్త చరిత్రమై, శివలీలామయమైన "శ్రీ కాళహస్తి మాహాత్మ్యము"లో తిన్నని భక్తిని వర్ణింప కుండుట సాధ్యమా? శైవకవుల ప్రకారము తిన్నడు సమస్త జను లకును పూజ్యుడు. మల్లికార్జున పండితు లేమనిరో వినుడు:

ఎట్టి కడుఁ గీడు కులమునఁ
బుట్టియు శివ! నిన్నుఁ గొలిచి పూజ్యుఁడ మనుజుం
డట్టిద ధర్మువు, రొంపిం
బుట్టియుఁ బద్మంబు సాల పూజ్యము కాదే.

ప్రాచీన కాలమునందు భారతీయులను నడిపించిన శక్తు లలో ప్రబలమైన శక్తి మతము. ఆయా మతానుయాయు లగు కవులు రచించిన కావ్యము లెన్నో కలవు. ఎంతగా మతము మత్తుమందువలె పని చేసినను, కొందరు కవులు కావ్యకళను, రసమార్గమును విస్మరించినవారు గారు. ఆ కొందరలో ధూర్జటి యొకడు. వీర వైష్ణవము వికసించిన కాలములోని వాడైనను, వైష్ణవ ప్రభు నాస్థానములో వర్ధిల్లినవాడైనను ధూర్జటి శైవ కావ్యమును రచించి శివుని కంకితము గావించెను అంతేకాక యీ కవి తన శతకములో చేసిన రాజనింద యింతంత గాదు ధూర్జటి కావ్య రచనా ఘట్ట మానాటి ప్రభువుల, కవుల నడుమ నున్న స్వేచ్ఛాప్రియ సంబంధమునకు తార్కాణము.

ధూర్జటి రచించిన శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో తృతీయాశ్వాసములో పూర్వార్థమునందు కన్నప్పయను తిన్ననికథ కలదు. ఆకథయందు ధూర్జటి చూపిన శిల్పమునుగూర్చి వ్రాయుట యీ వ్యాసము లక్ష్యము. ధూర్జటి తాను రచింపబోవు కావ్యము నందలి భక్తుల ప్రస్తావన కావ్య ప్రారంభ పద్యమునందే చేసెను. "శ్రీ విద్యా నిధియై" యను కావ్య ప్రారంభ పద్యములో "అట విక" శబ్దము కలదు ఆ యాటవికు డెవరో కాదు. తృతీయా శ్వాస పూర్వార్ధ కథానాయకుడైన కన్నప్పయే ఆలంకారికమార్గము ననుసరించి ధూర్జటి కావ్య ప్రారంభ పద్యమునందే వస్తు నిర్దేశము చేసెను. ఈ వస్తు నిర్దేశము తిన్నని కథయున్న తృతీయాశ్వాస ప్రారంభ పద్యమునందు కలదు. ఆ పద్య మిది.

క. శ్రీధర నయనాబ్జ సమా
రాధిత దివ్యాంఘ్రిశోణ రాజీవ! మనో
బాధావహ సంసార
వ్యాధి వ్రజ వైద్య! కాళహస్తీశ! శివా!

విష్ణుమూర్తి నేత్ర పద్మములచే పూజింపబడిన పాదములు కలవాడు శివుడు. శివుని పాదములు ఎర్రదామరలవంటివి. మనో బాధలను కలిగించునట్టిది సంసారము. ఆ సంసార సంబంధమైన వ్యాధుల సమూహమునకు వైద్యుడు పరమశివుడు. ఈ రెండు సంబోధనలును, తృతీయాశ్వాసమునందలి రెండు కథలను సూచిం చుచున్నవి. ఆ యాశ్వాసములో మొదటికథ తిన్ననిది. అతడు తన కన్నులచే శివుని పూజించినవాడు ఇక రెండవ కథ నత్కీరు నిది. నత్కీరుడు రుద్రుని యాగ్రహమున కెరయైనవాడు, కుష్ఠ వ్యాధిని పొందినవాడు. చివరకు సదాశివు నను గ్రహమునకు పాత్రుడైనవాడు' పాత్రుడై నత్కీరుడు

కం ఈ సంసారము దుఃఖా
వాసానందంబు, దీని వర్జింపంగా
నే సుఖము గలుగు దయ న
న్నా సుఖమునఁ గూర్పవే! కృతార్థుఁడ నగుదున్.

అని శివునితో నను ఈ భావమునే తృతీయాశ్వాసాది పద్యము నందలి రెండవ సంబోధనము సూచించుచున్నది. ఈ విధముగా వ్రాయుట కావ్య శిల్పవేత్తయగు వానికే చెల్లును. ధూర్జటి కావ్య శిల్పవేత్త. "మహా దేశిక సార్వభౌముడు" ధూర్జటిని జూచి "ధూర్జటీ! నీ శివభక్తి కావ్య సరణిం గడు ధన్యతఁ బొంద సర్వ భాషా శతధానిగుంభన రస స్థితి వొప్పు దలిర్పఁ జెప్పుమి" యని

యెనెను. గురువుగారి మాటలు పొల్లుపోలేదు. ఇంతటి శిల్పవేత్త యగు ధూర్జటి తిన్నని కథ నెట్లు తిద్ది దీర్చెనో చూతము.

పొత్తపినాటిలో నొక మహారణ్యము కలదు. అందు 'ఉడుమూరు' అను బోయపల్లె కలదు. అది "లోకోత్తర వన్య వస్తువు". "తద్రమోదాత్త మహత్త్వ మద్భుత రసావహము". నిజముగా నాబోయపల్లెయందలివారి పనిపాటులు, ప్రవృత్తి, యద్భుత రసావహములుగా నుండును. ధూర్జటి కవితా ప్రపంచమందలి వాస్తవిక దృష్టి కీ యుడుమూరి వర్ణనము తార్కాణము. ఆ వర్ణనము స్వభావోక్తి రమ్యము ఆ యాటవికుల యమాయికత్వమును, సేద్యనాద్యముల పద్ధతిని, శృంగారమును వాస్తవిక దృష్టితో ధూర్జటి వర్ణించెను. సామాన్య ప్రజా జీవితమును వర్ణింపదలచిన ప్రాచీన కవు లెంతవరకు పోగలరో యీ బోయపల్లె వర్ణనము రుజువు చేయును. ఆ యుడుమూరునందలి బోయ లెట్టివారు?

సీ. స్తబ్ధ రోమ విషాణ లబ్ధ వరౌక్తికములు
బాటింపుదురు రేఁగు పండ్లపాటి
ముక్త కంచుక మస్త ముక్తా ఫలంబుల
మందరింతురు గురువెంద లట్లు
సమద సామజ కుంభజములైన ముత్తియం
బులు జాతు రుసిరికాయల విధమున
వేణు జాతములైన యాణిపూసల నెంతు
రూడుగు పండ్లకు నీడుగాఁగ
తే గీ. గంధ సారాగురుద్రుమ కాష్ఠఖండ
చయము దమయింటి వంట కట్టియలు గాఁగఁ
జేయుదురు కాఁపురంబులు సేయునపుడు
చెంచెతలు చెంచులను గూడి చిత్రలీల.

ఆ బోయవారి చిత్రలీల లెన్నియో కలవు. పరిమళ ద్రవ్యములు వారికి పుష్కలముగా లభించును. నగరములలో నివసించువారికి నేవి లోకోత్తరములో, యేవి యలభ్య పదార్థములో యవి యా యాటవికులకు సర్వ సామాన్యములు; సులభ సాధ్యములు. ఇట్టి సంపద యున్నప్పటికి వారు సమలోష్ఠకాంచనులై స్వధర్మ పరాయణులై యుందురు. వారు భోగలంపటులు గారు.

సీ. పట్టు చీరలఁ గట్ట భాగ్యంబు గల్గియుఁ
బారుటాకులు గట్ట భారమనరు
రాజాన్న భోజన ప్రాభవశ్రీ గల్గి
యును వన్య ధాన్యంబు లొల్లమనరు
మాణిక్య భూషా సమాజంబు కల్గియు
నెర్రని గురివెంద లేటి కనరు
మంచి మెచ్చుల తూఁగు మంచముల్ కల్గియు
జాలుఁ బూఁదీఁగ యుయ్యాల లనరు
తే గీ. ఎంత సంపద గల్గియు నెట్టివారుఁ
దమ కులాగత ధర్మ కర్మములు విడువఁ
జాల, రటుకానఁ దత్పురీ శబర సతులు
మహిమ గలిగియు మానరు సహజవృత్తి.

ఇట్టి ప్రకృతి సంతానమునకు నాధనాథుడు రాజు. ఆతని భార్య తందె. వారి కుమారుడే తిన్నడు. తిన్నడు పుట్టిన యుడుమూరిలో రాగ విరాగములు దోబూచులాడుచుండును. అట్టి పట్టులలో పుట్టిన తిన్ననికి మాత్రము వైరాగ్యము నిసర్గ లక్షణమై యుండదా?

తిన్నని జన్మమె విచిత్రమయినట్టిది. అతడు కడుపులోఁ వడ్డప్పుడు తందె మనఃప్రవృత్తి యెట్లున్నదో చూడుడు.

సీ. పంచాననానేకప వ్యాఘ్రకోలాది
మృగములఁ జంపఁ గామించె నబల
శైలోపకంఠ నిర్ఝర సైకతస్థలి
శివుని దర్శింపఁ గాంక్షించె నబల
ఖండేందుశేఖరు గండూషితాంబుధా
రల మజ్జనము సేయఁ దలఁచె నింతి
చవియైన ఘ్రాణిమాంసమ్ము దొప్పలఁ బెట్టి
యభవున కర్పింప నతివ గోరె
తే గీ. నేత్ర నీలోత్పలంబుల నీలగళుని
యర్చనము సేయఁ జింతించె నంబుజాక్షి
గర్భ గోళంబునందున్న యర్భకునకుఁ
గల గుణంబులఁ దెలిపెడు కరణి నపుడు.

దీనినిబట్టి గర్భమున నున్న శిశువులక్షణములే గర్భవతియగు తందెకు పట్టినట్లు తెలియుచున్నది. పిండరూపమున నున్న శిశువేమి? ఇట్టి లక్షణములు దానికుండుట ఏమి? అవియే తల్లి మనసు మీద పని చేయుట యేమి? తిన్నడు సామాన్యుడుగాడు. కారణ జన్ముడు. అతని జీవ లక్షణములన్నియు పరమేశ్వర కల్పితములు. శివ లీలా ప్రదర్శనమునకై తిన్నడొక సాధనమయ్యెను. అందుచే శివు డెట్లాడించిన జీవుడగు కన్నప్ప యట్లాడును. తిన్నడు పరమ శివుని చేతియందలి కీలుబొమ్మ. ఏ లక్షణములు తన లీలా ప్రకాశమున కుచితములో, యా లక్షణములు భక్తుల కుండునట్లు చేయువాడు భగవంతుడు. కానిచో గర్భగోళమునందున్న తిన్నని కా గుణములుండుట, యవియే యాతనిని మోచుచున్న తల్లికి సంక్రమించుట పొసగవు గదా! మానవ జీవితము పరమేశ్వరుడు సంకల్పించినట్లు నడుచునను వ్యంగ్య మీ పద్యములో నున్నది. ఆ పద్యమునందు వర్ణించినట్లుగనే తిన్నని బ్రతుకు తెల్లవారినది గదా! శివుడే యాదవ భూపాలునకు తన లీలలను వర్ణించు చుండెననుట మనము మరవరాదు. అందుచేతనే తిన్నడు శివలీలా ప్రకాశకుడయ్యెను. ఎఱ్ఱాప్రెగ్గడయు నరసింహ పురాణములో గర్భవతియైన దైత్యరాజమహిషి నిట్లే వర్ణించెను. ఆమె "హరి నామ కీర్తన పరమోత్సవంబులు గావింప ననిశంబుఁ గాంక్ష సేయు" (తృతీయాశ్వాసము. 135 పద్యము) ననుచు నా శంభుదాసు డొక సీసపద్యము వ్రాసెను. దైత్యరాజమహిషి "యంతర్గతుండగు పుత్రువలన" నట్టి యనుభూతి పొందినదని ఎఱ్ఱన స్పష్టపరి

చెను. అంతర్గతుఁ డనగా గర్భస్థుఁడని యర్థము. తిన్నని జన్మ విధానము ప్రహ్లాదుని జనన విధానమును పోలియున్నది.

ధూర్జటి తిన్నని నాజన్మప్రాప్త శివభక్తి పరాయణుని గా నెంచెను. పుట్టిన వెంటనే తిన్నడు "జ్ఞాన ప్రధాన కలికా జాని పదధ్యాన పరమ సౌఖ్య సుఖప్రాప్తుండైన గతిఁ గన్ను దెరవంగా నేరక" యున్నాడట. కాని కొన్ని దినములకు "ఈ లోక వ్యాపారం బెలాగో యనుచుఁ జూడ నెంచిన గతి" నతడు గన్నులు దెరచె నట! తిన్నడు పుట్టి పెరుగుట శివభక్తి పరాయణత కభిముఖము గనే జరిగినట్లు ధూర్జటి వర్ణించెను. ప్రవర్తమానమగుచున్న శిశు విట్లుండెనట.

సీ. శివ భక్తి లతికతో చెడియో జగంబని
నవ్వి నట్లయ్యెన నవ్వఁ జొచ్చె
శ్రుతి మోహబంధంబు తెగఁ దన్నుగతి ముద్దు
టడుగులెత్తి విధుల్చు కాడఁ జొచ్చె
జన పరాఙ్ముఖుండైన భగిది సత్త్వము గూడి
పొత్తుల పాన్పుపైఁ బొరలఁ బడియె
శ్రేయో మహారాజ్య సింహాసనంబున
నుండు చందమునఁ గూర్చుండఁ దొడఁగెఁ
తే. గీ. దడవియాడె వసుంధరా స్థలమునందు
విశ్వపతి తత్త్వమను మణి వెదకు రీతి
తర్పకారి జగత్ప్రార్థనఁ దాఁకు భీతి
నడుగు వెట్టెడి గతిఁ దప్పటడుగు వెట్టె.

"ఇట్లు ప్రతి దిన ప్రవర్ధమానంబులగు నతని గుణంబు లకు శివభక్తి లక్షణోపమానంబులు సమానంబులై" యుండె నని ధూర్జటియే స్పష్టముగా చెప్పెను. సంతసుని తిన్నదన మున కానందించిన తండ్రియు నాథనాధుడును కుమారునకు తిన్న డని పేరువెట్టిరి. తిన్నని జీవితము తిన్నగా శివాభిముఖమగు చున్నదని దీని యంతరార్థము. అట్లగుటయే తిన్నదనము.

పరమేశ్వర లీలా నిధానమగు తిన్నడు ధనుర్విద్యా విశారదు డయ్యెను. నవ యవ్వన భాసమానుడైన తిన్ననికి మృగయా విహార విధానము తెలియఁగింపవలయునని వనచరులు నాథనాథునకు విన్న వించిరి. అందరు మృగయాధిదైవత పూజకు వెడలిరి. పూజా నంతరము తిన్నడు పరిజనులతో కూడి వేటకు వెడలెను. అతడు వెడలుట శివలీలకు నాందియైనది కారణజన్ముడగు వ్యక్తి పుట్టి పెరిగిన పట్టులలో నెక్కువ కాల ముండలేడు. ఒకవేళ సున్నప్పటికి నేదో యొక సన్నివేశ మాతని నా పరిసరములనుండి ఎక్క డికో—అనగా నాతని జీవిత లక్ష్యము సిద్ధించుచోటికి—యీడ్చి కొని పోవును. తిన్నని జీవితములో మృగయా విహార మటువంటి పట్టు నే. వనచరులు రాచబిడ్డకు వేట నేర్పవలయునని విన్న వించుటయును భగవల్లీలాకల్పనమే.

తిన్నడు వేటాడుచు వేటాడుచు సువర్ణముఖరీ తటమునకు పరివారముతో వచ్చెను. ఒకనాడు వేటలో దస్సిన తిన్నడు "వికచ ప్రసూనవకుళప్రకరంబుల నీడ" నొంటిగా నిద్రించెను. ఒకనాడొకడు కలలో కన్పించి

బాలక! యిచట శిలావట
మూలంబునఁ గొండ దండ మొగలేటితటిన్
శైల సుతాపతి, భక్తుల
పాలిటి పెన్నిధి వసించు, భక్తిం గొలువన్.

యని ప్రబోధించెను. ఒకానొక యడవిపంది తిన్నని వెలయించి యాలయించి కాళహస్తీశుని కడకు చేర్చి మాయమయ్యెను. "కలలో జెప్పిన యొడయుం, డెఱయించుక వచ్చినట్టి యేకలము హిమాచల తనయాధి పమాయావిలసనము" లని తిన్నడు గుర్తించెను. ఈ గుర్తించుట యతని బ్రతుకులో శివభక్తి బీజము మొలకెత్తుట.

ఇక్కడ నుండి తిన్నని భక్తి వికసించినది. అది జ్ఞాన పూర్వకమైన భక్తి గాదు. మరి యమాయిక భక్తి యది. ఈ యమాయిక భక్తి గలవాడు చరాచర ప్రకృతి యందంతట భగవంతుని దర్శించును. శివలింగము శిలానిర్మితమనిగాని, యది ప్రాణహీనమైనదనిగాని, భాషింపదనిగాని యీ యమాయిక భక్తుడు భావింపడు. అతని పాలిటి కది సాక్షాత్కరించిన పర మేశ్వరునితో సమానమే అతడు దానితో మాటాడును. తల్లి బిడ్డను వలె దానిని సాకును. లోకమున కిది యున్మాదము. భక్తునకు బ్రహ్మానందము. తిన్నని యీ ముగ్ధభక్తి బహుధా ప్రపంచింపబడినది.

శివలింగమును జూచినతోడనే కన్నప్ప కొక యనుమానము కల్గినది. కూడు నీళ్లు లేకుండ కాకులు దూరని కారడవిలో చీమలు దూరని చిట్టడవిలో శివు డెట్లు జీవించుచున్నాడు? ఇదే తిన్నని పీడించిన ప్రశ్న.

"ఆహార నిద్రాభయమైథునం చ
సామాన్య మేత త్పశుభి ర్నరాణామ్"

అని హితోపదేశకారుడు. ఆటవికుల సంస్కారము ఆహార నిద్రాదులను మించి ముందునకు పోలేదు. అమాయికుడై యాటవికుడైన తిన్నడు శివుని తిండితిప్పలను గూర్చి ముమ్మరముగా నాలోచించుటలో నాశ్చర్య మేమున్నది? ఆ నిర్జనారణ్యము నుండి శివుని తనయూరికి తీసికొని పోవగా తిన్నడు నిశ్చ యించెను. ఆతడు శివునితో నిట్లన్నాడు

ఓ సామీ! యిటువంటి కొండదరిలో, నొంటిం, బులుల్ సింగముల్ గాసింబెట్టెడు క్రూరమట్టడవిలోఁ గల్గువ్వి క్రీనీడ, నే యాసం గట్టితి నేటిగడ్డ నిలు? నీ వాఁకొన్నచోఁ గూడు నీ ళ్లె సుట్టంబులు దెచ్చి పెట్టెదరు? నీ కిందేటికే లింగమా?

శా. ఇల్లో, ముంగిలియో, యనుంగుఁ జెలులో,
యీడైన చుట్టంబులో
యిల్లాలో, కొడుకో, ధరింప నశనో
యే పాడుముల్ లేక? మా

తల్లిం గోరిన పెల్లనుండి గలవు,
తెప్పల్గాఁగ, నీ కిచ్చెదన్
తెల్లంబో! యిటు వొంటి నుండ కిం
కిచ్చేయుం గదే లింగమా!

తిన్నడు శివుని నుడుమూరు తమ్మన్నాడు. అట సకల భోగములు తలచన్నాడు. పడుకుదనము పింపిళ్ళగూయు మిటారి కత్తెలను సేవ కిచ్చెద నన్నాడు. శివుడులుకలేదు. పలుకలేదు. అమాయికత్వములో హాస్యము మెండుగా నుండును. తిన్ననిలో వది పోడు పుట్టినది. అందుచేతనే యతడు శివునితో

ఉ. నను మన్నించెదవేని నీ విపుడు రా నావెంట, రాకుండినన్
నిను నే బాసి చనంగనోప, నిచటన్ నీ తోడివే లోకమ్మె
మనువాఁడన్, గనువాఁడ నీ కథలు, నీ వనాసంబు చిత్తంబు వ
చ్చినచో మానెదుగాక, నిన్నిపుడు కస్తింబెట్ట నాకేటికిన్?

అని యన్నాడు. ఎంత ప్రార్థించినను శివుడు పలుకలేదు తిన్నడు శివభక్తిలో పరవశుడయ్యెను. "సంపెంగ తావిం ద్రుంగిన భృంగంబు తెఱంగున" నున్నాడు.

పరిజనులు వచ్చి యింటికి తమ్మని బతిమాలిరి అప్పటికే తిన్నడు బాహ్య ప్రపంచమును మరచెను. శివునిలో నతనిచిత్తము లీనమైయున్నది. అతడు కన్నీరు కార్చుచుండెను. మాట, పలుకు లేవు "ప్రమానుపడియుండ నేటికి నేను మఱచి" యని యతనితో పరిజను లనిరి. "ఎంత యుబ్బమటఁబడిన మమ్మేల చూడ" రన్నారు. తిన్నడేమో సమాధి స్థితిలో నున్నాడు. ఎట్టకేలకు తిన్నడు వారితో మాటాడినాడు. ఉడగట్టిన భూలము మాదిరిగా నా ప్రాణమును శివలింగముతో ముడుజేసితి నన్నాడు. శివుడు నా వెంట వచ్చినచో నేను మీవెంట వత్తు నన్నాడు. ఎక్కడ శివుడుండునో యక్కడనే నే నుందును నన్నాడు. చివర కాతడు పరిజనమునకు తన స్థిర సంకల్పము నెరుకపరచెను.

శా. నాకుం బుట్టము తల్లిదండ్రులు చెలుల్
నాథుండు నీ దైవమే
మీ కిచ్చోఁ బనిలేదు కన్నీవడఁగా,
మీ పల్లెకుం బొండు, కా
దా కార్యంబులు సేసినం గదలి నే రా,
నిచ్చటం బ్రాణముల్
పోకార్తుం దుది నాదు వేలుపునకై,
పొండికన్ నిజం బింతయున్.

"మీ పల్లెకుం బొండు" అని యనుటలో తిన్ననికి పెంచి పెద్ద చేసిన తల్లి దండ్రులు, కూడియాడిన చెలులు నెంతగా లాతి వారలుగా తెలియుచున్నది. అతని నిస్సంగత్వము నింగిముట్టి నది. పరిజనులు చేయునదిలేక వెడలిరి.

ఎన్నాళ్ళ నుండి శివుడు పస్తున్నాడో! అతని యాకటి తెగులు మాన్పదగదా? ఈ విధముగా భావించి తిన్నడు కలుకుట్ల

తెచ్చెను. పుక్కిటి నీటితో శివలింగము నభిషేకించి వానిని సమర్పించెను. "దొప్పలనంజా డద్రిరాజుల్లని నారగింపుమన"నని ధూర్జటి వ్రాసెను. అద్రిరాజనగా హిమవంతుడు. శివుడా హిమవంతుని యల్లుడు. అద్రిరాజల్లుడని ధూర్జటి యిట వ్రాయనేల? ఈ యాహారసమర్పణ ఘట్టములో తిన్నడు హిమవంతుని వంటి వాడైనాడని వ్యంగ్యము. మరి శివుడా, కఱకుట్లు తినలేదు. హిమవంతుడు సైతము బతిమాలని రీతిగా తిన్నడు శివుని బతిమాలెను.

కం: కాలవొ? క్రొవ్వవొ? మాడం
గాలెనొ? చవిగావొ? కమ్మగావొ? నీకున్
జాలవొ? యలవడవొ? తిన
వేలా కఱకుట్లు? పార్వతీశ్వర! చెపుమా!

కం: ఆకలి గాదో? భక్తిం
దేకువ గలవాఁడ గానొ? తినవేల? కృపన్
పోఁకఁ గదే నన్నిపు, డ
ర్రాఁకలఁ బెట్టక పలాశనాసక్తుఁడవై.

కం: నెపమొకటి గలదె నాపై?
మపవాసము తోడ బడలి యుండగ నీకే
యపరాధము సేయ గలదె?
కృపతోఁ గఱకుట్లు లారగింపం గదవే!

కం: నీ వారగింప కుండిన
జీవన మేమిటికి నాకు? శివ! నీ పదరా
జీవముల మీఁదఁ బ్రాణము
నే విడుతు నటంచు వ్రాలి యేడ్వం దొడఁగెన్.

ఈ పలుకులకు కఱకుబండలు కరగు నన్నచో శివుని హృదయము ద్రవింపకుండునా? ప్రసన్నుడైన శివుడు తిన్న డందింపగా కఱకు ట్లారగించెను.

తిన్నని భక్తితో వాలయమంతయు కసుమాలపు గూడ యినది. ఆ రోతను భరింపలేక, శివుని గొల్వగా వచ్చిన శివ బ్రాహ్మణోత్తముడు మహేశ్వరుని మందలించెను. దేవాలయ కశ్మలతకు కారణమైన వానిని జూపనిచో శివబ్రాహ్మణుడు ప్రాణము విడుతు నన్నాడు. శివుడా బ్రాహ్మణునకు తిన్నని భక్తిని జూప నిశ్చయించెను. తన వెనుక దాగియుండుమని యతని వనెను. హరద్విజు డట్లే చేసెను.

ఇంతలో తిన్నడు రానే వచ్చెను. "పావన నిర్మాల్యముఁ జెప్పుఁ గాలఁ గొని పోవంద్రోచి, గండూష జీవన సేకంబొనరించి, పత్తిరిడి, త్రోవల్గాచి తానేసి కాల్చిన కోలామిష ఖండముల్" శివునకు భక్షింప నిచ్చెను. శివుడు వానిని దినలేదు సరిగదా పె పెచ్చు కన్నీరు గార్చెను. తిన్న డెన్నో మందులు వాడెను. ఏ పని చేయలేదు. శివుని కంట నెత్తురు కారదొడగెను.

'పట్టపు దేవిన్ హిమగిరి పట్టిన్ మాయమ్మఁ జూచి వదరిన కతనన్ నెట్టవిసెనొ?' యని తిన్నడు శివు నడిగెను. పార్వతిని జూచి యురుముటచేత కన్ను బ్రద్దలయినదా యేమి స్వామి! యని యాతని యనుమానము. దీనితో దిన్నని ముగ్ధభక్తి యెక్కవలసిన మట్టమున కెక్కినది.

కంటికి కన్నే మందని నిశ్చయించి తిన్నడు తనకంటి నూడబెరికి శివుని కంటి కమర్చెను. శివుడు రెండవ కంట నెత్తురు కురియించెను. తిన్నడు నవ్వెను. నీ కృపచేత కంటికి కన్నే మందని తెలిసికొన గలిగితి ననెను. అత డేమాత్రము వెనుకంజ వేయలేదు. మరి శివుని మూడవకన్ను నెత్తురు కురిసిన నేమి చేయవలయును.? ఉన్న రెండు కన్నులు శివుని రెండు కన్నుల కతికించినచో మూడవకంటి కతికింపగా తిన్నని దగ్గర నేమున్నది? కంటికి కన్నేకదా మందు? అందుచే తిన్నడు 'శంకరా ఇదే నా వ్రతము. వినుము. నీ మూడవ కన్ను నెత్తురు చిమ్మెనా! నాకు మిగిలిన జ్ఞాన నేత్రమునకు మూలమైన నా ప్రాణములు నీ కిత్తు' నన్నాడు. అని నెత్తురు కారుచున్న శివుని రెండవ కంటిని చెప్పు గాలితో తన్నిపట్టి, తన రెండవ కంటిని బెకలింప బూనెను. శివుడు కన్నుగుడ్డును బెకలింపబోవు బాణమును తన చేతితో నంటబట్టికొని నిలువు నిలువు మని సకల దేవతలతో ప్రత్యక్ష మయ్యెను. హరద్విజునకు తిన్నని భక్తిని గూర్చి చెప్పెను. తిన్నని, బ్రాహ్మణుని సరసకు రమ్మని పిల్చి 'మీ కే వరమిష్ట' మని యనెను. వారిరువురు పునర్జన్మ లేకుండ చేయుమని కోరిరి. హరద్విజుడు 'ఇతఁడు కిరాతుం, డే దుర్మతి'నని యంగీకరించెను. శివుడు వారిరువురకు నాత్మతాదాత్మ్యము సిద్ధింపజేసి వారి బంధంబులను దీర్చెను.

శివుడు చెప్పినట్లుగా తిన్నడు 'శ్రుతి వ్యవహారేతర మత మునఁ దవిలి మహాభక్తి'తో నాత్మార్పణము చేసెను. మోక్షము వేదవేదాంగపారీణులకే కాక చిత్తశుద్ధిగల జ్ఞానహీనులకైన లభించును. శివబ్రాహ్మణ వృత్తాంతములో జ్ఞాన సహితమైన భక్తి గొప్పదా? జ్ఞాన రహితమైన చిత్తశుద్ధిపూర్వకమైన భక్తిగొప్పదా? యను రెండు ప్రశ్న లెదురయినవి. హరద్విజుడు పరమనిష్ఠా గరిష్ఠుడు. వేదవేదాంగ పారగుడు. తిన్న డట్టివాడు గాడు. అతని కడ నున్న దంతము కేవలము ముగ్ధభక్తియే. వాస్తవముగా చూచి నచో హరద్విజుడు మోక్షమున కర్హుడని యనిపించును. తిన్నని కథ వ్రాయుటలో ధూర్జటి యభిప్రాయ మదిగాదు. ఒకానొకడు శ్రుతి స్మృతి పురాణేతి హాసాదులను బఠింపక పోవచ్చును గాక! జన్మమును బట్టి బ్రాహ్మణుడు గాకపోవచ్చును గాక! ఏ కులము వాడయినను చిత్తశుద్ధి పూర్వకమైన భక్తితో శివుని సేవించి నచో జ్ఞానియగు బ్రాహ్మణభక్తుని మాదిరిగా పునర్జన్మరహిత స్థితి నందగలడు శైవములో జ్ఞాన భక్తికి, ముగ్ధ భక్తికి చోటు కలదు. వానిలో నొకటి హెచ్చుగాదు. మరియొకటి తొచ్చుగాదు.

దీనిని నిరూపించుటకే ధూర్జటి వ్రాసిన యీ కథలో శివుడు తిన్నని, ద్విజుని ననంతంబగు నాత్మరూపమున గూర్చెను. మల్లికార్జున పండితు లిట్లు చెప్పిరి:

కం. కులజు కులహీను లిద్దరు
నెలకొని భవదచల భక్తి నిష్ఠ వృత్తిన్
వెలసిన మీద సమానుల
కులజులు కులహీను లనఁగ గూడదు వారిన్.

పాల్కురికి సోమనాథు డిట్టి ముగ్ధ భక్తిని వర్ణింపకపోలేదు. అద్వైతియగు ధూర్జటి వీరశైవుడగు సోమనాథుని బాటనే పోయి తిన్ననివంటి యాటవికుని కావ్య శిల్పదృష్టితో వర్ణించెను.

ధూర్జటి ప్రబంధయుగమును కాలమునకు చెందినవాడు. అతడు రచించిన శ్రీ కాళహస్తి మాహాత్మ్యము క్షేత్ర మాహాత్మ్యముల కోవలోనిది. ప్రాయికముగా క్షేత్ర మాహాత్మ్య కావ్యములలో క్షేత్ర—తీర్థ—దైవత మహిమలు చిత్రింపబడును. ఇట్టి కావ్యములలో ఆ మహిమలు వెల్లడియగు నుపాఖ్యానము లుండును. కాళహస్తి మాహాత్మ్యములో క్షేత్రము శ్రీ కాళహస్తి. దైవము కాళహస్తీశ్వరుడు. తీర్థము సువర్ణముఖరి. క్షేత్ర మాహాత్మ్య కావ్యమును వ్రాయుచున్నను ధూర్జటి దానిలో ప్రబంధోచిత వర్ణనములు చేసెను. తిన్నని కథలో ఉడుమూరి వర్ణనము పురవర్ణనము వంటిదే. సందర్భోచితముగా ధూర్జటి దౌహృదము, వేట, సురాపానమువంటి వర్ణనములు చేసెను. ఈ వర్ణనములలో రమణీయ స్వభావోక్తి యధికము. కృత్రిమోత్ప్రేక్షాతిశయోక్తు లంతగా లేవు. తిన్నడు శివుని కంటికి వైద్యము చేసిన తీరు లానాడు సంఘమునందు ప్రచలితము లయినట్టివే. తిన్నని కథలో ఆంధ్ర జాతీయ జీవనము మనోహరముగా వర్ణింపబడినది

ప్రాచీన సాహిత్యము సామాన్య ప్రజా జీవనమునకు దూరముగా నున్నదనుమాట లెక్కువగా వినబడు రోజులివి. ఇట్టి నిందల యందలి సత్యాసత్యముల మాట యటుండనిండు. మత వర్ణ వ్యవస్థాదిశక్తులు ప్రాచీనులపై నెక్కువగా పని చేసిన మాట నిజము. కాని సామాన్య ప్రజా జీవనమును వర్ణింపదగిన తావులలో వారు దానిని మనోహరముగా వర్ణించిరి. రసమయముగా దిద్దితీర్చిరి. సామాన్య ప్రజా జీవనమును కవి యవశ్యము వర్ణింపవలయునను రాద్ధాంతవను మెండుగానున్న యీ రోజులలో నెన్నో రచనలు వెలువడుచున్నవి. దుష్ట రాజకీయ ప్రేరితులై కొందరు, మత దురభిమాన దురహంకార ప్రేరితులై మరికొందరు కావ్యములేమి, ఖండకావ్యములేమి, నవలలేమి వ్రాసిరి. వ్రాయుచున్నారు. వీనిలో నేమాత్రము కావ్య శిల్పమున్నది? కళా సౌందర్యమున్నది? తెలుగువా రాలోచింతురుగాక!

---

# ప్రాబ్లమ్ ఆఫ్ లైఫ్

శ్రీ 'శంపాలత'

సంబంధులకు ఇంటూమార్కులు పెట్టుకుంటూ
స్వేచ్ఛను స్క్వేర్ బ్రాకెట్టులో బంధిస్తూ
చిక్కు సమస్యలనూ చిద్విలాసాలనూ
ప్లస్ మైనస్‌లతో సమాధిస్తూ
జీవన సమీకరణం చివరికి
జీరో కే సమాన మౌతోంది!

బతుకు బాటలో మనస్సు పెంచుకొన్న 'ఏక్సిలరేషను'
పాతలగతుకుల్లో రిటార్డేషనుగా మారి
జీవనశకటం వెనక్కే పోతోంది
గుండెలో శాంతి — శాతంలో సహస్రాంశంగా
నెగ్లిజిబుల్ అవుతోంది!

ప్రసరించిన ఆశాకిరణం ఎదురుదెబ్బలు తిని తిని
ప్రతిబింబంలోనే పరావర్తనం చెందుతోంది
స్వార్థం గ్రావిటేషను ఫోర్సుతో దురాశలవైపు ఆకర్షింపబడి
నిరాశతో నిట్టూర్పులే విడుస్తోంది!

ఎగిరి — ఉన్నత శిఖరా లందుకోవాలన్న ఆశయాల రోదసీనౌక
నెగటివ్ వెలాసిటీతో సగంలోనే
నేల రాలిపోతున్నది!
'స్క్వేర్ రూటు'లో ఒదిగిఉన్న స్వప్నం
చివరి విలువలు గమనించలేకపోతున్నది!

లంబకోణంలా నిటారుగా నుంచోవాలన్న వాంఛ
పరతంత్రతలో చిక్కుకొని
'అబ్‌ట్యూస్'లా వంగి వాలిపోతున్నది!

నేరిడి శోధించటానికి లేకుండా జీవిత పరిభ్రమణంలో
పాలిత్ యాంగిల్‌లా మారిపోతున్నది !

హెూల్ క్యాబ్‌లో ఉన్న ఆర్థిక విపత్తు - ఎంత విడిదీసినా
చోటు చాలకుండా విస్తరించుకుపోతున్నది—
అసంపూర్తిగానే మిగిలిపోతున్నది !
కష్టనష్టాలను వేటితో భాగించినా
శేషం మిగులుతూనే ఉంది !

అనుకున్న 'ఆన్సరు' రానందుకు దిక్కులు చూస్తూ
అంతరంగం 'అబ్‌స్ట్రాక్టు'గా ఆలోచిస్తున్నది !



# సోషలిస్టు సాహిత్య దృక్పథము

## శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రి

విప్లవాత్మకములైన సోషలిస్టు సిద్ధాంతము లన్ని విషయములయందువలెనే వాఙ్మయమునందును ప్రధానముగా సాంఘిక దృక్పథము కలవి. రసాస్వాదన మిత్యాదులకం దంతగా ప్రవేశము లేదు. మరియు మార్క్సిస్టులు మానవ సాంఘిక జీవితమునకును ఆ సంఘమునందలి కళా విజ్ఞానాత్మకతకును గల సన్నిహిత సంబంధ బాంధవ్య పరిజ్ఞానమువల్లనే కావ్య వస్తు స్వరూప స్వభావము లధికముగా అవగతము లగునను విశ్వాసము కలవారు. మానవ జీవితముయొక్క వాస్తవికత కేవల సాంఘిక లక్షణలక్షితమే యగును కదా! అందువల్ల వాస్తవ మానవ జీవిత మేమి యనుభావమును వ్యక్తీకరించునో అదియు తప్పక సాంఘికమే కావలయును. సాంఘిక జీవితమంతయు బహుముఖాత్మకమైన సంఘర్షణమయము. సాహిత్యమును అట్టిదే. సాహిత్య మా విధముగా ఎందుకైనదనగా సాహిత్యమును రచించిన వ్యక్తి సంఘజీవి యగుటవల్లను, సంఘజీవితము వట్టి పోరాట రూపమగుటవల్లను. సంఘము మానవుల పరస్పర సంబంధ బాంధవ్యములు, మిత్రత్వ శత్రుత్వములు, ఇత్యాది ద్వంద్వములన్నియు రాగ ద్వేషములను బట్టుకొని యున్నవి. రాగ ద్వేషములు మానవజాతి కాజన్మ సిద్ధములు. ఆజన్మ సిద్ధములైన రాగ ద్వేషముల యభివ్యక్తియే సాహిత్యమునకు మూలమైనప్పుడు సుఖదుఃఖాత్మకమైన మానవ జీవితమును నేక రకములుగా సాహిత్యము ప్రదర్శింపవలయును. ఇదియే సాంఘిక దృక్పథము.

మానవ జీవిత మెప్పుడును సాంఘికమే. అనాదికాలమునుండియు, ఆటవిక జాతులనుండియు సంఘముగా తోటివారితో కలసి బ్రతుకుటయే మానవుడు చేయుచున్నాడు. మానవుడు సంఘజీవి యైనప్పటినుండియు వానికి రాగ ద్వేషములు పుట్టినవి. ఈ యర్థమునందే అవి ఆజన్మసిద్ధములు. త్రిగుణాత్మకమైన మానవ ప్రకృతులయందలి సత్వరజస్తమోగుణములు మానవులు దగ్గర దగ్గరకు వచ్చుచున్న కొలదియు పరస్పరము సంఘర్షణపడుట మొదలుపెట్టినవి. ఆ సంఘర్షణ స్థూలముగా రాగ ద్వేషాత్మకము. మానవ జాతిని సృష్ట్యాదినుండియు నీ ద్వంద్వము విడువక అంటి పెట్టుకొని వచ్చుచున్నది. అవి యేర్పడుటకు కారణ వస్తు సామగ్రి దేశకాలములనుబట్టి మారుచున్నది. సోషలిస్టు సిద్ధాంతము ఈ ద్వంద్వముల నతిక్రమించి ప్రవర్తించుచున్నవి. సోషలిస్టు వాస్తవిక దృక్పథముయొక్క పరమార్థము సాంఘిక జీవితముయొక్క బహుముఖములను తత్తదంతర్గతములైన సంఘర్షణములను కూలంకషముగా నిరూపించుచు రచయిత తాను తటస్థుడుగాను, సత్యాన్వేషకుడుగాను ఉండుట.

సాహిత్యముగాని మిగిలిన కళా విషయములుగాని మానవ జీవితమును దాని సర్వావస్థలయందును యథాతథముగా ప్రదర్శించును. మానవజీవితమనగా మానవ సంఘజీవిత మనియే యర్థము. సంఘము బహువర్గసమాకులము మానవుడు ప్రతివాడును ఏదేనొక వర్గమునకు చెందియుండును. ఏవర్గము వాడునుకాక తాను తానుగా మానవుడు బ్రతుకలేడు వర్గమనగా వర్ణమనియు నర్థము. వర్గ సమాజమున మానవుల అభిరుచులు, అభిమానములు, అభిలాషములు ఈ మొదలైన సుకుమార భావములన్నియు పరస్పరము సంఘర్షించును. ప్రతి వ్యక్తియందును ఈదృశమైన సంఘర్షణ బయలుదేరి మొత్తముమీద మానవుల ఆలోచనా విధానములను, అనుభూతి విశేషములను ఏకోన్ముఖము కానీయక వ్యక్తి విశేషములుగా వారిని మలచును. సంఘము తమ నింత పని చేయుచున్నదని సాధారణముగా ఎవరును గుర్తింపరు; అనుకోరు. ఈ గుర్తింపని, ఈ అనుకోని జన సమాజమునుండియే కవి పుట్టుచున్నాడు. కళాకారుడు పుట్టుచున్నాడు. వర్గ సమాజము మంచి చెడ్డలు రెండును ఈ కవియందును, ఈ కళాకారునియందును కూడ ఉండును దాని మంచి చెడ్డలనగా దాని జీవన దృక్పథము, దాని ఆదరము, దాని ఆచార వ్యవహారము, దాని కౌటిల్యము ఈ మొదలైనవన్నియును అన్నమాట ఒక కవి ఒక కావ్యము వ్రాసినాడనగా, ఒక కళాకారు డొక కళాఖండమును సృష్టించినాడనగా దానిమీద పైన సూచించిన బహ్యాంశముల ఒత్తిడి యున్నది. ఆ యొత్తిడుల ప్రభావములను నిశితముగా దర్శించిన కవి తన సమాజ జీవితమున కార్యమున ప్రతిబింబింపజేయగలడు. సోషలిస్టు దృక్పథమున కవి సమాజము నెన్ని ముఖముల ప్రతిబింబింపజేసినా డన్నది ముఖ్యము. అందుకు కవి సమాజమును చారిత్రక గతితార్కికముగా అధ్యయనముచేసియుండుట ముఖ్యము.

సమాజము వర్గ సహితమై యున్నంతకాలమును వర్గములు పరస్పరము సంఘర్షించుచునేయుండును సంఘర్షణము సాధారణముగా భూస్వాములకును, శ్రామికులకును నడుమ వచ్చును. ఆస్తివున్న వాడొకడు. లేనివాడొకడు. ఉన్నవాని కున్నదానిని సమయము వచ్చినపు డూడగొట్టుటకే లేనివాడు చూచుచుండును. లేనివానిని లేనివాడుగనే ఉంచుట తానున్నవాడుగా నుండుట

కవసరమని ఉన్నవా డెప్పుడును అట్లే ప్రవర్తించును. అందువల్ల ఈ రెండు వర్గములును ఎప్పుడును కలహించుచునే యుండును. అందుకే సోషలిస్టులు వర్గరహిత సమాజము నభిలషింతురు. అది ఆదర్శ సమాజము. మంచిదే. ఉన్నవాడొకడు, లేనివాడొకడు ఉండని సమాజ మిది. ఉన్నదంతయు ఉన్నవారందరకును చెందినది. అందువల్ల వివాదపడవలసిన అవసర ముండదని సోషలిస్టు లందురు. ఆ సమాజము వాస్తవ సత్యముగా అవతరించువరకును ఏదే నొక రీతిని భిన్న భిన్న వర్గములకు భిన్న భిన్న విషయములయందు పొత్తు కుదురక సంఘర్షించుట తప్పదు. ఈ సంఘర్షణలే సమాజమును ఈనాడున్నట్లు రేపుండనీయవు. అందువలన సమాజముయొక్క సత్య స్వరూప మిదియని చెప్పుట కుదురదు. అది సదా పరిణామశీలము కలది సమాజముయొక్క బాహ్యాభ్యంతరము లెప్పుడును మార్పును చెందుచునేయుండును. భూమి తిరుగుటను మన దృష్టి గమనించలేనట్లే సమాజముయొక్క మార్పును కూడ మన మా మారుచున్నప్పుడు గమనింపజాలము. మారిపోయిన తరువాత ఎప్పుడో గమనింతుము. ఈ గమనింపునకు పెద్ద తెలివితేట లక్కరలేదు. మారుచున్నప్పుడు గమనించుటకు మంచి జాగ్రత్త కావలయును మారబోవుచున్నదని గుర్తించుటకు మంచి దర్శన ముండవలయును. దర్శనముకలవాడు ఋషి. జాగ్రత్త కలవాడు సాధకుడు ఋషియే మహాకవి. సాధకులు కవులు. అందరును ఋషులు కాలేరు. అందువల్లనే మహాకవుల సంఖ్య ఒకరిద్దరుగా నుండుట సాధకులందరును సమానమైన జాగ్రత్తకలవారుగా నుండరు. జాగ్రత్త చాలని కవి అభ్యంతర విషయములకు చొచ్చుకొని పోలేడు మరియు నొక్కొక్కడు బాహ్య విషయపరిధినే దాటడు ఈ పరిధిలో కవితా సాధన చేయువాడు ముఖ్యముగా ఆలంకారికమైన పనితనము సుష్ఠుగా ప్రదర్శించుటకు మిక్కిలి కృషి చేయును. అనగా ఇందువల్ల వస్తుతత్వమునకంటె శరీర సౌందర్య సంపాదనమునకు కవి గట్టిగా యత్నించును. కావ్య శరీర సౌందర్య మది శబ్దాలంకారముల వినియోగనుమీద, ఛందోగతి ప్రభేద వినియోగము మీద ఆధారపడి కనిపించును. సోషలిస్టు దృక్పథమున ఈదృశమైన కవితా రచన ఒక గొప్ప విషయము కాదు. వర్గ పోరాటము యొక్క స్వరూప స్వభావములు, సమాజ మానవచేతనతమీద ఏమి విలక్షణ ప్రభావములను కలిగించుచున్నవో జాగ్రత్తపడి విచారించి వెలయించిన కవి కవిత్వమున కొక అర్థ గాంభీర్యము, ఒక వాడి యేర్పడును. శరీర సౌందర్యము చిత్తవృత్తి విమోహకము ఆత్మ సౌందర్య మానందపరమార్థము. కవికి శీవి, పదునుకు పదును గరిగి ఆభ్యంతర విషయ హృదయతల స్పర్శ చేయుచున్న కవిత్వమే సోషలిస్టు దృక్పథమున గొప్ప కవిత్వము. మరి యిట్లు గొప్ప కవిత్వమును వ్రాయుటకు కవి తాను నివసించుచున్న సమాజముతో అవినాభావముగా పెనవేసికొనవలయును. తనను సమాజరూపమున చూచుకొనవలయును. అపుడే వర్గ పోరాటాత్మకమైన సమాజము సామాజికుల మనస్తత్వములను, వారి నైతిక విలువలను, వారి ప్రవృత్తి విశేషములను, వారి చిత్తవృత్తులను, కవికి సంపూర్ణముగా తెలియ నిచ్చును. ఇంతవరకు సోషలిస్టు దృక్పథము ప్రకటించిన అంశములు మన మంగీకరింప జాలని వేమున్నవి? ఏమియు లేవు. సామాజికు లనగా మనము సమాజము వారందరని అనుకొనుచున్నాము. ఇచట వారనుకొనునది యిట్లు కాదు. సమాజమునందున్న ఒక్క శ్రామిక వర్గమునే వారు సమాజముగా పరిగణింతురు. ప్రజ లనగా వారి దృష్టిలో వారే ప్రజలు. మరొక రేమాత్రమును కాదు. ఈ వర్గమున కాధిక్యముకల వర్గములవారితో బహువిషయములయందు వివాదము వచ్చును. సాహిత్యము నం దీ వివాద స్వరూప స్వభావము లెప్పటికప్పుడు చిత్రింపబడి సంఘ చైతన్యమునకు దోహదము చేయవలయును. శ్రామిక జన సముదాయావసరములు ప్రధానముగా ఆధిక్యముగలవారి విశేష భోగ లక్షణములతోడను, వారి మర్యాదలతోడను వివాదపడును. మర్యాదలనగా నీతి, నిజాయితి, మతము, వేదాంతము మొదలైన విజ్ఞాన నాగరక విషయములు. ఈ యన్నింటి ముఖమునను ఆ యిరు వర్గముల వారిమధ్య సాగు పోరాట లక్షణమును సాహిత్యము చిత్రించవలయును.

సాహిత్య మిా ఫలానా విషయము నాశ్రయించి యుండవలయుననగానే వస్తువు విషయమున విధి నిషేధములను ప్రవేశపెట్టినట్లైనది. మరి ఈదృశమైన విధి నిషేధములయునికి నెరుగని మన వెనుకటి వాఙ్మయమునంతటిని యేమి చేయవలయును? మనము కమ్యూనిస్టుల ఆంతర్యము నిచ్చటనే సరిగా తెలిసికొనవలయును. అట్లు తెలియకపోవుటచేతనే చాలమంది కమ్యూనిస్టులా వాఙ్మయమును నశింపజేయ జూచుచున్నారని వాపోవుచున్నారు. నిజమునకు కమ్యూనిజము తత్త్వము అంతు చిక్కని "నామముల మెండు" జనము తా మా ప్రాచీన కావ్య వాఙ్మయమును రూపుమాపుట కవతరించినట్లు ప్రకటనలు చేయుచునున్నారు రూపుమాప వచ్చినానని పూనక దశయందు ప్రకటించుటయు, రూపుమాసిపోవుచున్నదని అమాయికముగా నమ్మి వాపోవుటయు రెండును అజ్ఞాన విలసితములే. కమ్యూనిజము ప్రాచీన సాహిత్యమును రూపుమాపవలసినదిగా చెప్పదు. మరి యేమి చెప్పు ననగా పురాసాహిత్యమును చక్కగా అధ్యయనము చేయుమని చెప్పును. ఒక్క సాహిత్యమునే కాదు. మనకు వారసత్వముగా సంక్రమించిన, మన పూర్వులు సృష్టించిన సర్వసంప్రదాయములను మన మట్లు నిశితముగా నధ్యయనము చేయవలయును.

చక్కగాను, నిశితముగాను అధ్యయనము చేయుట యనగా నేమి? ఏమనగా: *నీ కేది సంప్రదాయముగా వచ్చి అందినదో దాని

---

* It means really to understand the artistic heritage and evaluate everything that is great in it, to understand it's deviations, its failures, its controditions, and to judge these in the light of a subsequent, much clearer demarcation of classes, in the light of a contempa rary struggle of the proletariat.

యుగంలో ప్రతి దశయందును ఆనాటి మానవీయత నాటయు ణట్లు, మరియు దాని అనుచితత్వమును, అప్రయోజకత్వమును తెలియుటట్లు — తెలిసి నవకాలపు సమాజమునందలి వర్గ పోరాట విధాన దర్శన వివేకముతో అప్పటి వర్గ సమాజమునందు సంప్రదాయ మేమి పాత్ర నిర్వహించినదను అన్వేషణ బుద్ధితో అధ్యయనము చేయుట.



సాహిత్యమున శ్లాఘాపాత్రమగు వస్తువు ఇతి వృత్త వర్ణనమునందు లేదు. ప్రక్రియా భేదమునందు లేదు. ఛందోలంకారములయందు లేదు. సాంఘికముతైన సంబంధ బాంధవ్యము గల మానవ జీవిత చిత్రణమునందున్నది. వట్టి రసభావములను మిళ్ళించి మళ్ళించి వర్ణించినంతమాత్రమున అవి ఆనందప్రద ములు కావు. అట్లే వట్టి ఛందోలంకారములతో కసరత్తు చేసినంత మాత్రమున అది ఆనందదాయకము కాదు. సంఘ జీవనశక్తి ప్రభావము పడి మనిషి మనిషిగా తయారగుట యేదికలదో దానిని సాహిత్యము ప్రదర్శించవలయును. ఆ మనుష్యులకు అభిరుచు లుండును. అభిమానములుండును. వారు మంచి చెడుగులైన పను లను చేయుదురు. వారి నిత్య సమస్యలు వారికుండును. వారు వాటిని పరిష్కరించుకొను విధానములును వేరు వేరుగా వారి కున్నవి. కవియైనవాడు మానవజీవితమున యడుగు భాగమునుండి అర్థము చేసికొనుచు రావలయును. ఈ సోషలిస్టు సమాజమున కవి ఎంత ఎత్తు ఎగిరినా డన్నది ప్రధానము కాదు. కవి ఎంత లోతుకు చూచినా డన్నది ముఖ్యము. లోతనగా సంఘముయొక్క అట్టడుగు. అక్కడి నుండి మానవ జీవితమును పైకి పైకి చూచుకొనుచు రావలయును. మానవ మాత్రుడైన కవి తోటి మానవ సమాజము నోమహోగ్రముగా దర్శించక కవియగుట దురన్యాయము. నిజమున కది కుదురదు కూడ.

ఇక్కడ ఒక్క విషయమును జ్ఞాపకము చేయవలయును. ఇంతవరకు చెప్పిన దానినిబట్టి సోషలిస్టు సాహిత్యము కాని దానిని మార్క్సిస్టు కావ్య దర్శన సిద్ధాంతము తిరస్కరించుచున్న ట్లని పించవచ్చును. కాని నిజమున కట్టి తిరస్కార భావము మార్క్సిస్టు దర్శనమున లేదు. ఎందుకు లేదనగా సమాజ వికాసములో సోష లిజము పరమావధియు కాదు. అది ఒక మహోన్నతమైన విశ్రాంతి కేంద్రము. మానవజాతి సాంఘిక ప్రస్థాన మంతటితో ఆగదు. భూస్వామిక కాలము పోయినది. పెట్టుబడిదారుల కాలము పోయి నది. సామ్రాజ్యవాదుల కాలము పోయినది. ఏదియు స్థిరముగా ఈ భూలోకమున నిలువదు. మరేదియు స్థిరము కాదు గనుకనే భూమి తాను స్థితి యున్నది. అట్లే ఈ సోషలిజముకూడ ఒక వ్యవస్థ నశింపవలసినదే. అంతవరకు మాత్రమే అది ఉపాదేయము. నశించిపోయిన, కాలగర్భమున కలిసి పోయిన సాంఘిక రాజకీయ వ్యవస్థ లన్నియు కలిసి — ఇప్పుడు సమాజ మింత అభ్యుదయ లక్షణ లక్షితమై యుండుటకు యథాశక్తిని ఐతి దోహదము చేసినవి. ఆ విధముగానే ఇప్పు డభ్యుదయముగా కనబడుచున్న ఈ సోషలిజము భవిష్యత్తులో రానున్న క్రొత్త క్రొత్త విధానములకు ఉచితరీతిని దోహదము చేయును. అనగా సోషలిజము సంఘ పరిణామ దశావిశేషములలో నొక విశేషము మాత్రమే అన్నమాట. ఇట్లు దశావిశేషములుగా సంభవించిన అవస్థ లన్నింటిని జాగ్రత్తగా అవి సాంఘికాభ్యుదయమున కనుకూలముగా వర్తించి నవా? ప్రతికూలముగా వర్తించినవా? అని మనము చూడవల యును. ప్రతి తరమువారును తమ పూర్వతరముల వారి జీవిత దృక్పథములను ఆవిధముగా అధ్యయనము చేయవలయును. ఏవంవిధాధ్యయనము మన బుద్ధి శక్తిని పెంచి ఏ కావ్య విశేష మునుగాని సరిగా అర్థము చేసికొని అనుభవ పూర్వకముగా ఆనంద దించుటకు మిక్కిలి దోహదకారి యగును.

సాహిత్యము వాస్తవ జీవన విధాన చిత్రణమున సాధించెడు సంపూర్ణ లక్షణమునుబట్టి అది యొసగెడు ఆనంద ముండును. కావ్యానందము అది యే వాస్తవికతను చిత్రించుచున్నదో దానిని సర్వాంగసుందరము చేయు రచనా విధానమువల్ల సముత్పన్న మగు చున్నది. పరమార్థభూతమైన కావ్యార్థము ఆయాన్వితమైన ఘటిత స్వంబంధి భాషా విశేషమువలనను, అప్రయత్న సిద్ధమైన వస్తు సంబంధగతివిశేషమువలనను, వస్తు రచనా సంబంధి బంధురతా విశేషమువలనను పరమానంద ఘనముగా ప్రతీయమానము కావల యును. తత్ప్రతీతికి మూలమైనదియే కావ్య సౌందర్యము.

వాస్తవ వస్తు సముదాయమును విడిచి సౌందర్య మేకాంత మున స్వతంత్రముగా లేదు. వాస్తవిక వస్తు లక్షణ విశేషమే సౌందర్య రూపము. ఇక్కడ మన మొక విషయమును జాగ్రత్తగా గమనింపవలయును. ఏమనగా: ప్రకృతి వాతావరణము దానంతట అది చక్కని దగుటయు లేదు; కాకపోవుటయును లేదు, మానవ జాతి మనోభావములలో, దాని ఉత్పాదకశక్తిని బట్టి మరియు నందున్న కళా సంస్కృతుల మానవీయ భావ లక్షణమును బట్టియు సౌందర్య స్పృహ కలుగును: కాని అంతమాత్రముచేత సౌందర్య భావన కేవల వైయక్తిక చైతన్య లక్షణముగా కూడ భావింపరాదు. అది వస్తు విశేష స్థితి నాశ్రయించి ప్రకృతి వాతా వరణమునందును మానవుని సంఘ జీవనమునందును ప్రకటనమగు చుండును. మానవులయందు సౌందర్య భావనము వట్టి వాతావరణ పరిశీలనమువల్ల జనించదు. అసలా భావము కేవల నిరాధారముగా పుట్టనే పుట్టదు. బహుకాలాభ్యసనముచేత మానవుని ఉత్పాదక శక్తి పెరుగుదలయందది ప్రభవించును. మానవుడు దాని నా ప్రభవించు వేళయందే గమనించవలయును: ప్రకృతి వాతావరణము లను సంపూర్ణముగా స్వాయత్తము చేసికొనుటలో గల విశేష భేదము లనుబట్టి మానవులకు సౌందర్యము స్ఫురించును. మొదట మొదట పర్వతారణ్య ప్రాంతముల నిముడించుకొనని ప్రతుకు ప్రతుకుచో అవి మానవుని భయపెట్టినవి. క్రమముగా ఆ వాతావరణము

మీద మానవుని అధికారము పెరిగినది. అప్పుడు దాని యందము కనిపించుట మొదలైనది. పర్వతారణ్య ప్రాంత వాతావరణము మీద మానవుని అధికారము పెరుగుటయనగా సాంఘికముగా మానవ జీవిత మభ్యుదయము చెందుట యని యర్థము. అభ్యుదయము చెందుట యనగా ఉత్పత్తి శక్తులను స్వాయత్తము చేసికొని మానవుడు సంపన్నుడును, నాగరకుడు అగుట. అట్లైనప్పుడే ప్రకృతి గత సౌందర్యమును దర్శించి ఆనందింపగలడు. అపుడే మానవుడు తాను పొందిన ఆనందమును ఇతరునకు కలిగించు యత్నము చేయును. ఆ చేయుటనుండియే కళ పుట్టినది. కవిత్వము పుట్టినది. ఈవిధముగా ప్రకృతి భావ వాతావరణముల వలని దివ్యానుభవముల పునస్సృష్టి ప్రయత్నముచేతనే మానవుడు తన చుట్టు ప్రక్కల వాతావరణమును తన కనుకూలముగా మార్చుకొనుచు, దానితోపాటు తానును మారుచున్నాడు. ఈవిధముగా నిరంతరము సమాజము మారుచున్నది. ప్రకృతి మారుచున్నది. మానవుడు మారుచున్నాడు. తదనుగుణముగా సాహిత్యము మారుచున్నది. అనగా సాహిత్యము సమాజమును, ప్రకృతిని, మానవుని ప్రతిబింబించుచున్నదని యర్థము. కనీసపక్షమున ఈ త్రికముతోపాటు సాహిత్యమును మారుచుండునన్నది పరమార్థము. చారిత్రక గతినిబడి చూచినచో ఏకాలమున సమాజమున కుత్పాదన కార్య నిర్వహణ శక్తి ఎక్కువగా నుండునో ఆ కాలమున ఆ సమాజమున మానవుని కావ్య కళా రచన, శిల్ప కుశలతయు ఎక్కువగనే యుండును. అప్పుడే మానవ హృదయము అందచందములను, ఆనందానుభవమును చక్కగా గుర్తింపగలుగును. మానవుడు తాను సర్వమును మార్చుచు, భూమి సూర్యునిచుట్టు తిరుగుచు తన చుట్టును తాను తిరుగుచున్నట్లు, తాను కూడ మారును. మానవుని వస్తూత్పాద కార్యకలాప ప్రవృత్తినుండి సుఖ సంతోషముల భావానుభవము బలపడి తత్ఫలితముగా సౌందర్య సంభావన మభివృద్ధి చెంది రూపు కట్టుకొనును. ఎడతెగని ప్రవృత్తి విశేషమువలన చక్కగా చేయి తిరిగి ఆ యా కార్యములు తొలుత ఆరంభించిన నాటికంటె క్రమముగా సలక్షణములై ఫలించుట జరుగును. అవి సలక్షణములై ఫలించుచున్నకొలదియు వాని సుష్ఠుదనము, నందము మానవ చిత్తాపహారి యగును. అట్లందము వైపు చిత్తము మొగ్గసాగిననాటినుండియు మానవుని యందు సౌందర్య సంభావన మారంభమైనదని చెప్పవలయును. నీవు చేసిన పనియందు నీకు గల అభ్యాస విశేషముచేత నీ కృతి సుకృతి యగుట జరుగుచున్నది. సుకృతి యనగా అందమును పుష్కలించినది, సౌందర్యమును విరజిమ్మునది

మనోవాక్కాయములచేత మానవుడు సర్వ కార్యారంభములు చేయుచున్నాడు. కార్యములనిటు ప్రవర్తించుట పేరు కర్మ. కార్మికమైన మానవ జీవితమునందు కళా కవిత్వాది సౌందర్య వస్తూత్పాదన మొక భాగము. జీవితమున కిది యొక ముఖము. అదే జీవిత సర్వస్వము కాదు. కాని, అది లేక జీవితము స్వయం సంపూర్ణము కాదు.

# నల్లబొంత

## శ్రీ వి. వి. యస్. రామదాసు

'ఆ ముసలిది పోవడంతోనే శని విరగడయిం దనుకున్నాను' కాని, దాని నల్లబొంతను మీరు వదలకుండా ఉన్నారేమండీ?' అన్నది లలిత భర్త రామారావుకి కాఫీ అందిస్తూ.

"అది సరే కాని ఆమె అంటే నీ కెందు కంత కోపం? గర్భిణి స్త్రీలకు కోపం మంచిది కాదు" అన్నాడు రామారావు కాఫీ పుచ్చు కుంటూ.

"నా కోపం ఎందువల్ల నయితే నేం? ఆ ముసలిదానిమీద మీ కెందు కంత భక్తి? దానిపీడ విరగడయినా దాని నల్లబొంత అవతల పడేద్దామంటే ఒప్పుకోరేం? దాని బొంతమీద మీకెందు కండీ అంత మమకారం?" అన్నది లలిత.

"ఇవ్వాళ ఆదివారంకదా? ఆ నల్లబొంత సంగతి భోజనా లయాక చూద్దాం. ఇప్పటికి వెళ్ళూ" అని అప్పటికి తప్పించు కున్నాడు రామారావు.

"ఏమయినా ఇవ్వాళ దాని సంగతి తేలవలసినదే" అంటూ లలిత వంటగదిలోకి వెళ్ళింది.

ఆమె కెలా నచ్చచెప్పాలో అతనికి తోచలేదు.

రామారావు ఈజీచైరులో కూర్చుని ఆలోచించాడు.

నలుగురూ 'మామ్మగారూ' అని పిలిచే నారాయణమ్మగారు రామారావుకి చిన్నప్పుడు చేసిన ఉపకారం అత డీ జన్మలో మరువ లేడు. ఆమె చేసిన ఉపకారం గురించి లలితకు చెప్పలేకపోవ డానికి కారణం రామారావు చిన్నప్పుడు వారాలు చేసుకుని చదువు కున్న సంగతి ఆమెకు తెలియకూడదని అతని తాపత్రయం. అంతకంటె ముఖ్యంగా 'మామ్మగారు' చేసిన మహోపకారం ఎవరికీ చెప్పడానికి వీలులేనిది.

* * *

రామారావు తల్లి చిన్నప్పుడే పోయింది. అతనికోసం అతని తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. పౌరోహిత్యం చేసుకుంటూ అతనిని పెంచసాగాడు. ఆ కుగ్రామంలో అయిదవ తరగతివరకు మాత్రమే చదువుండేది. అదయిన తరువాత పట్నంలో కాపురం పెట్టి, హైస్కూలు చదువు, కాలేజీ చదువు యింకా పెద్ద చదు వులు చదివించుదామనీ తరువాత పెద్ద ఉద్యోగం వస్తుందనీ అతని తండ్రి ఏవో కలలు కన్నాడు.

కాని రామారావు అయిదవ తరగతి చదువుతూఉండగానే అతని తండ్రి గతించాడు. తండ్రిపోయిన పది రోజులకు ఆ గ్రామంలో ఆదరించేవారెవరూ లేరని అతనికి అర్థమయింది.

ఒకనాటి సాయంత్రం పుస్తకాలూ, ఉన్న రెండు జతల బట్టలూ మూట కట్టుకుని బయలుదేరి కాలినడకను ఆ గ్రామా నికి పన్నెండు మైళ్లదూరంలోవున్న పట్నం చేరాడు. పట్నంలో మొదటి వీధి మొదటి యింటి అరుగుమీద పడుకుని నిద్ర పోయాడు.

రామారావు నిద్ర లేచేసరికి, "ఏ వూరు నీది నాయనా? ఎవరబ్బాయివి బాబూ?" అని ఎంతో ఆదరంగా పలకరించిన నారాయణమ్మగారి గొంతు వినబడింది.

అతని దీనచరిత్రవిన్న నారాయణమ్మ జాలిపడింది

అప్పటికి నలభై ఏళ్ల మాత్రమే వయసున్న నారాయ ణమ్మ ఎక్కువ వయసున్న ఆమెలా కనిపించేది అప్పటికే ఆమె నందరూ 'మామ్మగారూ' అని పిలిచేవారు. కనీసం 'దొడ్డమ్మ గారూ' అనో, 'పిన్నిగారూ' అనో పిలవలేదని ఆమె ఎప్పుడూ విచారించలేదు.

కూతురి పెళ్లి చేసిన సంవత్సరం దాటకముందే నారా యణమ్మకు వైధవ్యం సంభవించింది. ఒక్కర్తే కూతురవడం వల్ల అల్లుని యింటికి వచ్చి కూతురికి సాయంగా ఉండిపోయింది. అల్లునికి కూడా వేరే పెద్ద దిక్కులేక ఆమె ఉండడాన్ని కాదన లేకపోయాడు. కాదనలేకపోవడానికి మరొక ముఖ్య కారణం ఆమె కున్న ఆస్తి.

ఆ పట్నం మునిసిపాలిటీలో పనిచేస్తూ అత్తగారి ఆస్తి వ్యవహారాలు చూస్తూ ఉండేవాడు నారాయణమ్మ అల్లుడు.

రామారావు దీన చరిత్ర విని జాలిపడిన నారాయణమ్మ అతనికి ఆశ్రయం యివ్వాలని ప్రయత్నించింది. కాని కూతురూ అల్లుడూ వ్యతిరేకించడంవల్ల వారం రోజుల్లో ఒకరోజు భోజనం పెట్టడానికి మాత్రమే అంగీకరింప చేయగలిగింది తన పలుకు బడిని వినియోగించి నారాయణమ్మ ఇంకా ఆరుగురి యిళ్లల్లో ఆరు వారాలు రామారావు భోజనం చేయడానికి ఏర్పాటు చేసి పెట్టింది.

ఆమె పట్టుపట్టడంవల్ల ఆమె అల్లుడు రామారావుని బడిలో అయిదవ క్లాసులో చేర్పించాడు.

# నల్లబొంత

ఆమె ఎంతో బ్రతిమాలినమీదట వీధి వసారాలో చదువు కుని పడుకోనియ్యడానికి ఆమె అల్లుడు అనుమతించాడు.

రామారావు చందాలు ప్రోగుచేసి జీతం కట్టేవాడు. కాని చందా పుస్తకం పట్టుకుని తిరిగేటప్పుడల్లా అతని మనస్సు కష్ట పడేది రైలు స్టేషను దగ్గరా, రైలు బళ్లలోను, బస్సుస్టాండుల దగ్గరా ప్రయాణికులను చందాలు యాచిస్తున్నప్పుడు అతని నిజాయతీని శంకిస్తూ నలుగురూ నాలుగు విధాల అనే మాటలు అతనికి శూలాలలా తగిలేవి.

రామారావు అదృష్టంవల్ల పుస్తకాలు మారలేదు అయిదవ తరగతి మంచి మార్కులతో పాసయినాడు.

ఆరవ తరగతిలో ప్రవేశించేనాటికి పుస్తకాలు కొనవలసిన సమస్య ఎదురయింది పాత పుస్తకాలు అమ్మేశాడు. ఆ డబ్బుతో ఎక్సర్సయిజు పుస్తకాలు కొన్నాడు. తన తరగతికంటె పై తర గతిలో చదువుకున్న ఒక కుర్రవాడు అతనియందు దయచూపి పుస్తకా లిచ్చాడు. కాని లెక్కల పుస్తకం మారిపోయింది.

లెక్కల పుస్తకం కొని తీరాలని లెక్కల మాస్టారు పట్టు పట్టారు ఒకటి రెండు రోజులు బెంచీ ఎక్కించి తరువాత, "రేపు లెక్కల పుస్తకం కొని తేకపోతే క్లాసునుంచి బయటకు తరిమే స్తాను" జాగ్రత్త అని హెచ్చరించాడు.

బడి విడిచిన తరువాత రామారావు పుస్తకాల షాపుకి వెళ్లి, ఆరవ తరగతి లెక్కల పుస్తకం ధర ఎంత?" అని అడిగాడు "రూపాయి పావలా" అని చెప్పాడు దుకాణదారుడు.

"ఒకవారం రోజులలో డబ్బు తెచ్చియిస్తాను. అరువు యిస్తారా?" అని అడిగాడు.

"అరువు రేపు — ఇవ్వాళ నగదే" అని వ్రాసివున్న బల్ల చూపించా డాయన

ఆ రాత్రి ఎవరింటి దగ్గర భోజనం చేశాడో ఆ యింటా యనతో చెప్పాడు రామారావు. ఆయన డబ్బు యివ్వలేకపోయాడు. కాని, "ఫరవాలేదు లే. మీ లెక్కల మాస్టారుతో నేను మాట్లాడతాను. నిన్నెప్పుడూ పుస్తకం గురించి అడగకుండా చూస్తాను" అన్నాడు

లెక్కల మాస్టారు ఎవరు చెప్పినా వినరన్న సంగతి రామా రావుకి బాగా తెలుసు. అదీకాక లెక్కల పుస్తకం ఉంటే బాగుండు నని తనకు కూడా ఉంది

"సరేనండి" అని నారాయణమ్మగారింటికి వెళ్లి చదువు కోవాలని కూర్చున్నాడే కాని అతని మనసంతా లెక్కల పుస్తకం కొనడానికి కావలసిన రూపాయి పావలామీదనే ఉంది.

రాత్రంతా లెక్కల మాస్టారి భయంకర రూపమే అతని కలలోకి వచ్చింది క్లాసునుంచి బయటకు పంపించినట్లు కల కని ఉలిక్కిపడి లేచాడు.

మరునాటి ఉదయం నూతి దగ్గర స్నానం చేసివచ్చి సావి ట్లోకి తిన్నగా రావలసినవాడు మధ్యగదిలోకి వెళ్లాడు. ఆ ఇంటా 'మామ్మగారు' అతనికిచ్చిన చనువువల్ల అత డే గదిలోకి వెళ్లినా ఎవరూ ఏమీ అనేవారు కారు

బల్లమీద ఉన్న చిల్లర అతని కంటపడింది బల్ల దగ్గ రకు వెళ్లాడు. తప్పు చేస్తున్నాననే వ్యాకులత ఒక ప్రక్క పీడిస్తు న్నప్పటికీ లెక్కల మాస్టారు ముఖం జ్ఞాపకానికి వచ్చి చిల్లర చేతిలోకి తీసుకున్నాడు. తనకు కావలసిన రూపాయి పావలా తీసు కుని తక్కినది బల్లమీదనే ఉంచాడు. తను ఆ పని చేస్తూండగా ఎవరూ చూడలేదనుకున్నాడు కాని వంటగదిలోనుండి చూస్తున్న నారాయణమ్మగారి కంటపడిన సంగతి అతడు గమనించనేలేదు. నారాయణమ్మగారి కూతురు పెరట్లో ఉండడంవల్ల ఆమె చూడ లేదు. గబగబా వసారాలోకి వెళ్లి బట్టలు వేసుకున్నాడు.

ఆ రూపాయి పావులా చొక్కా జేబులో వేసుకుని ఏమీ ఎరుగనట్టు, పుస్తకం చదువుతున్నట్లు నటించాడు

"ఏమే ఈ బల్లమీద పెట్టిన చిల్లరలో రూపాయి పావలా తక్కువయిం దేమి? నువ్వు తీశావా?" అని నారాయణమ్మగారి అల్లుని గొంతు వినిపించింది.

"నేను తియ్యలేదండీ" అని పెరట్లోనుంచి వస్తూ అన్న నారాయణమ్మగారి కూతురి కేక వినిపించింది.

వసారాలోవున్న రామారావు గుండెలు వేగంగాకొట్టుకున్నాయి.

"పనిమనిషి ఇంతకుమునుపే వెళ్లింది కదా?" అని అల్లుని గొంతు వినిపించింది.

ఇంక తన దగ్గరకు వచ్చి అడుగుతారేమోనని రామారావు భయపడ్డాడు.

"నేనే తీశాను నాయనా బొత్తిగా చిల్లరలేక అవస్థగా ఉంది" అన్న నారాయణమ్మగారి గొంతు వినిపించడంతో రామారావు భయం తగ్గింది

"అలా చెప్పండి. దొంగవాళ్లయితే అంతా తీసుకుంటారు గాని కొంత వదిలి పెడతారా?" అన్న అల్లుని గొంతు వినిపించింది.

రామారావు గబగబా పుస్తకాలు తీసుకుని, "వెళ్లొస్తా నండి, మామ్మగారూ" అని చెప్పేసి బజారుకు వెళ్లాడు.

లెక్కల పుస్తకం కొని మాస్టారి ఆగ్రహం తప్పించు కున్నాడు కాని, దొంగతనం చేశానే అన్న కించ అతనిని పీడిస్తూనే ఉంది.

ఆ సాయంత్రం మామ్మగారి పాదాలమీద పడి చేసిన తప్పు ఒప్పుకుని క్షమాపణ వేడుకుందా మనుకున్నాడు

రామారావు వేరే ఇంట్లో భోజనం చేసి 'ఇంటి'కి వెళ్ళే సరికి మామ్మగారు ఒక్కరే వీధి అరుగుమీద కూర్చున్నారు.

"భోజనం చేశావా నాయనా?" అని ఎంతో మృదువుగా అడిగా రామె.

"చేశానండి. బాబుగారూ, అమ్మగారూ లేరా?" అన్నాడు రామారావు.

"లేరు నాయనా, సినిమాకి వెళ్లారు" అన్నదామె.

"మామ్మగారూ"అని ఏడుస్తూ ఆమె కాళ్లు పట్టుకున్నాడు.

"ఛ ఛ ఏమిటి బాబూ అది ? లోపలికి పోదాం పద" అన్నదామె.

లోపల వీధి వసారాలోకి వెళ్లి చాపమీద కూర్చుంది నారాయణమ్మ.

ఆమెకు ఎదురుగా నిలబడి రామారావు, "మామ్మగారూ ఉదయం నేను బాబుగారి బల్లమీదనుంచి రూపాయి పావలా దొంగతనం చేశాను'' అన్నాడు.

"ఎందుకలా చేశావు బాబూ?" అన్నదామె.

"లెక్కల పుస్తకం లేదు. అది లేకుండా క్లాసుకి వస్తే క్లాసునుంచి బయటకు పంపేస్తామన్నారు లెక్కల మాస్టారు బుద్ధి గడ్డి తిని దొంగతనం చేశాను. బాబుగారి కాళ్లమీదపడి క్షమాపణ వేడుకుంటాను" అన్నాడు రామారావు.

"ఆ పనిమాత్రం చెయ్యకు నిన్ను క్షమించడానికి బదులు నిన్నొక దొంగవాని క్రింద జమకడతారు ఇంక నీ కెక్కడా ఆశ్రయం దొరకదు దానివల్ల నీ చదు వాగిపోతుంది. అందుచేతనే నేను అబద్ధం ఆడవలసి వచ్చింది'' అన్నదామె.

"మరి నన్ను పీడిస్తున్న ఈ బాధ ఎలా పోతుంది మామ్మగారూ?''

"నాతో చెప్పావు కదా. ఇక బాధపడకు. దొంగతనం చేసిన నిన్నూ, అబద్ధం ఆడిన నన్నూ ఆ భగవంతుడే క్షమిస్తాడు. ఇక చదువుకో బాబూ" అన్నదామె.

రామారావు పుస్తకాల ముందుర కూర్చున్నాడు.

"చూడు బాబూ. ఇకనుంచి నీ కెప్పుడు డబ్బు కావాలన్నా నన్నడుగు. నేను నీకు నిజంగానే 'మామ్మ' ని అనుకో'' అని చెప్పి నారాయణమ్మ వీధి అరుగుమీదికి పోయి కూర్చుంది.

**ఆమె ఒక అబద్ధం ఆడి అధఃపతనం కాబోయే అతని జీవితాన్ని ఉద్ధరించింది. చీకటి త్రోవను పోయేవానికి వెలుగు చూపించింది.**

నాటినుంచి రామారావు దొంగతనం చెయ్యలేదు.

నారాయణమ్మగారు అతని కెన్నో హితోపదేశాలు చేసి అతని శీలానికి పునాదులు వేసింది. ఆమె అతని నెప్పుడూ పొగడలేదు. నిజాని కామె ఎవరినీ పొగడదు. అందుచేతనే ఆమెవల్ల ఎంత ఉపకారం పొందినవారైనా ఆమెపట్ల ముభావంగా ఉంటారు.

లెక్కలలో నూటికి తొంభై మార్కులు వచ్చిన రోజున ఉత్సాహంగా ప్రోగ్రెసు రిపోర్టు 'మామ్మ'గారికి చూపించాడు. ఆమె కళ్లలో ఆనందం కనిపించినా అంతలోనే సీరియస్‌గా ముఖం పెట్టి, "ఏంరా, నూటికి తొంభై మార్కులు వచ్చాయని గర్వపడుతున్నావా? తక్కిన పది మార్కులు ఎందుకు రాలేదు?" అని గద్దించింది.

రామారావు బిక్కమొహం వేశాడు. అప్పటినుంచి లెక్కలలో మాత్రం నూటికి నూరు రావలసిందే. తక్కిన పేపర్లలో ఎనభైలు వచ్చి, తరగతిలో ప్రథముడుగా ఉన్నప్పటికీ 'మామ్మ'గారి దగ్గర మార్కులు చూపించడానికి భయపడేవాడు.

ఎనిమిదవ తరగతికి వచ్చేసరికే చందాల పుస్తకం పట్టుకుని తిరగడం అంటే అతని కెంతో లజ్జాకరంగా ఉండేది. ఆ సంగతి మామ్మగారికి చెప్పగా ఆమె ధనార్జనకు కష్టపడి పని చేయ్యడంలో ఉన్న గౌరవాన్ని బోధించింది. ప్రతి ఉదయం వార్తాపత్రిక అమ్మడం, శని ఆదివారాల్లో పాత పేపర్లూ, పుస్తకాలూ, డబ్బాలూ కొని అమ్మడం ద్వారా చందాల పుస్తకం పట్టుకుని తిరగడం తప్పించుకోగలిగాడు.

స్కూలు ఫైనలు పాసయేనాటికి యింక వారాలు చేసుకుని చదవడం అతనికి ఆత్మగౌరవానికి భంగకరంగా అనిపించి పై చదువులు చదవాలనే ఆశలు వదులుకున్నాడు.

అమ్మకంలో అతనికున్న నేర్పును మెచ్చుకున్న ఒక మెడికల్ స్టోర్సు యజమాని అతనిని సేల్సుమాన్‌గా నియమించాడు అతని వాక్చాతుర్యాన్ని గమనించిన ఒక మందుల కంపెనీ మేనేజరు అతనికి మెడికల్ రిప్రజెంటేటివ్‌గా ఉద్యోగం యిచ్చాడు.

మెడికల్ రిప్రజెంటేటివుగా అయిన తరువాత రామారావు ఆ వూరు వదలి హైదరాబాదు వెళ్లవలసి వచ్చింది. హైదరాబాదులో లలిత అనే హైస్కూలు టీచరును ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు. ఆమె ప్రేమ హడావిడిలో పడి మామ్మగారి సంగతి మరిచిపోయాడు.

చాలాకాలం గడిచింది.

ఒకనాడు రాజమండ్రి క్యాంప్ వెళ్లి నాళంవారి సత్రంలో దిగాడు. ఒక ప్రక్కను అరుగుమీద ఒక నల్లబొంత వేసుకు కూర్చునివున్న ఒక ముసలామెను చూశాడు. ఆమె ఒక బొంతను కుడుతున్నది. దగ్గరకు వెళ్లి చూసి ఆమె నారాయణమ్మగారని గుర్తుపట్టి "మామ్మగారూ" అని ఆమె కాళ్లకు నమస్కారం చేశాడు.

"నువ్వా, రామం" అని ఆమె కళ్లనీరు పెట్టుకుంది.

"మామ్మగారూ. ఏమి టిలా ఇక్కడ ఉన్నారు?"

"ఏం చెప్పను బాబూ. నా కూతురు చనిపోయింది. పిల్లలు లేరుకదా అని అల్లుడు మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. నే నా ఊరు వదిలి వచ్చాను."

'మరి మీ ఆస్తి ఉండాలి కదా. ఏమయింది మామ్మగారూ?'

"నా కూతురు బ్రతికిఉండగానే ఆస్తి అంతా నగదు క్రింద మార్చేసి మా అల్లుడు సొంతం చేసుకున్నాడు"

"మరి మీవంటిమీద నగలు ఉండాలి కదా" అన్నాడు రామారావు.

"ఒకనాడు మా యింట్లో దొంగలు పడ్డారు" అని ఆమె యింకా ఏమో చెప్పబోతూవుంటే,

"అంటే మీ దగ్గర ఏమీ లేదు కదా అని అమ్మగారు పోయిన వెంటనే మళ్లీ పెళ్లి చేసుకున్నది చాలక మిమ్మల్నిలా ఇల్లు వదిలేటట్లు చేశారా?" అన్నాడు రామారావు.

"అల్లుడిగారి నేమీ అనకు, రామం. నా కూతురున్న స్థలంలో మరొక పిల్ల ఉండడం చూడలేక నేనే వచ్చేశాను. ఆయన నన్ను వెళ్ల మనలేదు" అన్న దామె.

"పోనీయండి. ఉండమని బలవంతం చెయ్యవచ్చు కదా" అన్నాడు రామారావు.

"బలవంతం చెయ్యలేదని బాధపడడం వెర్రితనం."

"ఇంక నాతో వచ్చెయ్యండి మామ్మగారూ. మీ మనవ రాలికి సాయంగా ఉందురుగాని."

"ఏదో ఇలా బొంతలు కుట్టుకుని రోజులు గడిపేస్తున్నాను. ఇక్కడే ఉండనియ్యరాదా, బాబూ?" అన్నదామె.

"నేను మీ చేతి అన్నం తిని పెరిగినవాడిని కాదా, మామ్మ గారూ. ఆనాడు మీరు చేసిన మహోపకారానికి నేను నా చర్మాన్ని ఒలిపించి మీకు చెప్పులు కుట్టించినా ఆ రుణం తీరదు. నా మాట కాదని నా మనసు బాధ పెట్టకండి. రేపు నాతో హైదరా బాదు వచ్చేయండి" అని బలవంతం చేశాడు రామారావు.

నారాయణమ్మను ఇంటికి తీసుకువచ్చాడు.కాని లలిత అంతగా ఆదరించలేదు. తనతో ముందుగా ఒక మాట అయినా చెప్పకుండా తీసుకురావడం ఆమెకు నచ్చలేదు.

నారాయణమ్మను ఆమె 'మామ్మగారూ' అనిగాని 'అమ్మమ్మ గారూ' అనిగాని పిలవలేకపోయింది. 'ఏమండీ' అని మాత్రం అనగలిగింది.

నారాయణమ్మ సోమరిగా కూర్చునే అలవాటులేనిది కావడం వల్ల, ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూ ఉండడంవల్ల లలిత ఆమె ఉనికిని కొంత సహించగలిగింది. పొగడడం నారాయణమ్మ స్వభా వంలోనే లేదు కనుక లలిత అభిమానం సంపాదించలేకపోయింది

ఎప్పుడైనా లలిత మాట్లాడడానికి అవకాశం యిస్తే,'అమ్మా నీ కడుపున ఒక కాయ కాస్తే నేనెంతో సంతోషిస్తాను" అనేది.

దానితో లలితకు వళ్లు మండేది. వారి పెండ్లయి అయిదు సంవత్సరాలైనా సంతానం కలగకపోవడాన్ని ఎవరూ అంత నిర్మొగమాటంగా ఆమె దృష్టికి తేలేదు. అది పట్నవాసపు తరహా.

"చూడండి. ఆ ముసలిది మనకు సంతానం లేదన్న సంగతి ఎలా దెప్పుతున్నదో" అని భర్తకు ఫిర్యాదు చేసింది.

రామారావుకి చిన్నప్పటి ప్రోగ్రెసు రిపోర్టు ఉదంతం జ్ఞాపకం వచ్చింది.

లలితలాంటి అందమైన అమ్మాయిని పెళ్లాడడం లెక్కల్లో నూటికి తొంభై తెచ్చుకున్నట్లే. కాని మామ్మగారి దృష్టిలో సంతానం కలిగితేనేగాని ఆ పది మార్కుల వెలితి తీరదు.

"మామ్మగారు దెప్పడంకాదు. ఆమె మన శ్రేయోభిలాషిణి. రేపే డాక్టరు దగ్గరకు వెళ్లి పరీక్ష చేయించుకుందాము"అన్నాడు.

డాక్టరు పరీక్ష జరిగి మందులు పుచ్చుకున్న తరువాత లలితకు నెల తప్పినది.

ఆ వార్త విన్న నారాయణమ్మ మనస్సులోనే ఎంతో సంతో షించింది. లలిత ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవాలని ఎన్నో సలహా లిచ్చేది. అదంతా లలితకు వెగటుగా తోచేది.

పుట్టబోయే శిశువుకోసం నారాయణమ్మ చిన్నచిన్నలాగులు కుట్టడం, మేజోళ్లు అల్లడం చేసేది.

"చిన్న చిన్న బొంతలు కుడతాను. పాత చీరలియ్యవమ్మా" అని లలితను తొందర పెట్టేది.

ఆమె కోరిక తీరకుండానే 'మామ్మగారికి' ఎంతో జబ్బు చేసింది.

రామారావు చాలా ఆదుర్దా పడ్డాడు. డాక్టరుని తీసుకువచ్చాడు.

"నా కెందుకు బాబూ, డాక్టరు?" అన్నది నారాయణమ్మ.

"మామ్మగారు సరిగా చెప్పారు" అన్నది లలిత కసిగా.

"ఓల్డేజ్ కదా. ఏం చెప్పగలం? అయినా హాస్పిటల్‌లో అడ్మిటు చేయండి." అన్నాడు డాక్టరు.

రామారావుకి అందరిమీదా ఒళ్లు మండింది. ముసలితనం వచ్చినంతమాత్రాన జీవించడానికి హక్కు పోతుందా? మనిషి బతి కున్నంతవరకు చావకుండా ప్రయత్నం చేయవలసిందేనని నారా యణమ్మను ఆసుపత్రిలో చేర్పించాడు.

తనకు చేతనయినంతవరకు 'మామ్మ'గారి సేవ చేశాడు. కాని లాభం లేకపోయింది. ఆమె చివరి క్షణాల్లో 'నాయనా రామం..' అని యింకా ఏమో చెప్పబోతూఉండగా వూపిరి ఆగిపోయింది.

ఆమె అంత్యక్రియలు శాస్త్రోక్తంగా చేశాడు రామారావు.

అటువంటి నారాయణమ్మ స్మృతి చిహ్నంగా నిలచిన ఆ నల్లబొంతను చూసి లలిత అసహ్యించుకుంటోంది.

తాను వారాలు చేసుకునే వాడనీ, తాను చిన్నప్పుడు చేసిన దొంగతనాన్ని నారాయణమ్మ కప్పిపుచ్చి సన్మార్గవర్తిగా చేసిందనీ లలితతో ఎలా చెప్పడమో రామారావుకి తోచలేదు.

* * *

ఈజీ చైరులో కూర్చుని ఆలోచిస్తున్న రామారావుకి ఒక ఆలోచన మెరుపులా తట్టింది. సంతోషంతో లేచి హుషారుగా స్నానాల గదిలోకి వెళ్లాడు.

భోజనాలయాక పనులు ముగించుకుని వచ్చి, "ఇంక బొంత సంగతి చెప్పండి" అన్నది లలిత.

"చెప్పడాని కేముంది. ఆ బొంత నల్లగా ఉండడమే కదా నీకు నచ్చనిది?"

"అంతేకాదు. అది చాలా కుళ్లు బొంత."

"అందుకే మన యిద్దరికీ రాజీమార్గం సూచిస్తున్నాను. ఆ బొంతను విప్పి పైన నల్ల చీరను మార్చేద్దాము. అంతపెద్దగా ఉన్న ఆ బొంతను అయిదారు చిన్న బొంతలుగా తయారు చేద్దాము. ఇవ్వాళ సినిమా ప్రోగ్రాము రద్దు చేసుకుందాము. బొంత కుళ్ళదంటున్నావు కనుక ముందు బొంత కుట్లన్నీ విప్పి లోపల గుడ్డలన్నీ వేడి నీళ్లలో ఉడకపెడదాము. ఏమంటావు?" అని ఉత్సాహంగా లలితను చూశాడు రామారావు

"మీ సలహా చాలా బాగుంది" అన్నది లలిత నవ్వుతూ. ఆ నల్లబొంతను గది మధ్యకు ఈడ్చారు.

ఒక్కొక్క కుట్టూ తెంపుతున్నారు.

బొంత కుట్లు సగం విప్పుతూ ఉండగా అతని చేతికి బొంతలోని ఏదో గట్టి పదార్థం తగిలింది అదేమిటా అని దులిపాడు రామారావు. ఒక నల్లని గుడ్డ సంచీ క్రింద పడింది.

ఆ నల్లని గుడ్డ చూసి లలిత అసహ్యించుకుంది. కాని రామారావు అది సంచీ అని గ్రహించి దాన్ని తీసి చుట్టూవున్న దారాన్ని విడదీసి సంచీ బోర్లించాడు అందులోనుంచి ఇదివరకు మామ్మగారి వంటిమీద ఉండే బంగారు ఆభరణాలు క్రింద పడ్డాయి. వాటితోపాటు వంద రూపాయల నోట్ల కట్టలు చిందర వందరగా పడ్డాయి.

లలిత తన కళ్లను తానే నమ్మలేకపోయింది.

"చూశావా, లలితా. బామ్మగారు మనకి ఎంత ఉపకారం చేశారో తన డబ్బుకోసం చూపే అభిమానా లేపాటివో తెలుసుకుని డబ్బుతో నిమిత్తం లేకుండా తనమీద నిజమైన అభిమానం ఉన్న వాళ్లకు ఈ మాత్రమైనా చెందాలని బామ్మగారు ఈవిధముగా దాచి ఉంటారు" అన్నాడు రామారావు.

"అవునండీ. ఆమె గొప్పతనం తెలియక ఏమేమో వాగాను. మనం ఆమె కెంతో రుణపడిఉన్నాం." అన్నది లలిత సిగ్గుపడుతూ.

"అవును. అందుచేతనే పుట్టబోయే మన శిశువు మగవాడైతే నారాయణరావు అనీ, ఆడబిడ్డయితే నారాయణమ్మ అనీ పేరు పెడదాం. ఏమంటావు?" అన్నాడు రామారావు

"అలాగే ముందీ సంచి పెట్టెలోపెట్టి వస్తానుండండి" అంటూ లలిత లేచింది.

# గోదావధూటీ పరిణయము

## శ్రీ శ్రీరంగాచార్య

సంస్కృతాంధ్ర భాషా రమణీ గళాభరణములుగా ననేక కృతి రత్నముల రచియించి సాహిత్య చరిత్రయందు ఖ్యాతిగాంచిన మరింగంటి వంశకవులకు నల్లగొండ మండలము ఆకరమైనది; అందు ముఖ్యముగా, దేవరకొండ తాలూకాయందలి కనగల్లు గ్రామము ఇచ్చటినుండి కొంతకాలము తరువాత ఈ వంశపు కవులు అన్య ప్రాంతములకు వెళ్లి స్థిరపడినవారు కొందరు.

నేటికిని మిర్యాలగూడెం తాలూకా 'అనుముల' యను గ్రామమందును, సూర్యాపేట తాలూకా నరసింహాపురము, విశాఖ మండలమందలి భీమునిపట్నము, కృష్ణాజిల్లా యందలి మొఖాసా కల్వపూడి మొదలగు స్థలములలో వీరు గలరు

ద్రవిడ వాఙ్మయమునందు 'తిరువాయ్‌మొళి' 'నిత్యానుసంధానము' అనునవి వైష్ణవ మతపరముగా అనుదిన పారాయణాద్యర్చనలతో సుప్రసిద్ధమైనవి. వీనియందు గోదాదేవి రచించినది 'తిరువాయ్ మొళి' మరికొన్ని గీతములు. ఈమెనే 'ఆండాళు' అనియందురు

ఈ యాండాళు వృత్తాంతమును 'గోదావధూటీ పరిణయము'ను పేర మూడాశ్వాసముల దివ్య ప్రబంధమును శృంగార రస ప్రధానముగా రచియించిన కవి—మరింగంటి వెంకట నరసింహాచార్యులు. ఈ వంశమునందలి కవులలో వెంకటనరసింహ నామధేయులు హెచ్చుగా నున్నారు. కావున ఈ గ్రంథకర్తను ప్రథమ వేంకట నరసింహాచార్యులుగా గ్రహింపవలయును.

సుప్రసిద్ధుడు, శతాధిక గ్రంథకర్త, శత ఘంటావధాన బిరుదాభిరాముడునగు మరింగంటి సింగరాచార్యులకు ఈ కవి ఆరవ తరములోనివాడు (అనగా సుమారు 1770 ప్రాం.). ఈయన వేంకట దేశిక పౌత్రుడు, రంగమాంబా వెంకటార్యుల పుత్రుడు, మౌద్గల్య గోత్రుడు, మిర్యాలగూడెం తాలూకాయందలి 'అనుముల' గ్రామ నివాసి.

ఈ కృతి విశేషములను, ఇతర కృతులను తెలుపుటకు ముందు గోదావధూటీ పరిణయ కృత్యాది ననుసరించి యీ కవి వంశ వృక్ష మొసంగుదును[1]—




1. ఈకృత్యాది మరింగంటి కవుల గూర్చిన విశేషముల తెలిసికొనుటకు మిక్కిలిగా నుపయోగించును. వంశ వృక్షము మాత్ర మొసంగుచున్నాను.




ఈ వంశవృక్షముని ననుసరించి కొందరినిగూర్చి సంక్షిప్త పరిచయము చేయుదును.

## 1. చెన్నయాచార్యులు

ఈయన పుట్టుకతో సర్ప రూపముగా నుండి తరువాత మానవాకృతి దాల్చినాడట. ఇతని ప్రతిభా మహత్త్వముల గూర్చి దశరధరాజనందనచరిత్ర. నిరోష్ఠ్య సీతా కల్యాణముల యందు విపులముగా గలదు. ఈ చెన్నయాచార్యులు 'పణ్కా ... (మిర్యాలగూడెం తాలూకా) యందలి గుట్టపై నివాసముగా నుండెడివాడట. నేటికిటి ఆ ప్రాంతపు ప్రజలు 'చెన్నయః గారి పండుగ' జరుపుదురు. పర్వతోపరిభాగమునగల పుట్టలో పాలు పోయుదురు. మరింగంటివారు నేటికిని సర్ప పూజ చేయుటకు కారణము చెన్నయాచార్యుల జన్మయేయని వారందురు.

---

2. సింగరాచార్యుల తరువాంగల కవులనుగూర్చి తెలుసుకొనుట కుపయోగకరముగా నుండునను భావనతో వంశవృక్షమంతయు నొసంగనైనది.

గోదావధూటీ పరిణయమందు చెన్నయార్యుల గూర్చి యిట్లు గలదు.

'జనని సుగర్భమందునను
చక్కఁగ దాఁ జనియించు నత్తఱిన్
గనుఁగొన నెల్లవారి
కహికాంత కళాంశజుఁ డయ్యె నంతటన
దనరెను మానవాకృతిని
తాను వహించి ప్రియం బెలర్పఁ గా
విని కనువారలందరికి
విస్మయమున్ మదియందు సంధిలన్'
'దశనవ సంఖ్య యగ్రజులు
దద్దయు పేర్మిని గారవింపఁగన్
విశదత సర్వ వేదములు
వేడ్కఁదలిర్ప గ్రహించి చక్కఁగన్
అసదృశ శాస్త్ర షట్కములు
హర్షిత స్వాంతత సంగ్రహించి రా
రసికులు మెచ్చ చెన్నగురు
రాయఁడు రాజిలె రాజు లెన్నఁగన్'
(1—29, 30)

## 2. అప్పలాచార్యులు

నరనాగాశ్వ నృపాల సభ్య గణితుఁడైన యీ అప్పలాచార్యుల వారు సింగరాచార్యుల కగ్రజుడు. పొన్నికంటి తెలగన యయాతి చరిత్రలో పేర్కొనబడినాడు. దశరధరాజనందన చరిత్రలోనే గాక మరింగంటి కవుల రచనలన్నింటియందునను అప్పలాచార్యులవారిని గూర్చి తెలియును. మల్కిభరాం ఆస్థానములో ఈయన ఆస్థానకవియై యుండెనేమో? బహు భాషావేత్తయని తెలియుచున్నది.

## 3. జగన్నాధాచార్యులు

అవధాన చక్రవర్తిగా పేరుగాంచిన యీతడు కర్ణాటక్షమాభృత్సభాంతరమున స్వర్ణాభిషేకమందినట్లు నేబతి కృష్ణయామాత్యుని రాజనీతి రత్నాకరము ద్వారా తెలియుచున్నది.[3] ఆపద్య మిది—

'గురుమూర్ధన్యు శతావధాన బిరు దాంకున్
ద్రావిడా మ్నాయ త
త్త్వరసజ్ఞున్ పటు సంస్కృతాంధ్ర రచనా
దక్షున్ హయాభీశకం
ధర సంలబ్ధ సువర్ణ వృష్టియుతు
కర్ణాటక్షమాభృ త్సభాం
తర పూజ్యున్ మరుకంటి వేంగళ జగ
న్నాథార్యు గీర్తించెదన్''

ఇందు పేర్కొనబడిన కర్ణాటక్షమాభృత్తు బహుశః అళియ రామరాయలు గావచ్చునని భావన. ఈయననుగూర్చి ఈ పద్యమ్ము, సింగరాచార్యుల పద్యములు (ద. రా నం. చరిత్రలో), గోదావధూటీ పరిణయ పద్యములు దప్ప—రచన లేమియు లభింపలేదు.

## 4. సింగరాచార్యులు

శత ఘంటావధాన బిరుదముగల యీ సింగరాచార్యులవారు వింశతి నిరోష్ఠ్యాది ప్రబంధముల వ్రాసినవాడు. మల్కిభరాం సమకాలీనుడు. దశరధరాజ నందన చరిత్ర అను నిరోష్ఠ్య రామాయణము, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము అను రెండు రచనలు దప్ప నేవియు లభించలేదు. ఈ రెండు గ్రంధములైనను చాలాకాలము క్రితము ముద్రింపబడుటచే నేడెక్కడను లభ్యమగుట లేదు. తెనుగులో నిరోష్ఠ్య రచనకేగాక, అచ్చాంధ్ర రచనకును, అచ్చాంధ్ర నిరోష్ఠ్య రచనకును— సింగరాచార్యులవారే ఆద్యుడు.[4] ఈ వంశపు కవులలో మరికొందరినిగూర్చి తెలుపు

3. 'కుతుబ్షాహీ సుల్తానులు—ఆంధ్ర సంస్కృతి' అను గ్రంధములో డా. రామరాజుగారు 'నేబతి కృష్ణయామాత్యుడు' అను వ్యాసమునందు తెల్పిన పద్యము. (పుట 99)

4. నా పరిష్కరణ, విపుల పీఠికలతో దశరథ రాజనందన చరిత్రను ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీవారు ముద్రించుచున్నారు.

టకు సమయమిదిగాదు.[5] కావున ప్రస్తుత గోదావధూటీ పరిణయ కృతికర్తను, కృతులను తెలుసుకొందము. ఈ వెంకట నరసింహాచార్యులు గోదావధూటీ పరిణయ ఆశ్వాసాంతగద్యయందు...' గీర్వాణాంధ్రో భయ భాషా కవితా విచిత్ర విదేహ రాజకన్య కాభ్యుదయాది షోడశ మహాగ్రంథ బంధురాలంకార నిర్మాణ పారీణ...' అని తెల్పుకొనినాడు. ఆయన కృతు లివి.

1. విదేహరాజ కన్యకాభ్యుదయము
2. శ్రీ కృష్ణ శతానందీయము
3. చిలువపడిగరేని పేరణము
4. నృకంఠీరవాభ్యుదయము
5. క్షత్ర బంధోపాఖ్యానము
6. జాంబవతీ కుమార శృంగార విలాసము
7. రామానుజాభ్యుదయము
8. శల్యపిళ్లరాయ చరిత్ర
9. విష్వక్సేన ప్రభాకరము
10. గోదావధూటీ పరిణయము
11. పద్మినీ కన్యకాభ్యుదయము
12. రతి మన్మథాభ్యుదయము
13. మిత్రవిందోపాఖ్యానము

వీనియందు కొన్నిటిని మరింగంటి శ్రీరంగాచార్యులవారు తమ స్వగ్రామమైన కనగల్లునందు స్వగృహమును 'తాళపత్ర గ్రంధ నిలయము'గా మార్చి సంరక్షించుచుండెడివారు వారు పరమపదించి సుమారు అయిదారు సంవత్సరములైనది. తరువాత ఈ గ్రంధముల జాడయే తెలియదు.

లక్ష్మణరాయ పరిశోధక మండలిలో శ్రీకృష్ణ శతానందీయము, చిలువపడిగరేని పేరణము అను గ్రంధము లున్నట్లు పండిత శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు తమ 'మన తెలంగాణము'అను రచనలో తెల్పిరి. డా. రామరాజుగారును 'విజ్ఞాన సర్వస్వము'నందు వ్రాసినారు.కాని నేడు ఈ రచనలే గావు 'కలవు'అనిన చాలా రచనలు 'లోప సంజ్ఞ'లోనున్నవి. నాయీ నల్లగొండ కవులగూర్చిన పరిశోధన వ్యాసంగమున గోదావధూటీ పరిణయ లిఖిత తాళపత్ర ప్రతులు రెండు లభించినవి వానికిని ఈ ముద్రిత ప్రతికిని[6] పాఠభేదములేగాక కొన్ని పద్యములే అధికములుగా గలవు. ఆచార్య శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు 'సమగ్ర ఆంధ్ర సాహిత్యము'పై 'సమీక్ష' వ్రాయుచు (1966 ఫిబ్రవరి భారతి) ఇందులోని కొన్ని గ్రంథములగూర్చి తెల్పిరి. విస్తరభీతికి భీతిల్లి ఆ భాగముల పేర్కొనుట లేదు. జిజ్ఞాసువులందు చూడవచ్చును.

మూ డాశ్వాసముల పరిమితిగల ఈ గోదావధూటీ పరిణయము కృతిభర్త యిష్టదైవమైన 'సిరిసన గండ్ల' నరసింహా స్వామికి అంకితము చేయబడినది. (ఈ గ్రామము మిర్యాలగూడెం తాలూకాలో గలదు. ఈ కవి మరికొన్ని రచనలును పై స్వామికి అంకిత మీయబడినవి.) తన రచనలనుగూర్చి కవి యిట్లు తెల్పు తెల్పుకొనెను. '.. అంకితంబుగా మదీయాన్వయాభీష్టదైవంబగు శ్రీ మద్వేంకట లక్ష్మీ నృసింహుల కనవరత శోభనపరంపరాభ్యుదయం బగునట్లు సమర్పితంబుగా నా యొనర్పం బూనిన శ్రీ భాష్య కాలోక్త ముక్తావళియగు గోదాపిరాట్టి యభ్యుదయంబను మహా ప్రబంధ మందార ప్రసూనంబునకు కథాక్రమం బెట్టిదనిన.....' అనియు—

> సిరి సతి స్తన్య పానమునఁ జెందిన పుష్టిని యీ ప్రబంధమున్
> సరసముగా రచించెదను సత్కవిదేశికు లుత్సహింపగన్'

ఇత్యాదిగా నియమము చేసినాడు.

సంక్షిప్తముగా నిందలి కథ—'

### ప్రథమాశ్వాసము :

శ్రీరంగమందు స్వామి శ్రీ భూ నీళా యుక్తుడై యున్న సమయమున యతిరాజులవారు వచ్చుదురు. సకల దేశిక ప్రతతియు గోదాపిరాట్టి చరిత్ర వినవలయునను కుతూహలముతో నుండి యతిరాజులవారి నడుగగా, ఆయన చెప్పనారంభించును. (ఇతరవర్ణనలతో).

పాండ్య మండలమందు విల్లిబ త్తూరు అను పట్టణము గలదు. యాతాయాత వైష్ణవ జన మచ్చటి స్వామికి నిరంతరము అర్చనలు చేయుచుందురు. ఆ పట్టణమునందు ముకుందుడను భక్తు డుండును. ఆయన భార్య 'పత్తియారు'. వీరికి భట్టనాధుడు కలుగును. ఇతడు నిరంతర విష్ణుపూజా పదధ్యాన చింతాసక్తుడు. విష్ణుమూర్తి భట్టనాథుని భక్తికి మెచ్చి పాండ్య రాజు కొల్వునందు వాగ్వాదముచేసి (విష్ణువుతప్ప అన్యములేదని) రమ్మని—తన శక్తి నాతని కొసగి పంపించును. ఆతడు జయించి మరల ధన్వినామపురమును ప్రవేశించును విష్ణువునుండి భక్తిని మాత్రమే యితడు కోరుకొనినాడు.

భూదేవి (భూపిరాట్టి) ఇతనికి పుత్రికా రూపమున కలుగటకు హరియనుజ్ఞ వేడి, తులసీ వనమునం దుద్భవించును. విష్ణుచిత్తుడు పూజా ప్రసూనాలకై ఉద్యానవనమునకు వెళ్లి చూడగా నీ బాలిక కన్పించును. సంతానహీనుడగు నీ భక్తు డామెను గారాబముగా పెంచుచు, 'గోదా పిరాట్టి' యను నామ మొసంగెను. తరువాత ఈమె బాల్యము, క్రీడలు యౌవనము—ఇత్యాది వర్ణనలు.

### ద్వితీయాశ్వాసము :

వసంతర్తు వర్ణన గోదాదేవి ప్రతిదినము విష్ణుమూర్తికి మాలిక సిద్ధముచేసి తాను ధరించి చూచుకొని స్వామికి పంపించును. దీని నొకమారు తండ్రి చూచి, ఇట్టి మాలిక దేవార్చన కనర్హమని మరియొక మాలికను సిద్ధముచేసి స్వామికి సమర్పింప, స్వామి గ్రహింపడు. కారణ మేమని యడుగగా, గోదాదేవి ధరించిన మాల్యమే తనకు ప్రీతియనును. విష్ణుచిత్తుడట్లే చేయును. తరువాత గోదాదేవితో ఆమె జననక్రమము తెల్పుట, దివ్య తిరుపతుల పుణ్యక్షేత్రముల వర్ణనము, శ్రీరంగనాధస్వామి ప్రభావ వర్ణన.

---

5. భారతి పత్రికలో మరింగంటి కవులపై నావ్యాసములు.
6. గోదావధూటీ పరిణయము. 1950 సంవత్సరమున నీలగిరి (నల్లగొండ) మహిళా భక్త సమాజమువారు కీ. శే. మరింగంటి శ్రీరంగాచార్యులవారి పరిష్కరణతో ప్రచురించిరి. పరిష్కర్తల పొరపాటో ఏమోకాని స్ఖాలిత్యములే హెచ్చుగా గలవు. సంస్కరించి ప్రచురించుట యవసరము.

తృతీయాశ్వాసము :

రంగనాథస్వామిపై మరులుగొన్న గోదాదేవి విరహ వర్ణన (హెచ్చుగా గలదు) శ్రీరంగనాథస్వామితో వివాహము (గోదా కల్యాణము జరుగును) ఈ కథను వర్ణనలు మొదలగునవి చేర్చి పెంచినాడు. ఆముక్తమాల్యదయైన గోదా చరిత్రయే కృష్ణదేవ రాయల 'ఆముక్త మాల్యద' గోదాపరిణయము దానియంత ప్రౌఢి గాలేదు. వ్యాకరణ దోషములు, వ్యావహారిక రూపములు మిక్కుటముగా నున్నవి. పూర్వము తెల్పినట్లు పరిష్కర్తల అశ్రద్ధ హెచ్చయినట్టు స్పష్టమగుచున్నది. అయినను షోడశప్రబంధ నిర్మాణుడైన కవి రచనలలో ఒక్కటైనను సాహిత్య సూర్యాలోక భాగ్యము నందినందులకు సంతసించుట సాహిత్యోపాసకులకర్తవ్యము.

గోదావధూటీ పరిణయమునుండి మచ్చునకు మూడు పద్యము లొసంగెదను.

'గతమగు పూర్వ జన్మ కృత
కర్మ చయంబులు బాసి చేతనుల్
హితమగు మీ పదాబ్జముల
యం దతి భక్తిని సంస్మరింపుచున్
అతులితమైన మోక్షమున
కర్హులు నయ్యెడు పద్ధ తేయదో!
శతదళ పత్ర నేత్ర యది
చక్కగ వేడెద యానతీయగన్. (1 ఆ.)

అమ్మరో! స్వామి కర్పితము
లయ్యెడు మాలిక లేల యీ క్రియ
న్నిమ్ముగ నీవు గైకొనుట
యిం తపచారము నౌ టెరుంగకన్
ధర్మము దప్పి యుత్తరుగు
దాల్చుట నీ కిది కూడదంచు దా
గ్రమ్మర బాలకై కొసఁగి
గక్కున నూత్న ప్రసూన మాలికల్' (2 ఆశ్వా)

(ఇమ్ముగ—ధర్మ—అను పద్ధతిలో ప్రాస గావచ్చు.)

బాలా యీలా గేలా
చాలా నీ మదిని నమ్మజాల వదేలా
డోలాయమానవౌ టిది
మేలా నా మాట నీవు మెచ్చ వదేలా! (3 ఆశ్వా)

పది సంవత్సరములకుపూర్వముముద్రణమైనను ఈ గ్రంధము ముద్రింపబడినట్లుగానే లేదు నల్లగొండ ప్రాంతమున ఒకరి యింటియందు చదలుపట్టి పోవుచున్న యీ గ్రంథమును దెచ్చి మరల ఎత్తి వ్రాసితిని తెలిసినంత మేర దీనిని గూర్చి సాహిత్య లోకమునకు తెలియపరచుటయే ఈ రచనోద్దేశ్యము. సాహిత్య ప్రియంభావుకులు ప్రియంభావుకత్వము చూపుదురుగాత.

'స్వోచ్ఛిష్ట మాలికా బంధ గంధ బంధుర సింధవే
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళమ్'.

# బెర్ట్రాండ్ రస్సెల్



**1970** ఫిబ్రవరి రెండో తారీఖున ఎరల్ బెర్ట్రాండ్ రస్సెల్ ఓ ఎం ఎఫ్ ఆర్ ఎస్ పరమపదించారు. మెరియోనెత్ షైర్‌లోని తమ స్వగృహంలో తొంబదియేడవ యేట పరమపదించారు.

రస్సెల్ చరిత్రలో నిలిచే మనిషి అట్లా ఆయన నిలుస్తారనడానికి గణితశాస్త్రంలో ఆయన కృషి, ప్రతీకతర్కంలో ఆయన ఉపజ్ఞ, తత్వశాస్త్రంలో ఆయన ప్రతిభ కారణాలు ఈ మూడు రకాల శాస్త్రాలమీదను ఆయన ప్రభావం విస్తారమైనదే గాక, లోతైనది బాళమైనది ప్రతీకతర్కం ఉన్నదంటే దాని చరిత్ర, గణితశాస్త్రతత్వం వున్నదంటే దాని నిర్మాణము—వీని సర్వస్వము యీ ఇరవయ్యవ శతాబ్దంలో బెర్ట్రాండ్ రస్సెల్, ఫ్రీజ్‌లు కట్టిన పునాదులమీదనే నిలుస్తున్నవి ఎన్ని విషయాలను గురించో పునర్నిర్మాణాలు జరిగాయికాని, అవి అన్నీ గూడా పోపలనుంచి నిర్మించబడిన నిర్మాణాలే సాధారణ తత్వశాస్త్రంలో జి ఇ మూర్‌ను గురించి, లుడ్విగ్ విట్‌గెన్‌స్టీన్‌ను గురించి ఆలోచిస్తూవున్నప్పుడు, ఆ ఇద్దరు ఒక అర్ధ శతాబ్దపు విచారధారకు జనిస్థానాలు, దానిని రూపుకట్టించినవారు అని విధిగా అనిపిస్తుంది ఆ ఇద్దరు గూడా రస్సెల్‌వలన ప్రభావితులైనవారే అదేవిధంగా రస్సెల్ వారివలన ప్రభావితుడైనాడు వారు రస్సెల్‌కు ప్రచోదనాన్ని ఇస్తే, రస్సెల్‌కు వారివలన ప్రచోదనం లభించింది రస్సెల్‌కు శిష్యులు అని చెప్పతగినవారు లేరు అయితే రస్సెల్ లేవనెత్తిన అనేకములైన ప్రశ్నలవలన జిజ్ఞాసాధ్యాసీనులైన తత్వవేత్తలు అనేకమంది వున్నారు అందుకు కారణం వుంది రస్సెల్‌లో అతివాదం ఒక్కటే లేదు, ఆ అతివాదంతో కూడిన కాఠిన్యం ఒక్కటే లేదు, ఆయనలో మహాశిల్పి అంటూకూడా వున్నారు. ఆయనయొక్క ఆ మహాశిల్పితనం అవదాతమైంది ఆ అతివాద కాఠిన్యము, శిల్పితనంయొక్క అవదాతత్వము ఆయనలో సంవాదం చెంది ఆయన్ను విశిష్టుణ్ణి చేశాయి కొన్ని నవ్వుతాలు విషయాలు వుంటాయి అవి ఒక వాదంలో విప్రతిపత్తుల వంటివి అసంగత విషయాల వంటివి అటువంటి హేళనాత్మక, అపహేళనాజనకవిషయప్రపంచం పట్ల గూడా ఆయన ఉత్సాహ పూరితమైన ఆసక్తిని చూపారు ఆయన ఆలోచనా ప్రపంచం అమూర్తమైంది అందులో అసంగత విషయాలు నిరూపం అయివున్నప్పుడు వానిని ఆయనే నిర్దాక్షిణ్యంగా తనకు తాను ఆనందం అనుభవిస్తూ కడిగి పారవేసుకున్నాడు ఏవీ దాచుకోలేదు మరి ఆ అసంగత విషయాలే తాత్వికచింతనకు కీలకాలవంటివి అయినాయి

రస్సెల్ ప్రతి అంగుళము రస్సెలే రస్సెల్ అయినవానిలో వుండె "పెంకితనం" ఒంతా ఆయనలో వుంది ఆయన ఏమి మాటా డినా ఒకరి ఖాతరుచేసి మాట్లాడలేదు ఎవరో ఏమో అనుకుంటారని, పెద్ద మనుష్యులు ఏమో అంటారని వంటివానిని ఆయన పట్టించుకోలేదు శాసన ధర్మాన్ని గణించలేదు. ఆ శాసనధర్మం ఆయన్ను రెండుసార్లు జైలుకు గూడా పంపించి ఉంది జీవితం అంతటా ఆయన అనేకమైన ఉద్యమాలలో పాల్గొన్నారు వానికి ఆయన అలంకారము అయినారు అటువంటి ఉద్యమాలలో చివరిది, ఆయన ఘనంగా భావించింది, అణ్వస్త్ర విసర్జన సాధనోద్యమం ఏకపక్షంగా ఆ ఆయుధ విసర్జనం జరగాలన్నది ఆ ఉద్యమ పరమార్థం ఆ ఉద్యమాన్ని ప్రజలు అంతగా ఆదరించలేదు ఆ ఉద్యమంనాటికి ఆయనకు ఎనభై యేళ్లు దాటిపోయినాయి అయినా ఆ ఉద్యమంలో ఆయన తన సర్వశక్తులతోను దిగబడ్డారు విరుపులేని ఉత్సాహశక్తిని చూపించారు అది ఒక దైవకార్యం అన్నంతగా భావించారు తన సాటి మానవులు ఎటువంటి మహా విపత్కర ప్రమాదంలో ఇరుక్కొనివున్నారో వారి ఎరుకకు తీసుకొని రావడానికి ఎంత చేయాలో అంతా చేశారు అణ్వస్త్రాలు ఉన్నాయంటే, అవి ఎటువంటి పాపాచరణానికి ఉపకరణాలు కాగలవో, ఆ పాపంయొక్క పరిణామము, వైశాల్యము ఆయన్ను పట్టుకు వదలలేదు అవే ఆయనకు పట్టాయి ఆయన చిత్తం ఆ చింతనతో అభినివిష్టం అయిపోయింది ఆయన వానిని అతితీవ్రంగా ఆడిపోశారు ఖండించారు ఏదో పూనిన విధంగా పని చేశారు ఆ తీవ్రతలో, ఆ పూనిన పద్ధతిలో క్షయం చెందుతూవున్న తన శక్తులతో కార్యాచరణంలో,ఆ అణ్వస్త్రాలవలన రాగలదని ఆయన భావించిన, ఆయన మనస్సు సమక్షంలో అతి విపులంగా విశదంగా కన్పిస్తున్న ఆ సర్వ వైనాసిక స్థితినుంచి విముక్తికి రాజకీయమైన ఉపాయవిశేషం ఏమన్నా వున్నదా అని మదింపుచేసె స్థిరతమైన మదింపునకు ఎడమే తగ్గిపోతూ వచ్చింది.

ఈ ఇరవైయవ శతాబ్దంలో తోటి మానవులతో భావాను సంధానాన్ని, రస్సెల్ అంతగా కుదుర్చుకున్న మేధావులు అట్టేమంది కన్పించరు. ముఖ్యంగా బ్రిటన్‌లో తక్కిన చాలామంది అట్టివారి కన్నా ఆయన ఈ అనుసంధాన సమస్యలను సుష్ఠుగా పరిష్కరించుకోగల్గారు. సామాన్య మానవుని మనస్సునకు ఎక్కడం ఎట్లాగన్నది సమస్య అయినప్పుడు, అందుకు మార్గాన్ని ఆయన చక్కగా తెలుసుకున్నారు. ఆ మార్గంలోతు చూచారు. ఆసాంతం చూచారు. ముఖ్యంగా తన జీవితపు మలి దశలో ఆ మార్గం రస్సెల్‌కు విశేయమై వంగి వచ్చింది. ఆ మార్గాన్ని ఆ రోజులలో ఆయన ప్రధానంగాను అన్వేషణ చేశారు. అన్వేషణ చెయ్యాలని చేశారు. అక్కడ ఆయన అవలంబించిన పద్ధతిలో క్రొత్త ఏమీ లేదు. ఆయన తన ఆలోచనలను, అభిప్రాయాలను అవదాతంగా, ఇట్టే అర్థం అయ్యే విధంగా, సభ్యతతో కూర్చి అభివ్యక్తం చేశారు. మరి ఆయనతో సమకాలీనులైనవారిలో ఎంతోమంది మేధావులు ఉన్నారు. శిల్పులు ఉన్నారు. వారిలో ఎంతమంది ఆయన ఈ చేసిన దానిలో సగం అంత మేరకైనా చేయగల్గారు!

భాష విషయంలోనే గాక, అనుభవ పరమార్థాలను దృష్టాంత రూపాలుగా త్రవ్వి ఎత్తడంలోగూడా ఆయన అనన్యమైన ప్రజ్ఞను చూపించారు. ఆ దృష్టాంతాలు మామూలు జనులకు, మగవారికి, ఆడవారికి గూడా ఇట్టే అవగాహన అయ్యేవిధంగా ఉండేవి. ఎందు చేతననగా, అవి ఆ పురుషుల, ఆ స్త్రీల అనుభవంలోని సాధారణ విషయాలే అవడంచేత ఇది రస్సెల్ విషయంలో చెప్పుకోవలసిన ఇంకో ముఖ్య విషయం. ఇక్కడ ఒక మనిషి ఉన్నాడు. ఆ మనిషి అభిజాత్యం అసామాన్యమైంది. ఆ మనిషి మేధావిత అసామాన్యమైంది. ప్రతిభ అసామాన్యమైంది. ఆ మనిషి మనస్సుయొక్క పద్ధతులు అసామాన్యమైనవి. ప్రవృత్తి అసామాన్యమైంది.అయినా సామాన్యజనులతో మాట్లాడేటప్పుడు,అంతకన్నా ధారాళంగామాట్లాడే వాడులేడు. అదేవిధంగా ఆ వినే జనులు గూడా ఆ మనిషి చెప్పేది అంత ధారాళంగా వినగల్గారు. ఇది ఒక ప్రహేళిక. దీన్ని ఎట్లా విప్పడం? అంత అభిజాత్యము కలవాడు, ఆ జనుల అభిజాత్యంతో సామానాధికరణ్యం అనుభవించగల్గాడు. ఆ ఉభయుల అభిజాత్య ధర్మంలోను ఆ సామానాధికారణ్యతవుంది. వేయి చెప్పండి, రస్సెల్ అచ్చమైన ఇంగ్లీషువాడు. ఆ ఇంగ్లీషుతనమే ఆయనకు, ఆయనను విన్న ప్రజలకు సామానాధికరణ్యమైన సంగతి అయింది.

పరమ ఆర్జవశీలియైన బెర్ట్రాండ్ ఆర్థర్ విలియమ్ రస్సెల్ 1872 మే నెల 18 వ తేదీన మాన్‌మౌత్‌షైర్‌లో టిన్‌టెర్న్‌కు సమీపంలోవున్న రేవెన్‌స్క్రాఫ్ట్ అన్నచోట జన్మించారు. వైకౌంట్ అంబర్లీ ద్వితీయ పుత్రుడు ఆయన లార్డ్ జాన్ రస్సెల్ మనమడు. ఆయన తల్లిపేరు కేథరైన్. ఆమె స్టాన్లీ ప్రభువు సంతానం. రస్సెల్ కుటుంబీకులందరు ప్రతిభావంతులు. స్పృహణీయులైన భావుకులు. లలితకళావేదులు. ఉద్దండ పండితులు. ఈ సర్వలక్షణాలు బెర్ట్రాండ్ రస్సెల్‌లో అభివ్యక్తిపొందాయి. ఆయన మూర్తి కూడా రస్సెలుల కుటుంబ లక్షణాలనే పుణికి పుచ్చుకున్నది.మరి ఆయన అన్నగారు అట్లా కాదు. ఆయనకు తల్లి వైపు వారి సర్వలక్షణాలు ఉత్తమ స్థాయిలో అబ్బాయి. రస్సెల్ జీవితం ఆయన చిన్ననాటి సంఘటనలతో అధికంగా ప్రభావితమైంది నియమితమైంది. ఈ విషయాన్ని ఆయనే ముందుకు వచ్చి ఒప్పుకునివుండేవారనిచెప్పవచ్చు. మరి ఆయన ఆ తొలి ఏళ్లలోని జీవితం ఏవిధంగా చూచినా, సంప్రదాయబద్ధమైన, అనూచానమైనపద్ధతులకు లొంగివుండే పద్ధతిలో పౌరమాత్రుడుగా రూపొంద గలందులకు అనువైనటువంటిది కాదు రస్సెల్ తల్లి, రస్సెల్ తండ్రి ఆయన పుట్టకకు పూర్వమే పాత ఆచారాలను, పద్ధతులను వదిలిపెట్టివేశారు. వారు ప్రాకృతిక విజ్ఞాన విధేయవాదులై పోయినారు. భగవంతుడు ఉన్నాడని, ఉత్తర జన్మలు ఉన్నాయని నిరూపణ చేయడంగాని, లేక నిరూపణ చేయలేకపోవడంగాని సాధ్యం కాదన్న తత్వాన్ని వారు అవలంబించారు. ప్రకృతి శక్తులే యదార్థం, పదార్థ సంబంధమైన దృశ్యజాతమే వాస్తవం—అన్న సిద్ధాంతాన్ని వారు చేపట్టారు. రస్సెల్‌కు రెండోఏటనే తల్లిపోయింది. మూడోఏట తండ్రి పోయాడు. ముత్తవ తల్లి పెంపకం. ఆ అమ్మమ్మ పట్టి ఆచారవంతురాలు ప్యూరిటన్. "A Puritan with the moral rigidity of the Covenenters" అని ఆమెను గూర్చి రస్సెల్ వ్రాసికూడా ఉన్నాడు.తన బిడ్డలను ప్రకృతి శక్తి విశ్వాస్యులనుగా పెంచాలని రస్సెల్ తండ్రి విల్లు వ్రాసిపోయాడు. ముత్తవ గారుద్దేశవాదిని. ఆతండ్రి తన పిల్లలకు గార్డియనులుగా ఇద్దరు Free — Thinkers ను నియమించి వున్నాడు. అయితే ఈ నియామకాన్ని కోర్టులు నెట్టివేశాయి. వారిని న్యాయస్థానాల అధీనంలో "వార్డులు"గా ఉంచారు కేంబ్రిడ్జికి వెళ్లే అంతవరకు రస్సెల్ విద్యాభ్యాసం ఇంట్లోనే సాగింది. ఆ జీవితం సుఖావహమైంది కాదు. బాహ్య ప్రపంచంలోనికి ఆయన విడుదల అప్పుడే, అనగా కేంబ్రిడ్జిలో ప్రవేశించినప్పుడే. బాహ్య ప్రపంచంతో అదే ఆయన ప్రథమ పరిచయం. "అది ఒక కొత్త ప్రపంచం" అన్నాడు రస్సెల్ స్వయంగా. ఆ ప్రపంచంలో అంతులేని ఉల్లాసము, ఆనందము వున్నదన్నాడు. ఆ ప్రపంచంలో ఆయనకు స్నేహితులు దొరికారు. లోవెస్ డికిన్‌సన్, డా. ట్రెవిల్యాన్, మెక్ టెగ్గార్ట్, జి.ఇ. మూర్‌లవంటి స్నేహితులు ఆ ప్రపంచంలో ఆయనకు లభ్యమైనారు. వీరిలో చివరి ఇద్దరి ప్రభావము రస్సెల్‌పై అధికంగా ప్రసరించింది. వారిచేత ఆయన ఎక్కువ ఆకృషితుడైనాడు. జె. ఎం. ఎఫ్. మెక్ టెగ్గార్ట్ పలుకుబడిలో రస్సెల్ కొంతకాలం హెగెలియన్ అయినాడు. అట్లా అనడం కంటే బ్రాడ్లీ అనుయాయి అనడం బాగుంటుంది. అయితే మూర్ ఆ హెగెలియన్ వ్యామోహంలోంచి ఆయన్ను బయటికి లాగాడు. అసలు కేంబ్రిడ్జిలో ఆ తరంవారంతా గూడా మూర్ ప్రభావానికి లోనైపోయారనే చెప్పవచ్చు. ఆ ప్రభావం అత్యంతము గాఢమైంది. అంతేకాదు. అది ఆ తరం అదృష్టం కూడాను.

1890 లో రస్సెల్ ట్రినిటీ కాలేజీలో ప్రవేశించాడు. 1893 లో పరీక్ష ఇచ్చినప్పుడు ఏడవవాడుగా వచ్చాడు ఈస్థితికి ఒక కారణం చెప్పవచ్చు. గణితశాస్త్రం వున్నదంటే, అందులో ఆయన గణితశాస్త్రం కోసమే అయిన ఆసక్తిని చూపించలేదు. ఆ గణిత శాస్త్రాన్ని ఆయన భూతార్థజ్ఞాన సాధనకు దృష్టాంత పూర్వమైన విషయంగా మాత్రమే అధ్యయనం చేశారు. అచ్చట ఆయన

ఆసక్తి తాత్వికమైనటువంటిది. ఆ మరు సంవత్సరం రస్సెల్ నైతికశాస్త్రంలో ప్రథమశ్రేణిలో ఉత్తమ విశిష్టతలతో ఉత్తీర్ణులైనారు. కేంబ్రిడ్జిని వదిలి వెళ్లిన అనంతరం ఆయన పారిస్‌లో బ్రిటిష్ రాయబారి కార్యాలయంలో గౌరవోద్యోగం చేశారు. ఆ తర్వాత బెర్లిన్‌కు వెళ్లారు. అచ్చట సమాజ సమస్యలను ఆర్థిక సమస్యలను అధ్యయనం చేశారు. ఆ అధ్యయనంయొక్క ఫలం 1896 లో ఆరు ఉపన్యాసాల రూపంలో బహిర్గతమైంది. లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్‌లో జర్మన్ సోషల్ డెమోక్రసీని గురించి ఆయన ఉపన్యాసాలే అవి. వంశపరంపరనుబట్టి అయితే ఆయన రాజకీయరంగంలో ప్రవేశించివుండవలసింది. కాని దాన్ని ఆయన విసర్జించి వేశారు.

1895లో ట్రినిటీ కాలేజీలో లెక్చరరుగా రస్సెల్ ఎన్నిక అయినారు. 1896 లో అమెరికాలో Non—Euclidean Geomentry మీద ఉపన్యాసాలు ఇచ్చారు. ఆ తర్వాత ఆయన **Essay on the Foundations of Geometry** అన్న గ్రంథాన్ని ప్రకటించారు. గణితశాస్త్రంలో, తత్వశాస్త్రంలో ఆయనకువున్న శిక్షణ, ప్రజ్ఞ, పాటవం ఆయనచేత ఇంకో పని చేయించాయి. ఆయన ఇప్పుడు మేధావియొక్క లక్షణాన్ని గురించి అనుశీలనం మొదలుపెట్టారు. ఆ రెండు శాస్త్రాలు ఏ మేధావిలో సంవాదం చెంది దృష్టాంత స్థాయికి వచ్చాయో, అతనిని గురించి ఆ అనుశీలనం సాగింది. అందుకు ఫలితంగా వెలువడిన గ్రంథమే "Critical Exposition of the Philosophy of Leibniz. ఇది చాలా గొప్ప గ్రంథం. 1900 లో ప్రచురింపబడింది. లీబ్నిజ్‌ను రస్సెల్ సార్వకాలికులైన మహాతాత్వికులలో ఒక్కరు అని అన్నారు. రస్సెల్ ఆయన్ను అంక తర్కంలో ప్రథమ జిజ్ఞాసువుగా ప్రథమ విద్వాంసునిగా గుర్తించారు. ఆ తర్కంయొక్క ప్రకృష్టత్వాన్ని లీబ్నిజు గ్రహించినంతగా మరివ్వరూ భావనచేసివుండలేదని, దాని ప్రాముఖ్యాన్ని గమనించి వుండలేదని గూడా రస్సెల్ భావించారు. ఆ భావన ఆధారంగానే లీబ్నిజును గురించి అట్లా ఆయన చెప్పడం జరిగింది. ఈ రంగంలో తర్వాత తర్వాత బెర్ట్రాండ్ రస్సెల్ లోకోత్తరమైన విప్లవాన్ని సాధించారు. దృక్కోణ పద్ధతిలో, సాధన విషయంలో రస్సెల్‌కు లీబ్నిజుకు చాలా సన్నికర్షమైన పోలికలు ఉండటం గూడా మనం గమనించవలసి ఉంటుంది.

1900లో పారిస్‌లో గణిత శాస్త్రమహాసభలు జరిగినప్పుడు ఆ శాస్త్రంలో పియానో అన్న శాస్త్రజ్ఞుని గ్రంథాలను రస్సెల్ గణిత శాస్త్ర పండితుల దృష్టికి తెచ్చారు. 1903 లో ఫ్రేజ్ చెప్పింది గమనించాలన్నారు. ఆ రోజులలో రస్సెల్ విచారధారపై ఆ ఇద్దరి ప్రభావం అధికంగా చెల్లుతూ వచ్చింది. ఆ ఇద్దరు శాస్త్రవేత్తల అన్వేషణలు, లీబ్నిజు గ్రంథాలు ఆయనకు అద్భుత ప్రచోదనాన్ని ఇచ్చాయి. ఆ ప్రచోదనమే **Principles of Mathematics** అన్న గ్రంథ రచనకు ఆయన్ను పురికొల్పింది. 1903 లో ఆ గ్రంథాన్ని ఆయన ప్రపంచానికి సమర్పించారు. ఆ గ్రంథం ప్రయోజనం ఏమిటి? రస్సెల్ ఇట్లా వివరించారు: "సర్వమైన గణితశాస్త్రమున్నూ ప్రతీకతర్కం (Symbolic logic) నుంచి ఉద్భవం చెందుతూ వున్నది. మరి ఆ ప్రతీకతర్కంయొక్క రహస్యాలు, సూత్రాలు ఏమిటి? ఈ విషయాలను తెల్పడమే ఈ గ్రంథం ప్రయోజనం."

The Princples of Mathematics ను ఆదిలో రస్సెల్ రెండు భాగాల గ్రంథంగా ప్రచురించాలనుకున్నారు. మొదటి భాగం ప్రచురించిన తర్వాత తన అధ్యయన ఫలితాల నిగమనార్థాన్ని నిరూపిస్తూ రెండోభాగం ప్రకటించాలనుకున్నారు. ఈ కార్యం అయితే జరుపబడిందిగాని, అది వేరేగ్రంథంగా వచ్చింది. ఏ. ఎన్. వైట్‌హెడ్‌తో కలిసి ఆయన ఆ గ్రంథం రచించారు. ప్రకటించారు. ఆ గ్రంథమే ప్రపంచంలో Principia Mathematica అన్న పేరున ప్రసిద్ధి కెక్కింది. ఈ గ్రంథ రచనం 1900 లో ప్రారంభం అయింది. పూర్తికావడానికి పది సంవత్సరాలు పట్టింది. అయితే ఒక్క భాగంగా అది పూర్తి కాలేదు. మూడుభాగాలగ్రంథంగా అది రూపు దాల్చింది. 1910 లో మొదటి భాగము, 1912 లో రెండోభాగము, 1913 లో మూడో భాగము ప్రచురితమైనాయి. 1925 లో తిరిగి ఈ గ్రంథం ఒక కొత్త పీఠికతో ప్రకటించబడింది. ఆ తర్వాత గూడా అది బహు పర్యాయములు ప్రచురణ పొందింది. 1908 లోనే రస్సెల్‌కు రాయల్ సొసైటీ సభ్యత్వం వచ్చింది. ఆ రాయల్‌సొసైటీ వారు ఈ గ్రంథం ప్రచురణకు ప్రభుత్వపు నిధినుండి గ్రాంటు ఇచ్చారు. ఈ మహాగ్రంథం రచనను గురించి రస్సెల్ ఇట్లా వ్రాశారు: "ఆ భారంనుండి నా చిత్తం తిరిగి సరిగ్గా కోలుకోలేదు. ఆ తర్వాతనుంచి అమూర్త విషయ మీమాంస చెయ్యాలే, అందుకు నా మనస్సు అంతకుపూర్వం అంతగా సమర్థం కాలేకపోతున్నది."

గణితశాస్త్ర ప్రపంచంలోను, తర్క సాహిత్యంలోను గూడా Principia Methametica చరిత్రను సృష్టించిన గ్రంథం అయిపోయింది. అంతకు పూర్వం ఏ ఇతర గ్రంథమూ చెప్పనంతగా, ఈ గ్రంథం ఆ రెండు శాస్త్రాలను గురించివిప్పి చెప్పింది. దీనితో గణితశాస్త్రం అన్నది తర్కశాస్త్రంలో ఒక విభాగం అన్నంతమాత్రంగా పరిణమించింది. గణితశాస్త్రం తర్కశాస్త్రంలో భాగమే అయిపోయింది. ఈ పరిణామంలో నూత్నాతి నూత్నమైన ప్రతీకవాదం Symbolism) రూపు కట్టింది. బృహత్తరమైన తర్క పద్ధతి అవతారం ఎత్తింది. నిపుణ మనస్కులైన ఉత్తమ మేధావులు దానికి సుష్ఠు రూపం ఇచ్చారు. తత్వ చింతనకు బెర్ట్రాండ్ రస్సెల్ చేకూర్చిన ఉజ్జ్వలమైన కాంతి అంతా ఈ తర్క పద్ధతికి అక్షరరూపకల్పన చేయడంలోనే వుంది. తత్వ శాస్త్రాన్ని ఆయన అమేయమైన ఈ అలంకారంతో అలంకరించారు. ఇది అక్షరమైన ఆభరణం. ఆయన తాత్విక రచనలలో ఈ పద్ధతి పరివ్యాప్తమై వానికి పుష్టిని చేకూరుస్తూ వచ్చింది. తాను తత్వ చింతనాప్రపంచంలో సాధించిన ఘనమైన ఈ తర్క పద్ధతికి ఆయన "Logical Atomism" అనే పేరు పెట్టారు. ఆయన దర్శనశక్తికి, ఆలోచనా నైపుణ్యానికి ఆ పదబంధం న్యాయాన్ని చేకూరుస్తూవున్నది. ఇచ్చట ఆయన తన ఈ కొత్త తర్కంచేత సాధించదలచుకున్నది ఇది: భావాలు లేక

ప్రత్యయాలు అత్యంతము సంశ్లిష్టము, క్లిష్టము అయి ఉంటాయి. వానిని అవయవి భావాలు అనుకుందాము. ఇప్పుడు వానిని అంగభావాలు, అనగా వేరు వేరు భాగాలుగా సరళంగా, అక్లిష్టంగా పూర్వ పక్ష నిరాసకంగా విడదీయాలని ఆయన ప్రయత్నించారు.

తత్వ శాస్త్ర ప్రపంచంలో రస్సెల్ సాధించిన మహా విషయాలను ఆ శాస్త్రాధ్యాయులైన పండితులు చూచుకోవలసిన విషయం. బ్రిటన్‌కు సంబంధించినంతవరకు, రస్సెల్‌కు ముందు, రస్సెల్ అనంతరము తత్వశాస్త్రం అని అంటున్నారంటే, అది అతిశయోక్తి విషయం కాదు. మరి మామూలు మానవుల దృష్ట్యా చూచినట్లయితే, తత్వశాస్త్రంలో రస్సెల్ సాధించిన కార్యం అద్భుతావహమయ్యే కన్పిస్తుంది. రస్సెల్‌కు ముందు తర్క పద్ధతి వ్యాకరణం బాధకు, కారక ప్రక్రియా వైపరీత్యానికి, వాక్య రచనా విచార వాదనకు గురిఅయిపోతూ వుండేది. రస్సెల్ ఆ శాస్త్రానికి ఆ బాధ విరగడ అయిపోయేట్లు చేశారు. ఇప్పుడు తర్క విచికిత్స నిరాటంకంగా సాగడానికి వీలు ఏర్పడింది. అనూదాన తాత్విక ప్రశ్నలకు తాత్విక పద్ధతి రచనా విచారధార యొక్క ప్రయోజనం ఎంతో వుంది అని బెర్ట్రాండ్ రస్సెల్ తన నిర్మించిన తర్కప్రపంచం విశేషాని గురించి ఎంతో వివయంగా ప్పుకొని వున్నారు.

రస్సెల్ ఈ మాటలలో చెప్పదలచుకున్న విషయాన్ని ఆయన రూపొందించిన ఒక ముఖ్యమైన సిద్ధాంతాన్ని సంక్షిప్తంగా తెలుసు కున్నప్పుడు బాగా అవగతం అవుతుంది. 1905 లో "Mind" అనే దానిలో రస్సెల్ 'నిర్దేశించడం గురించి' (On Denoting) అన్న వ్యాసాన్ని ప్రకటించివున్నారు. ఆ వ్యాసంలో ఆయన తన అతిముఖ్యమైన దార్శనిక సిద్ధాంతాన్ని నిరూపించి వున్నారు. ఆ సిద్ధాంతాన్ని 'Theory of discriptions" అంటారు. అనగా "నిర్దేశ సిద్ధాంతం" అన్నమాట. "అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రస్తుత అధ్యక్షుడు" మొదలైన పదబంధాలు 'ఉనికి'ని గురించి మీమాంసచేసే తాత్విక ప్రవరులకు నిష్ఫలమైన ఆవేదనను కల్గిస్తూ వచ్చాయి. "మాట వరసకి నేను బంగారపు కొండ సత్తా చేతలేదు అంటాను. 'మాట వరసకు నీవు-బంగారపు కొండ అంటే ఏమిటి'' అని అడుగుతావు. నేను అది 'బంగారపు పర్వతము అంటాను అనుకో. అప్పుడు నేను దానికి సత్తాను కల్పన చేసినట్లు కన్పిస్తుంది. "సత్తాచేత బంగారపు పర్వతములేదు" అన్న పదబంధంలోను, "వర్తులాకార సమ చతురస్రం ఉనికిలేదు" అన్న పదబంధంలోను "బంగారు పర్వతము" "వర్తులాకార సమ చతురస్రము" అన్నచోట మాటలలోమాత్రమే తేడావుంది. ఒకటి ఒకటి ఇంకొకటి ఇంకొకటి అన్న అర్థం అచ్చట ప్రతీతి చెందుతున్నది. నిజానికి ఆ రెంటికీ స్థితి లేదు. రెండూ అభావాలే ఇదో చిక్కు సమస్య. దీనిని తన నిర్దేశ సిద్ధాంతంతో విడదీయడానికి రస్సెల్ తలపెట్టాడు. "వేవర్లీ గ్రంథకర్త స్కాట్" అన్న ఉక్తి ఉన్నది. నిర్దేశ సిద్ధాంతాన్ని అవలంబించినప్పుడు, దానిని ఇట్లా వ్యాఖ్య చేయవలసి ఉంది. "అచ్చట 'C' అని సత్తా ఉన్నది. అప్పుడు 'X' వేవర్లీ గ్రంథకర్త అన్న ఉపన్యస్త వాక్యంలోని X అనే సత్తా, 'సి'అనే సత్తా అప్పుడు అది భూతార్థం అవుతుంది. కాకపోతే దబ్బర అవుతుంది. పైగా 'C' స్కాటు. అదే విధంగా సత్తాచేత బంగారపు కొండలేదు' అన్నప్పుడు "అక్కడ 'C' అన్న సత్తా లేదని, అందువల్ల X' బంగారుమయము, పర్వతమయము' అన్నచోట X, C అయితే అది నిజము, కాకపోతే దబ్బర అన్న అర్థం ప్రతీతిని చెందుతున్నది." అందువల్ల 'ఉనికి' లేక 'సత్తా' అన్న దానికి నిర్దేశ పద్ధతిలో మాత్రమే స్థితి ఉన్నదని చెప్పవలసివుంటుంది. ఈ సిద్ధాంతంవలన "స్థితి"ని లేక "ఉనికి"ని, లేక "సత్తా"ను గురించి రెండువేల యేండ్లుగావున్న అగమ్యగోచరపు పద్ధతిఅంతా కొట్టుకుపోయి, అంతా విశదం అయిపోయింది అని రస్సెల్ అన్నప్పుడు, ఆయన గొప్ప ఏమీ చెప్పుకోవడంలేదు. ఉన్న విషయమే చెబుతున్నాడు. మరి ఈ "స్థితి" ని గురించి ఈ అగమ్యగోచరపు పద్ధతి ప్లేటో "థియోటేటస్" వ్రాసిన దగ్గరనుంచి సాగుతూనే వస్తున్నది.

ఏభై సంవత్సరాలపాటు చేసిన తాత్విక రచనలలో రస్సెల్ తన తర్క పద్ధతిలోని వైనాశికశక్తిని ఉపయోగించి సాంప్రదాయిక తాత్విక సమస్యలను, సాంప్రదాయిక తాత్విక దర్శనాలను పరీక్ష చేశారు. ఆయన అట్లా వానిని మీమాంసించి తేల్చిన నిష్కృష్టార్థాలతో మనము ఏకీభవించవచ్చు. ఏకీభవించకపోవచ్చు. కాని అచ్చట ఆయన తన నూతన తర్కపద్ధతిని వినియోగం చేయడం అన్న దానివల్లనే ఒక విశదీకరణ, ఒక ఉత్తేజనము, ఒక ఎరుక, సంభవం అవుతున్నాయి. వర్గాలు, సాంతత్యము, అనంతము, భాషా రూపాలు మొదలైన సంబంధాలను గురించి ఆయన చేసి చూపించిన విశ్లేషణం ఈ అన్నింటిని కలుగజేస్తున్నది. వివిధ శాస్త్రాల వ్యవస్థాపనపు కట్టుబడిలోను అంతర్గర్భితమైన తార్కిక ప్రమాణ పద్ధతిని శంకచేస్తూ, ఆ శంక చేయడాన్ని తాత్విక విజిజ్ఞాసాపథంలో ప్రతి ఒక్క తాత్వికరంగానికి విస్తరించుకుంటూ పోయి సుస్మృచింతనం సాగించడంలోనే ఆయన బృహత్తర కృషి అంతా ఇమిడివుంది. ఆయన చేసిన పనులలో అది అత్యంతము శాశ్వతమైంది. లాక్, బెర్కిలీ, హ్యూమ్‌లు ఎట్లా అనుభవ ప్రామాణ్యవాదులో, రస్సెల్ గూడా అట్లాగే అనుభవ ప్రామాణికవాది. అయితే వారినుండి ఈయన విశిష్టుడు అనడానికి, వారు చేయని కొత్త పద్ధతి ఆలోచనలను ఈయన చేశాడు. రస్సెల్ తన విచారధారకు గణితశాస్త్రాన్ని, శక్తిమంతమైన తార్కిక పద్ధతిని ప్రాతిపదికలు చేసుకున్నాడు. దానితో ఆయన అవలంబించిన అధునాతన విశ్లేషణాత్మక అనుభవ ప్రామాణ్యవాదం ప్రాదుర్భావం చెందింది. వారికి, రస్సెల్‌కు తేడా ఇక్కడే. ఇక్కడే రస్సెల్ విశిష్టుడు. ఆయనే స్వయంగా ఆ మాట ఒప్పుకున్నారు. అనుభవ ప్రామాణిక విజ్ఞానమునన్నా, అనుమతి విజ్ఞానమునన్నా, వీనినే తాను అంగీకరించగలనని రస్సెల్ అన్నారు. తాత్విక రూపాలలో శాస్త్రధర్మం కలిగిన దార్శనిక సమస్యలకే సమాధానాలను అన్వేషించాలిగాని తత్వశాస్త్రానికి కాదన్నారు. విజ్ఞానశాస్త్రము, మేధ సమాధానం చెప్పలేని చిక్కు సమస్యలు వుంటే ఉండవచ్చునని రస్సెల్ అంగీకరిస్తున్నారు. అయితే ఆ సమస్యలకు సమాధానాలు, లేక పరిష్కారాలు సాధించాలి అంటే అందుకు శాస్త్రము, మేధ విన్నా, అతీంద్రియ్యాదిక పద్ధతులు ఉన్నాయంటే తాను అమోదించ

లేనన్నాడు. అటువంటి పద్ధతులు వున్నాయని అంగీకరించడానికే తిరస్కరించారు.

రాజకీయ తత్వశాస్త్ర రంగంలో ఆయన అడపాదడపా ప్రవేశిస్తూ వచ్చారంటే, అందుకు ఆయన యీ అనుభవ ప్రామాణ్య వాదమే కారణమై వుంటుంది. స్వతః ఆయన రాజకీయ తత్వవేత్త కాదు. కాని ఆయన శరీరపు నాడులలో రస్సెలుల రక్తం ప్రవహిస్తూ వుంది. అట్టివాడు లాక్ యొక్క తత్వానికి తాత్వికంగా దూరంగా వుండటం అన్నదే కుదరదు. లాక్ తత్వం ఎప్పుడూ వారికి తలలో మెదులుతూనే వుంటుంది. 1947 లో **Philosophy and Politics** అన్న గ్రంథం వచ్చింది. అందులో రస్సెల్ ఇట్లా వ్రాశాడు: "ప్రజాస్వామ్యానికి సిద్ధాంత రూపమైన ప్రాతిపదికను చేకూర్చ గల్గిన దర్శనం ఒక్కటే వున్నది. అది అనుభవ ప్రామాణ్య వాదం. (Empiricism). ప్రజాస్వామ్యం యొక్క మనస్ స్థితికి అదే తగిన తత్వం. ఈ అనుభవ ప్రామాణ్యవాద ప్రథమ దార్శనికుడు, దానికి వ్యవస్థాపకుడు అయిన లాక్, స్వేచ్ఛకు, సహనానికి—దానికి ఎంత సంబంధం వున్నదో స్పష్టంగా ప్రదర్శించాడు. దీనినిబట్టి ఉదార దృష్టి యొక్క సారభూతమైన తత్వం—ఒకరు ఏమి అభిప్రాయాలను కల్గివున్నారు అన్నదానిలో లేదు., ఆ అభిప్రాయాలను ఎట్లా అవలంబనం చేయడం జరుగుతున్నది అన్న దానిలో వుంది. పిడివాద పద్ధతిలో గాక, వానిని తాత్కాలోపయుక్తంగాను, పరీక్షార్థంగాను మాత్రమే వహించాలి' అని రస్సెల్ స్పష్టం చేశాడు. అయితే ఈ శ్రుతిసూత్రాన్ని రస్సెల్ తన ప్రసంగాలలో సర్వే సర్వత్రా అనుసరించారా అంటే ఎవ్వరుగాని గుండె మీద చేయి వేసుకొని, ఆఁ అనుసరించారు అని చెప్పలేరు.

1907 లో బెర్ట్రాండ్ రస్సెల్ పార్లమెంటుకు నుంచున్నారు. గెలవలేదు. ఆయనకు ఏదో మంచి చెయ్యాలన్న తహతహ ఒకటి వుంది. దానికి అభివ్యక్తి కల్గాలి అంటే, 1914—18 ప్రాంతం దాకా ఆయన వేచి వుండవలసి వచ్చింది. అది యుద్ధ కాలం. ఆ కాలంలో ఆయన శాంతివాద ఉద్యమంలో తల మునకగా దిగబడ్డాడు. ఆ ఉద్యమం ఫలితాలు విపరీతంగా పరిణమించాయి. దేశంలో పెద్ద తుఫాను చెలరేగింది. ఆ తుఫానుకు ఆయన కేంద్రం అయిపోయినాడు. వానిని ఇక్కడ సంక్షిప్తంగా చెబితే సరిపోతుంది. ఆ రోజుల్లో నో—కాన్స్క్రిప్షన్ ఫెల్లోషిప్ అని వుండేది. ఆ దాని తరపున ఒక కరపత్రం వెలువడింది. ఆ కరపత్రాన్ని రచించింది తానేనని రస్సెల్ అంగీకరించాడు. వంద పౌనులు జరిమానా పడింది. ట్రినిటీ కాలేజీలో లెక్చరర్ పదవి నుంచి తీసేశారు. ఆయన గ్రంథ భాండాగారాన్ని పట్టుకున్నారు. అది జరిమానా కోసం అన్నమాట. 1916 హేమంతంలో ఆయన హార్వర్డ్‌లో ఉపన్యాసాలు ఇవ్వవలసి వుండినది. కాని ప్యాస్‌పోర్టు దొరకలేదు. బ్రిటిష్ ప్రభుత్వము ఆయన్ను దేశంనుంచి బయటికి వదలనీయడం మంచిదికాదని, ప్రజా శ్రేయస్సు దృష్ట్యా అది మంచిది కాదని, ప్యాస్‌పోర్టు ఇవ్వడం క్షేమంకాదని అన్నట్లు హార్వర్డు అధికారులు రస్సెల్‌కు తెలియజేశారు.

అదే సంవత్సరం సెప్టెంబరులో రస్సెల్ మీద ఇంకో నిషేధం విధింపబడింది. నిషిద్ధ ప్రాంతాలని ప్రకటింపబడిన వానిలో ఆయన ప్రవేశించ రాదన్నారు. ఆ తర్వాత అనతి కాలంలో ఆయన ఒక పుస్తకం ప్రకటించారు. "యుద్ధ కాలపున్యాయం" అని దాని పేరు. అందులో ఆయన యుయుత్సురాజ్యాలను—ఒక దాని వాసన ఒక దానికి గిట్టక కాట్లాడు కుంటున్న కుక్కలతో పోల్చారు. ఈ పోలిక ఎంతో ఆగ్రవేశాన్ని దేశంలో సృష్టించింది. చివరికి 1918 ఫిబ్రవరిలో బౌ స్ట్రీటు కోర్టులో ఆయనకు ఆరు నెలలు జైలు శిక్ష విధించారు. ఇది ఎందుకు విధించారు అంటే—నో—కాన్స్క్రిప్షన్ ఫెల్లోషిప్ వారి పత్రికలో ఆయన కొన్ని వ్రాతలు వ్రాశారు. ఆ వ్రాతలలో అమెరికన్ సైన్యాన్ని గురించిన విమర్శలు వున్నాయి. వానివలన అమెరికా ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వం సంబంధాలు చెడిపోగల స్థితి వున్నదని భావించబడింది. అందుకు ఆ శిక్ష పడింది. ఆ కేసు అప్పీలుకువెళ్లింది. అప్పీలులో— అనుభవించే శిక్షను రెండో డివిజన్‌లో గాక మొదటి డివిజన్‌లో అనుభవించ మన్నారు. అట్లా ఆయన ఖైదుకు వెళ్లారు. ఖైదులో వుండగానే ఆయన **"Introduction to Mathematical Philosophy"** అన్న గ్రంథాన్ని వ్రాశారు.

యుద్ధం ముగిసింది. ఆ తర్వాత రస్సెల్ తన మనస్సు చేత మానవలోకానికి సంబంధించిన ప్రతి ఒక్క విషయాన్ని గురించి స్పృశించడం మొదలు పెట్టారు. 1920 లో రష్యాకు వెళ్లి వచ్చారు. బ్రిటిష్ కార్మికపక్షం తరపున ఆ దేశం వెళ్లిన ఒక ప్రతినిధి వర్గంలో సభ్యుడుగా వెళ్లారు. ఆయనకు అచ్చట "చలామణి అవుతున్న సైనిక నియంతృత్వం" పద్ధతి నచ్చలేదు. బోల్షివిజం అంటే ఏమిటో, ఏమిటిగా వున్నదో చూచి తొలి హెచ్చరిక ఇచ్చారు. ఆ హెచ్చరిక అప్పుడు ఆయన వ్రాసిన "ది థియరీ అండ్ ప్రాక్టీస్ ఆఫ్ బోల్షివిజం" అన్న గ్రంథంలో ఇవ్వబడింది. 1939—45 యుద్ధంలో గూడా ఆయన సోవియట్ కమ్యూనిజంను విమర్శిస్తూనే వున్నారు. ఆ రోజుల్లో రష్యాయొక్క కీర్తి పతాకస్థాయిలో వుండి వుంది. ఆయన **"Analysis of Mind"** అన్న గ్రంథాన్ని 1921 లో ప్రకటించారు. ఆయన ఇచ్చిన కొన్ని ఉపన్యాసాలే ఈ గ్రంథం రూపంలో వెలువరించబడినాయి. ఆ ఉపన్యాసాలను ఆయన లండన్‌లో ఇచ్చారు. ఈలోగా 1920 లో చైనాకు వెళ్లారు. పెకింగ్‌లో తత్వశాస్త్ర అధ్యాపకులుగా, ప్రొఫెసర్‌గా పని చేశారు. ఆ తర్వాతనే ఆయన "ది ప్రాబ్లమ్స్ ఆఫ్ చైనా" అన్న గ్రంథాన్ని ప్రకటించారు. పాశ్చాత్య సభ్యతఅన్నా, జపాను సంస్కృతి అన్నా, ఆయనకు ఒక విధమైన వైరస్యం ఏర్పడివుంది. ఈ గ్రంథంలో ఆ వైరస్యాన్నంతా చూపించి వేశారు. చైనానుంచి తిరిగి వచ్చినతర్వాత మళ్లీ పార్లమెంటుకు నిలబడ్డారు. 1922 లో 1923 లో. కాని ఎన్నిక కాలేదు. **A, B, C of Atoms** (1923), **A, B, C of Relativity** (1925) అన్న రెండు గ్రంథాల నమిడికాలంలోను **The prospects of Industrial Civilization** అన్న గ్రంథాన్ని ప్రకటించారు. పై రెండు గ్రంథాలు అందమైన గ్రంథాలు. విషయ శబలత్వం కల్గినటువంటివి. ఆ

